చేయఁబడక వృద్ధిక్షయములు లేక యేకరీతిగా వెలుగొందు జ్యోతి స్సొకటిగలదు.

కాలస్వరూపమని కొందఱు, కాలకారణమని మఱి కొందఱు, నామరూపక్రియారహితమని యింకను గొందఱు, కాదు కా దిది యానందమయమని వేఱొకకొందఱు, నిశ్చయముగా నిది విష్ణుమయమని మఱియుఁ గొందఱు, కానే కా దిది శైవమని యింకనుం గొందఱు, ఏదియుఁ గా ది దన్నింటికి మూలకారణమని మఱిమఱికొందఱు విసుఁగుదోఁచునట్లు, మనస్సు చెడునట్లు, దీనిజోలి వల దిఁక నూరకుండుట మేలని స్ఫురించునట్లు, ఎవరికిఁ దోఁచినట్లు వారు సిద్ధాంతము చేయుచుండు తత్త్వ మొక్కఁడు బ్రహ్మాండములనిండియుండుట మాత్రము సత్యము.

అది సత్యస్వరూపమైనఁ గానిండు, ఆనందస్వరూపమైనఁ గానిండు; తేజస్స్వరూపమైనఁ గానిండు, ఇవన్నియు నదియే కానిండు, మొత్తముమీఁదఁ బరతత్త్వ మొక్కటి సాటిలేక యలరారుచుండు ననుటమాత్రము సిద్ధాంతము.

అట్టితత్త్వమును దెలుపుటకే వేదములు నడుముగట్టుకొని పోరాడిపోరాడి వెల్లకిలఁబడినవి. వేదాంతములనఁబడు నుపనిషత్తులు ఇటు అటు పొరలాడునర్థములు గలవాక్కులం బలికి నోరుమూసికొనినవి. * స్మృతులు పైవానిగతింగాంచి

---

* మనుస్మృతిః—

శ్లో. యత్తత్కారణ మవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్,
తద్విసృష్ట స్సపురుషో లోకే బ్రహ్మేతి కీర్త్యతే. అ. ౧. శ్లో ౧౧.

మనకేల యీపెత్తనమని మానవకృత్యములం దెల్పి యిట్టిధర్మముల నాచరించిన నాపరతత్త్వమును గనుఁగొనవచ్చునని తన తెలియమి మఱుఁగుపఱచుకొని మెల్లఁగాఁ దొలఁగినవి. పురాణ రాజము లేమోచెప్పఁబూని శ్రుతిస్మృతుల పాటుగాంచి మన మిఁక నోరుదెఱచిన మర్యాదనిలువఁజాలదని భీతిల్లి భగవదవ తారములలో నగు గాథలం జేర్కొని మనుజులకు భగవద్భక్తి గలుగునట్లు చేసితి మింతటితోఁ గృతకృత్యతం గాంతమని చల్లఁగా జారినవి. భారతాదీతిహాసములు పురాణముల నను

---

అసంఖ్యామూర్తయ స్తస్య నిష్పతంతి శరీరతః,
ఉచ్చావచాని భూతాని సతతం చేష్టయంతి యాః. అ ౧౨. శ్లో ౧౫.

యాజ్ఞవల్క్యస్మృతిః—
హితాహితానామనాడ్య స్తాసాం మధ్యే శశిప్రభమ్.
ప్రాయశ్చిత్తకాండము. శ్లో ౧౦౮.

మండలం తస్య మధ్యస్థ ఆత్మాదీప ఇవాచలః,
సజ్ఞేయ స్తం విదిత్వేహ పునరాజాయతే నతు. ౧౦౯
జ్ఞేయంచారణ్యక మహం యదాదిత్యాదవాప్తవాన్,
యోగశాస్త్రం చ మత్ప్రోక్తం జ్ఞేయం యోగ మభీప్సతా. ౧౧౦
అనన్య విషయం కృత్వా మనోబుద్ధి స్మృతీంద్రియమ్,
ధ్యేయ ఆత్మాస్థితో యోఽసౌ హృదయే దీపవ త్ప్రభుః. ౧౧౧
మోహజాల మపాస్యేహ పురుషో దృశ్యతే హియః,
సహస్రకరపన్నేత్ర స్సూర్యవర్చా స్సహస్రకః. ౧౧౯
స ఆత్మా చైవ యజ్ఞశ్చ విశ్వరూపః ప్రజాపతిః,
విరాజ స్సోఽన్నరూపేణ యజ్ఞత్వ ముపగచ్ఛతి. ౧౨౦

సరించి తల్లిపిల్లలవావిగా భగవత్కథలనే పలికి బ్రదికితిమిరా స్వామీ యని విరమించుకొనినవి.

ఇట్లు శ్రుతిస్మృతిపురాణేతిహాసములు, ఉపపురాణాదులవి యివి యననేల యెన్నియో ఆమహనీయభగవత్తత్వమహిమమును దెలియఁజాలక, తెలిసినంతమట్టుకైనను దెలుపఁజాలక గర్వమును వదలినవి.

ఇఁక వానిలోఁ గొంతభాగమో కొంతలో నొకకొంతభాగమో పఠించి, తదర్థమును జక్కఁగా గ్రహింపఁజాలక గ్రహించినట్లు నటించు వారిగతి యిప్పట్టున నేమగునో మనమేల విచారింపవలయు ? సభాముఖములఁ బ్రతిపక్షముఖపిధానము చేయుటకు మాత్రము ప్రయత్నించి తెలిసితెలియని కుతర్కవాక్కులచే నాక్రోశించి పామరు లబ్బా యెంతటివాఁడురా, యనుకొనుచుండ సంతోషించుచుఁ దెలియని తత్త్వములఁ దా ననుభవమునఁ దెలిసికొనినట్లు నటించు నొక్కొక్కరు నిట్లే నాలుగు డబ్బులు గణించుకొనుచుఁ గాలముఁ గడపుచుఁ దమగతి యేమగునో తెలియక యెందో దిక్కులేక చనిపోవుచుండుట యంద ఱెఱింగినదియే.

కొంద ఱిట్లు తమగతి దెల్లవాఱఁగాఁ బరులను మోసపుచ్చి భగవత్తత్వము నుపదేశరూపమునఁ దెలియఁబఱచుచుఁ దిరుగుచుండుట క్రొత్తదికాదు. ఇట్టి పండితమ్మన్యులు తత్వమిది యని సిద్ధాంతము చేయఁగల్గుదురా యనుప్రస్తావమే యనవసరము.

తోఁచి నట్లర్థమును వివరించి స్వస్వమతముల సిద్ధాంతము చేసికొన నవకాశమిచ్చు శ్రుతులు లోనగునవి. "ఇద మిత్థ" మ్మని తెల్పఁజాలవు. తక్కినవానిగతి యిట నేటికి? అటులని యూరకుండఁజెల్లునా? ఊరకున్న గడతేఱుమార్గము దొరకునా? దొరకకున్న నేమిలోపమని తృప్తిఁజెందుట మనుష్య ధర్మమగునా? ఇఁకఁ జేయవలసిన దేమి?

బహుశ్రుతులు, సన్మతులు నగు మాన్యులు వచించిన వేదాదిప్రమాణగ్రంథార్థమును నమ్మి భగవంతుని నెఱుఁగఁ దలఁచి కృషి చేయుచుండిన నాపరాత్పరుఁడు, సచ్చిదానంద రూపుఁడు, కరుణానీరధి, పరమపురుషుఁడు నగుభగవంతుఁడే యీజీవుఁడు పరిపక్వస్థితికిం జేరె నని కరుణించి కడతేర్చిన చో ముక్తుఁ డగునుగాని రిత్తమాటలచేఁ గాఁజాలఁడు.

అప్పుడైన వేదాదు లేకదా ప్రమాణము లనుప్రశ్నము రావచ్చును, అదిసత్యమే. అంతకన్న వేఱుగతి కానరాదు. కాఁబట్టి యాత్రోవలఁబడి పోయిపోయి కర్మము పరిపక్వము కాఁగా భగవత్కరుణకుఁ బాత్రులైన మహనీయులు పామరులై, గతియేదిరా యని దిక్కుదోఁపక యలమటఁబడు దీనులఁ బరిపక్వ జీవులం గాంచి మించిన కరుణఁ గాపాడఁబూని నాలుగుమాటలు చెప్పిన వాని నేనమ్మి నిశ్చలబుద్ధిఁ దదుదీరితార్థమును స్మరించుచుఁ దదనుగుణముగఁ బ్రవర్తించుచుండుటయే యుత్తమపథము.

అది కావని యొక్కసారి యెగిరి మోక్షలక్ష్మీపదమును గౌఁగిలించుకొనుద మనుకొనుటయు నట్లుచేయఁ బ్రయత్నించుటయు వెఱ్ఱితనము. అట్లుచేసిన లభించునది కాదు. బహుతర జన్మ పరిపక్వకర్మమునఁ గాని వాస్తవజ్ఞాన ముదయింపదు. అది యుదయించినఁగాని సద్గురుకటాక్షము కలుగదు. అది గలిగినఁ గాని సద్గ్రంథపఠనతదర్థావబోధము లలవడవు. అవి యలవడినఁ గాని జగన్మిథ్యాత్వజ్ఞానము పొడసూపదు. అది పొడసూపి దృఢపడినఁగాని బ్రహ్మసత్యత్వజ్ఞాన ముదయింపదు. అది యుదయించినఁగాని సంసారము నిస్సారమను నమ్మకము గలుగదు. అది గలిగినఁగాని మోక్షపదప్రాప్తిప్రయత్న మొనరింప వీలు పడదు. వీలుపడినఁగాని కడతేఱఁజాలఁడు. ఇంతేది తక్కువ యైనను నధోగతియే. పునర్మరణజన్మములే.

## మంచిమార్గమేది ?

భగవంతుఁ డనుగ్రహించిన బుద్ధి నుపయోగించు నధికార మందఱకుం గలదు. పైవిషయములం గూర్చి చక్కఁగా నాలోచించినచోఁ గడతేఱుటకు మార్గములు:—

౧. సత్కర్మముల నాచరించుట.
౨. సద్గ్రంథములఁ బఠించుట.
౩. వానియర్థమును జక్కఁగా గ్రహించుట.
౪. ఆయర్థమును బ్రవర్తనమున నుంచుట.
౫. భగవన్నామకథాజాలముల నెఱుంగుట.

౬. భక్తజనసంకీర్తనము చేయుట.

౭. ఫలములఁగోరక కర్మముల నాచరించి భగవదర్పణము చేయుట.

౮. జ్ఞానవైరాగ్యముల సంపాదించుట.

యను నీమొదలగునవి బహువిధములుగాఁ గలవు. ద్రవ్యమక్కఱలేక జనసాహాయ్య మక్కఱలేక పాండిత్యముతోఁ బనిలేక యభ్యసింప ననువుపడునది భక్తిమార్గము. ఇదియే ప్రథమసోపానము. దీని నెక్కనఁగాని పైఁబోవవీలులేదు. ఇది యనపాయము. దీనికిఁ బ్రధానము శ్రద్ధ. శ్రద్ధయనఁగా ఆస్తిక్యబుద్ధియని భావము. ఇది కుదురుటకుఁ జక్కని పూర్వజన్మకృతపుణ్యముండియే తీఱవలయు ఇంతమాత్రము సహాయసంపద కుదిరెనా భక్తిమార్గము జీవుని ముక్తిమండపమునకుఁ గొంపోవఁ గలదు. పైసహాయములు లేని భక్తి పరవంచన యొనరించుటకుఁగాఁ గొంగవూనిన యనశనమహావ్రతము వంటిది. అది వేషధారుల కుపకరించును. కొలఁదికాలమున కాతనిఁ బునరావృత్తిరహిత నరకరూపమునఁ బడఁద్రోయక విడువదు. కావున సహాయసంపదం బొంది భక్తిమార్గమునఁ బ్రవర్తించుట శ్రేయము.

మనుష్యుఁ డొనరింపనేర్పఱచిన కర్మములన్నియు భక్తిమార్గమునే తెలుపును. భక్తునిలక్షణములే కర్మఠుని లక్షణములు. కర్మఫలములను భగవత్సమర్పణముచేయుట కర్మఠుని కృత్యము. సర్వము భగవదర్పణ మొనరించుట భక్తుని పని.

కీ రిపవరకు గమ్యస్థాన మొక్కటియే. పద్ధతులు వేఱు. ఫల మొక్కటియే. వీరికి సహాయము చేయఁ బూనియున్న గ్రంథ ములు విసంవాదములుగఁ దోఁచుఁ గాని యట్టివి గావు. మచ్చ రము మాని శాంత స్వాంతముతో నాలోచించిన సర్వ గ్రంథము లొక్కరీతిగా నర్థమగును. ముందే మనమతమున కనుకూలమగుపద్ధతి నన్వయించుచుఁ, బరమతదూషణము చేయఁబూనుచో భిన్నవిధములుగా నర్థమగును దానఁ జేటు వాటిల్లు గాన నట్లుగాక పరమార్థజిజ్ఞాసువై యేగ్రంథము పఠించినను దాని సార మొక్కటియే.

భక్తుల కెల్ల గమ్యస్థాన మొక్కటియే యనఁగా నుపాస్య దైవ మొక్కఁడే యని తేలునుగదా యను ప్రశ్నము రాక మానదు. ఆప్రశ్నమునకు సమాధానము చెప్పుటకే యిన్ని గ్రంథములు నడుముకట్టుకొని నిలిచియున్నవి. దానిం బరిశీ లించుటలో భేదములు గలవు. ఆభేదముల వదలుచో సకల గ్రంథప్రతిపాదిత తత్త్వ మొక్కండే యగును.

ఈవిషయమును జర్చించి సిద్ధాంతమును దెలుపుట కిది సమయము కాదు. ఈగ్రంథోద్దేశము నదికాదు. కాన నా చర్చనుమాని ప్రకృతవిషయమునకుం గడంగెద.

ప్రకృతవిషయము శ్రీకృష్ణావతార తత్త్వము. శ్రీకృష్ణుఁ డన నెవఁడు? విష్ణువా! ఈశ్వరుఁడా! శక్తియా! ఈమూవు రునా. ఈమూఁగురు కానేకాదా. ఐన నెవ్వఁడు? అను ప్రశ్నము

వచ్చునపు డూరకుండుట కవకాశము లేదు. తెలిసినవియో తెలియనివియో కొన్నిమాటలు చెప్పక తప్పదు.

సర్వత్రవ్యాపించి రూప మిదియని తెలియఁబడకుండ నుండఁజాలి సర్వసాక్షియై కర్త, కర్మము, కర్మఫలము, తానయై యనిర్వచనీయమహిముఁడైన పరమాత్మ యొకండు గలఁడని యంద అంగీకరించిన విషయము అట్టి పరమాత్మ నుపాసించు టెట్లు? అనునది యవ్వలిమాట.

ఆపరమాత్మ ప్రపంచము రచింప నిచ్ఛఁ గొనునపుడు ప్రకృతి యావిర్భవించును. ఆపరమాత్మ యిచ్ఛయే ప్రకృతి. ఆమెకు నిచ్ఛాశక్తియను నామధేయము గలదు. ఆప్రకృతి ప్రభావ మనిర్వాచ్యము. శ్రుతులు వర్ణింపలేవన నీఁక నితరుల మాటఁ జెప్పనేటికి? ఆస్థితియందే వారికిఁ బ్రకృతిపురుషు లను ప్రఖ్యాతి కల్గెను. ఆప్రకృతి యావిరాట్టునకంటె వేఱా కాదా యనుప్రశ్నమునకే సమాధానము చెప్పఁజాలక మహా మునులే పండ్లిగిలించిరి. తోఁచినట్లు పల్కిరి. అందుఁ గొందఱు మొండిపట్టుదలగలిగి తాఁ బట్టినకుందేటికి మూఁడే కాళ్లనని వారు ప్రకృతిపురుషుల కభేదమనిరి. మఱికొంద ఱదికాదు. విరాడిచ్ఛయే ప్రకృతియని పిలువంబడు. అది రూపముగలది కాదని తల లాడించిరి. మఱియుఁ గొందఱు ఆప్రకృతి తదిచ్ఛా సంభూతురా లనిరి. ఇంకనుం గొందఱు విరాడంతర్యాతశక్తి యే ప్రకృతి యనిరి. ఇవ్విధమునఁ దోఁచినట్లెల్ల శిరఃకంపము లొనరించి, చేతులు త్రిప్పి, వాదించిరి.

ఈవిషయమున బహుగ్రంథావలోకభాగ్యముం గల మాన్యులు ప్రకృతిపురుషులకు భేదాభేదవిచార మశక్యమని పలికిరి. ఆమాటయే సత్యము. ఆపరాత్పరుని యిచ్ఛామాత్రమున సకలబ్రహ్మాండము లలరారు నన నామహాత్ముని యిచ్ఛయన నెట్టిదో తెలియ నస్మాదృశులకు శక్యమా? ఆయిచ్ఛకే సంకల్పమనియు నామాంతరము గలదు ఆప్రకృతికిని సంకల్పశక్తి యను నామాంతరము గలదు. ఇంక నిది యీలాగని యెట్లు చెప్ప శక్యమగును.

శ్లో. శక్తిశక్తి మతో ర్భేదం కోజనః ప్రతిపద్యతే,
వహ్నేశ్చ దాహికాయా శ్చ భేదః కోను సమీక్ష్యతే.

అను ప్రమాణముంబట్టి గట్టిగా నాలోచింపఁగా "తదభేద" వాదమే నిలుచునేమో యని తోఁచెడు. సూర్యునకు ఉష్ణగుణమునకు భేదమా, అభేదమా, అని ప్రశ్నించిన నుత్తరము చెప్పుట కశక్యము. ఏదో యొకరీతిఁ బల్కినను, బ్రశ్నించువాఁడు బుద్ధిమంతుఁడైన నమ్మించుట మఱియుఁ గష్టము.

అట్లైన నీవాద మిట్లుండవలసినదేనా యనుప్రశ్నము రావలసినదే. సమాధాన "మా నట్లే" యని చెప్పవలసినదే. సామాన్యు లిటు సమాధానము చెప్పిన నమ్మవచ్చును.

భగవంతుఁడు సంకల్పరహితుఁడైనతఱిఁ బ్రపంచమే లేదు. ఏమైనది? ఆయనలో నుండినది ఎట్లు? విత్తనములలో

కురశక్తి యినుడునట్లు. పిదప నేమైనది? కర్షకుఁడు సకాల మున నావిత్తనముల సుక్షేత్రములఁ జల్లిన నవి బహుతర ముగా నగపడినట్లు పరమాణురూపజీవకోటి తదిచ్ఛామాత్ర మున నానావిధ పూర్వరూపములఁ బొంది వెలయును.

ప్రశ్నము:—భగవంతునియందు లీనమై మరల రూపత్వము నొందునపు డుత్తమ మధ్యమాధమ రూపభేదము లెట్లు గలిగె?

ఉత్తరము:—గ్రంథపరిశీలనము పెద్దలసాంగత్యము తక్కువ యగుట నీప్రశ్న మొనరింప నవకాశము గలిగినది. కర్మ మనాది యని యంగీకరింపుము. జీవుఁడు తన్నిబద్ధుఁడు. భాండములోనుంచిన విత్తనములు చల్లినపిదప నేకరూప మున వెలువడవుకదా? కర్మము నశించునదికాదు. సత్కర్మ మొనరించినఁ దదనురూపరూపము, దుష్కర్మ మొనరించిన దాని కనుగుణ మగురూపము కల్గును. పుణ్యపాపములఁ దలక్రిందుగాఁ జేయ భగవంతుఁడు పూనఁడు. సర్వ సముఁడు) సర్వసాక్షి యనువేరు లాపరమాత్మకుఁ గలవు.

ప్రశ్నము:—అయిన నాభగవంతుని పనియేది?

ఉత్తరము:—ఇచ్ఛామాత్రమున సృజించుట; తన్నాశమున లయింపఁజేయుట.

ప్రశ్నము:—ప్రకృతి శక్తి యెట్టిది? అదియుండు టెందు?

ఉత్తరము:—అది సర్వవ్యాపిని, భగవంతుఁ డిచ్ఛయింపఁ దా

నావిర్భవించి తదిచ్ఛానుసారము యథాపూర్వముగ సకల బ్రహ్మాండముల నిర్మించును.

ప్రశ్నము:—అట్టితటి యాభగవంతున కేమని పేరు ?

ఉత్తరము:—సగుణబ్రహ్మమని. అత్తటి నాపరమాత్మం గీర్తింతురు. నమస్కరింతురు. ఉపాసింతురు.

ప్రశ్నము:—తత్పూర్వ్వ మావిరాట్టు నుపాసించుట, కీర్తించుట యెట్లు ?

ఉత్తరము :—సిద్ధాంతముగా నర్థమును దెలుపఁ జాలని మాటలచేత నుతింపఁదగు. అట్టివాక్కులచేతనే తద్రూపము నెరుంగఁదగు. అట్టివిధులచేతనే ఉపాసింపఁదగు.

ప్రశ్నము:—ఆమాట లెట్టివి ? విధు లెట్టివి ?

ఉత్తరము:—అనంతుఁడు, అవ్యక్తుఁడు, అవాఙ్మానసగోచరుఁడు, సర్వకర్త, సర్వసాక్షి, సర్వేశ్వరుఁడు, నిరంజనుఁడు, సర్వాంతర్యామి, ఇత్యాదు లామాటలు.

"పూర్ణస్యావాహనం కుత్ర సర్వాధారస్య చాసనమ్,
స్వచ్ఛస్య పాద్య మర్ఘ్యంచ శుద్ధ స్యాచమనం కుతః"

ఇత్యాదు లావిధులు.

"సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్రపాత్,
స భూమిం విశ్వతోవృత్వా అత్యతిష్ఠ ద్దశాంగుళమ్."
నీవార శూకవ త్తన్వీ పీతాభాస్వ త్యణూపమా,
తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః.

"సబ్రహ్మా సశివస్సహరిస్సేంద్రస్సోஉక్షరఃపరమస్స్వరాట్"

శ్లో. ఊర్ధ్వమూల మధశ్శాఖ మశ్వత్థం ప్రాహు రవ్యయం,
ఛందాంసి యస్యపర్ణాని య స్సం వేద స వేదవిత్,

ఇత్యాదులు ధ్యానసాధనములు.

ప్రశ్నము:—వీనిచే నేమియే స్పష్టముగాఁ దెలియఁబడునా.

ఉత్తరము:—తెలిసినట్లు నటింపక నిరంతర మీరీతి ధ్యానిం పుము. సుకృతపరిణతిగల్గినఁ దెలియఁగలదు.

ప్రశ్నము:—ఇంతకన్న విస్పష్టముగా నాపరమాత్మను లక్ష్య లక్షణపురస్సరంబుగాఁ దెలుప శక్యముగాదా?

ఉత్తరము:—నిరంజనాదు లామహాత్మునకుఁ బేరులు. తదర్థ ప్రతిపాద్యుఁడే విరాట్టు.

ప్రశ్నము:—అట్టైన అవాఙ్మానసగోచరుని వాఙ్మనోగమ్యు నిగఁ జేసికొనుటెట్లు? పూజాదు లొనరించి తృప్తిపఱచు టెట్లు?

ఉత్తరము:—ఆర్యా! నీవాస్తికుఁడవని తెల్లమాయె. ఇక వినుము. నుతించుటకు పూజించుటకు మనఃపీఠమున నాసీనునిగాఁజేసి ధ్యానించుటకు సగుణబ్రహ్మము పాత్రుఁడు.

ప్రశ్నము:—సగుణబ్రహ్మ ముపాస్యుఁడైనచోఁ బ్రకృతియు నుపాసనార్హ యగునా?

ఉత్తరము:—ప్రకృతిపురుషులనుచో నర్థమేమి? ప్రకృతివిశిష్ట పరమాత్మయని కొందఱు వాదింతురు. కాని అర్థ మొక్క

టియే. ఆయిరువురకు భేదము చెప్ప నెవరికిని సాధ్యము కాదు. కాన వారిరువురు నుపాసనార్హులే.

ప్రశ్నము:—హరిహర బ్రహ్మ లెవరు ?

ఉత్తరము:—జగత్కారణభూతులగు నాదిపూరుషులు.

ప్రశ్నము:—వీరు ప్రకృత్యతీతులా ? ప్రకృతినిబద్ధులా ?

ఉత్తరము:—ప్రకృత్యతీతు లేనాఁటికిఁ గారు. ప్రకృత్యతీతుఁ డనఁదగువాఁ డొక్కవిరాట్టువే. తక్కుంగల వారెల్లఁ బ్రకృతిబద్ధులు.

ప్రశ్నము:—ఈత్రిమూర్తులే పరమేశ్వరస్వరూపులని యుపాసించువారికి ఫలము శూన్యమే.

ఉత్తరము:—కాదు. జగదాకార విలసితుఁడే పరమాత్మ. ఎవరి నుపాసించినను ఆ విరాట్టునకే చేరును.

ప్రశ్నము:—అలాగైన నీత్రిమూర్తులనేగాక తక్కుంగలదేవతల నుపాసించినను భగవంతు నుపాసించినట్లే యగునా ?

ఉత్తరము:—పరమానందము! చక్కనిప్రశ్న మొనరించితివి ? సదుత్తరము చెప్పెద. ఆలకింపుము. ఇంద్రరూపమున వెలయు పరమాత్మయని యుపాసింపుము. ఇంద్రుఁడు దిక్పాలకశ్రేష్ఠుఁడు; ఈయనకన్న విష్ణు వధికుఁడు. అని యిట్లు భేదబుద్ధిం గైకొనకుము. అట్లు గ్రహించితివా ఆ విరాట్టువు సర్వాంతర్యామిత్వము నశింపఁజేసినవాఁడ వగుదువు. అట్లుగాక ఇంద్రరూపమునొందిన విరాట్టువు. అని

యుపాసించినచో ననపాయమోక్షసామ్రాజ్యమును బడ యఁగల్గుదువు.

ప్రశ్నము:—ఇటులైన నేభక్తుఁ డేదేవత నీబుద్ధితో నుపా సించినను ఫల మొక్కటియే యని తేలునుగదా!

ఉత్తరము:—దృఢభక్తితో నావిరాట్టువు నిష్టదేవతారూప మున నుపాసించిన నందఱకు ఫలమొక్కటియే యనుట కేమి సందియము ?

ప్రశ్నము:—ఈరీతి నాలోచించినఁ ద్రిమూర్తులలో హెచ్చు తగ్గులు లేకుండుటయే గాక సర్వదేవతా సామ్యము సిద్ధించునే.

ఉత్తరము:—అది సిద్ధించినచోఁ గొంపలు మునిఁగిపోవునని భయపడకుము.

ప్రశ్నము:—మఱొక ప్రశ్నమున కవకాశ మిత్తురా ? కోప పడకుఁడు.

ఉత్తరము:—ఎన్నియేఁ బ్రశ్నముల నొనరింపుము. కోపపడ నవకాశమే లేదే.

ప్రశ్నము:—హరిహరులలో నుత్తమాధమభేదములు గల వనువారి ప్రమాణవచనములకుఁ దిలోదకము లీవలసిన దేనా?

ఉత్తరము:—దారికి వచ్చుచున్నావు. చక్కఁగా వినుము. వినిన దానిని మనసునఁ బదిలపఱచుకొనుము. అదేదనః—కర్మ భేదములచేత భక్తి వివిధరీతులఁ బరిణమించుచుండును. ఒక్కొక్కప్రాణి కొక్కొక్కదేవతయం దాదృతియు

వేఱొకదేవతయం దనాదరణము గలుగుచుండును. కాని ఆతనియందలి భక్తి దృఢమగుచో ఫలముగల్గక తప్పదు. అన్యదేవతాదూషణముమాత్ర మాతనికిఁ బ్రతిబంధక మగుట తప్పదు. విష్ణువే విరాట్టువు అనుభక్తునకు, శివుఁడే విరాట్టువు, అన్నభక్తునకు నుపాసనాఫలము సమానము. కాని, వారిభక్తిమాత్రము దృఢతమము గావలయు. ఈమాటలసందడిలో భగవంతుఁడు సర్వాంతర్యామి యను మాటనుమాత్రము మఱువకుము. అన్నియు సరిపడును.

ప్రశ్నము:—ఈమాటల వైఖరిం బట్టిచూడఁగా సర్వదేవతాసామ్యము స్పష్టము. ఏదేవత నుపాసించినను ఫలము సమానము. ఐతే భక్తి యేకరీతిగా నుండవలయుననుట విశేషము. అట్లైనచో నేదేవత నుపాసించినను సమాన ఫలము గలుగును. అని తెలిసికొంటిని. తెలిసికొనఁదగిన వింతయేనా?

ఉత్తరము:—ఇంతమాత్రమే కాదు. విశేషముగాఁ గలదు. ప్రాణి స్వపూర్వకర్మానుసారము; తదనుగుణఫలప్రదాత యగు దేవత నుపాసించును. ఆదేవతయు నట్టిఫలము నిచ్చును.

ప్రశ్నము:—మరల నేమో శంకగలిగించున ట్లున్నది ఏదేవత నుపాసించినను ఫలమొక్కటియే యంటిరిగదా!

ఉత్తరము—దేవతలలో బహువిధభేదములు గలవు. ఉపాసకులందఱు పైఁజెప్పఁబడిన ట్లుపాసింపఁజాలరు. ఆయుపాసనచేయుటకుఁ బుణ్య మెక్కువ యుండవలయు. అల్ప

పుణ్యుల కాయుపాసన శక్యముగాదు. ఆతనిబుద్ధి యా మార్గమునఁ నడువఁ జాలదు.

ప్రశ్నము:—నాకేమియుఁ దోఁచలేదు. ఈసంశయము నివారింపుఁడు.

ఉత్తరము:—కర్మానురూపఫలప్రదాతలు దేవతలు గలరు. అందు హరిహరు లుత్కృష్ట కర్మఫలప్రదాతలు. ప్రాణికోటి యందు బహువిధభేదకర్మము లొనరించినవా రుండునట్లె దేవతలయందును భేదములు గలవు భక్తుఁడు స్వకర్మోచిత ఫలము నొందఁజాలును. కాన నట్టి దేవతాభక్తియే యాతనికిం గుదురును.

ప్రశ్నము:—ఈవిషయము దురూహముగా నున్నది. ప్రశ్న మొనరించుకొలఁది సంశయము లెక్కువ యగుచున్నయవి. ఇవి వదలుటెట్లో.

ఉత్తరము:—త్వరపడకుము. విషయ మది సులభసాధ్యము కాదు. దురూహమే. కాని యుపాసనాబలమున సుజ్ఞేయ మగును.

ప్రశ్నము:—మఱియొక ప్రశ్నము గలదు.

ఉత్తరము:—ఏ దది ?

ప్రశ్నము:—ప్రకృతి నుపాసించువారికి ఫలముగలదా ?

ఉత్తరము:—ఆర్యా! స్వల్పబుద్ధి నగపఱచితివి. ప్రకృతి నుపాసించిన ఫలము గలుగునా యను శంకగలిగెనా ? సర్వ దేవతలు, దేవాధీశులు, తద్వికృతులుగారా ?

ప్రశ్నము:—ప్రకృతియనఁ బార్వతియా, లక్ష్మియా, శారదయా, వీరిలోఁ దారతమ్యములు గలవా?

ఉత్తరము:—తారతమ్యములు గలవనుట బుద్ధిభ్రాంతి. ఒక్క మాట; విష్ణువు విరాట్టుగా భావింపుము. అపుడు మూల ప్రకృతి లక్ష్మీదేవియే యగును. ఈశ్వరు నట్లు భావింతువేని పార్వతియే ప్రకృతి యని తలంపుము. బ్రహ్మనే యట్లు భావింతువా శారద ప్రకృతి యని నిశ్చయింపుము. ఏద్వంద్వమునుపాసించినను వారిరువురు ప్రకృతిపురుషు లనంబడుదురు. ఇతరదేవతాధిశద్వంద్వమున నసూయఁ బూనకుము. అజహరిహరులు స్వస్వశక్తులంగూడి సకలవాంఛల నొసఁగఁ జాలుదురు. వేఱువేఱుగ నుపాసించినను ఫలప్రదాత లగుదురు. అనఁగా—దీని భావమేమి? అవయవి ప్రకృతివిశిష్టము; కాన నది యుపాస్య మేల కాదు? ఇంకను ఈవిషయమునఁ జర్చ చేయుచో విషయమెంతయో తేలఁగలదు. చర్చించుకొలఁది నొక్కొక్కశంక కలుగుచునే యుండును. మనస్సును బహుభంగులఁ బోనీయక చిక్కఁబట్టి నిశ్చితజ్ఞానమున నొక్కదేవత నుపాసించుచు నితర దేవతా దూషణముచేయక సకలదేవతలు, తదితర ప్రాణికోటులు ప్రకృతిపరిణతములని భావించి యా ప్రకృతి నుపాసించి తదనుగ్రహము నొంది పరమపురుష సాన్నిధ్యము నొందఁ బ్రయత్నింపుము. ప్రకృతి ప్రధానుశాలు కాదను వాదము మూర్ఖవాదము. దాని నుపాసింపకున్న

నజ్ఞానపటము దొలఁగదు. అది తొలఁగకున్న భగవద్దర్శ నము కానేకాదు. ఆలోచింపుము.

శ్రీమ చ్ఛంకరభగవత్పాదులు సౌందర్యలహరియం దిట్లు వాక్రుచ్చిరి.

శ్లో. క్వణ త్కాంచీదామా కరికలభకుంభ స్తననతా
పరిక్షీణా మధ్యే పరిణతశరచ్చంద్రవదనా,
ధను ర్బాణా౯ పాశం సృణిమపి దధానాకరతలైః
పురస్తా దాస్తాం నః పురమథితు రాహోపురుషికా.

విరించిః పంచత్వం వ్రజతి హరిరాప్నోతి విరతిం
వినాశం కీనాశో భజతి ధనదో యాతి నిధనమ్,
వితంద్రీ మాహేంద్రీ వితతి రపి సమ్మీలితదృశా
మహాసంసారే ఽస్మి న్విహరతి సతి త్వత్పతి రసౌ.

ఇట్టిప్రమాణములు చూపఁబూనిన నన్నిగ్రంథములు ఎత్తివ్రాసిన ట్లగును. కాన, నింక నీచర్చ చాలును. ప్రకృత విషయమునకు వచ్చెదను.

పైనుదాహృతప్రశ్నోత్తరముల సారమేమన—విరాట్టు ప్రపంచరచనేష్టమునఁ బ్రకృతివెలయించి యథాపూర్వముగా బ్రహ్మాండముల నలవరించెను. తదధిష్ఠాతలదేవతల వెలయిం చెను. తా సర్వాంతర్యామియై సర్వసాక్షియై వెలసెను. ఇట్టు చేసిన నేమి లాభ మనుప్రశ్నము తుచ్ఛము. ఆ భగవంతుని లీలలెఱుంగ నెవరికి శక్యము? కాఁబట్టి హరిహరప్రముఖదేవత

లాపమహాత్ముని వికృతులు గానఁ దదతీతుఁ డగువిరాట్టు నుపా
సింప శక్యముకాదు గాన నీ యుత్తమోత్తమదేవతల నుపా
సించి వీరియనుగ్రహమున మాయాతీతుఁ డైన విరాట్టుపుకరు
ణకుఁ బాత్రుఁ డగుపుణ్యాత్ముఁడు ముక్తుఁడు అనునదియే.

ఈవిషయము నిఁకఁ బెంచివ్రాయక ప్రకృతప్రయత్నఫల
మగు శ్రీ కృష్ణావతారతత్త్వము ననువదింపఁ గడంగెదను.
పైవ్రాయఁబడినవిషయము వివాదాస్పదము. బహుసంశయ
భూయిష్ఠము. ఇందేది సత్యమనునది వచింపఁజాలక మహాత్ములు
కాలమును బుచ్చిరి. తోఁచినట్లు సిద్ధాంతముల నొనరించిరి.
శ్రుతిస్మృతి పురాణేతిహాసములకు నర్థమును ద్రిప్పిత్రిప్పి చెప్పిరి.
ఆ యర్థము గుదురక పలుపాట్లు పడిరి. ఆసిద్ధాంతములు
ఏతత్క్షణపర్యంతము నిస్సంశయములా? కావు. ప్రశ్నములపైఁ
బ్రశ్నములు వచ్చుచునే యున్నవి. అది సిద్ధాంతము కా
దిదియే రాద్ధాంతమని కొందఱువాదింప బద్ధకంకణులై యున్న
వారు. తెలిసినదానినిగూడ మఱుగుపఱచుచు మొండివాద
ములకుఁ బూనుచున్నారు. సత్యాన్వేషణము వెనుకఁ బడినది.
కుతర్కసహాయము మెండుగా దొరకుచున్నది. సకలశాస్త్ర
ములు తోఁచినట్లు సిద్ధాంతము చేయఁబూనినవారిచేతులలోఁ
జిక్కి తికమకపడు చున్నవి. మతాచార్యులు పరదూషణము
చేయఁబూనినట్లు వారి గ్రంథములనుండి తేలున ట్లున్నది.

ముక్తి సాధించుటకే కదా యిన్నిగ్రంథములు కావలసి
వచ్చినవి. ముక్తియందును భేదము సిద్ధాంతము చేయఁబడినది.

వైకుంఠమే ముక్తిస్థానమని కొందఱు వ్రాసిరి. కైలాసమే ముక్తిపదమని కొందఱు తేటపఱచిరి. కాదు కా దది వేఱు తావని మఱికొంద అనిరి. అదియొక దివ్యహర్మ్యమని యందుఁ జొచ్చినవారు పునర్భవము నొందరని, అందే యాడుచుందు రని కొందఱు వాదించిరి. రామరామ! కృష్ణకృష్ణ! హరహరా! ఆ స్థానమెట్టిదో, అందుఁ బొందఁగల సుఖమెట్టిదో, ఆనంద మయుండగు పరమపురుషుఁ డం దెట్లుండునో, అందుఁ జొచ్చిన వారందఱు ఇం దున్నట్లే తాటియాకుల విప్పిచదువుచుఁ గలహములకుఁ గాలుద్రవ్వుచు, నదికా దిది, ఇదికా దది-అని మొండిమాట లాడుచుందురో, ఎవ్వ రెఱుఁగుదురు ?

మన మతాచార్యులు మువ్వురు మూఁడుమార్గములం దెల్పిరి. వారిమార్గములలో నేది ముక్తిపదముం జేర్చునో చెప్పఁజాలము. ఎవరికి దేనియందు నమ్మకముగలదో వారు దాని నాశ్రయించి పరమతముల దూషింపక కృతార్థు లగుట కన్న నుత్తమమార్గము వేఱేదియుఁ దోఁపకున్నది. వాదము లకుఁ బూనుట, గ్రంథములం ద్రిప్పుట వృథాప్రయాస మన వలసి వచ్చుచున్నది. సర్వసంశయవిచ్ఛేదము చేయ నేగ్రంథము చాలకున్నది. బుద్ధి ప్రసరించుకొలఁది యుక్తులు తోఁచు చునే యుండును. వేదములు, వేదాంతములు, తదంగములు లోనగునవి ఒక్కమాటగా నిది తత్త్వమని బోధించుట లేదు. వానికింకూడ నీసంశయములుండినట్లు తోఁచును. ఇట్లనుటయు మహాపాతకమే. పరిపక్వజీవునకు సత్యము తోఁచునేమో.

కాఁబట్టి తా నమ్మినమతము సత్యమనియే భావించి తదనుసారముగఁ బ్రవర్తించుట యిహపరసుఖహేతు వనుటకన్న వేఱొకమాటఁ జెప్పుట యుక్తముగాదు.

ఇట్లు నిశ్చితాంతఃకరణుండనై ప్రకృతప్రయత్నమునకుం గడంగెదను. ప్రకృతప్రయత్న మనఁగా — శ్రీకృష్ణావతారతత్త్వమును వ్రాయుట. ఇదేమి యల్పకార్యమా? భగవదవతారతత్త్వ మిది యని నిర్వచనము చేయ సాధ్యమా? అట్లని యూరకుండుట న్యాయమా? ఊరకున్నఁ బురుషార్థములను త్తమోత్తమ మనఁబడుముక్తి సాధించు టెట్లు? కావున నేదో యొక ప్రయత్నము చేయవలసినదే.

ప్రకృత మగునీప్రయత్నము సముద్రమున కేతము వేసినట్టిది కదా! ఎట్లిది తుదముట్టును? అనుశంక నొందఁ బనిలేదు. శ్రీమద్రామాయణాదిమహాగ్రంథముల నాచేత వ్రాయించిన శ్రీపరాంబ యీగ్రంథమునుగూడ నాచేత వ్రాయించి యానందింపఁగలదను పెనునమ్మకము నా కున్నది.

ఎందఱో ఈ పవిత్రచరిత్రమును వ్రాసిరి. నీవిఁక వ్రాయున దేమి? యని ప్రశ్నించుట యంత మంచిది గాదు. భగవత్కథను బొగడ నెవరు వెనుతీయుదురు? తృప్తినొందుదురు? అది సర్వతోముఖము. అపారము. దానినంతయు వచింప నెవరితరము? కాఁబట్టి భక్తులు తోఁచినంత వ్రాయుట యత్యుత్తమమార్గము. అట్టిమార్గము నాక్షేపించుట యుక్త

ముగాదు. ఎవరిపుణ్యము వారిదనుసూక్తి యందఱెఱుఁగు
దురు.

శ్రీకృష్ణశబ్దము నర్థము నిర్వచనము చేయుటయుఁ గష్ట
ముగనే యున్నది. భగవంతున కిది యనాదిగానున్న నామమా,
ద్వాపరాంతమున యాదవకులమున నవతరించినపుడు కలిగి
నదా? అన్న సనాతన మనవలయు. ఈకృష్ణరూపమున నవత
రించినది విష్ణువా? యన్న నించుక సంశయింపవలసియున్నది.
గోలోకముననున్న శ్రీకృష్ణమూర్తియొద్దకు లక్ష్మీసరస్వతీసహి
తుఁడై విష్ణువుపోయినట్లు పురాణము చెప్పుచున్నది. ఈమాట
చాలమందికిఁ గ్రొత్తదిగాఁ దోఁచుటయే గాక యచ్చెరువును
బుట్టించును. ఈపురాణమే యసత్యమని పలుకు నంత తెగువఁ
గల్పించును. కాని యించుక యాలోచించిన దానితత్వము
బోధపడును.

వైకుంఠవాసియగు విష్ణువునకన్న వేఱైన శ్రీకృష్ణపర
మాత్మ గోలోకమున వేంచేసియున్నాఁడనుట, వింతప్రసం
గము గాదు. పురాణములఁ బరిశీలింపకపోవుట, దురహంకృతి,
యుండుట నట్లుతోఁచుట కవకాశ మొదవును. అట్లగుటఁ
బురాణములఁ బఠించి పట్టుదలను మానిన నన్నియు సత్య
ములుగా గోచరించును.

శ్రీకృష్ణపరమాత్మను దర్శింప శంకరుఁడు, బ్రహ్మ,
విష్ణువు తక్కుంగల యింద్రాదిదేవతాధీశగణముపోవుట యను
విషయముం బఠించి సన్మతిచే నాలోచించినచో వీరినందఱిని

బుట్టించిన భగవంతుఁడు వేఱొకఁడు కలఁడనియు, నొక్కొక్క కార్య మొక్కరొక్కరు చేయ నాపరమాత్మయే యాజ్ఞాపించె ననియు, తదాజ్ఞ శిరసావహించి స్వకార్యములం దీర్చుచుఁ దన్నిర్మిత బ్రహ్మాండములకుఁ దమరధిపతులై యున్నవారు హరి హరవిరించి ప్రముఖులని తేలకమానదు. ఔరా! మొండి పట్టుగా విష్ణువునకన్న శంకరుఁ డధికుఁడు; శంకరునికన్న విష్ణు వధికుఁడు; అని బొడ్డున జన్నిదమును దోపి మాటలపోటు లాటతోఁ దృప్తినొందక చేతులు గలుపఁబూనుట వెఱ్ఱితనము కాదా! ఒక్క భగవంతుఁ డెన్నెన్ని రూపముల నుపాస్యుఁ డగు చున్నాఁడు? ఎందఱు జీవులు భిన్న భిన్న కర్మము లొనరించు వారు గలరు? అనునది మనస్సున స్ఫురించినపుడు కన్నులు కానరాక మనస్సు మన యధీనమున నుండకపోవుట తప్ప మఱేమిగలదు?

ఈరీతినుండనే భక్తుఁ డేరూపమున నాభగవంతు నుపాసించినను గొఱంతలేదుకదా! సకలకార్యముల నొనరించుచు, జీవులు సుఖదుఃఖముల నొందుచుండఁ దా సర్వజ్ఞుఁడై నిర్లిప్తుఁడై సర్వవ్యాపియై భగవంతుఁడు చూచుచుండుటఁ దలంచిన దేవతాభేదముగాని, తారతమ్యముగాని మన మూహించుట మిగులఁ బొరపాటని సిద్ధాంతము గాఁ దోఁచును ఏది యెట్లున్నను భగవంతుని లీలావతారములఁ గథలుగా వ్రాయుట, నుతించుట సత్కార్యము. అదియు నొకతపస్సు. అట్టికృత్య మొనరించుటకే యీనాప్రయత్నము. గొప్పదానములు, తీర్థయాత్రలు లోనగు ధర్మకార్యములను జేయ శక్తిఁజాలని నేనీ కార్యముచేతనే కృతార్థుఁడ నగుదు నని నమ్ముచున్నాఁడను.

## మతవిభేదములు.

శైవ, శాక్తవైష్ణవములే షణ్మతములలో వ్యాప్తినొందినవి. తక్కినవి వీనితర్వాత వ్యాప్తినొందిన వనఁ దగినవి. అవి సౌర, గాణాపత్య, కాపాలికములు. ఇందు శాక్తగాణాపత్యకాపాలికములు శైవము ననుసరించును సౌరము శైవవైష్ణవములతో వియ్యమందుచునుండును. ఇందేమతము నాలోచించినను ఆదేవతయే సర్వోత్కృష్టుఁ డని తేలును. బాహ్యవిభేదములుతప్ప నాచారములలోఁ దత్త్వ మొక్కటియే. అన్నియు నేకత్వమునే తెలుపును. సర్వమతతత్త్వములఁ దెలిపినంత దనుక నాలోచించిన భేదమే కానరాదు. ఏభక్తుఁ డేదేవత నుపాసించినను ముక్తుఁ డగు నని స్ఫురించును.

ప్రకృతినామమున వ్యవహరింపఁబడు త్రిపురసుందరి సర్వదేవతలు, తదధిపతులు, తక్కుంగల సకలజీవకోటి నేనే యని తెలుపును. రామకృష్ణులచరిత్ర మందఱకు గోచరంబు కాన దాని నిటఁ బ్రధానముగా భావించి వ్రాసెద.

"శ్రీ కృష్ణ శ్శ్యామలాదేవీ శ్రీరామో లలితాంబికా."
యను ప్రమాణము కనఁబడుచున్నది. విన్నంతనే యిది క్రొత్త మాటగా నసందర్భముగను దోఁచును కొందఱ కాగ్రహము గూడఁ గల్గును. ప్రతిపక్షిని దాడనరూపబహుమానమున నలరింతమా యని తోఁచును. దానికిఁ దగినదేహపాటవము లేనిచో మాటలచే నాపని చేయఁ దలంపుగల్గును. కాని తత్త్వ

మిందేవిరా యని కన్నులుమూసి నిష్పక్షపాతమతి నాలోచించిన మనము పొరపడితిమని తోఁచును. ఆపైననే మతము నాక్షేపించు నలవాటు నశించును.

## దీని సారమేమి ?

మన మనఃపాటవము నశింపఁజేయు భేదబుద్ధిని బ్రతిమతము పోఁగొట్టఁ బ్రయత్నించుచున్నది. తదుక్తదేవత నుపాసించిన ముక్తి కరతలామలక మనుచున్నది. ఇతరదేవతలు తదంగదేవతలే యనుచున్నది. అనఁగా నొక్కదేవతనే యుపాసింపుము. సమాహితచిత్తుఁడవు కమ్ము దాన భగవదనుగ్రహపాత్రుఁడ వగుదువు. సత్యము. నమ్ముము. ఈదేవతయే నామరూపభేదములచే నిన్నివిధములుగాఁ దోఁచుచున్నది. ఇంతకంటె నేమి బోధింపవలయు ? ఇంతకన్న నేమి హితము దెలుపవలయు. ఇందలిసార మేదేవత నుపాసించినను అవిరాట్టు నుపాసించినట్లే. అ విరాట్శక్తియే యీరూపమున వెలయుచున్నది. ముక్తి కరగతము. సత్యము. సత్యము. సత్యము. నమ్ముఁడను వదియే కాని వేఱొకటి కాదు. ఇట్టులుండ మావిష్ణు వెక్కువ. మాశివుఁ డెక్కువ యనుట యెంత తెలివితక్కువ ఎంతపాపము. మావిష్ణువనఁగా నేమి యర్థము ? మాశివుఁడన నేమి భావము ? మా మీ యనుమాటల కర్థమేమి ? దేవతాంతర దూషణమున కేమి యధికారము గలదు ? దానఁ గలులాభ మేమి ?

మతత్రయస్థాపకులు తమభావ మిది యని తెల్పిరి. పరమతదూషణమును దెల్పిరా? అది పురుషార్థమని బోధించిరా? లేదే! ఒక్కదేవతనే నమ్ముఁడనిరి; అదియే తరణోపాయ మనిరి. మనస్సు స్వాధీనము చేసికొం డనిరి అంతశ్శత్రువులగు కామక్రోధాదుల జయింపుఁ డనిరి శ్రుతిస్మృతి పురాణాదులు ప్రమాణము లనిరి. వాని నమ్మినవారికి సుగతి గలదనిరి. సంసారసుఖ మత్యల్ప మనిరి. దీనినమ్మి చెడిపోకుఁడీ యనిరి. తలపగులఁగొట్టుకొని తత్త్వ మిదియేసుఁడీ యని తెల్పిరి. తమ జీవితకాలమంతయు నీకృషికై ధారవోసిరి. ఈకృషి చాలదని కాఁబోలు శ్రీమద్రామానుజభగవత్పాదులు భక్తి కందఱు పాత్రులు, కులభేదము లనవసరము లని భగవన్మంత్రము నుపదేశించి ప్రతిలోమజాతులనుగూడ జాతులలో సమతఁ గనఁజేసిరి. ఏమి వారి యౌదార్యము! ఏమి వారి యాశయము! ఏమి వారిపట్టుదల! వేనోళ్లఁ గొనియాడిన ఋణవిముక్తుల మగుదుమా!

శ్రీమత్సర్వజ్ఞాచార్యులుగారు భక్తితారతమ్యమును దెలిపిరి. ఆకాలమున నించుక మార్పులుచేయక తప్పదని వారికిం దోఁచెను మనుజుల యాశయము లట్లుండినవి. కాన వా రాలోచించి యీమార్పులు చేయకున్న భక్తి నిలుకడఁ గాంచదని య ట్లొనరించిరి? భగవంతు లిద్దఱు గలరనిరా? ఇతరదేవతల దూషింపుమనిరా? కామక్రోధవిశిష్టులు కమ్మనిరా? లేదే. ఏల కొందఱు పరమతధర్మముల దూషింపవల

యేమనో తెలియఁజాలకున్నాఁడను. వారిమతమున విష్ణువే పరమాత్మ. తక్కుంగలవారు తదాజ్ఞాపాలకులు. తద్భక్తులు. తత్సమానులు లేరు. అట్టివిష్ణువు నుపాసించిన ముక్తిగలుగు. ఇదియే తద్బోధసారము. ఇందు దూషింపఁదగిన విషయమేమున్నది? ఒక్కదేవతను నమ్ముము. మనస్సు స్థిరముగా నుంచుకొనుము. విష్ణువు పరమాత్మయని నిశ్చయింపుఁడని వారు బోధించిరి.

ఇట్లు మతస్థాపకులందఱును ఒక్కదేవునినే నమ్ముఁడనిరి. నామములు వివిధముగ నున్నవి. దాన బాధయేమి? సర్వనామవ్యపదేశ్యుఁడు పరమాత్మ యొక్కఁడే. ఏరూపమున నేనామమున బూజించినను, ధ్యానించినను, గీర్తించిన నామహాత్ముఁడే తృప్తుఁడగును. ఆభగవంతుఁడు విష్ణువే కానిండు. శంకరుఁడే కానిండు. బ్రహ్మయే కానిండు. షణ్ముఖుఁడే కానిండు. గణపతియే కానిండు. త్రిపురసుందరియే కానిండు. ఇంక నెవ్వరేకానిండు. దానఁ గీడులేదు. కాని యన్యదేవతా దూషణముమాత్రము కీడుమూడఁజేయును. కాన దానిమాని మానవులు ఇష్టదేవతనుపాసించి తత్ప్రసాదపాత్రులు కావలయును.

## కృష్ణ విష్ణువు లిద్దరా?

శ్రీకృష్ణజన్మఖండమున గోలోకవాసియగు శ్రీకృష్ణపరమాత్మను దర్శింప శ్రీమహావిష్ణువు సరస్వతీ భార్గవీ సహితుండై వచ్చెనని చెప్పఁబడియె. కాన మహావిష్ణువు కాక గోలోకమున శ్రీకృష్ణమూర్తి రాధాదేవితోఁ గూడియుండె ననియు

నాదేవదేవుఁడే విష్ణువకంటె నధికుఁడనియుఁ దెలుపఁబోదు. ఆకృష్ణమూర్తియే యాదవకులమున నవతరించెననియు స్పష్ట పఱచును. ఈగాథచే మొదటికే మోసమువచ్చెనే యన్న సందియ మొంద నవసరము లేదు. నారాయణమూర్తి యొక్కఁడే. భగవంతుఁడగు శ్రీమన్నారాయణమూర్తి లీలావతారము లనేకములు. ఏయే కార్యమునకై యేయే యవతారము నెత్తునో తెలియుట చాలఁగష్టము. ఆమహానుభావుఁడే యెఱుంగును. మానవులకుఁ దెలియ శక్యముకాదు. శాస్త్రము లీవిషయమును విస్పష్టముగాఁ దెలుపఁబూనలేదని తోఁచు.

భగవంతుఁడగు నారాయణమూర్తియే బహువిధపుణ్యవంతులగు మానవులు తత్పుణ్యఫలము లనుభవించుకొఱకొక్కొకలోకము నేర్పఱచును. తానందు నధిష్ఠాతయై మహామహిమమున నలరు. బహువిధనామరూపముల వెలుఁగొందు నామహామహుని భక్తులు సేవించుచుందురు. లోకమర్యాదల ననుసరించి తానును మెలఁగుచుండు. ఉపాసకుల యభీష్టమెట్లో యట్టిరూపమున వారిం గటాక్షించి పోషించుచుండును. ఎట్టిరూపమును సేవించు భక్తులు అట్టిరూపమున సాక్షాత్కరించిన భగవంతు నర్చించి కృతకృత్యు లగుచుందురు. భగవద్రూపము భక్తవాంఛాధీనము కాని స్వేచ్ఛాధీనము కాదు. ఇది సిద్ధాంతము. అనుభవైకవేద్యము.

కాళిదాసు విద్యార్థియై భయంకరరూపిణియగు కాళికయాలయమున కేగి ప్రార్థింప నాజగజ్జనని భక్తునిభావ మెఱిఁగి వీణాహస్తయై శారదరూపమున సాక్షాత్కరించెను. తద్దర్శన

మాత్రమున బుద్ధిజాడ్యము వదలి జ్ఞానసంపన్నుఁడై సులలిత వాక్కుల నాలోకమాతను

" మాణిక్యవీణా ముపలాలయంతీం
మదాలసాం మంజులవాగ్విలాసామ్,
మాహేంద్ర నీలద్యుతికోమలాంగీం
మాతంగ కన్యాం మనసా స్మరామి. "

అని స్తుతించెను సకలసురాసురభయంకరరూపధారిణియగు నామాతంగకాదేవి భక్తుఁడు విద్యనుగోరి వచ్చినాఁడని యెఱింగి తనసుగుణ్యమగు శారదరూపమున వీణాపాణియై సాక్షాత్కరించి యాతని యభీష్టవరము నొసంగెను.

కావున భగవంతుఁడగు నారాయణమూర్తి వైకుంఠ వాసియైనను పుణ్యవంతులకుఁ దగిన లోకములఁ గల్పించి తానందు వేంచేసియుండు ఎట్టిపుణ్యముగలవా రట్టిలోకమునఁ దదర్హసుఖము లనుభవించుచుందురు. గోలోక మట్టి భక్తనివాసస్థానము. అందలిసుఖము లనుభవింపఁగలవారు తదుచిత సత్కర్మముల నాచరించినవారే. భక్తవాంఛాప్రదుఁడగు భగవంతుఁ డాలోకమున శ్రీకృష్ణనామమున వెలయుచుండును. అనపాయిని యగు శ్రీదేవియే యందు రాధానామమున నా మహామహుని చెంతనుండి భక్తులకెల్ల వాంఛితముల నీఁజాలి యుండును సర్వము తానై యుండు భగవంతుఁడు లోకమర్యాదల ననుసరించి యొకకార్యము సాధింపఁబూని స్వరూపము నే

తా నాశ్రయించినట్లు నటించును. ఇట్లగుటంబట్టి గోలోకమునకు శ్రీకృష్ణదర్శనార్థము వైకుంఠమునుండి లక్ష్మీసరస్వతీసహితుఁడై నారాయణమూర్తి యరిగె. నన్నగాథనుండి ప్రమాద మేమియుఁ గలుగఁజాలదు. రాధామాధవుల నుపాసించు నిచ్ఛ గల భక్తులా గోలోకమునకుం బోవుదురు. లక్ష్మీనారాయణుల నుపాసించు భక్తులు వైకుంఠమున కేగుదురు. అదియే ముక్తిస్థానమని శ్రీమద్రామానుజాచార్యుల తాత్పర్యము.

రామకృష్ణాద్యవతారములు సమాప్తినొందినను భక్తులా రూపముల నానామముల భగవంతు నుపాసింతురు. శ్రీమన్నారాయణమూర్తి యారూపమున వారికిం బ్రత్యక్షమయి కోరిక లొసంగు. రామావతారము సమాప్తమై చాలకాలమైనను రాము నుపాసించు భక్తులు లేకపోలేదు. ఆరామ రూపమున భగవంతుఁడు సాక్షాత్కరింపకపోలేదు. రాముఁడు మానవరూపమును వదలి వైకుంఠమున కేగెనుగదా? ఆరూప మెట్లుపాస్యమని శంకనొందుట యొకవిధమగు వెఱ్ఱితనము.

ఈసిద్ధాంతమును మనమున నుంచుకొన్నచో నేశంకలు గలుగవు. మార్గభేదములు తోఁపవు. మనస్సు చలించు నవకాశ ముండదు. పురాణములఁ బడఁదిట్టుకష్టము తొలఁగిపోవును. ఉన్నంతభక్తితో భగవత్సేవ చేయు నవకాశ మొదవు.

ఇయ్యది సిద్ధాంతమో కాదో నేఁ జెప్పఁజాలకున్నాఁడ. ఈసిద్ధాంతమునే నే నమ్మినవాఁడ నని మాత్రము నిరాఘాట

ముగ మమ్మాటికిఁ జెప్పఁగలను. ఇట్టే యందఱు నమ్మవలసి నదియు, నమ్మనిచోఁ జెడుదురనియు మాత్రము నేఁ జెప్పఁ బూను. ఇంతకన్న మంచిసిద్ధాంతము తోఁచినచో దానినే వా రనుసరింపవచ్చు. విభేదము నశించుట సిద్ధాంతమునకు ఫలము. సంశయాస్పద మగునది సిద్ధాంతము కాఁజాలదు. ఒక్కసిద్ధాంతమే యందఱకు సరిపోదని మాత్రము చెప్పఁ గలను. ఏలన, జనులు చేయుకర్మములు వేలువేలుగా నుండును. కర్మానుభవములుకూడ వేలు. కావున నేకవిధమగు భక్తి యందఱకుండునని నే నమ్మఁజాలకున్నాఁడను. కాని భగ వద్భక్తియందు భేదముండినను దృఢవిశ్వాసమున శాస్త్రిక మార్గమునఁ బ్రవర్తించినచోఁ గృతార్థుఁ డగునని మాత్రము ఉపన్యాసమునఁ జెప్పఁగలను. మతభేదములఁ దర్కించి 'యిదమిత్థ' మని సిద్ధాంతముచేయు నధికారము నాకు లేదు. కాన నేఁ జేయఁబూనిన కార్యమునకు మరలుచున్నాఁడను.

ఈగొడవలో నెన్ని యపసిద్ధాంతములఁ జేసితినో యను భీతి నాకే కలుగుచున్నది. కరుణానీరధులగు సాధుజనులు నన్ను మన్నింతురుగాక! నాయూహాలలో నించుక సత్యముండిన నానందింతురుగాక ! లేకపోయినఁ గోపమూన కుందురు గాక! "మహాజనో యేన గతస్సపంథాః" అన్నసూక్తియే యంద ఱకు మూలాధారము. అదియే తరణోపాయము. దానిమానిన మానవుఁడు మరల మానవత్వము నొందఁజాలఁడు. కుతర్క ములు కడతేర్పఁజాలవు. కామక్రోధాదులగు దుర్వార వైరి

సీసు ఉడుగఁ ద్రొక్కుచుండఁ దలయెత్తు నవకాశమే లేకపోవు చుండఁగా నీకుతర్కము లోకప్రక్కఁ బాధించుచుండ నెట్లు కడతేఱఁగల్గుదుమో యెఱుంగఁజాలకున్నాఁడను. కాఁబట్టి మొండిపట్టును వదలి సాధువు లనుసరించిన శాస్త్రోక్త మార్గము నాశ్రయించి కృతకృత్యులమగుదుమేమో యన్న యాశ నాకుం జాలఁగలదు. ఇంతకన్న వేఱుపాయము తోఁచకున్నది.

పురాణభేదములఁ బాటించి దేవతాదూషణము చేయుటకన్న మహాఘోరకార్యము వేఱొకటి లేదని గట్టిగాఁ జెప్ప సాహసింతును చేయరాని కార్యములలో నిదియొకటి. ఇంత మాత్రమైన నోర్పులేకున్న మన మానవత్వము దానవత్వ మగునేమో యను భీతి నాకుంగలదు. మతభేదముల మాని స్వమతాచార్యప్రోక్తమార్గమునఁ బ్రవర్తించుచు భగవద్భక్తి గలిగి పురాణముల దూషింప నడుముకట్టక దేవతాభేదములఁ బ్రధానముగాఁ జేసికొనక యిచ్ఛానుగుణభగవద్రూపమున నాపరమపురుషు నుపాసించుట కన్న నీకలికాలమునఁ దరణోపాయము వేఱొకటి లేదని విన్నవించుచున్నాఁడను. ఇఁకఁ గృష్ణావతారతత్త్వగ్రంథవిషయమునఁ బ్రవర్తించెదను.

ఇది రచనాప్రణాళిక.

శ్రీ శ్రీ శ్రీ.





శ్రీ

శుభమస్తు.



# శ్రీకృష్ణావతారతత్త్వము.



## విషయవిభాగము.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

సకలేశ్వరుండగు భగవంతుఁడు ప్రపంచమున మనుష్యరూపమున నవతరింపనేల? ఇంద్రాదులు చాలరా? లేక హరిహరుల యాజ్ఞ చాలదా? అవతరింపకున్న నేమి? ఆమహనీయమూర్తి సంకల్పించిన నాకార్యములు నెఱవేఱవా? అను ప్రశ్నములు చేయుట స్వభావము. పైశ్లోకమే దీనికి సమా

భాగము చెప్పఁజాలియుండదు. ఐనను సమగ్రముగా సమాధానము చెప్పకపోయిన చాలనట్లు తోఁచు. "పరిత్రాణాయ సాధూనామ్" అను వాక్యము భగవంతుఁ డేల చెప్పెను ? ఇంద్రాదులఁ ద్రిభువనేశ్వరులఁ జేసి నిర్మించి మరలఁ దానే యేల యవతరించవలయు నను ప్రశ్నముకూడ వచ్చును ? ఇంద్రాదుల కలవిగాని కార్యములు పొసఁగినందునఁ దా నవతరించె నని సమాధానము చెప్పవచ్చును. ఆమీఁద నట్టి వెట్లు పొసఁగె నను పరియుఁ బ్రశ్న మేకదా ! ఆప్రశ్నమునకు సమాధానమే శ్రీ కృష్ణావతారతత్త్వమను నీమహాగ్రంథమని భావింపవలయును. ఆయొక్క మాట కింత గ్రంథము సమాధానరూపముగా వెలసినది.

## భగవదవతారహేతువులు.

ఏకాలమున భూలోకమున ధర్మము నశించుసూచనలు పొడకట్టునో ; ఏకాలమున సాధుజనసంతతికిఁ బాపులబాధలు మెండగునో; ఇఁక నిలువఁజాలము. పురాణపురుషా! నిన్ను మించిన దిక్కు వేఱొక్కటిలేదని మునులు లోనగు వారు మొఱ్ఱయిడుదురో; ధర్మరక్షణము చేయఁజాలకయు, సజ్జనుల రక్షింపనేరకయు, దుష్టుల నిగ్రహింపశక్తిలేకయు భూపతులు చేతులు పిసికికొనుచుఁ దమపౌరుష మావంతయే ఫలింపకుండ నామమాత్ర విఖ్యాతిం గాంచి యూరకుందురో, భువనమునఁ గలుగు పీడల నాపి ధర్మమునురక్షించి, ధర్మఘాతుకు లగు దుర్జనులఁ గీటడంచి, ప్రజాసామాన్యము హాయిగా నుండఁ

జేయఁజాలక, 'మహాత్మా! నీవుతక్క నితరు లీయిక్కట్టు నాపఁ జాలరు, వేగ మవతరింపుమా' యని యస్త్రశస్త్రముల నేల వైచి చికాకులఁబడి దిక్పాలకులు దీనులయి ప్రార్థింతురో, మహాఘోరతపస్సు, పతివ్రతలమహిమము, ధర్మరక్షణమున నశక్తమగునో యట్టికాలమున శ్రీమన్నారాయణమూర్తి తత్కాలోచితరూపమును గ్రహించి మహి నవతరించును. తా నవతరింపక తనయంశము నొక్క పుణ్యపురుషునందుఁ బ్రవేశపెట్టి యాయిక్కట్టు తొలఁగించుటయుఁ గలదు. అది యవతారమనఁ బడునా యనుశంక గలుగును. పరశురాముఁ డట్టివాఁడే కదా! దశావతారగణనయం దామహాత్ముని పే రుండుట యెఱుంగమా! అంశావతారము కాదందురా? భగవదంశము భగవదంశముచేఁ గొట్టుపడుట పరిహాసాస్పదము కాదా? పరశురాముఁడు తప మొనరించి శ్రీమహాదేవునివలన వరములఁ బొందెననుట పురాణప్రసిద్ధము కాదా? ఆ మహాపురుషుఁడు సకలరాజలోకముం బొలియించి జగంబు దుష్టరాజవిరహితంబుగాఁ జేసి తపస్సు చేయుచుండ శ్రీరామరూపమున భగవంతుఁ డవతరించి యామహాత్ముని క్షీణశక్తునిగాఁ జేయుట రామాయణాదిగ్రంథములనుండి తేలినదియే కదా!

అనఁగాఁ బరశురామునం దున్న స్వాంశ మాకాలమునఁ జేయఁదగు మహాకార్యము నొనరింపఁ జాలమిఁ, దా మానవరూపమున నవతరించి స్వాంశము నాపరశురామునుండి గ్రహించెననుటకన్న వేఱొక సమాధానము తోఁచకున్నది. తన్నుఁ

హా నవమానించుకొనుట లోకమునఁ గానము. కాఁబట్టి పరశు రామావతార మంశావతారమనక తప్పదు.

అంశావతారమున కేకాల ముచితము గాదో ఆ కాల మున నుచితాకృతితో నా పరమపురుషుఁడే యవతరించును. ఆరూప మా కార్యమును జేయఁ దద్ధాస్రమును మాని స్వలోక మున నుండును. ఇట్లవతరించు మహాత్ముఁడు విరాట్టువనుట భ్రాంతి. సగుణపరబ్రహ్మమే.

ప్రకృత ముపపాద్యగ్రంథాధిపతియగు శ్రీకృష్ణభగ వంతుఁడు భూతలమున నవతరింప నవసరము కలిగినదా యన్న నట్లుచేయక తప్పదయ్యెను ఆలసించినఁ బ్రపంచము దారుణబాధల పా లగునని తోఁచెను. ధర్మధ్వంసకులు చెల రేగిరి. సాధువులబాధలు నిర్భరము లయ్యెను. దేవతలు చేయు నది నేరక భగవంతుని నవతరింపఁ బ్రార్థించిరి. అట్టితఱి శ్రీమ న్నారాయణమూర్తి సాక్షాత్కరించి దేవతాప్రార్థనంబు లంగీక రించి భూలోకమున నవతరింప నంగీకరించెను

## ద్వాపరాంతకాల స్థితి.

భగవంతుఁడు శ్రీకృష్ణరూపమున నవతరింప నంగీక రించినతఱి మర్త్యలోకమున ద్వాపరయుగసంజ్ఞచేఁ గాలము. వ్యవహరింపఁబడుచుండెను. కాల మఖండము. దాని కాద్యంత. ములు లేవు. కాలరూపము భగవత్స్వరూపమే.

లోకానా మన్తకృత్కాలః కాలోఽన్యః కలనాత్మకః,
స ద్విధా స్థూలసూక్ష్మత్వా న్మూర్త శ్చామూర్త ఉచ్యతే.

సూర్యసిద్ధాంతము.

ఆకాల మఖండదండాయమానమైనను లోకవ్యవహారమున కుపయోగించుటకు విభక్తమయి మహాయుగ, యుగ, వత్సర, మాస, పక్ష, తిథ్యాదిరూపమున వ్యవహరింపఁబడును. అట్లే భగవంతుఁడును సర్వాంతర్యామియైనను, కాలస్వరూపుఁడైనను, రూపనామాదిభేదవిరహితుఁడైనను, ప్రపంచమున కుపయుక్తమగునట్లు బహువిధరూపనామభేదములచే విభక్తుఁడయి యుపాసింపఁబడును.

ఆ ద్వాపరాంతమున భూమిపయి మనుష్యులు ప్రబలిరి. స్వేచ్ఛాప్రవర్తకులైరి. ఎవరికిఁ దోఁచినది వారికి ధర్మమగుచుండెను. పెద్దలమాటలు వారిచెవుల కెక్కుటలేదు. స్త్రీలపాతివ్రత్యము క్షీణదశకు వచ్చెను. రాజులు విషయలోలురై యుత్తమకాంతలఁ జెఱఁబట్టి నారంభించిరి. ఇఁక నితరులమాట చెప్పనేటికి ?

'యథా రాజా తథా ప్రజాః.' అన్ననీతి యేకాలమునను మార్పు నొందదు. ధర్మరక్షణార్థ మేర్పడినరాజు దుర్వృత్తి నవలంబింప నితరు లామార్గము నవలంబించుటచే సాధువు లేమి చేయవలయును? పతివ్రతలకు దిక్కెవరు? భర్తలు దురాత్ములబారి నుండి తమవారల రక్షింపఁజాలకుండిరి. అత్తఱి వారి పరితా

షము నిర్వచింప నేరితరము? సర్వేశ్వరుఁడు లేఁడా? ఈ బాధలుఁ దొలఁగించు నవకాశమే లేదా? ధర్మము నశింపవలసిన దేనా? యని దీనులై సాధువులు మొఱ్ఱపెట్టసాగిరి. దుష్టులు సాధువుల బాధించుటయే పరమపురుషార్థముగ భావించుకొని యాకీర్తి వెలఁగుచుండిరి పరకాంతలఁ గారాగారముననుంచుట గొప్పయశస్సుగాఁ గొందఱు భావించుచుండిరి. ఇట్లెన్నియో విపరీత కృత్యములు సాగుచుండెను. ఎప్పుడు భగవంతుఁ డవతరించునా? యని సజ్జను లువ్విళ్లూరుచుండిరి. దుష్టులకును జీవితాంతము సమీపించుచుండెను. ఇట్టితఱి భగవంతుఁ డవతరింపక పోవ వీలుండునా?

ఇట్టి మహాపత్సమయమున శ్రీకృష్ణపరమాత్మ యవతరింపఁ దలంచెను. సమయము సర్వవిధముల ననుకూలమై యుండెను. దేవతలు ప్రతిక్షణము దేవదేవు నారాధించుచుఁ బ్రార్థించు చుండిరి. త్వరపెట్టుచుండిరి. తమకష్టములఁ బలుభంగులఁ దెలుపుకొనుచుండిరి. సర్వేశ్వరుఁ డాదితేయుల విన్నపము లాలించి యభయదాన మొసంగి స్వప్రతిజ్ఞను బాలింపఁ దలంచెను.

శ్రీకృష్ణావతారమేల దశావతారములలోఁ బరిగణింపఁ బడ లేదనుసందియ మంకురింప వచ్చును. పరశురామావతారము పరిగణింపఁబడుటయు, లోకోద్ధరణమునకై, హితబోధ మొనరింప నవతరించిన శ్రీకృష్ణావతారము పరిగణింపఁబడకుండుటయుఁ జిత్రముగాఁ దోఁచును. కొందఱు దశావతారము

ఎలో బలరామావతారమును జేర్పక కృష్ణావతారమును జెప్పిరి. కాని స్మృతులు బహుతరపురాణములు బలరామావతారమునే చెప్పిరి.

దశావతారములు వైకుంఠవాసియగు శ్రీమహావిష్ణుమూర్తివనియు, శ్రీకృష్ణావతారము గోలోకవాసి యగు శ్రీపరమాత్మవనియుఁ గావున నిది దశావతారములలోఁ బరిగణింపఁబడుట సమంజసమే కాదనియు, బ్రహ్మవైవర్తపురాణాంతర్గత శ్రీకృష్ణజన్మఖండమే యిందులకు దృష్టాంతమనియు నొక సమాధానము చెప్పవచ్చును.

జయవిజయులు మూఁడుజన్మము లెత్తి విష్ణువుతో విరోధించి హతులై వైకుంఠమున యథాపూర్వముగ ద్వారపాలకులనఁ బరఁగుచు భగవత్సేవ చేయుచునుండఁ దగునట్లు ఏర్పాటు కలదుకదా! ఆప్రకారమే హిరణ్యకశిపు హిరణ్యాక్షులై తొలిజన్మమునను, రావణ కుంభకర్ణులై మఱుజన్మమునను నరసింహ శ్రీరామచంద్ర రూపధారియగు శ్రీమహావిష్ణువుచె నిహతులగుటయు, మూఁడవతడవ శిశుపాల దంతవక్త్రులై పుట్టిరనియు, వారిని, వారిపక్షమునుండి లోకపీడ నొనరించువారిని జంప శ్రీకృష్ణుఁ డవతరించెననియు, నట్లగుటంజేసి వైకుంఠవాసి యగు శ్రీమన్నారాయణమూర్తిగాక గోలోకవాసి యగు శ్రీకృష్ణమూర్తి వేఱుగా వెలయు దేవదేవుఁడనుటయుఁ జెప్ప సరిపడకున్నదని పైసమాధానముపైఁ బ్రశ్నము చేయ నవకాశము గలదు.

శిశుపాలదంతవక్త్రులు జయవిజయుల తృతీయజన్మ మనుట లోకప్రసిద్ధము. పురాణసంసిద్ధము. కావున దీనికి విరుద్ధముగాఁ దోఁచినట్లు సమాధానములు చెప్పుట ప్రామాణిక సమ్మతము కాదనియుఁ జక్కఁగాఁ దోఁచెడు. దీనిం బట్టి చూడఁగా గోలోకవాసియగు శ్రీకృష్ణమూర్తి వైకుంఠవాసి యగు విష్ణుమూర్తికన్న నధికుఁడనికాని, వేఱనికాని చెప్ప న్యాయము కాదు. కాఁబట్టి ఇంతకుముందు నేఁ జెప్పినసమాధానమే తగినది యని నా భావము. నా యెఱింగినంతవఱ్ఱు దీనికి మించిన సమాధానము వెదకినను, గానరా కున్నది.

శ్రీకృష్ణావతారము దశావతారాంతర్భూత మేల కాదనుప్రశ్నము మిగిలి సమాధానమునకై వేఁచియున్నది. దశావతారముల గాథలు పరికించినచో నొక్కొక్కకార్య మునకై యొక్కొక్కయవతారమును భగవంతుఁ డెత్తెనని సామాన్యదృష్టికిం గోచరించును. శ్రీకృష్ణావతార మట్టిది కాదు. విశేష మిందేమి గలదను ప్రశ్నము రాక మానదు.

శ్రీకృష్ణావతారసమయమున భూదేవి ప్రజాభారపీడిత యయ్యెను. అందు దుష్టాత్ము లెక్కువ సంఖ్యగలవారు. భగ వంతుఁడు తాఁజేయు కార్యమొక్కటియు, నితరులచేఁ జేయింపఁదగు కార్యమొక్కటియుఁ గాక తానే మానవులకుఁ జక్కని భక్తిజ్ఞానాదుల నుపదేశింపక తప్పని కాలముకూడ వచ్చెను. కృష్ణావతారమునకు ముందు లెక్కింపఁబడు నవతార ములలో నితరులచేఁజేయించు మహాకార్యములు లేకుండెను.

లలో బలరామావతారమును జేర్పక కృష్ణావతారమును జేర్చిరి. కాని స్మృతులు బహుతరపురాణములు బలరామావతారమునే చేర్చిరి.

దశావతారములు వైకుంఠవాసియగు శ్రీమహావిష్ణుమూర్తివనియు, శ్రీకృష్ణావతారము గోలోకవాసి యగు శ్రీపరమాత్మదనియుఁ గావున నిది దశావతారములలోఁ బరిగణింపఁబడుట సమంజసమే కాదనియు, బ్రహ్మవైవర్తపురాణాంతర్గత శ్రీకృష్ణజన్మఖండమే యిందులకు దృష్టాంతమనియు నొక సమాధానము చెప్పవచ్చును.

జయవిజయులు మూఁడుజన్మము లెత్తి విష్ణువుతో విరోధించి హతులై వైకుంఠమున యథాపూర్వముగ ద్వారపాలకులఁ బరఁగుచు భగవత్సేవ చేయుచునుండఁ దగునట్లు ఏర్పాటు కలదుకదా! ఆప్రకారమే హిరణ్యకశిపు హిరణ్యాక్షులై తొలిజన్మమునను, రావణ కుంభకర్ణులై మఱుజన్మమునను నరసింహ శ్రీరామచంద్ర రూపధారియగు శ్రీమహావిష్ణువుచే నిహతులగుటయు, మూఁడవతడవ శిశుపాల దంతవక్త్రులై పుట్టిరనియు, వారిని, వారిపక్షముననుండి లోకపీడ నొనరించువారిని జంప శ్రీకృష్ణుఁ డవతరించెననియు, నట్లగుటంజేసి వైకుంఠవాసి యగు శ్రీమన్నారాయణమూర్తిగాక గోలోకవాసి యగు శ్రీకృష్ణమూర్తి వేఱుగా వెలయు దేవదేవుఁడనుటయుఁ జెప్ప సరిపడకున్నదని పైసమాధానముపైఁ బ్రశ్నము చేయ నవకాశము గలదు.

శిశుపాలదంతవక్త్రులు జయవిజయుల తృతీయజన్మ మనుట లోకప్రసిద్ధము. పురాణసంసిద్ధము. కావున దీనికి విరుద్ధముగాఁ దోఁచినట్లు సమాధానములు చెప్పుట ప్రామాణిక సమ్మతము కాదనియుఁ జక్కఁగాఁ దోఁచెడు. దీనిం బట్టి చూడఁగా గోలోకవాసియగు శ్రీకృష్ణమూర్తి వైకుంఠవాసి యగు విష్ణుమూర్తికన్న నధికుఁ డనికాని, వేఱనికాని చెప్ప న్యాయము కాదు. కాఁబట్టి ఇంతకుముందు నేఁ జెప్పినసమాధానమే తగినది యని నా భావము. నా యెఱింగినంతవట్టు దీనికి మించిన సమాధానము వెదకినను, గానరాకున్నది.

శ్రీకృష్ణావతారము దశావతారాంతర్భూత మేల కాదను ప్రశ్నము మిగిలి సమాధానమునకై వేఁచియున్నది. దశావతారముల గాథలు పరీక్షించినచో నొక్కొక్క కార్యమునకై యొక్కొక్కయవతారమును భగవంతుఁ డెత్తెనని సామాన్యదృష్టికిం గోచరించును. శ్రీకృష్ణావతార మట్టిది కాదు. విశేష మిందేమి గలదను ప్రశ్నము రాక మానదు.

శ్రీకృష్ణావతారసమయమున భూదేవి ప్రజాభారపీడిత యయ్యెను. అందు దుష్టాత్ము లెక్కువ సంఖ్యగలవారు. భగవంతుఁడు తాఁ జేయు కార్యమొక్కటియు, నితరులచేఁ జేయింపఁదగు కార్యమొక్కటియుఁ గాక తానే మానవులకుఁ జక్కని భక్తిజ్ఞానాదుల నుపదేశింపక తప్పని కాలముకూడ వచ్చెను. కృష్ణావతారమునకు ముందు లెక్కింపఁబడు నవతారములలో నితరులచేఁ జేయించు మహాకార్యములు లేకుండెను.

తా నుపదేశింపక తప్పనిపని కలుగకుండెను. ఆకాలపుఁ బ్రజలు శ్రుతిస్మృత్యుక్తమార్గముల బద్ధాదరులై యుండిరి. ద్వాపరాంతమునఁ బ్రజలకు లేనిపోనిశంకలు గలుగసాగెను. శ్రుతిస్మృత్యుక్తమార్గములు స్వానుష్ఠేయములా? యనియు, నివి తరింపఁ జేయఁజాలునా? యనియు స్ఫురించెను. కావున శ్రుతిస్మృతులు వారిశంకలకు సమాధానముల నిర్వచింపఁజాలనట్లుండెనని మనమూహింప నవకాశము గలదు. కాఁబట్టి శ్రుతిస్మృతుల రక్షించుటయుఁ, బ్రజలకు హితమార్గముల నుపదేశించి తద్ద్వారా శ్రుతిస్మృతులయందు విశ్వాసమును బుట్టించుటయుఁ, బూర్వావతారములకన్న నెక్కువభారమును వహించుటయుఁ దప్పక పోయెను. ఇట్టు లగుటంబట్టి శ్రీకృష్ణావతారము క్రొత్తదిగాఁ బరిగణింపఁబడవలసివచ్చెను. కాననే దశావతారపరిగణనయం దిది దగులలేదనునది యొక్కరీతిగా సమాధాన మనవచ్చును. అవతారదశకమునకన్న నీయవతార ముత్కృష్టమని నిర్వచింపఁ బూనుట మహా పాపహేతువని నా సంపూర్ణవిశ్వాసము. ఆస్తికు లీకార్యమునఁ బ్రవర్తింపరనియు నాకు దృఢమగు నమ్మకముగలదు. ఆస్తికాభాసులు కొందఱట్టి నిర్వచనమునకుఁ బూనినను నది సర్వజనాంగీకృతము కాఁజాలక నశించుననియు నా యూహ. నా యీ యూహను సఫలముగాఁ జేయుట భగవంతుని పని.

ఈ యుదాహృతానేక హేతువులం బట్టి శ్రీకృష్ణమహావిష్ణువులకు భేదము గలదను వాదము చాలసేపు నిలువఁజాల

వని చెప్పవచ్చును. ఇట్టివాదముల భగవంతుఁడు కరుణా సింధువు నగు శ్రీపురాణపూరుషుఁడు లోకులు చేయకుండఁ జేయుఁగాక. శ్రీభగవత్కథా రసాస్వాదన మొనరింప నెల్లరు బద్ధకంకణు లగునట్లనుగ్రహించి తనప్రతిజ్ఞను నెఱవేర్చుఁ గాక యని వారక కోరుచున్నాను

ఈరీతిగాఁ జర్చించుటవలనఁ దేలిన సారాంశ మేమ నఁగా:—శ్రీకృష్ణనారాయణులకు భేదములేదనియుఁ గథా భేదములకు విశేషార్థము గలదనియు, కుతర్కములు తరణో పాయప్రతిబంధకము లనియు, నట్టివానిం బాటింపక పేటిఁబుచ్చి భగవంతుని నమ్మి, తదుపదేశములఁ జక్కఁగా గ్రహించి, తద్భ క్తులగురువులుగా భావించి,పరదేవతాదూషణము పాపహేతు వని నిశ్చయించి, పెద్దల మాటలయందు విశ్వాసముంచి ప్రవ ర్తించుటకన్న వే ఱుత్తమోత్తమ మార్గము లేదనుటే యని గ్రహింపఁదగును. అన్యథా గ్రహించినచోఁ దరణోపాయము శూన్యమగును. ఇంతట "అతిసర్వత్ర వర్జయేత్" అను శాస్త్రము ననుసరించి ప్రకృతప్రయత్న మగు శ్రీకృష్ణావతార తత్త్వమును గథారూపమున వ్రాయఁబూనెద.

## వసుదేవాద్యుత్పత్తి కారణము

తొలునొలుత శ్రీకృష్ణమూర్తి యవతరించుటకు ముందు వసుదేవాదుల పుట్టుకకుఁ గారణములఁ దెలిపి యవ్వల రాధా దేవి లోనగువారి యుత్పత్తిని వ్రాసెద. భగవంతుఁ డవతరించు

టకుముం దేయే ప్రయత్నము లొనరించి దేవతలు దేవదేవునకు సాయపడిరో వివరించెదను. అట్లు వివరించినంగాని తత్త్వ మెఱుంగ నసువుపడదు. వసుదేవాదు లెవ్వరో, ఏల భూమి నవతరించిరో యను మొదలగువిషయములు తెలిసినంగాని లేని పోనిశంకలు కలుగకుండవు. మనస్సు నిర్మలము గానేరదు. మనస్సు నిర్మలముగా నుండకున్న భగవద్భక్తి కుదురదు. అది కుదురకున్న భగవదనుగ్రహపాత్రుండు కాంజాలండు. అట్టి వాండు కాకున్న మానవుండు కడ తేఱంజాలండు. కాంబట్టి వసు దేవాదులపుట్టుకను దొలుదొలుత వివరించుట ముఖ్యము. ఈగ్రంథము బ్రహ్మపురాణము, బ్రహ్మాండపురాణము, బ్రహ్మ వైవర్తపురాణము, విష్ణుపురాణము, శ్రీభాగవతము, దేవీ భాగవతము, హరివంశము, మహాభారతము అను వీనిం బ్రధానముగా భావించి వ్రాయంబడును వరుసగా వ్రాయం బూనినచోం గథావ్యత్యయదోషము పొసంగు ననుభీతిని రచనాప్రణాళిక నొకరీతి నిర్మించుకొన్నాండను. వసుదేవా ద్యుత్పత్తిమొదలు కథలను వరుసగా నొక్కొక్కపురాణము నుండి సంగ్రహించి వ్రాసెదను మొత్తముమీంద నన్నికథలు పురాణానుసారమే వ్రాసెదను. ఒకకథ యన్నిగ్రంథముల యందు సమానముగాం గాని యించుక భేదముగాం గాని చెప్పం బడియుండునపుడు దేనినుండి వ్రాసినను గొఱంతయుండదు గాన నట్టితావులం బురాణనామ ముదాహరింపను. దానిచే నాకథ సర్వపురాణాంతర్గతమనియు, విభేదరహితమనియు

గ్రహింపఁ దగు. ఒక్కపురాణమునమాత్రమే యొక్కకథ చెప్పఁబడి వేఱొకపురాణమున నది కనఁబడనిచో నాపురాణముపేరు క్రింద నుదాహరించువాఁడ. నాకుఁ దోఁచినట్లు కథల మార్పు నొందింపను కథావిశేషాంశములు మాత్రము క్రింద వ్రాయఁబడును. అవి నావ్రాసినయవిగా గ్రహింపఁ దగు పారాయణార్హము లన్న హేతువుం బాటించి స్తోత్రముల వీలు ననుసరించి యట్లే క్రింద వ్రాసెదను. శ్రద్ధాళువు లవ్వానిం బఠింప నవకాశము గలుగును. అట్టి స్తోత్రములఁ దెనుఁగున వ్రాయుటకన్న నట్లేయుంచిన మేలని నా భావము. స్తోత్రముల నట్లు వ్రాయఁబూనను గాని సామాన్యముగా స్తోత్రములు వదలఁబడక యట్లే యుంచఁ దలంచితి నని మాత్రము చెప్పఁగలను. భగవద్గీతాదుల నుదహరించునపుడు గీతల నట్లే ముద్రించుట యంతగా మంచిదిగాదని తత్సారమును వచనరూపముగనే వ్రాసెద. స్తుతిపాఠములలో భగవద్గీతలు చేర్పఁబడఁదగవు గదా! అవి భగవదుపదేశవిషయములలోఁ బరిగణింపఁ దగినవి. కావునఁ దత్సారమును వ్రాసెదను. అందును సర్వదా సంస్మరింపఁదగిన శ్లోకములమాత్రము క్రింద వ్రాసెదను. ఆశ్లోకముల భగవద్గీతా సారములుగా భావింపఁదగినవనియు, నిరంతరము సంస్మరింపఁదగినవనియు నా యభిప్రాయము. ఇది యందఱచే నంగీకరింపఁబడునన్న నమ్మకము నా కున్నది. అట్టి తావులంగూడ నెన్నియో ప్రమాదములున్న వానిని సజ్జనులు మన్నింపకపోరని నా దృఢ విశ్వాసము. నాచేత నీపనిఁ జేయించు శ్రీ పరమపురుషుఁడు

సజ్జనాదృతికిం బాత్రునిగా ననుఁజేయకుండునా' యని నెఱనమ్మి యున్నవాఁడను. కావున నెందెం దెన్నెన్ని ప్రమాదము లున్నను సజ్జనులు వానిం బాటింపక గుణమున్నచో దానిని మాత్రమే పరిగ్రహించి నన్నుఁ గృతకృత్యునిం జేయుదురు గాక.

ఇది విషయవిభాగము.

శ్రీ శ్రీ శ్రీ.





శ్రీః

శుభమస్తు.



# శ్రీకృష్ణావతారతత్త్వము.

## కథారంభము.

### * కశ్యపముని వసుదేవుఁడై జన్మించుట.

ఒకానొకప్పుడు మరీచిముని తనయుఁడై సుప్రసిద్ధుఁడై ప్రపంచసృష్టి నొనరింప ధాతకుఁ దోడ్పడుచున్న మహాముని కశ్యపుఁడు కారణాంతరముచే వరుణదేవుని హోమధేనువుల

---

* ఈకథ శ్రీదేవీభాగవతము చతుర్థస్కంధమునుండి గ్రహింపఁబడినది. ఇతరగ్రంథములయం దీకథ యిట్లు సహేతుకముగాఁ జెప్పఁబడలేదు.

గ్రహించెను. లోభముచే నట్టిమహార్షి సంగ్రహించె ననుట కన్న నసంగతవిషయ ముండునా? ఈకార్య మొనరించినఁగాని లోకోపకృతి కలుగదని వా రెఱుంగుదురు. కాఁబట్టి యకృత్య మిదియని పరుల కా సమయమునఁ దోఁచినదైనను భావిశుభ ప్రద మగుననిని మహాత్ములొనరింతురు కార్యాంతమునఁగాని తత్కారణము పామరుల కెఱుకపడదు.ఇదమిత్థమనితోఁచినంత వఱకు వారి నాక్షేపింపక విడువరు. దీన వారి మహిమము నకుం గొఱంత యుండదు. ఈచరిత్రమున బ్రహ్మయుఁ గశ్యపు నాక్షేపించినట్లుగను శపించినట్లుగను గానంబడు. లోకనిర్మాత యగువిధాత తెలియక యట్లాక్షేపించి యుండఁడు. అట్లా క్షేపించినట్లు కథ తెల్పకున్న లోకులకు నీతిబోధింప నవకాశము దొరకదు. కశ్యపునంతవాఁ డిట్టియకార్య మొనరించి శాప ఫలము ననుభవించియుండ నిఁక మనమన్న నెంతవార మన్న యూహ పామరులకుం దోఁచవలయు. అట్లు తోఁచినఁగాని యట్టికృత్యముల నొనర్ప కుండరు. లోకక్షేమముగలుగు పొంటెఁగదా యిన్ని ప్రయత్నములు దేవదేవుఁ డొనరించును?

తండ్రి తనయులకుఁ జిన్నతనమున నీతిని గార్యరూప మునఁ దెల్పును. వయసువచ్చినకొలఁది వాగ్రూపమునఁదెల్పును. ఈరెండింట పుత్త్రుఁడు కృతకృత్యుఁడు గాఁడేని తాఁ జేయునది లేదని యూరకుండును. అట్లే భగవంతుఁడు కార్యరూపమున లోకులకు నీతిం దెల్పును. కావునఁ బెద్దలు తప్పుచేయుట

యిట్టికృత్యములు లోకులు చేయరాదని స్వకృత్యరూపమున బోధించుటకే యని గ్రహింపఁదగు. ఇఁకఁ గథకురండు.

వరుణదేవుఁ, డిట్లు కశ్యపముని తన హోమధేనువుల నరికట్టెనని విని యమ్మునింగానఁబోయి 'మహాత్మా! మునివర్యా! ఈ ధేనువులు నావి. వీనిదూడ లంబా యని యఱచుచున్నవి. వదలుమా?' యని ప్రార్థించెను. కశ్యపమునివతంసుండును లోభమూని 'నే నీయ' ననియె. వరుణుండును జేయునదిలేక హోమధేనువుల నావాని నిమ్మని యన్యాయముగా గ్రహించె నన్న తీవ్రక్రోధమున నోడలెఱుంగక దూషుస్వరమున, 'ఓకశ్యపా! దేవజనకుండ, మునివరుండ నాకేమిభయ మన్న గర్వమున నుబ్బి యకృత్య మిది యని భావింపక నా హోమ ధేనువుల గ్రహించి ప్రార్థితుఁడవయ్యు నీయ నీయకొన కున్న వాఁడవు. కాఁబట్టి భూలోకమున గోపాలుఁడవై పుట్టుము. నీభార్యలగు నదితియు, దితియు నీతోఁగూడ నవతరించి దుఃఖ ముల పాలగుదురుగాక. వత్సములు తల్లులకై యఱచుచున్న వని తెల్పినను వానిని వదలవైతివిగాన నీదుఃఖము నీభార్యలు గూడ ననుభవింపవలసినదే;' యని శపించి యట నిలువక బ్రహ్మలోకమునకుం బోయెను. బ్రహ్మయు మహర్షి పరి వృతుఁడై లోకవృత్తము నరయుచుండెను. అత్తఱి వరుణుం డరుణనయనుండై విరించి కొలువుకూటంబుం జేరి తత్పాదార విందవందనకృతార్థుండై లేచి నిలిచి బహుభంగుల స్తుతించి, 'మహాత్మా! చూచితే. కశ్యపముని నా హోమధేనువులం బల్మి

గ్రహించి ప్రార్థితుం డయ్యు నీకున్నవాఁడు. దానంగనలి మానవలోకమున గోపాలుండవై భార్యాద్వయసహితుండవై పుట్టువుం గాంచి వెతలం బడుమని శపించితి. లోభంబు, సర్వాపన్మూలం బనియెఱింగియు నిట్టియకార్య మొనరించెం గదా! యని విన్నవించెను.

విధాతయు జలాధీశుఁ బలుకు లాలించి సగౌరవంబుగాఁ గూరుచుండ నియోగించి దివ్యదృష్టిం జూచి వృత్తాంతం బంతయు లో నెఱింగి కశ్యపమౌని రప్పించి యి ట్లనియె. 'మహాభాగా! లోకపాలకుం డగువరుణదేవుని ధేనువుల నేల యపహరించితివి? అడిగినను ఏల ఈయవైతివి? ఇట్టియన్యాయ మున కేల యొడిఁగట్టితివి? న్యాయ మెఱుంగుదువు. పరద్రవ్యాప హారణము పాపమని తెలియుదువు. సర్వజ్ఞుండవు. ఇట్టి నీవిట్టి బెట్టిదంపుఁ బాపకార్యం బేల యొనరించితివి? ఔరా! లోభ మాహాత్మ్యము! * మహాత్ములంగూడ వదలదు గదా! లోభము నరకములఁ బాలుసేయును. సకలపాపములకుం బుట్టి నిల్లు. సకలసాధువులు దానిం దెగడుదురు. అట్టిదాని నేల యాశ్రయించితివి? మునీంద్రా! ఇందుల కేమిసమాధాన మిత్తువో విన వేడుకపడుచున్నాఁడ ననియె

పాఠకమహాశయులారా! లోభము కశ్యపునంతవానిని వలదయ్యెను. సర్వదేవజనకుఁడు. మహాజ్ఞాని. అట్టి కశ్యపుఁడు దాని జయింపఁజాలఁడయ్యె. కాన లోభము శక్తి యపారము.

---

* అహోలోభస్య మహిమా మహతోఽపి న ముంచతి, లోభం నర కదం నూనం పాపాకరమ సమ్మతమ్. 3 అ. ౧౧ శ్లో.

శాంతులై మహాత్ములై యెవ్వనేమును లోభమును జయిం తురో, వారే ధన్యు లనఁబడుదురు సంసారమునఁ ద్రోసిపుచ్చ రానిశత్రువు లోభమే. అది యపవిత్రమగు. అట్టి యపవిత్ర లోభము కశ్యపునంతటి మహామునిని లోఁబఱచుకొనియె నన నింక నెవ్వరిని లోఁబఱచుకొనఁ జాలదు? అట్టిదానిని జయిం చుటయే జితేంద్రియత్వఫలము.

## వసుదేవోత్పత్తి.

ఇట్లు విరించి సముచితరీతివచింపఁ గశ్యపుఁ డూరకుం డెను. బ్రహ్మయు లోకోపకారపరాయణత్వ మూని తాసర్వ విదుం డగుటఁ గశ్యపమునిం జూచి తనపౌత్రుఁడై పరమవల్ల భుండైనను మర్యాదారక్షణార్థ మిట్లు శపించెను.

"కశ్యపమునీ! నీవు మర్త్యలోకమున యదువంశమున భార్యాద్వయయుతుండవై యంశావతార మొందుము. గోపా లుండ వనంబరఁగుము. ఈశాపము మార్పరానిది. కాన ననుభ వింపక తప్పదు. ఇఁకఁ బొమ్ము." అని పలికెను.

కశ్యపమునియు భూభారహరణార్థము బ్రహ్మ తనను శపించుట యెఱింగి తనయంశమున యదుకులమున భార్యా యుతుండై పుట్టువుంగాంచ నీయకొని పనివినియెను.

## దితి యదితిని శపించుట.

ఆకశ్యపముని కిర్వురుభార్యలు గలరు. అదితియని, దితి యనియు వారి పేరులు. అందుఁ దొలిపత్ని యగునదితి కింద్రుండు

కుమారుఁడు. ఆతఁడేకదా త్రిలోకాధిపతి. మహాపరాక్రమ వంతుఁడు. ఆకొమరునిం జూచుచు నాతల్లి మహానందసాగ రమున మునిఁగి తేలుచుండును. దితియుఁ దాను నట్టికొడుకుం బడయనెంచి యొక్కనాఁడు ప్రాణవల్లభుని భక్తిమైఁగొల్చుచు నిట్లని వేఁడె. 'ప్రాణనాయకా! అదితికిఁ ద్రిలోకాధిపతిత్వమున విలసిల్లు సల్లలితగుణాకరుఁ గుమారుఁ బ్రసాదించితిరి. అట్టి పట్టితో సర్వసుగుణములఁ దులఁదూఁగు కుమారుం బ్రసాదించి నన్నుఁ గృతకృత్యంజేయవే.'

మునియు నా జలరుహేక్షణకోరిక కానందించెను. ఆ వాంఛయు సముచితరీతి నున్నదని మన్నించెను. చిఱునగవు పొలయఁ 'బద్మాక్షీ! స్వస్థమనస్కవు కమ్ము. నీకోరిక కొనసాగు. వ్రతపరాయణవు కమ్ము;' అని యాజ్ఞాపించి వ్రతరీతి నుపదే శించెను. ఆమెయు భర్తృతత్పరయై తదాదిష్టనియమము నను ష్ఠించుచు గర్భవతియై యథశ్శయ్యాశాయినియుఁ బయోవ్రత యునై కాలముఁ గడపుచుండెను.

అట్లు దితి సంపూర్ణగర్భభరాలస యగుటరసి యదితి, దితిగర్భమున నున్న శిశువు మహేంద్రునంతవాఁడగునని తల పోసి సవతి మచ్చరముఁ బాటించి యాతనయుండు పుట్టునేని నాకొడుకు నతిశయింపఁ గలండు ఇంద్రునికీర్తి క్షీణించు నని చింతించి కుమారుం జీరి, * 'నాయనా! నీ సవతితల్లిగర్భమున

---

* శత్రుస్తేఽద్యసముత్పన్నో దితిగర్భేఽతి వీర్యవాన్,
ఉపాయం కురునాశాయ శత్రోరద్య విచింత్యచ,
ఉత్పత్తిరేవహంతవ్యా దిత్యాగర్భస్య శోభన. 3 అ. 30 శ్లో.

నీకు శత్రువు కాఁగల సుతుఁడున్న వాఁడు. పుట్టినపిదప నాతనిం గిట్టి యట్టిట్టు చేయ నెట్టిదిట్టకైన నశక్యమని తలంతు. ఉత్పత్తికి ముందే నశింపఁజేయుము. దాని కనువగు నుపాయ మాలోచింపుము. 'కుమారా! దినదినప్రవర్ధమానయై సపత్నీ భావమూని యనవరతము నీకుఁ గీడుగోరు దితింగాంచిన నామనంబు చింతాతరంగిణీ నిమగ్న మగుచున్న యది. రాజయక్ష్మ నామక రోగమువలె దినదినప్రవర్ధమాన మగు తద్గర్భము నే త్రుంచిన మేలని నాకుం దోఁచెడు. దితిం గాంచినప్పుడెల్ల నాహృదయమున లోహశంకువు నాటినట్లు పెనుబాధ కల్గుచున్నయది. ఏ యుపాయము చేనైనఁ దద్గర్భముం దునుమాడి నాకుం బ్రీతినిగూర్పుమా?' అని హిత ముపదేశించెను.

పురుహూతుఁడు మాతృప్రయుక్తోదంతము నాలకించి యట్లే యొనరింతు. చింతమానుమని జనని నూరార్చి యాక్షణంబ తరలి సవతితల్లి యిల్లుచొచ్చి సాష్టాంగముగాఁ బ్రణామమాచరించి వినయ ముట్టిపడ 'యమ్మా! వ్రతపరాయణాత్వమున మిగులఁ గృశించియున్న దానవు. అట్టి నీకు సేవచేయ నరుదెంచితి. పాదము లొత్తుదు. మఱియెన్నియే శుశ్రూష లొనరింతు గురుశుశ్రూషయే కదా తరణోపాయము. నాతల్లికిని నీకును భేదము లేదు. నాకు మీ రిరువురు తల్లులే. ఇట్లని శపథ మొనర్తును. అని పలుకుచుఁ దచ్చరణములు శిరముసోఁక మరల నమస్కరించెను.

దితియు సుతునిపలుకులు ఋతములనియే మతినెంచి యట్లే కానిమ్మని యానతిచ్చెను. శతముఖుండును పాదసంవాహనము చేయఁ బూనెను. నియమముల నలసియున్న యాపూఁబోఁడి తచ్చేవ కచ్చెరువందుచు సుఖపారవశ్యమునఁ గన్ను దోయిమోడ్చి గాఢనిద్రం జెందె. ఇట్లు భూమింబరుండి హాయిగ నిద్రించు దితింగాంచి గాఢనిద్ర నొందెనని పరికించి సూక్ష్మరూపము నాశ్రయించి శస్త్రపాణియై యోగబలంబున నామె యుదరముం జొచ్చి కరుణ మాని యిది యకృత్యమని తలంపక, పాపమునకు జంకక నిరంకుశవృత్తి నాగర్భము నేడు ఖండములుగా ఛేదించెను. ఆబాలకుండు రోదన మొనరింప సాగెను. వజ్రచ్ఛేదితతనుం డగుచు బిట్టురోదన మొనరించు నాబాలుని 'నేడువకు సోదరా!' యని శతముఖుండు బుజ్జగింప సాగెను. ఆయేడుఖండముల నొక్కొక్కదాని మరల నేడుగా ఖండించెను.

అత్తఱి నిద్రాముద్రాపరాఙ్ముఖయై లేచి యావిధ మంతయు నెఱింగి యాగ్రహించి యాయకార్యము సవతి యొనరించిన దానింగా నెఱింగి, 'యోభగినీ! ఇంద్రునిచే నిట్టి యకార్యమును గరుణమాలి పాపభీతిం బోఁదోలి చేయించితివి. కాన నీతనయుని త్రిలోకాధిపత్యము నశించుఁగాక. తల్లి ప్రోత్సహించినంతనే యాలోచింపక యొనరించినకతన శతముఖుండీశాపఫలము నొందవలయు. అదితియు మోసమున నిట్టి దారుణక్రూరకార్యమును జేయించెను గావునఁ బాపచారిణి

యగు. నీమెపుత్రులు పుట్టినంతన చత్తురుగాక. పలుసారు లిట్టి దుఃఖము నామె యనుభవించుఁ గాక. * పుత్రశోకాతురయై యింకొక జన్మమునందును దుఃఖములఁ బొగులుచుఁ గారాగారమున వసించుఁగాక.' అని శపించెను.

ఇట్లు త్తఱి నయ్యుత్తమాంగన దారుణశాపం బొసంగిన నింద్రుం డులికిపడియె. కశ్యపుండును 'గామినీ! కోపఃక్రితాప ములఁ నొందకుము. నీ యాతనయులు బలవత్తరులై శతమఖు సమానులై దేవతలై స్వర్గమున నుండఁగలరు నీవిపుడొసఁగిన శాప మమోఘము గావున నిరువదియెనిమిదవ దగు ద్వాపర యుగమున నదితి యనుభవింపఁ గలదు. నిజాంశమున మనుష్య జన్మము నొందఁగలదు. వరుణుఁడును నన్ను శపించియుండెను. ఈ రెండుశాపములఫల మొక్కమాఱుగా నదితి యనుభ వించుఁ గాక. ఊఱడిల్లుము. వ్యసనము పాలుగాకుము. గత కార్యమునకై చింతిల్లకుము. విధికృతమును దప్పింప నేరికి నశ క్యమనుమాట మనమున నునుపుము.' అని యాశ్వాసించెను. భర్తయగు కశ్యపమునివతంసుఁ డిట్టు లూఱడిల్లం బలుక నా దితియు బదులుపలుకక యందులకు సమ్మతించి తనసాధ్వీత్వము నిలుపుకొనియె. అదియకదా ఉత్తమస్త్రీలక్షణము.

ఆశాపమునఁ గశ్యపుఁడు స్వాంశమున వసుదేవుండై జన్మించెను. అదితియు స్వాంశమున దేవకియై జనసమందెను.

---

* కారాగారే వసత్వేషా పుత్రశోకాతురాభృశమ్, అన్యజన్మని చా ప్యేవం మృతాపత్యా భవిష్యతి. ౩ అ. ౪౯. శ్లో.

ఇట్లు భగవంతుని యవతారమునకు ముందు ప్రధానులగు దేవకీవసుదేవులు జన్మించిరి.

ఈ కథనుండి లోభ మెట్టివారికైన హానికరమనియు సకలాపన్మూలమనియు, దానిని జయించుటే జితేంద్రియత్వమనియు, నద్దాని నాశ్రయించినచో నెట్టివారయినఁ గృతకృత్యులు కాఁజాలరనియు గ్రహింపఁదగిన సారాంశములు.

## భూదేవి బ్రహ్మలోకమున కరుగుట.

వసుదేవునియు, దేవకియు, నుత్పత్తి తెలిపినవెంటనే దేవతాంశములవలన నెవ్వరెవ్వ రీభూమి నవతరించిరో చెప్పవలసి యుండియు నిన్నింటికి మూలకంద మనందగు ముకుందు నావిర్భావప్రధానహేతువును దొలుత విస్తరించి చెప్పవలసి యున్నయది. కావున ఆకథను విస్తరించి పిదప మహాపురుషావతారముల ననువదించెద. కథాసాంకర్యబాధ దానఁ దొలఁగు నని యి ట్లొనరించుచున్నాఁడను.

* ద్వాపరయుగ చతుర్థభాగమునఁ గొంతకాలము గడువఁగా ధర్మము నశింపఁజేయు కడంకలనొప్పు దుష్టులు పిక్కటిల్లిరి. వారిసంఖ్య సాధుజనుల సంఖ్యను మించె. సాధుపురుషులు దుష్టజనబాధల నెట్లో యోర్చుకొని కాలము గడుపుచుండిరి. వేదచోదితకర్మము లొనరించు నవకాశములు

* ఈకథ బ్రహ్మవైవర్తపురాణాంతర్గత శ్రీకృష్ణజన్మఖండ చతుర్థాధ్యాయమునుండి వ్రాయఁబడినదని గ్రహింపఁదగు.

తగ్గఁ జొచ్చెను. ఎందో యజ్ఞములు చేయఁబడుచున్నను అవి నిరంతరాయములుగా సాగుట దుష్కర మయ్యెను. అర్థాతురులై కొందఱు భూసురు లాదుష్టుల నాశ్రయింపసాగిరి. కర్మములు భగవత్ప్రీతికరములు గాక దంభకర్మము లనఁబడుచుండెను. పతివ్రతల శ్రమములు వచింప నలవిగాకుండెను. వారి కష్టపరంపరలు తొలఁగునా యనుశంక యందఱ కంకురింపఁ జొచ్చెను. దుష్టులు విచ్చలవిడి చరించుచుఁ దమ్ముఁ బొగడు రాజుల నాశ్రయించి వారికి ధనసంచయములఁ బ్రోగు చేయుచు, గ్రామములఁ గొల్లఁగొట్టుచు నడ్డములేక ప్రవర్తింపసాగిరి. మునులమాట యిఁకఁ జెప్పనేటికి ?

ఇన్నికష్టములు పరంపరలుగా సాగుచుంట ధరారమణి యోరువఁజాలక యేరీతి నీ కుజనులభరించి బ్రదుకఁగల నని యూహించి తనవగ నాపఁజాలు భూపాలకు లాపట్టునఁ గనఁబడకుంటకు వగచి నిజరూపమున దేవలోకమునకుం బోయి యింద్రాదులతోఁ దనదుఃఖమును దెల్పుకొనియెను. శతమఖాదు లంతకముందే మర్త్యలోకమునఁ బ్రబలి యనివార్య శౌర్యమున విఱ్ఱవీఁగు జరాసంధాది దుష్టజనులచర్యలంగాంచి యుద్విగ్నమానసులై యుండిరి. కాన భూదేవి తనవగలఁ బలుకఁగాఁ జేతులు పిసికికొనుచుఁ జేయునది లేక యామెను మాటలచే నూఱడించిన లాభము లేదనియు, నీదుర్గతినుండి యామె నుద్ధరింపఁ దమ కనువుపడమియు నెంచి చంచల స్వాంతులై, 'దేవీ! కాలగతిమార్ప నేరికే నశక్యంబు. దానికి

మన మెల్ల లోఁబడినవారము. భగవంతుఁడే యీదుర్గతి నాపి మనల నుద్ధరింపవలయు. మన కశక్యమగు నీపనికిఁ బ్రతిక్రియఁ జేయఁబూనుట వృథాప్రయాస మనఁదగు. కాన మాతోడ రమ్ము. ఉష్మలింపకుము. సుంత యూఱడిల్లుము. అని మాటలచే నామె నాశ్వాసించి తమ యసమర్థతం దెల్పుచు నామెను వెంటనిడుకొని బ్రహ్మలోకమున కరిగిరి.

ఆలోకమునఁ బుణ్యపురుషు లక్షయసుఖంబు లనుభవించుచు దుఃఖ మన నెట్టిదో కలయందైన నెఱుంగక యుండిరి. ఏప్రాణియు నిత్యసంతుష్టి నొందకున్న యది గానరాకుండెను. గంధర్వులు పాడుచుండఁగా, భక్తులు తన్నుఁ బరివేష్టింపఁగా, మునీంద్రులు శ్రుత్యర్థసారములఁ బ్రశ్నించుచుండఁగా, సామగానము శ్రుతిమనోహరముగా వినఁబడుచుండగా బ్రహ్మదేవుఁడు నిండుకొలువుండెను.

భూదేవియుఁ దనవెంట నిలింపులు గుంపులు గుంపులుగా రాఁగా నార్తయై తన్నుద్ధరించు దిక్కెవ్వరవ్వరమేష్ఠియే యన్న నమ్మకమున నరిగి పితామహుంగాంచి కన్నీట నాతనిపాదములఁ దడుపుదానివలె వ్రాలి నమస్కరించెను. దేవతలు దిగులు వెలిఁబుచ్చుమోములతో యథోచితముగా నమస్కరించిరి. భూదేవి కన్నీరుమున్నీరు కాఁగా విలాప మొనరించెను. ఆ రోదనధ్వని యాపరమేష్ఠి యాస్థానమండపమును జింతాసాగరనిమగ్నముగావింపక విడిచినది కాదు. ఎల్లవా రుల్లములఁ దల్ల

డపడ సాగిరి. తటాలున నిట్టిరోదనము భూదేవి చేయ నేమియో కారణమని యూహింపసాగిరి.

పరమేష్ఠియు నా తరుణిం గాంచి 'కుమారీ! యేల తల్లడిల్లెదవు? ఇంత వంత నొందఁ గారణ మేమి? ఎవ్వరివంక నీకి బాధకలిగె? ఎన్నఁడుగాని యిట్టి విన్నఁదనంబు నీమోమును గుదురుట గాంచి యెఱుంగను దుఃఖింపకు. ఉన్న దున్నట్లు వినిపింపుము. నీచింత నంతము నొందించెద. తల్లీ! ఊఱడిల్లు మూఱడిల్లుము.' అని మిగులఁ గనికరము దొలకాడ నాశ్వాసించుచు నంత నిలువక యామె వెంగట నట్టి చింతలఁజివికిన దేవతలం గాంచి 'త్రిదశులార! యేల మీమోముల కాంతి యంతరించినది? వగలపాలయినట్లు తోఁచెదు. కారణ మెఱింగింపుఁడు భీతి మానుఁడు. దైవంబు మీబాధఁ దొలఁగింపఁ గలండు. చింతిల్లిన లాభ మేమి? వినిపింపుఁడు.' అని మనోహర మృదుభాషణముల వారిచింతఁ దొలఁగించెను.

దేవతలును గలంకఁబాసిన చిత్తంబులతో నంజలిబంధం బొనరించి 'కారుణికోత్తమా! మా విన్నపంబుల నాలకింపుము ఏమియు లోకవృత్తంబు నెఱుంగనిచందంబున నడుగుచున్న మీముందట విన్నవించుశక్తి మాకున్న దే! ఐన దేవర యానతి మౌళులందాల్చి మావగలఁ దెలుపుకొందుము. పిదప మాభాగ్యము. ఈధాత్రి నిరంతర చింతల విసికి వేసరి మమ్మాశ్రయింప నరుదెంచెను. సకలవిధముల బాధితయగు నీమెకష్టముల గట్టెంక్కింపఁజాలని మేము చేయునది యాదేశించునట్టి

ప్రోడవగు నీచెంతకుఁ జేరితిమి. ఇఁక మాగతియో యించుక విన్నవింతుము. దుష్ట రాక్షసులు మమ్ము తఱిమితఱిమి కొట్టు చున్నవారు. వారిమార్గ్గానిని నిలువరింప రాకయున్నది. వర లాభగర్వమున సహార్యశౌర్యములుగలుగఁ ద మ్మెదిరించు వారు లేక సింహములభంగి విచ్చలవిడిఁ దిరుగు సురవైరి వీరుల మే మాఁపఁగలమా? మావంత లిట్లుండ నీభూదేవి తన దుఃఖముల మాకడం దెలుపుకొన నేతెంచె. రాక్షసబాధల కన్న నీమె పరితాప మాలకించుట కష్టముగఁ దోఁచెను. చేయునది తోఁపమి శరణ్యుఁడ వగునీపాలి కీతరుణిం దోడు కొని వచ్చితిమి. ఇదియ మాయుదంతమని యూరక నిలువం బడిరి. వారిం జూచుచుండ నియోగించి ధరారమణివంకఁ గటాక్షదృష్టులం బొలయఁజేసి యి ట్లనియె.

'కుమారీ! నీదుఃఖములు తొలఁగె. నిశ్చింతముగా నా చెంతనుండుము. వెతలపాలు గాకుము. నీవిపుడు భారమును వహింపఁజాలక వచ్చితివి కదా! నీకు భారమని తోఁచునట్లు చేసిన దుష్టాత్ము లెవ్వరు? సర్వంసహానామము సార్థకముగాఁ జేయు నీకిట్టి భార మనుచింత గల్గించినవా రెవ్వరో విడువక తెల్పుము' అని సాదరంబుగాఁ బ్రశ్నించెను.

### భూదేవి తనకష్టముల బ్రహ్మకడఁ దెలుపుట.

ఉర్వీరమణియుఁ దనకష్టములు గట్టెక్కినట్టే తలంచి యించుకవికాసము మోమున నంకురింపఁ బద్మయోనిం గాంచి

కరకమలయుగళంబు ముకుళించి భయభక్తులు పెనఁగొన నిట్లని యె. 'దేవా! నామనోవ్యథ నాయందు విశ్వాసముగల బంధువుతో విన్నవింపవలయునే కాని యితరులకుం జెప్పనొప్పదు. ఒకప్పుడు తెల్పినను దాన లాభము లేదు లోకమున స్త్రీజాతి యస్వతంత్రయనందగు. కాఁబట్టి స్వామి జనక పుత్ర సోదరులచే రక్షింపఁదగినది. అట్టులగుట నాకు నీవు తండ్రివి. నీచెంతఁ దెలుపుకొన నాకు స్వాతంత్ర్యము గలదు. కాన మానక సర్వము తెల్పుకొనుదాన.

ఇక్కాలమున నా యాధారమున నివసించువారిం దెల్పెద. అవధరింపుము. హరిభక్తివిరహితులు, హరిభక్త నిందకులు, స్వస్వధర్మము నాచరింపక వీటఁబుచ్చి తిరుగువారలు, వేదోక్తకర్మాచరణ విముఖులు, అసత్యవాదులు, కూటసాక్షులు, చేసినయుపకారము కాసంతయేని పాటింపనివారు, నిధిహారకులు, మిత్రద్రోహము బుద్ధిపూర్వకముగాఁ జేయుచునది మేటికార్య మని సంతసించువారు, సదాచారదూరులు, నమ్మినవారి మోసగించువారు, భగవన్నామమును విక్రయించి దాన జీవించుకుమతులు, లోనగు మహాపాపులు మెండుగ నున్నవారు. కులాచలముల నింక నెన్నింటినేని మోయఁగల నాకీ పాపులభారము దుర్భర మయ్యెను. మహాప్రభూ! కృపాసింధూ! తండ్రీ! సర్వలోకపితామహా! దేవభూదేవహింస చేయు దైత్యులభారము మిక్కుటమగుచున్నది. ఇంకఁ దెల్పఁజాలను. సర్వమెఱింగినప్రోడ వగునీకడ నే నింతకంటె విన్న

వింపవలసిన దేమున్నది? మహాత్మా! నేను ననాథనేని దీనికిం బ్రతివిధాన మాలోచింపుము. నన్నుద్ధరింపుము. అని తెల్పి దీనయై మౌన మూనెను.

## బ్రహ్మ భూదేవి నూఱడించుట.

విరించియుఁ జింతాభరంబున వాడినమోముతో నున్న ధరాకమఃశింగాంచి 'కుమారీ! చింతఁబాయుము. నీవిచారముఁ బాపెద. ఇదియొక గొప్పభారమా? ఖేద మెడఁబాయుము. దురాత్మకులు నిన్నుఁ గాఱియపెట్టుచుండ నోర్వఁజాలుదునా? భూదేవీ! యః:విత్రులు మహాపవిత్రురాలవగు నీపై * గోరోచనాదివస్తువుల నజ్ఞానంబున నునిచిన రౌరవాదినరకముల పాలగుదురు. అట్టిపాపాత్ములకాలమున మితిమీఱియుండుట తెల్లమాయె. ఉమ్మలింపకుము. సులభముగ నీవంతఁ బాపెద. దురాత్ముల రూపుమాపెద. అమ్మా! నన్నుఁ గూడిరమ్ము. పరశివుపాలికిం బోయి యామహాకరుణారాశికి నీమొఱ్ఱఁ దెలిపెద. తదాదిష్టపద్ధతి నీకష్టములఁ దొలఁగింతు' అని పలికి యమర్త్యులను భూదేవిం బిలుచుకొని కైలాసంబునకుం బోయెను.

---

* గోరోచనం చ ముక్తాం చ శుక్తిం మాణిక్యమేవ చ, పురాణ సంహితాం వహ్నిం కర్పూరం పరశుంతథా. రజతం కాంచనంచైవ ప్రవాలం రత్నమేవ చ, కుశబీజం తీర్థతోయం గవ్యం గోమూత్ర గోమయమ్. త్వయి యే స్థాప యిష్యంతి మూఢాస్తై చ్చైతాని సుందరి, పచ్యంతే కాలసూత్రేణ వర్షాణామయుతం ధ్రువమ్. 3౦ శ్లో. ౪ అధ్యాయము.

## బ్రహ్మ భూదేవిని దేవతలందోడ్కొని కైలాసంబున కరుగుట.



అతినిర్మల కైలాసభూధరంబున గంగాతీరంబునఁ బవిత్రతమాశ్రమంబున వటమూలంబున సుఖోపవిష్టుండై సనందనాదిమునిబృందారకేంద్రులు పరివేష్టించి వివిధవిషయంబులు ప్రశ్నింపఁ బ్రతివచనం బిచ్చుచు, దేవతాదీనాలాపముల నాలకించి యభయం బొసంగుచు, వ్యాఘ్రచర్మమును గట్టి, గజచర్మము నుత్తరీయముగాఁ దాల్చి కోటిసూర్యప్రభాభాసమానుండై వామభాగంబున గౌరీదేవి యలరఁ, బన్నగేంద్రహారములు విలసిల్ల, చంద్రసూర్యాగ్నిలోచనములు చెలువారఁ, బంచాననము లొప్ప, మందాకినీసంఫుల్లపంకజబీజమాలికలం బ్రీతిమైఁ దాల్చి, పంచముఖంబుల శ్రీకృష్ణమంత్రంబు నిరంతరము జపించుచు, సకల భక్తకామదుండయ్యుఁ దాఁ గామాంతకుండై, యప్సరోలాస్యములం దిలకించుచుండియు, విరాగియై, గంధర్వదివ్యగాన మాలించుచు వికృతిం బొరయక, తనవైభవమును దిలకించి సర్వమంగళ యచ్చెరువందుచుం దన్నుఁజూడ నా సాధ్వీతిలకమును సవిలాసదృష్టిజాలములఁ గాంచుచు, గంగాతరంగిణీసమాలింగితశీర్షుండై, చంద్రార్ధభూషణుండై, త్రిశూలపట్టిసాది నానావిధదివ్యాయుధంబులు కరంబులం గ్రాల, రూపములం దాల్చి శ్రుతులు వినుతింప నసమానతేజమున విలసిల్లు భక్తలోకవశంకరుండగు శ్రీశంకరుం గాంచెను.

ఇట్లు పరమేశ్వరుం గాంచి విరించియు భూదేవియు, నిలింపులు తనవెనుక నిలువఁ జెంతకేగఁ బరశివుం డాదరంబున

లేచి లోకాచారముం బాటించి వందనమర్పించి యంచిత
విధుల ననుసరించి యాతిథేయసత్కారంబుల నాచరించెను
బ్రహ్మయు నుచితమర్యాదలం బడసి సంతుష్టుం డయ్యెను.
భూదేవియు నమరులు మ్రొక్క యథావిధి శంకరుం డాద
రించి కూర్చుండ నియోగించెను.

పరమేష్ఠి కొంతసేపు తత్కాలోచితాలాపములం గడపి
పదంపడి భూదేవి పరిదేవనంబును, నిలింపుల దీనాలాపంబులను
విన్నవించెను. ఈశ్వరుండును దదాకర్ణనమున గౌరింగూడి వగ
నొంది యుచితాలాపముల భూదేవిని ద్రిదశుల నూఱడించి
మీకష్టంబులం దీర్పుభార మిక మాది. మీరెల్లం జింతల
మాని మీమీ నివాసంబులకుం బొండు. మీకు మేలయ్యెడు
నని సెలవీయ భయంబుం బాసి తమతమ నివాసములకు నమ
ర్త్యులు తదధిపతులు భూదేవియుం బోయిరి. దేవతలు భూదే
వియుం దమతమనెలవుల కరుగ విరించిశంకరు లిరువురు రహ
స్యస్థలంబునం గొంత యోజించి యిమ్మహాకార్యంబు నెఱవేర్ప
కున్న మేలులేదని నిశ్చయించి సేవాసమాగతసనందనాది
భక్తులం బోవంబనిచి యిరువురును గదలి ధర్మగృహంబున
కేగి యాతనికిం గార్యభంగినెఱింగించి యాతనిం గూడి వైకుంఠ
లోకంబునకుం బోవం బయనమైరి

## బ్రహ్మశంకరధర్ములు వైకుంఠలోకమునకుం బోవుట.

వైకుంఠలోక మీ బ్రహ్మాండమునకుం బైన, బ్రహ్మ
లోకంబున కవ్వలం గోటియోజనముల విస్తీర్ణము గలిగి జరా

మరణములులేని ప్రాణికోటు లలరార, వాయుధార్యమాణం బై, సనాతనంబై, యెట్టివారికేని వర్ణింప నలవిగాక, సకలమణి వినిర్మితసౌధప్రాకారములు దృష్టుల కచ్చెరువుఁ గల్గింప, జారు తరఘుంటాపథంబు లొప్పార, నసమానంబై యలరుచుండు.

అట్టి వైకుంఠలోకమున కరిగి యం దసమత నెసఁగునా సరసిజలోచను పావనాంతఃపురముం గని యందుఁజొచ్చి తన్మధ్యభాగంబునఁ గనకమయసింహాసనంబున నాదితేయ పూజిత పాదారవిందుఁడై, రత్నకుండలము లొప్పఁ, గనకాం బరముఁ దాల్చి, యసదృశనిర్మలరత్నహారంబులఁ గైసేయఁబడి, కరుణా నీరరాశియై, యింతింతనరాని వైభవంబునఁ దులఁ దూఁగు శ్రీమహావిష్ణువుం గాంచిరి.

భక్తసంరక్షణంబె తనకృత్యంబుగాఁ దలంచుచు, దీనుల యాలాపంబుల నాలకించుచు, సుస్మితంబు మోమునఁ జిందు లాడ, సర్వగీర్వాణులు జేజే లొనరింప, నిందిరాదేవి పాదార విందము లొత్తఁ, బరమానందము నొందుచు, సరస్వతియు సేవింపఁ, గందర్పకోటిసుందరాకారుండై యున్న యాపంకజా క్షుండును సేవార్థమువచ్చియున్న సచ్చరితుల శంకరపంకజాస నుల ధర్మునిఁ గాంచెను. వారును భయభక్తులు పెనఁగొన నా మహావిష్ణువునకు నమస్కారము లర్పించిరి. * పెక్కుభంగుల

---

* బ్రహ్మః— నమామి కమలాకాంతం శాంతం సర్వేశ మచ్యుతం, వయం యస్య కలాభేదాః కలాంశకలయాసురాః. మనవశ్చ మునీంద్రాశ్చ మానుషాశ్చ చరాచరాః, కలా కలాంశకలయా భూతాస్త్వత్తో నిరంజన.

వినుతించిరి. మనస్సు కరుణాతరంగిణీ నిమగ్నమగునట్లుపనిష దుక్తులఁ గొనియాడిరి. ఈవిధి శంకరధర్ములొనరించిన స్తుతిఁ బఠించిన నాలకించిన వినిపించిన సకలపాపములు తొలంగు.

ఇట్లు స్తుతింప నాలకించి కాంచనాంబరుఁడు విధిశివధర్ము లారా! మీవచ్చినకార్యం బెఱుంగుదు. మీరిపుడు గోలోక మున కరుగుఁడు. నేనును లక్ష్మీసహితుఁడనై యచ్చటి కరు దెంతు. శ్వేతద్వీపనివాసులగు నరనారాయణులు, సరస్వతియు, యోగమాయ యనంబరఁగు మదీయశక్తియు, ననంతుఁడును, గణేశ్వరకార్తికేయులును, సకలవేదమాతయగు శ్రీసావి త్రియు నావెంట నరుదెంతురు. * నేనే యాగోలోకంబున

---

శంకరః:—త్వా మక్షయ మక్షరం వా వ్యక్త మవ్యక్త మీశ్వరం, అనాది మాదిమానంద రూపిణం సర్వరూపిణమ్. అణిమాదిక సిద్ధీనాం కారణం సర్వకారణం, సిద్ధిజ్ఞం సిద్ధిదం సిద్ధి రూపం క స్తోతు మీశ్వరః.

ధర్మః:— వేదే నిరూపితం వస్తు వర్ణనీయం విచక్షణైః, వేదేఽనిర్వ చనీయం యత్త న్నిర్వక్తుంచకః క్షమః, యస్యసంభావనీయం య ద్గుణరూపం నిరంజనం, తదంతిరిక్తం స్తవనం కి మహం స్తౌమి నిర్గుణమ్. బ్రహ్మాదీనా మిదం స్తోత్రం షట్శ్లోకోక్తం మహామునే, పఠిత్వాముచ్యతే దుర్గా ద్వాంఛి తం చలభేన్నరః. ౬౬ శ్లో. ౪ అధ్యాయము.

* గోలోకం యాతయూయం చ యామి పశ్చాచ్ఛ్రియా సహ, నరనారాయణౌ తౌ ద్వౌ శ్వేతద్వీపనివాసినౌ. ౬౭. ఏ తేయాస్యంతి గోలోకం తథా దేవీ సరస్వతీ,అనంతో మమ మాయాచ కార్తికేయో గణా ధిపః. సావిత్రీ వేదమాతా చ పశ్చాద్యాస్యంతి నిశ్చితమ్, తత్రాహం ద్విభు జః కృష్ణో గోపీభీరాధయాసహ. అత్రాహం కమలా యుక్తః సునందాదిభిరా

భుజద్వయవిరాజితుండనై రాధాగోపికాళింగూడి శ్రీకృష్ణుం
డనై యొప్పుచుందును. ఈవైకుంఠమున నాల్గుబాహువు లల
రార లక్ష్మీవల్లభుండనై భక్తశ్రేణి సేవింప విష్ణునామంబున
నుండుదు. శ్వేతద్వీపంబున నారాయణాహ్వయంబున నరుం
గూడి యుండుదు. ఈ మూఁడుస్థానంబుల నుండువాఁడ నేనే
కాని వేఱొకరు లేని యెఱుంగఁదగు నాయీయానతిం
గొని గోలోకంబున కరిగిన నట మీవాంఛితంబులు సిద్ధించు
నని పలికెను

విరించి ప్రభృతు లావిష్ణుమూర్తికి నమస్కరించి సెల
వంది యటనుండి యేఁబదికోట్లయోజనములపొడవున నగ
మ్యంబై వాయుసంధార్యంబై శ్రీకృష్ణపరమాత్మచే నిచ్ఛా
మాత్ర వినిర్మితంబై జరామరణాదిభీతిలేక యలరు జంతువు
లచే విలసిల్లుచు సర్వోత్కృష్టంబు సుఖాకరంబునై యచ్చెరువుఁ
గల్గించుచు వినిర్మలవిశాలభాగంబగు గోలోకంబునకు మనో
వేగంబునం బోయిరి.

ఆలోకమును వలయాకారముగాఁ జుట్టుకొని విరజానది
ప్రవహించుచుండును. దానితీరంబు లతిమనోహరంబులు. నవ
రత్నంబు లాతీరంబుల నెందుఁజూచినను గానవగు మరకత
మాణిక్యపద్మరాగేంద్రనీలవజ్రవైడూర్యగోమేధికపుష్యరాగ
ముక్తాప్రవాళస్ఫటికకౌస్తుభప్రముఖనామంబులందాల్చి రత్న

---

వృతః, నారాయణశ్చ కృష్ణోఽహం శ్వేతద్వీపనివాసకృత్. మమైవైతేకలా
స్సర్వే దేవా బ్రహ్మాదయస్స్మృతాః, కలా కలాంశకలయా సురాసుర నరాద
యః. గోలోకం యాతయూయం చ కార్యసిద్ధి ర్భవిష్యతి. ౨౧ శ్లో. ౮ అధ్యా.

ములని కొన్నియు, సుపరత్నములని కొన్నియువిఖ్యాతిఁ గాంచుచుండు. మృత్తికయు సువర్ణమే యనఁదగియుండును. నవనిధులగను లాతీరంబులఁ గానంబడు. మణిదళములు చెలువారుచుండు. బంగరుకమలంబు లాతటస్థ కమలాకరంబులఁ జూడఁదగు. విహారంబులకు ననువగుస్థలంబులు తదుచితపదార్థంబులతో నలరారుచు నందుఁ గనువిందుచేయుచుండు. సంతానము లోనగు కల్పద్రుమంబులం దెందుఁజూచినను గానసగు. వానిశీతలచ్ఛాయల విశ్రమింప సకలసుఖములు కరతలామలకములుగాఁ దోఁచుచుండు. మణిదండంబుల వెలయు పతాక లందం దమర్పఁబడియుండుట నేత్రపర్వంబగు. అందలి యిసుకతిప్పలు మఁఖలశకలములప్రోగులే యన్న సందియమ్మును గల్గించుచుండు.

అట్టితావులనెల్లఁ బెల్లుగఁ బొడఁగాంచి విధిహారధర్ములు తక్కుంగలయాదితేయులు సంతోషాంబుధి నోలలాడిరి. మరల మరల విలోకించిరి అయ్యారే! ఇట్టి తావులుగల యీలోక మెంతమనోహరముగానుండునో యని నాసికాపుటముల నంగుళులుంచిరి. ఇందు నివసించు పుణ్యాత్ముల పుణ్యములకు మేర గలదే యని యచ్చెరువందిరి. ఇంకొక్కసారి చూచి పోవుదమా? యని మరలఁ బరికింపసాగిరి. ఎట్టకేలకు, కార్యాతిశయభరంబు త్వరపెట్ట నమ్మహానది నుత్తరించి యవ్వలి తీరంబుఁ జేరిరి.

విరజామహానదీతీరమును దాఁటి యించుకదూరమున నయనములకు మిఱుమిట్లుగొలుపు కాంతులఁ దేజరిల్లు కొండ

యొక్కుండువారి నుతికిం బాత్రమయ్యె. * దానియెత్తు కోటి యోజనములు. వెడలుపు పదికోట్లయోజనములు. పొడవేఁబదికోట్లయోజనములు. దానియందము వర్ణనాతీతము. మందారపారిజాతాదిబృందారకతరుబృందము లద్దానం గ్రిక్కిరిసియుండు. కామధేనువు లందు మందలుమందలుగాఁ గానఁబడుచు మహైశ్వర్యమును గలుగఁజేయు. దానిశృంగంబులు మణిమయములు గాఁ దచ్ఛోభ మిట్టిదని యెట్లు వర్ణింపనగు? ఆశిఖరములు శతసంఖ్య నలరు. దేవత లవ్వానిం జేరి చూడ నలవిగాదు. గోలోకమున కాపర్వతము రత్నసాను విచిత్రితమగుటఁ గోటవలె నమరియుండును. ఆపర్వతమును దిలకించునపుడు వారికిం గల్గిన సంతోష మింత యని యాయ నంతుఁడేని వచింపలేఁ డన నిఁకఁ దక్కుంగలవా రొక్క లెక్కయా? దానింగాంచి దానిశిఖరంబున నచ్చెరువుగొలుపుచు ననమానప్రఖ్యాతిగాంచు రాసమండలమును గాంచిరి.

## † రాసమండలవర్ణనము.

ఆ రాసమండలము పదియోజనముల విస్తీర్ణమున నలరుచు గుండ్రముగానుండి దృష్టిపాత్రంబై యుండును. దానిం

* కోటియోజన మూర్ధ్వం చ దైర్ఘ్యం దశగుణోత్తరం, శైలప్రస్థ పరిమితం పంచాశత్కోటియోజనమ్. అని మూ. ౪ అ. ౦౫౧ శ్లో.

† రాసమండలమనఁగా 'రాసతే అత్రేతి రాసః, గోపానాం క్రీడా భేదః.' అని శబ్దకల్పద్రుమము. కార్తికేపూర్ణిమాయాంచ కృత్వాతు రాసమం

జుట్టి సుందరోద్యానములు వేనవేలుగా నుండును. లతావిశేష ములు, సురుచిరతరువులు పుష్పఫలనిబిడములై యుండును. ఆపుష్పములు పరిమళముల వెదఁజల్లుచు, షట్పదఝుంకారముల వింతగొలుపుచు,వర్ణనాతీతములై యుండును. క్రీడోచితసకల పదార్థబహుళములై కేళీమందిరములం దెన్నియో యమర్పఁ బడి యుండును. రత్నమయసోపానములు, మణికలశములుఁగల విచిత్రతరానేకమండపములు నందు విలసిల్లుచుండును రత్న బిందుభూషితములై, మరకతమణిమయస్తంభంబు లొప్పార, మహేంద్రనీలమణీవిరాజితమధ్యభాగము లొప్పుఁజూపఁ రత్నమయప్రాకారము లుల్లసిల్ల, మణివేదికలు చెలువార, విద్రుమమయకవాటముల నందములగు భూరితరద్వారములు చెలువుఁగులుకఁ; దియ్యమామిడి యాఁకులతోఁగూడి వజ్ర ములు నడుమనడుమ ముడులవలెఁ గనంబడఁ గూర్పఁబడిన తోరణములు ముద్దులు మూటఁగట్టుచుండ; జందనాగరు కస్తూరికుంకుమద్రవములు చల్లియుండుట గుమగుమలాడుచు, రత్నమయపత్రములు, గలిగి విచిత్రనానావర్ణపంకజోత్పల కైరవషండమండితములై, మత్తమధుకరనికరఝుంకారరవసంకు లంబులై, లెక్కింపఁ దరంబుగాక చూపఱ కచ్చెరువుఁగూర్పు చున్న కేళీసరోవరము లందుఁ గనఁబడుచుండును. కుసుమ శయ్యలు, కర్పూర కస్తూరీమిళితతాంబూలములు, మృదులత

---

దలం, గోపానాం శతకం కృత్వా గోపీనాం శతకం తథా, శిలాయాం ప్రతి మాయాం వా శ్రీకృష్ణం రాధయా సహ.

బ్రహ్మవైవర్తము, ప్రకృతిఖండము, ౨౫ అధ్యాయము.

మామూల్యాంబరములు, వివిధాంగరాగములు, మణిమయ ముకురములు, శ్వేతవర్ణరత్న ఖచితదండ విరాజితచామరములు, విచిత్రవర్ణనీయ నయనానందకర మనోహరకుసుమమాలికలు, నిఖిలభోగ్యద్రవ్యములును, గలిగి వర్ణింప నేరకేఁ దరంబుగాని యట్టు లొప్పు కుంజకుటీరము లా రాసమండలమున నెన్నియో వెలయుచుండు.

## రాసమండలమునను్న గోపికలవర్ణనము.

అట్టి రాసమండలమును గాంచి విరించిశంకరులు, ధర్ముండు నాశ్చర్యపరవశులై యందిందుకు నేపు నిల్చిరి. ఆరాస మండలమునందు విహరించు గోపికలు దృష్టిసంతృప్తినిచ్చుచుం గానంబడిరి. వారిఫాలభాగములు చందనసిందూరబిందువుల రంజిల్లుచుండెను. కోమలహారిరత్నకుండలముల కాంతులు కపోలతలములఁ బ్రసరింప నవి రత్నదర్పణములా యనుశంక నంకురింపఁజేయుచుండెను. నవ్యభవ్యభములై, విచిత్రరత్న ముద్రిక లలరఁ బొడవులై హస్తములు వారిసౌందర్యమును జాటుచుండెను. కస్తూరికాపంకమునిండఁబూయ నొక వింత చాయనొసంగుచు, విద్యుల్లతలభంగి వారిగాత్రము లొప్పుచుండెను. రత్నమయమంజీరములు, దివ్యకేయూర ములు, మనోహరవలయములు, అమూల్యహారములు, విచిత్ర తరానేకభూషణములు, చారుతరకాంచనపీతరోచిస్సంయుతా నర్ఘ్యవస్త్రములు, వారి యనంతసంపదున్నతిఁ జెప్పక చెప్పు చుండెను. ఇట్టి వేషాదుల, మణిభూషాదుల నలరు నాయో

షామణుల వర్ణింప భాషాదేవికైన నలవియగునే. ఇంతియ గాదు. ఆగోపాలకలలనామణులు కరికుంభసమానత నలరు పాలిండ్లు సుంత నమ్రతఁ గలిగింప, మోముదమ్ములు వింత కాంతిని వెలయింప, గమనవిలాసములు, మత్తద్విరదంబులకును, రాజహంసలకును లజ్జనుబుట్టింప, రుచిరచంపకమాలికాపరిమళమిళితకేశపాశము లింపుఁ గల్పింపఁ, బరిపక్వబింబాధరములు మనోజ్ఞత ద్విగుణింప, ఫుల్లారవిందదళనయనములు చెలువును బెంప, వాఁరిదాడిమీబీజసమదంతములు క్రొత్త వికాసము నింప, నేవిషయమునను సాటి యనునదియే లేక విలసిల్లుచుండిరి.

వారి యసమానసౌందర్యమున కచ్చెరువందుచుఁ గొంత దూర మరిగిరి. అంత వారియెదుట రాధాదేవి చెలికత్తియలు తోఁచిరి. వారు ధరించిన పుష్పమాలికలం గాంచి మకరందసమాస్వాదనలోలుపమ్ములై రోలంబంబులుపరుగునవచ్చి చుట్టుం జేరి ఝుంకారంబులఁ దమసంతసమును దెలుపుచుండెను స్మరశరాసనము నెగఁజిమ్ముభ్రూలతల చెలువుతోఁగూడి మందహాస మొకవింత సంతసమును గూర్చుచుండెను. రత్నకింకిణికాబద్ధరశనాభిరామపృథుతరనితంబములు సౌందర్యమున కిదియే యుదాహరణ మని తెలియఁజేయుచుండెను. రతిదేవిం దిరస్కరించు నాకృతులు నేత్రపర్వమున కిదె యవధి యనుభావము బయలుపఱచుచుండెను. శ్రీకృష్ణపాదారవిందనిరంతరభక్తి నిర్మ

ఉతను వెల్లడించుచుండెను. వారిసంఖ్య లక్షలమీఁజి కోట్లు లకుఁ జేతులు సాచుచుండెను.

ఇట్లు రాధాదేవి సఖులు దర్శనమొసంగిన నచ్చెరువం దుచు వారివిలాసముల కానందించుచు, వారికింగల శ్రీకృష్ణ భక్తిపారవశ్యమును మెచ్చుచు, నచ్చోటుబాఁటి యాశత శృంగమహీధరంబునకుఁ జెంత గోలోకంబు నాపరించి వలయా కారంబుగాఁ గానంబడుచుఁ, బరమపవిత్రమై శ్రీరాధామాధ వులకు నిత్యవిహారయోగ్యంబై సిరుల కాటపట్టగు బృందావన మును దర్శించిరి.

## బృందావనమహిమము.

ఆపావనవనము విరజాతరంగిణీవీచికాశీకరములం గలిసి యున్న శీతలమారుతము సోఁకుటచే నించుకంత గదలు ననేక శాఖాగ్రములు గలదేవతామహీరుహములచే నిండియుండెను. వృక్షాగ్రముల నివసించి యేలాటిభీతిలేక చిగురుటాకుల మెక్కి క్రొవ్వి చెలరేఁగి కూయు కోకిలకూజితంబుల శ్రోత్రసుఖసార మిద్దియే సుఁడీ యని బోధించుచుండెను. కమలాకరంబులు, నందు విహరించు రాయంచల నడబెడంగులు, లతావితాన సమావృతకుంజపుంజములు, సకలశృంగారవస్తుప్రశస్తకేళీ మందిరములు, గోగణంబులు, గోష్ఠంబులు, శ్రీకృష్ణభక్తగోపా లకరమ్యహర్మ్యసముదయంబులు గలిగి బ్రహ్మాదులకు మహా నందప్రదమయ్యెను.

## గోలోకవర్ణనము.

ఇట్లు బృందావనము నేత్రపర్వ మొనర్ప నచ్చోటుగడచి యవ్వలఁ*గోటియోజనముల విస్తీర్ణముగలిగి, వర్తులముగా నాకృతియమర, రత్నప్రాకారములు చెన్నువహింప, ద్వారచతుష్టయ మెంతో సంతోషమును గల్గింప, హరిపాదారవిందముల డెందంబుల నిలుపుకొని నిరంతరధ్యాన మొనరించుచుండు భక్తవరుల మందిరము లెన్నియో గణింప శక్యముగాకయుండ నొప్పుచు, ద్వారపాలకులయి వీరభటులు చూచువారి కచ్చెరువుపుట్టించుచుఁ గాచుచుండ, నందున్న పార్షదులగేహంబులు

---

* ఇందుఁ దఱచుగాఁ గోటియోజనము లని చెప్పఁబడినది. ఇది యొక యసంగతప్రసంగముగాఁ గొందఱకుం దోఁచునేమో, కాని భక్తిరసము గలవారలకు సహజముగనే యుండును. కోటి యను నది విపరీతార్థము నీఁజాలదు. బహుళసంఖ్యను దెలుపును. పురాణవచనము లసంగతములను మాటనుముందే తలంపక చదివిన పిదప విపరీతార్థములనే చేయఁబూనక జాగరూకులై మెలఁగిన విపరీత మిం దేదియు నుండదు. ఉన్నదున్నట్లు చెప్ప నెవ్వఁడును సాహసింప లేఁడు. చెప్పను లేఁడు. "శతమానంభవతి" యను వేదవాక్యమందుఁగల శతశబ్దము బహువర్షములనియే యర్థ మిచ్చును. లేనిచో నూటయిరువదిసంవత్సరముల యైదుదినములు మనుష్యాయుర్దాయము నిర్ణయింపఁబడఁగా నం దిరువదిసంవత్సరముల యైదుదినము తగ్గించుట కావేదము కంకణము కట్టుకొన్నట్లగును. కావున విపరీతార్థములఁ జెప్పఁబూనక ఉపలక్షణవిధిచేఁ గోటి యనఁగా నధికసంఖ్య యని గ్రహించుటయే సరసము.

లెక్కపెట్ట నలవిగాకుండ, నేత్రములకు విందుసేయుచు, గోలోకము వారిమనంబుల నానందరసనిమగ్నులఁ గావించెను.

అందు శ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహముంబోలె దేహంబు లొప్ప, భక్తులగు పార్షదనామకు లెందఱో కనఁబడిరి. రాధాదేవి నిరంతర మారాధించుచు, గోపకాంతు లనంతసంఖ్యలఁ దిరుగుచుండిరి. వారిసంఖ్య ముప్పదిరెండు కోటులని పరిగణింపఁబడుచుండెను గాని లెక్కింప నలవియే గాకుండెను. రాధాదేవి సఖుల సేవించుకింకరజనముల కేర్పాటు చేయఁబడియున్న గృహవరము లనేకము లుండుండెను.

## గోలోకవిశేషము.

భారతఖండమున జన్మించి నూఱు జన్మము లందు విడువక తపస్సుచేసి సకలకర్మఫలములను భగవదర్పణంబుచేసి పరిశుద్ధభక్తిచే జాగ్రత్స్వప్నములయందు వదలని శ్రీహరి భక్తిచే రాధాకృష్ణదివ్యనామస్మరణము ననవరత మొనరించుచు శరీరముల వదలి గోలోకముంజేరి దివ్యశరీరధారులై శ్రీకృష్ణదర్శనానందమున దేహములు తెలియకున్న పుణ్యపూరుషుల కలరింపఁబడి, సకలమణిమయమండితములగు మందిరము లసంఖ్యలుగ నందొప్పుచుండెను.

అట్టి గోలోకముం జొచ్చి కొంతదూర మరిగి యందొక్క పవిత్రస్థలంబున నైదుయోజనముల విస్తృతియుఁ బదియోజనముల యెత్తును గలిగి చూచినంతన విస్మయమును

గల్గించు నెఱ్ఱనిఫలంబులు గలిగి, వేయిశాఖలు వెలయ రత్నమయవేదిక లొప్పారఁగా నపమానరూపంబునఁ దోఁచు నక్షయవటవృక్షముం గాంచిరి. ఆవృక్షమూలమున శ్రీకృష్ణతుల్యరూపములం దాల్చి, బంగరురంగుగలవస్త్రములం దాల్చి మణిమయభూషణములువెలయ నాడుచున్న బాలురం గాంచిరి. వారు పార్షదు లనఁబడు మహాభక్తులపుత్రకులు. వారి నాట్యమును గన్నులారఁ గాంచి బ్రహ్మయు శంకరుండు లోనగు వారానందపారవశ్యముం జెందిరి.

అటనుండి కదలి చనుచుండ నొకరాజమార్గంబు గనఁబడియె. దాని చమత్కృతి శ్రీకృష్ణపరమాత్మకే తెలియును గాని యితరులు గ్రహింపఁజాలరు. ఆమార్గమున నీలతనుద్యుతులలర నృత్యమొనర్చుచున్న గోపికలం గాంచి భగవన్నామమహిమమును దెలిసికొనుచు మూర్ఛమునింగినట్లు చొక్కియుండెందుఁగాంచినను శ్రీకృష్ణభక్తిరసపూర్ణులగు సజ్జనులుండుట కెంతయు నచ్చెరువుపడుచు, గల్లుగల్లని కరకంకణములు ధ్వనింప వాద్యములమ్రోయించువారిని, జిగురుటాకులరక్తిమ నీసడించుమృదులకరాంగుళుల వీణియలమీటువారిని, వీవనల విసరువారిని, మంజుమంజీరనినాదములు చెలరేఁగుచుండ నృత్యములు సల్పువారిని, రాజహంసలకు నడబెడంగు నేర్పునట్లు నడచువారిని, వివిధవేషంబులం దాల్చి శ్రీకృష్ణచరితము గానముచేయుచుఁ జొక్కియున్నవారిని సుందరాకారముల

విలసిల్లు గోపికాంగనల నందొక్కచోటఁ గాంచిరి. ఆగోపికలందుఁ గొందఱు మణినిర్మితకనకతాళములం గొని వాయించుచుండిరి. కొందఱు పురుషాకృతుల వేడుకమీఱఁ దాల్చి విహరించుచుండిరి. మఱికొందఱు శ్రీకృష్ణాకృతిం జెంది శృంగారకేళులఁ క్రీడించుచుండిరి. ఇంకనుం గొందఱు రాధికాకారములం గైకొని వారికి సేవలు సేయుచుండిరి. బహువిధవిలాసములం గొందఱు మునింగి తేలుచుండిరి.

అంతఁ త్రిదశవర్యు లాచోటువాసి కొంత దవ్వేగి రాధికాసఖీజనములయందుఁ బ్రథమగణ్యలై యలరు పుణ్యకాంతల మహోన్నతహర్మ్యములం బొడఁగాంచిరి. వారు ముప్పది ముప్వురనునది లోకవిశ్రుతంబ. వారిరూపములు ప్రేమాలవాలములు అన్నివిధముల రాధికతో వారు సరివత్తురనుట కేలాటి సందియములు లేవు. వారిపవిత్రనామములు:—సుశీల, యమున, శశికళ, రతి, మాధవి, స్వయంప్రభ, కదంబ, మాల, కుంతి, పద్మ, చంద్రముఖి, పద్మముఖి, గంగ, సావిత్రి, చంపక, జాహ్నవి, శుభ, గౌరి, సర్వమంగళ, హార్దపారిజాత, సతి, భారతి, సరస్వతి, సుధాముఖి, చందని, సుందరి, మధుమత్తి, మందని, కాళిక, నర్మద, అంబిక, అపర్ణ, కృష్ణప్రియ యన నలరుచుండెను. వారి దివ్యహర్మ్యములు వర్ణనాతీతము లై యుండెను. సకలరుచిరపదార్థములు కొఱఁతలేక యందొప్పుచుండెను.

## బ్రహ్మాదులు రాధాదేవి మందిరమును జూచుట.

ఆచోటుగడచి యవ్వలంబోయిపోయి రాసేశ్వరియు, దేవాధిదేవియు, సమస్తగోపికానాథయు, శ్రీకృష్ణప్రాణాధికయు నై యసమానవిఖ్యాతి నందియున్న కరుణావారాశి రాధాదేవి నివసించు మనోహరదివ్యసౌధమును గాంచి యచ్చెరువందిరి. ఆమందిరమున శతమందిరము లిమిడింపఁబడియుండెను. రత్ననిర్మితవేదిక లందలరారుచుండెను. సువర్ణనిర్మితములు వరమణిఖచితములునగు కలశము లందమర్పఁబడియుండెను. దాని ప్రకాశము దశదిక్కుల వెలిఁగించుచుండెను. దానింజుట్టి ప్రాకారమొక్కండు గగనము నొరయుచుండెను. గంభీరపరిఖ యద్దానిం గాపాడ నమరియుండెను. సురతరువర నికరములు వలయాకారంబుగాఁ బెంపఁబడియుండెను. దాని విశాలము యోజనత్రయము మణివేదికలఁజెలఁగు ముఖ్యద్వారములు నాలుగు, అవ్వల మఱికొన్ని ద్వారములును గలవు. రత్నఖచితకవాటము లందొప్పు. సజ్జనావృతమై యారమ్యహర్మ్యము మునులకును దర్శింప వాంఛఁ బుట్టించుచుండును.

ఇట్లు పూర్వపుణ్యవిశేషమునఁ గన్పడందగు శ్రీరాధికాసౌధముం గాంచి కరముహర్షించి దానికిం బ్రదక్షిణం బాచరించి యద్దానిం గడచి యాదటఁ గొంతదూరమేగి యందందు గోపికాగోపకుల దివ్యాశ్రమములు గనంబడఁ గాంచుచు, నొకదానిని మించి యింకొకటి దృష్టులఁ బవిత్రములుగఁ

జేయ నద్భుతంపడుచు, నిట్లు గోలోకమంతయుం గలయం జూచిరి.

ఇవ్విధంబున హరిశతధృతిప్రభృతులు బ్రహ్మాండాసనముం గాంచి శతశృంగమహీధరంబు దర్శించి విరజానదిం దాఁటి యవ్వలిభాగము శూన్యంబుగఁ దోఁప నీఁక మీఁదిభాగ మగమ్యంబని భావించి మరలి గోలోకంబునకు వచ్చిరి.

ఆలోకమును శ్రీకృష్ణమూ ర్తి రాధికావాంఛితంబుఁ దీర్ప నిర్మింపఁజేసెను సకలశుభముల కయ్యది నిధి. సరోవర సహస్రము లందుండెను. ఆగోలోకంబు బ్రహ్మాండోపరిభాగంబున నుండుటంజేసి దానిపై నేలోకంబును లేదు. తదూర్ధ్వ భాగంబంతయు శూన్యంబై యంధకారావృతంబై యుండు. అది సృష్టి కతీతము. ఎవ్వారికే నగమ్యము. ఇది గోలోక వృత్తము.

## బ్రహ్మాదులు శ్రీకృష్ణమందిరముం జూచుట.

ఈవిధముగా నాబ్రహ్మాదులు గోలోకమంతయుం గల యందిరిగి మరలివచ్చి మున్నుచూచిపోయిన రాధాదేవీ మందిరమును బోడఁగాంచి యందుఁ బ్రధానభూతమగు ప్రథమ ద్వారముం గాంచి దానిరచనాచమత్కృతికి మెచ్చుచుఁ దదధి పతియై సకలమణిమయభూషణభూషితుఁడై కాంచనచేలమును ధరించి శ్రీకృష్ణభగవత్సేవాపరాయణుం డై లక్షగోపకులు తనుంగొల్వ నలరుచున్న వీరభానునిం జూచిరి. తమవచ్చినకా ర్యమెల్ల నాతనికిం దెల్పిరి. వీరభానుండు మహాత్ములారా! శ్రీ

హరి యానతిం గొనక యెరినేఁబోవనిచ్చు నధికారము నాకు లేదు. ఇంచుక యిటనుపవిష్టుల రగుఁడు. అని సవినయముగాఁ బ్రార్థించి తా నతిజవమునం బరుగిడి పరమాత్ముని యనుగ్రహము నొంది వేగంబ దేవదేవుని చెంతకుం బొండు. భగవంతుఁడు సాదరంబుగ నతివేగంబ మిమ్ముల రమ్మనె.

అన విని పరమానందభరితులై యటనుండి రెండవ ద్వారమును జేరి యందుఁ గడుం బాలుఁడయ్యును దేజశ్శాలియై యైదులక్షలగోపకులు సేవింప ద్వారపాలకుఁడై యున్న చంద్రభానుం గాంచిరి. ఆతఁడు బహుమానపురస్సరముగా గౌరవింప నటనుండి మూఁడవద్వారమును జేరి యందు నవరత్నకుండలముల కాంతులు గండభాగములనలంకరింపఁ గడు బాలుఁడయ్యు మురళియు, రత్నదండమును ధరించి ప్రతాపమున దేరి చూడరాక వీరులగు గోపకులు తొమ్మిదిలక్షలు గొలువ ద్వారపాధిపత్యమున నొప్పు సూర్యభానుంగని యాతనివినయమునకు మనము లలర నటనుండి కదలి నాల్గవకక్ష్యం జేరి నవమన్మథుఁడో యన నందమున ముదముంబొందఁ జేయుచుఁ బెక్కులక్షల గోపకులు సేవింప నున్న వసుభానునిం బ్రీతిమీఱఁ గని యతఁడు సమ్మానింపం దరలి యైదవకక్ష్యాంతరాళంబుం బొడఁగని యందుఁ గదంబపుష్పకాంతిఁ దిరస్కరించునట్టి ఛాయ నలరు కలశమును ధరించి కస్తూరికాపరిమళపరిమిళితచందనములంది, మయూరపింఛముం దాల్చిన కేశపాశముతో దశలక్షగోపాలబాలకులతో మహారాజువోలె రత్నమయాసనమున నుప

విష్టుండై భగవత్సాక్షాత్కరణసమాదరంబున నున్న ద్వారాధినేత దేవభాను దర్శించి యాతఁడు సత్కరింప భగవత్సందర్శన కుతూహలంబున వేగంబ యటనుండి కదలి షష్ఠకక్ష్యం జేరి శ్రీఖండపల్లవకపోలకుండలమండితుండై, దశలక్షగోపాలక సంసేవితుండై యుద్దామవైభవంబునఁ జూడఁదగియున్న శక్రభానుండను ద్వారాధిపతి దృష్టిగోచరుండు కాఁగా తత్సత్కారమున నలరుచు, నటనుండి కదలి సప్తమద్వారదేశంబుం గాంచి దానివైభవము నుతిపాత్రము కాఁగా అందున్న ద్వారనాథునిఁ, జారుచందనపరిలిప్తగాత్రుని, ద్వాదశలక్ష గోపాలసమాయుక్తుని, సుస్మితవక్త్రుని, రత్నభూషణహారకేయూరాభిరాముని రత్నభానుని సార్థకనాముని వేడుకమైఁగని, యతఁడాదరింప నతనినుచితభాషలం దేల్చి యటను నుండక శ్రీకృష్ణపరమాత్మను గాంచు వేడుక వేగిరింపఁ, గదలి పద సరసిజములు తడఁబడ నడచుచుఁ బోయి యష్టమద్వారము దృక్పథమునఁ బడఁగాఁ బరమానందమునందుచు, నందుఁ దిలకము ఫాలభాగమున కొంక వింత చెలువు గలిగింప ద్వాదశలక్ష గోపపరివృతుండై రత్నదండము హస్తదండమున నలర సుపార్శ్వుండను నున్న ద్వారపాలకుం గాంచి యంచితవిభవంబున నాతండు మన్నింప నలరుచు, నందుండి యవ్వలికి సాగి రత్నవేదుల నొప్పి, చందనమాల్యంబులఁ గనుపట్టుచున్న నవమద్వారంబు సందర్శించి సుబలుండను ద్వారపతిం గాంచి తత్పరిజనుల సంఖ్యవచింప నలవిగాకుండఁగా మెచ్చుకొనుచు, నతఁడనుమతిచేయ, నచ్చోటువాసి దశమకక్ష్య డాయం

బోయి, యనిర్వచనీయరూపుని, శ్రీకృష్ణసమానుని, వింశతి లక్షగోపాలబాలయుతుని సుదాముం డనువాని ద్వారపాలకుం గని యామహానీయుఁడు రత్నవేత్రమున దారిచూప, నవ్వలం బోయిపోయి పదునొకండవకక్ష్యం గనుంగొని నవమణి కుండలమండితుని, చందనచర్చాలంకృతుని, హారిహారిద్వస్త్ర ధరుని, కోటిగోపసేవితుని, రాధికాపుత్రసమానుని, శ్రీరామ నాముని, ద్వారపునిం బొడఁగని, యతఁడు సంభాషింపఁ దదనుమతింగొని పండ్రెండవద్వారము కడకుం బోయిరి. అందు మందారమాలతీ మల్లికాదిప్రసూనమాలికాభివేష్టిత కంధరుండై సకలరత్నభూషణములం దాల్చి బంగరురంగు వలువలుగట్టి శతకోటిగోపబాలురు నయనానంద మొసంగఁ గాంచి వారిసత్కృతులంబొంది యటగడచి యవ్వలం బోయి పోయి యట్టిరూపములనే వెలయుచుఁ బదుమూఁడవద్వారం బును గాచుచున్న శతకోటిగోపకులం బొడఁగని యవ్వల నట్టిదేయగు వైభవంబున నొప్పారు ద్వారద్వయంబునుమీఱి యంతఃపురము చెంత నలరు పదునాఱవమహాద్వారంబును దర్శించిరి.

ఆద్వారమశ్రుతాదృష్టపూర్వవైభవంబున మించుచుండెను. మణులచే నిర్మితములగు నఱఁగులచే వింతగొలుపుచుండెను. కవాటములు మేటిమణులచే ఖచితములై నేత్రపర్వములై యుండెను. రత్నపుత్రికలం దమర్పఁబడియుండెను. ఇంద్రనీల మణిగవాక్షము లొప్పుచుండెను. అందు రాధికాప్రియసఖిజన ములు లెక్కింపరాక కావలి కాచుచుండిరి. ఆద్వారంబుదాఁటి

యించుక లోనికిం బోవ నందు రతీకాంతను రూపమున గేలి సేయుచు భోగమున మహేంద్రాదుల లెక్కింపక వర్ణనాతీత భూషణములధరించి స్వప్నమునందైనఁ జూడఁజాలని యట్లున్న గోపికల బహులసంఖ్య నలరువారిం గాంచి పులకాంచితవిగ్రహులై శ్రీకృష్ణసందర్శనంబుఁ గోరుచు భక్తిచే శీర్షములు వంచి ముందునకు నడచి యందలి సౌధవరంబులఁ గాంచి విస్మయ మొందుచుఁ దన్మధ్యస్థలంబున శ్రీ కృష్ణమూర్తి వాసార్హమై యొప్పు సౌధవర్యమును దర్శించి.

## శ్రీకృష్ణమూర్తి సౌధవర్ణనము.

* ఆసౌధమున వజ్రములు నడుమనడుమ పొదిగినయింద్ర నీలమణిస్తంభములు పెక్కులు వెలయుచుండెను. రత్నములచే నిర్మింపఁబడిన కుడ్యములు మహోత్సాహమును గలిగించుచుండెను. మణినిర్మితకలశము లమర్పఁబడి చూపఱకు భాగ్యవిశేషమును దెలుపుచుండెను. మందారపారిజాతాదిసురతరుపుష్పమాలిక లందుఁ గన్పట్టుచుండెను. చతుశ్శాల లెన్నియే నందుఁ దోఁచుచుండెను. మణిదర్పణంబులు నిలుపఁబడి యుండెను. ఇంద్రనీలములఁ బత్త్రములుగా నొనరించి తోరణములు కూర్పఁబడి వానిచే నలంకరింపఁబడి యుండెను. అవిరసాలపల్లవ

---

* అమూల్యరత్నసారాణాం సారేణ రచితంపరమ్. నానారత్నమణిస్తంభై ర్వజ్రయుక్తై శ్చ భూషితమ్. పారిజాత ప్రసూనానాం మాలాజాలై ర్విరాజితమ్. అని మూ. ౫ అధ్యా. ౨౦ శ్లో.

ములు నాఁ దగియుండెను. ఇంకను వర్ణనాతీతవస్తువిశేషసంభరితమై యాసౌధ మొప్పులకుప్ప యన నొప్పుచుండెను. దాని ముంగిటిభూమి దర్శింపఁ దగియుండెను. అట్టి శ్రీకృష్ణదివ్యభవనము నేత్రములఁ బవిత్రములఁ జేయ వా రెంతయు సంతసించిరి.

ఏసౌధమును దర్శింప భక్తవరులు తత్తఱపడుచుందురో, ఏది యనేకజన్మపుణ్యపరిణామమునఁ గాననగునో, ఏయది బ్రహ్మాండాంతర్భ్యాతముఁగాక సామాన్యపుణ్యవంతుల కగమ్యమగునో, ఏది వర్ణింప శేషాహికిని, భాషాయోషామణికి నశక్యమై యుండునో,ఏపుణ్యగేహము భక్తజనమాత్రగమ్యమో యద్దాని నసదృశవైభవమున నలరుదాని శ్రీకృష్ణవాంఛానిర్మితమై యలరుచున్న దానిం జూచినంతనే వారి యానందమునకు మేరయే యారయ లేకుండెను.

అందుఁ గొందఱు భక్తులు వీణారవంబుల శ్రీకృష్ణమహిమములఁ దెలుపునట్టి పాటల శ్రోతలకు సంతసము నొదవించుచుండిరి మఱికొందఱు చతుర్విధవాద్యముల వాయించుచుండిరి. మఱియుఁ గొందఱు తదర్థముల నభినయించుచుండిరి. శ్రీకృష్ణతుల్యరూపముల వెలయు గోపకులు గోటిమంది యందుండిరి. శ్రీరాధాంబాసమానాకృతుల నొప్పు గోపికలు కోటిమంది యొకచోఁ గూరుచుండియుండిరి.

అట్టి యపూర్వశృంగారరాశియై భక్తిరసపరిపూర్ణహృదయులకుగమ్యమనం దగిన యాసౌధవరమధ్యభాగంబున నొక్క

రమ్యతమసింహాసనంబున నద్భుతంబగు తేజోరాశిం గాంచిరి. తద్దర్శనంబున నొడలు కంపింప రోమాంచము లంకురింప నయనోత్పలంబు లానందపారవశ్యమున ముకుళింప బ్రహ్మాదులు కేలు మోడ్చి సాష్టాంగ నమస్కారణము లాచరించి యించుక సమీపించి నిలిచిరి.

## బ్రహ్మ శ్రీకృష్ణు నుతియించుట.

* ఓపరమేశ్వరా! జగంబులనెల్ల వ్యాపించి వరేణ్యుండవై వరదుండవై సకలభూతకారణుండవై తేజోరూపుండ

* వరంవరేణ్యం వరదం వరదానాం చ కారణమ్, కారణం సర్వ భూతానాం తేజోరూపం నమామ్యహమ్. ౯౩. మంగళం మంగళానాం చ మంగళం మంగళప్రదం, సమస్తమంగళాధారం తేజోరూపం నమామ్యహమ్. ౯౪. స్థితం సర్వత్రనిర్లిప్త మాత్మరూపం పరాత్పరం, నిరీహమవితర్క్యం చ తేజోరూపం నమామ్యహం. ౯౫. సగుణం నిర్గుణం బ్రహ్మ జ్యోతీరూపం సనాతనం, సాకారంచ నికారం చ తేజోరూపం నమామ్యహమ్. ౯౬. తమ. నిర్వచనీయం చ వ్యక్త మవ్యక్త మేకకం, స్వేచ్ఛామయం సర్వరూపం తేజోరూపం నమామ్యహమ్. ౯౭. గుణత్రయ విభాగాయ రూపత్రయ ధరం పరం, కలయా తే కృతా స్సర్వే కిం జానంతి శ్రుతేః పరం. ౯౮. 'సర్వాధారం సర్వరూపం సర్వ బీజమబీజకం, సర్వాంతక మనంతం చ తేజో రూపం నమామ్యహం. ౯౯. లక్ష్యం షడ్గుణ రూపం చ వర్ణనీయం విచక్షణైః, కింవర్ణయామి లక్ష్యంచ తేజోరూపం నమామ్యహం. ౧౦౦. అశరీరం విగ్రహావదింద్రియం యదతీంద్రియం, యదసాక్షీ సర్వసాక్షీ తేజోరూపం నమామ్యహం. ౧౦౧. గమనార్హ మపాదం యదచక్షుః సర్వదర్శనం,

వగు నీకు నమస్కారములు. సనాతనుండవై యజుండవై, యమృతుండవై సాకారనిరాకారరూపముల నొప్పి వ్యక్తావ్య

---

హస్తాస్యహీనం యద్భోక్తృ తేజోరూపం నమామ్యహం. ౧౦౨. వేదే నిరూపితం వస్తు సంతః శక్తాశ్చ వర్ణితుం, వేదే నిరూపితం యత్త త్తేజో రూపం నమామ్యహం. ౧౦౩. సర్వేశం యదనీశం య త్సర్వాది యదనాది యత్, సర్వాత్మక మనాత్మం యత్తేజో రూపం నమామ్యహం. ౧౦౪. అహం విధాతా జగతో వేదానాం జనకస్స్వయం, పాతా ధర్మోహరో హర్తా స్తోతుం శక్తా న కేపియత్. ౧౦౫. సేవయా తవ ధర్మోఽయం పాలనే చ నిరూపితః, తవాజ్ఞయా చ సంహర్తా త్వయాకాలే నిరూపితే. ౧౦౬. నిశ్శేషోత్పత్తి (నిషేకలిపి) కర్తాహం త్వత్పాదాంభోజసేవయా, కర్మిణాం ఫలదాతా చ త్వం భక్తానాం చ నః ప్రభుః. ౧౦౭. బ్రహ్మాండే బింబసదృశే భూత్వా విషయిణోవయం, ఏవం కతివిధా స్సంతి తేష్వనంతేషు సేవకాః. ౧౦౮. యథా నసంఖ్యారేణూనాం తథా తేషా మణీయసామ్. సర్వేషాం జనక శ్చైకో యస్తం స్తోతుం చ కే క్షమాః. ౧౦౯. ఏకైకలోమ వివరే బ్రహ్మాండమేకమేకకమ్, యస్యైవ మహతోవిష్ణో ష్షోడశాంశ స్త వైవ సః. ౧౧౦. ధ్యాయంతే యోగిన స్సర్వే త వైతద్రూప మీప్సితమ్, తద్భక్తదాస్యనిరతా స్సేవంతే చరణాంబుజమ్. ౧౧౧. కిశోరం సుందరతరం యద్రూపం కమనీయకం, మంత్రధ్యానానురూపం చ దర్శ యాస్మాక మీశ్వర. ౧౧౨. నవీనజలదశ్యామం పీతాంబరధరంవరమ్. ద్విభుజం మురళీ హస్తం సస్మితం సుమనోహరం. ౧౧౩. మయూర పింఛచూడంచ మాలతీ జాలమండితం, చందనాగురుకస్తూరీ కుంకుమద్రవ చర్చితం. ౧౧౪. అమూల్య రత్నసారాణాం సారభూషణభూషితం, అమూల్య రత్నరచిత కిరీట మకు టోజ్జ్వలమ్. ౧౧౫. శరత్ప్రఫుల్లపద్మానాం ప్రభా మోష్యాస్యచంద్రకమ్, పక్వబింబసమానేన హ్యధరోష్ఠేన రాజితమ్. ౧౧౬. పక్వదాడిమబీజాభదంత పంక్తి మనోహరం, కేళీ కదంబ మూలేచ స్థితం రాసరసోన్ముఖమ్. ౧౧౭.

క్తరూపుండవై, యనాదివై, యేకాకివై యలరు నీకు వందనములు. జగత్సృష్టిస్థితిలయముల నొనరించు కోరిక గుణత్రయవిభాగంబు సేసి మూర్తిత్రయమును గ్రహించిన యమితతేజునకు నమస్కరించెదను. మహానుభావా! నీకళాంశములే యీ జనులగుదురు. అట్టి సర్వాతీతుని, శ్రుత్యతీతుని, నుతింప నే నెంతవాఁడను? భగవంతా! జగత్సర్వబీజుండవు, తలంపఁగా నబీజుండవు, సర్వవాచ్యుండవు, సర్వాధారుండవు, జగత్సంహారకర్తవు, అనంతుఁడవు, అరూపుఁడవు, అఖిలరూపుఁడవు, సర్వసాక్షివి, అసాక్షివియు నగు నిన్ను స్తుతించెదను పాదములు లేక నడవఁ గలవు. నేత్రములు లేక చూడఁగలవు. హస్తములు లేక పనులు చేయఁగలవు. ముఖము లేకమాటలాడఁ గలవు ఇట్టి నీమహిమము నెఱుంగక మ్రొక్కెద. సర్వాత్మకుఁడవయ్యు ననాత్మ వగుదువు. అతీంద్రియుఁడవయ్యు నింద్రియుండ వగుదువు. అశరీరివయ్యు శరీరి వగుదువు. ఇట్టి నీమహాత్వ మెఱుంగ నశక్యంబు. కావుననే నేమియుఁ దెలిసికొనఁజాల నని యిదె యంజలి ఘటించుచున్నాఁడ. ఓసర్వేశ్వరా! గుణరూపములుగల వస్తువును బండితులు వర్ణింతురు. గుణరూపవిహీనుఁడ వగు నిన్ను వర్ణించు టెట్లో తెలియనేర కున్నాఁడను.

---

గోపీవక్త్రస్మితతనుం రాధావక్షస్థలేస్థితం, ఏవం వాంఛిత రూపం తే ద్రష్టుం. కో వా న చోత్సుకః.౧౧౭. ఇత్యేవ ముక్త్వా విశ్వసృట్ ప్రణనామ పునః పునః, ఏవం స్తోత్రేణ తుష్టావ ధర్మోఽపి శంకర స్స్వయమ్. ౧౧౮. బ్రహ్మవైవర్తపురాణే, శ్రీకృష్ణజన్మఖండే, పంచమాధ్యాయాంతర్గత ' స్తుతి రియమ్.

కాన జోహారు పొనరించెద. ఓమహాత్మా! వేదనిరూపితవస్తువు నుతింపఁదగియుండు. వేదవితతియే నిరూపింపలేని నిన్నెట్టు లీవిధముగ నున్నాఁడ వని నుతింపఁ గలను? ఓజగన్నాయకా! జగములకు వేదవ్యూహమునకు నేను జనకుండను. ఈధర్ముఁడు రక్షించువాఁడు. ఈపరశివుఁడు లయకర్త ఇట్టిమామువ్వురకు నీమహిమ మెఱుఁగరాదే? ఇంక నెవ్వఁ డెఱుఁగఁగలఁడు? ఇట్టి యచింత్యమహిమమునకు నీకు జేజేలు సమర్పించెదను. రాధానాథా! నాకును, ధర్మునకును, బార్వతీజానికిని సృష్టిస్థితిలయకర్తృత్వములులభించుటమీపాదారవిందసేవాసమాలబ్ధపుణ్యవిశేషంబునఁ గాక మఱే హేతువు కలదు? అట్టి కరుణారాశికి నీకు సాష్టాంగదండప్రణామంబు లాచరించెదను. దేవదేవా! ఈబ్రహ్మాండమున బాలకులవలె విషయాసక్తులమై నిన్ను నిరంతరము సేవించుచున్నారము. ఇట్టి బ్రహ్మాండము లనేకములుగలవు. అందు మావంటిపాదసేవకులు పెక్కుమంది యుండురు. వారెల్లమాకంటె నధికులగుదురు. మేము వారికంటె నత్యల్పులము. నీవు సర్వజనకుండవు. కరుణానీరరాశివి. సకలకర్మఫలప్రదాతవు. సత్కర్మముల నొనరించి తత్ఫలములఁ బొందఁ జాలని వారము. భక్తులమని మమ్మనుగ్రహింపఁ దగుదువు. అచింత్యమహిమా! నీరోమకూపము లెన్నియో, అన్ని బ్రహ్మాండములుండును. అట్టి నిన్ను స్తుతులఁ దనుప నేనెంతవాఁడను? వైకుంఠలోకమున నలరు విష్ణువు నీపదునాఱవకళయ యగు. ఇట్టి నీమహిమ

మెఱుంగ నేనెట్లు నేర్తు? యోగీశ్వరేశ్వరా! భక్తిమై యోగు లందఱు నిన్ను మనఃపద్మస్థితుంగాఁ జేసికొని నిరంతరము భజించుచుందురు. పుణ్యాత్ము లెవ్వరో వారు నీపాదధ్యాన మొనరింపఁ గల్గుదురు. మంత్రవిదులు మంత్రప్రతిపాదితభవదీయ బాలరూపమును ధ్యానింతురు. అట్టి సురుచిరతేజోవంతమగు భవదీయబాలరూపమును మాదృష్టుల యెదుట నునిచి మమ్ము ధన్యులం జేయుము. నీలమేఘమువలె నలరుచు, భుజద్వయ విరాజితంబై, పీతాంబరాలంకృతంబై, సుస్మితవిభాసురంబై, వేణువిరాజితంబై, మయూరపింఛాలంకృతంబై, మాలతీకుసుమదామాంచితంబై, దివ్యచందనకస్తూరికాదుల పూతలుగలిగి, సకలభూషణభూషితంబై మనోహరంబయి వెలయు నీరూపంబును జూపి మ ముద్ధరింపుము. వ్రజాంగనలు సేవింప రాధాదేవి సంతసమున విహరింపఁ గోఁట్ గోటిసూర్యప్రభాభాసురంబై తనరారు. నీమృదులాంగమును దృష్టిసాఫల్యముగఁ జూడఁ గోరెదము.

అని యిట్లనేకభంగుల వినుతించి విరించి సముచిత భక్తిరసపరిపూర్ణమానసుండై మఱిమఱి నమస్కరించెను. ధర్ముఁడు పరశివుఁడు నట్లె నమస్కరించిరి. ఇట్లు విరించి శంకరులు ధర్ముఁడు నొనరించిన యీ స్తవరాజమును శ్రీకృష్ణపూజా కాలమున నెవ్వరు పఠింతురో వారికిఁ గృష్ణభక్తియు, వాంఛాఫలసిద్ధియుఁ గల్గును. మోక్షలక్ష్మి యాభక్తులం బొందు.

## శ్రీకృష్ణమూర్తి బ్రహ్మాదులయెదుట సాక్షాత్కరించుట.

ఇట్లు లాదేవోత్తములు చిత్తముల భగవద్దర్శనమును గాంక్షించుచు ముకుళితకరసరసిజులై నిలిచియుండిరి. వారి స్తుతి శ్రీకృష్ణమూర్తి మనోవీథిఁ జేరెను. దాన భగవంతుఁడు సంతోషించెను. వెంటనే యాతేజోరాశి మధ్యభాగమున నీల నీరదశ్యామతనుండై, శారదనిశాకరసంకాశవదనుండై, మాణిక్య వేణుమనోహరనిస్వనపరిలసద్బింబాధరుండై, కరుణాకటాక్షపరిభాసురనయనారవిందుండై, తప్తకాంచనచేలుండై, రత్నకుండలకేయూరకటకాదిభూషణభూషితుండై, భక్తవాంఛాఫలదాననిరతుండై సాక్షాత్కరించెను.

ఇవ్విధంబునఁ బొడసూపిన శ్రీకృష్ణపరమాత్మ దివ్యమంగళవిగ్రహమును గాంచి యామహనీయమూర్తి పార్శ్వంబునఁ బ్రాణేశ్వరకరుణాపరిపూర్ణనయనప్రభాపాత్రభూతయై, కరుణాంబుధియై,సుందరతనువల్లియై, భక్తవాంఛలనొసంగుచునీప్సితమున వెలయు రాధాదేవిం గనుంగొనిరి. ఆమె సర్వాంగసౌందర్యము వర్ణనాతీతము. ఆదేవిని శ్రుతులు వర్ణింపజాలవన నితరులమాట యిట నేటికి? ఏ యే యవయవ మెట్లెట్లుండవలయునని శాస్త్రములు మొత్తి యిడుచున్నవో, అట్టిశాస్త్రములకు శాస్త్రము లనఁదగియుండెను. ఆరాధామాధవులం గాంచినంతనే వారి నయనారవిందములు సంతోషాంబుధి నోలలాడసాగెను. ఒడలు తెలియక మ్రాన్పడిన ట్లుండెను. ఇంచుక యిట్లుండి

కృతార్థులమైతిమని భావించుకొనుచుఁ గేలుమోడ్పులొప్ప నిలువంబడి యిట్లని ప్రార్థింపఁబూనిరి. అందు విరించి యిట్లనియె.

## బ్రహ్మాదులు శ్రీకృష్ణుం బ్రార్థించుట.

ఓసర్వేశ్వరా! భవదీయపాదారవిందసందర్శనమున నా మనంబు పట్టుదమైనది. భవసాగరమును దాఁటుటకు మీపాద స్మృతి నౌకయగును. శాశ్వతభక్తిని బ్రసాదింతురుగాక! అంత శంకరుం డిట్లనియె. పరమేశ్వరా! నాచిత్తమీనము భవాం బుధి స్మనింగి యందే విహరించుచున్నది. ఈచిత్తమీనమును దరిఁజేర్పుము. నిరుపమానభవదీయసేవాసాయుజ్యము నొసం గుము. అంతట ధర్మ్యం డిట్లు వేఁడెను. ఈశ్వరా! నీపాదభక్తి సంసృతిసంజాతఘోరతాపనివారకము. ధన్యము. సర్వజన సమ్మాన్యము. కావున నట్టి భవదీయపాదనిరతిం గాంచి నా చిత్తము వెలయునట్లనుగ్రహింపుము.

## శ్రీకృష్ణుఁడు దేవాధిపతుల నాదరించుట.

అనఁగా మిగుల సంతోషించి యాపరమేశ్వరుండు 'బృందారకేంద్రులారా! మీరు నావారు. సంశయమే లేదు. చెంతకురండు. మత్పదాశ్రయు లగు మీకుఁ గుశలమా' యని ప్రశ్నింపనేటికి? పరితాపము లన్నియుఁ దొలంగును. నేను మీకు సాయముచేయ సిద్ధముగనుండఁ జింత యిఁకనేటికి? మీస్తుతికిఁ జాల మెచ్చితిని. దర్శన మొసంగితి. మీరు వచ్చిన

పని యింతకుముందే యెఱుంగుదును. దిక్పాలకులారా! ఆలకిం పుఁడు. కాలానుసారము శుభాశుభకర్మములు పొసఁగుచుం డును. కాలమే సర్వము నధీనము చేసికొని నిరంకుశముగాఁ బ్రవర్తిల్లుచుండును. తరువులు, లతలు ఆయా కాలమునందుఁ బుష్పించినట్లు కాలానుసారము శుభాశుభకర్మములు వ్యాపిం చుచుండును. శుభాశుభములు, ఆపత్సంపదలు, సంతోషదుఃఖ ములు కాల నిబద్ధములని యెఱుంగుఁడు. ఫలకాలమురాక యవి ఫలింపవు. కార్యము ననుసరించి శత్రుమిత్రభావములు గలుగుచుండుట చూడలేదా? ఇంద్రాదు లెందఱు మీరు చూచుచుండఁ జనిరో మీ రెఱుఁగుదురుకదా! కాలముగదా దానికిం గారణము. మీరీలోకమునకు వచ్చినప్పటినుండి యీ కొలఁదికాలమున స్వర్గమున మనువులు, ఇంద్రులు ఏడుమంది గతించిరి అష్టముఁడగు నింద్రుఁడిపుడు స్వర్గముననున్న వాఁడు. మీరిటవచ్చునపు డుండినవాఁ డిపు డొక్కరుఁడును లేఁడు. వీరందఱు కాలవశంగతులు గాన నింతలోనే గతించిరి. కాలము పరమేశ్వరరూపము. దాని కందఱు లోఁబడుదురు.

ఇప్పటిరాజులు పాపాత్ములు. స్వేచ్ఛాప్రవర్తకులు. బల పరాక్రముల విఱ్ఱవీఁగువారు. వీరును గాలనిబద్ధులే. ఐన నా విషయమెఱుంగరు. వారికి మరణకాల మాసన్నమగుచున్న యది. నాయాజ్ఞారీతిగనే వాయ్వాదులు చలించుట లోనగు కృత్యములఁ జేయుచుండుదురు. వీరు పారదనేల. యంద

ఉను మదాజ్ఞాయత్తులే. కర్మకర్తను నేనె. కర్మఫలప్రదుఁడను నేనే. నియతకర్మములచే ధర్మరక్షణము చేయువాఁడను నేనే ధర్మరక్షచేఁ బ్రజలఁ బ్రవర్తింపఁజేయువాఁడను నేనే. నేను వధింపఁబూనుచో వాని రక్షించువాఁ డీలోకమున లేఁడు. రక్షింపఁబూనిన వాని నశింపఁజేయువాఁడును లేఁడు. సృష్టిస్థితిలయములఁ గాలోచితముగ నేనే యొనరించువాఁడను. నాభక్తుల జోలికిం బోవువారిపీఁచ మడంతును. వారి రక్షణతత్పరుండనై యుండుదు. దానిని మించినపని యొండు లేదు. జ్ఞానులు నాసేవం గోరుదురు. మూఢులు నాచే వంచింపఁబడుదురు. నరకభయము నాభక్తులకు లేదు. నాసేవకులకుఁ బుణ్యపాపరూప సుఖదుఃఖానుభవములు నాచే నపహరింపఁబడు. నాసుదర్శనం బనఁబరఁగు చక్రంబు నాశాసనంబున నా భక్తుల చెంతనే మసలుచుండును. ఈలోకమున వైకుంఠమున నాకు నిలుకడలేదు భక్తులమానసమే నాకు నిత్యవాస స్థానము. ప్రాణాధికయగు నీరాధయు, భార్గవియుఁ, బ్రాణసములగు మీరును భక్తులకన్న మిన్నగ నెన్నఁబడరు. భక్తులు సమర్పించిన పదార్థమల్పమైనఁ బ్రియము మీఱ నారగింతును. భక్తులుగానివా రొసంగిన దెట్టిపదార్థమైన దూరముగాఁ ద్యజింతును. భార్యాపుత్రమిత్రబంధుజనుల నందఱవదలి నన్నే సేవించువారిని సదా రక్షించుచు వారిచెంత నుండుదు. మిన్నైన వదలుదుంగాని. వారి నెడఁబాయను. ఇట్టి నాభక్తుల కపకారము చేయువారు వినాశము నొందుచుండఁ గాపాడువారును గలరే? దేవతాశ్రేష్ఠులారా! మే మిరువురము మీ

వెంటఁ జనుదెంచి ధాత్రి నవతరింతుము. మీ రుద్వేగముల మాని మీమీ నిలయంబులకుఁ బొండు.

## ―― రాధను వృషభానునింట జన్మింప నియోగించుట. ――

అని దేవతావరు లలరం బలికి శ్రీకృష్ణమూర్తి గోప గోపికల నెల్లం జక్కఁజూచి మీరెల్ల వేగంబ భూలోకంబున నందవ్రజంబునం బుట్టుఁడు. నాసేవానిరతియందును మీకుం గలుగుచుండు. సంశయింప నక్కఱలేదు. నేనును మీ చెంత నుండ నవతరించెద.

అని రాధాదేవిం గాంచి సాధ్వీ! నీవు నాయానతిమై భూలోకంబున వృషభానునింట నవతరింపుము. ఆతఁడు మహా నుభావుఁడు. పుణ్యపురుషులయం దుత్తమోత్తముఁడు. ఆయన భార్య సుబలపుత్రికయగు కళావతి. సాధ్వీతిలకమనం బ్రఖ్యాతి నొందినది. ఆమె సామాన్యురాలని భావింపకుము. రమాంశ మునఁ బుట్టిన గుణమణి. సుశీలమున నామెంబోలు వారుండఁ బోరు. ఆకళావతి పితృదేవతలకు మానసపుత్రిక. యోషా భూషణమనం జెల్లు. అట్టిసాధ్వియు దుర్వారంబగు దుర్వాసుని శాపంబుం గాంచె. ఆశాపంబు లోకాపకారము సేయ నీయఁ బడియె. దానంజేసి కళావతీనామంబున నందవ్రజంబునఁ బుట్టు వుం గాంచి యున్నయది. నీవును నందవ్రజంబున నాకళావతికిం బుత్రికవై యవతరింపుము. నన్ను వదలియుండనోపవని నే నెఱుంగుదు. నిన్ను వదలి క్షణమాత్రమైన నే నుండఁజాలు

దునే. కాఁబట్టి నేను బాలకృష్ణరూపంబున నందవ్రజంబున నలరారు నిన్నుం బరిగ్రహించి గోలోకవాసమున ననుభవించు సుఖములఁ గొఱంత లేకుండ ననుభవింపఁజేసెద. ఇంచుకయు సంశయింపకుము. శీఘ్రంబ నేను నవతరింతును. భక్తులు మన రాకకై కాచియున్నవారు. మన మవతరించి దుష్టశిక్షణ రూపధర్మంబును బ్రతిష్ఠించి సాధుబాధల నడంపవలయు. హృదయేశ్వరి! నాప్రాణాధికవు నీవు. నీప్రాణాధికుఁడను నేను. మన కభేదంబుగదా. దేహమొక్కటియే గాన దీని వేఱు చేయ నశక్యంబు.

అని శ్రీకృష్ణపరమేశ్వరుం డాజ్ఞాపింప నారాధాంబయుం బ్రాణేశ్వరు నానతి శిరసావహించి భగవన్ముఖాబ్జబింబంబుం దనివిదీఱఁ గాంచి మీయానతి నెఱవేర్చెద నని పలికి గోపికలం గాంచి మధురతరోక్తుల నిట్లనియె. గోపికలారా! మీరీలోకంబున నన్నుం గొలిచి భగవంతుని సేవించినట్లే భూతలంబున నవతరించు మాయిరువురను సేవించు పొంటె నందవ్రజంబున గోపిక లనుపేర నవతరింపుఁడు మీకు మా సేవాసుఖంబందును గొఱంత లేక లభింపఁగలదు.కావున వేఱుగ భావింపక వేగంబ యవతరింపుఁ డని వార లూఱడిల్లం బలికి వారి సమ్మతిం దెలిసికొని ప్రాణేశ్వరా! మీయానతి నవతరించెద. వేగంబ యట మీసేవ నాకుం గలుగవలయు. భక్తరక్షణకృత్యంబుల మఱువక యవతరించి బాలకృష్ణరూపంబున నన్నుం గలిసి యుండవలయు నని వేఁడెను. పరమపురుషుండు

సుస్మితంబు. ముఖంబునం జిందులాడ నక్లే యని రాధను బర
మానందపరిపూర్ణమానసం జేసెను.

## శ్రీకృష్ణు దర్శింప లక్ష్మీసరస్వతులంగూడి నారాయణమూర్తి వచ్చుట.

ఇట్లు భగవంతుఁడగు శ్రీకృష్ణుఁ డాజ్ఞాపించునంతలో దివ్యస్యందనసమారూఢుండై పెక్కుచామరములచే వీవఁ బడుచు శతకోటిసూర్యప్రభాభాసమానుండై శంఖచక్రగదా పంకజములు నాల్గుహస్తముల వెలుంగ, నవరత్నమకుటంబు మనోహరముగా వెలయంగఁ గాంచనచేలంబు ప్రకాశింప వన మాల వక్షస్థలంబునఁ గాంతులసీనుచుండ, గుండలరోచులు గండస్థలములఁ జిందులాడఁ భక్తరక్షణసమాదరంబు మనంబు నిండ వెలుంగు నారాయణుండు సమాదృతస్థానుండు ప్రత్యక్ష మయ్యెను.

అమ్మహాపురాణపురుషుని వామభాగంబున సకలభూషణ భూషితాంగలతయగు సరస్వతీదేవియు, దక్షిణభాగంబున భూషణంబుల శోభిల్లఁజేయు తనువల్లిక యలరవెలయు లక్ష్మీ దేవియు నుండిరి. ఈరీతి వైకుంఠవాసియగు నారాయణ మూర్తి సరస్వతీభార్గవీసమేతుండై యరుగుదెంచి బ్రహ్మాదిదేవ తలును, గోపకులు, గోపికలును, సత్వరంబుగ లేచి వేదమంత్రం బుల వినుతించుచుఁ దదేకదృష్టి నవలోకించుచుండ నాశ్చర్య జనకంబుగా నాశ్రీకృష్ణుని దివ్యమంగళవిగ్రహంబున విలీనుం

డయ్యెను. బ్రహ్మాదు లావిధముం బిలకించి విస్మయంబుఁ నొందిరి

## విష్ణువు కృష్ణునియందు నిలీనుఁ డగుట.

ఆసమయంబున శ్వేతద్వీపనివాసియగు శ్రీమహావిష్ణువు దర్శనీయరూపుండు పుణ్యరాశిసముపలబ్ధనుండు, సకలదేవతా వినుతుండు, భక్తవాంఛాప్రదాననిరతుండు కాంచనరథంబును దిగి వచ్చి దేవతాధిపులంద ఱిది యేమని చూచుచుండ రాధాధిపుఁడగు శ్రీకృష్ణపరమాత్మయందు నేకత్వముం బొం దెను.

ఇట్లు వైకుంఠలోకశ్వేతద్వీపవాసులగు నారాయణ మహావిష్ణువులు గోలోకనివాసిరై శ్రీరాధానాథుండగు శ్రీ కృష్ణునియందుఁ బ్రవేశించిరి. ఇట్లగుటం గన్నులలరంగాంచు సరసిజాసనాదు లాశ్చర్యమున నిదేమని నిర్ణయింపనేరక చిత్ర ములగతి నట నూరకుండిరి.

పాఠకులారా! ఈగాథం జదివిన మది సందియము గదు రకపోదు. దీనియంతరార్థమేమో గమనింపుఁడు. విష్ణునారా యణశ్రీకృష్ణు లొక్కరూపమే యని విశ్వసింపుఁడు. భక్త వాంఛాపూర్తినొందింప ననేకలోకంబుల ననేకనామంబులఁ బ్రకాశించు విరాట్టుమహిమ నుతియింప నెవరు నేర్తురు? బ్రహ్మాదు లచ్చెరువందిరన నిఁక దక్కుంగలవారి నడుగనేల? భక్తు లెట్టెట్టిరూపమున ధ్యానింతురో ఏయేలోకమున

వారియమోఘాశీర్వాదంబులం గైకొని వారలతోడి సరససల్లాపంబులం బ్రొద్దుపుచ్చుచుండిరి.

సదంపడి గోపికలామూలప్రకృతికి భయభక్తులొప్ప నమస్కృతు లొనరించి తదాశిషంబులం బడసి కనకమయ సింహాసనంబున నాలోకజనని నాసీనం జేసిరి. అపుడు పార్వతీ లక్ష్మీసరస్వతులు ముప్పురు నేకాసనాసీనులయి యిష్టాలాపంబులం బ్రొద్దుపుచ్చుచుండిరి.

భక్తజనులారా! ఈకథనుండి గ్రహింపఁదగువిషయమేమి? శ్రీకృష్ణుఁడే సగుణబ్రహ్మము. యోగమాయయే మూలప్రకృతి. ఆమెయే హరిహరవిరించుల నిర్మించె. లక్ష్మీపార్వతీ సరస్వతు లామె యపరస్వరూపలే. అనఁగా లక్ష్మీపార్వతీసరస్వతుల కించుకంతయు భేదములేదు. హరిహరధాతలకు నభేదమే వీరు సగుణబ్రహ్మాంశములే. ఒక్కొక్కరూపంబున సగుణబ్రహ్మము ప్రపంచమున వెలయుచుండును. బ్రహ్మాండములన్నియుఁ దదిచ్ఛావిలసితములు. తద్భిన్న మిాపత్తునులేదు. అట్టి శ్రీకృష్ణపరమాత్మను బాటించుట యిహపరసాధనము. యోగమాయ యన వేఱని భావింపరాదు. తదిచ్ఛయే. ఆమెయే ప్రకృతి. తదన్వితుఁడే సగుణబ్రహ్మము ఆమూర్తియే యుపాస్యము. స్తుత్యము పూజ్యము. ధ్యానైకగమ్యము. ఈ సగుణబ్రహ్మమే ప్రపంచనివృత్తుఁడై విరాట్టువనంబరఁగు. ఆతత్త్వమునకు రూపనామములు లేవు తేజోరూపమని, జ్ఞానరూపమని, ఆనందరూపమని యెన్నియోరీతుల శ్రుతులు పలుకుచుండు. సర్వవ్యాపి, సర్వాంతర్యామి, సర్వసాక్షి యను

మొదలగు నామము లామహాత్మునకే చెల్లును. ఆవిరాట్టు సృష్ట్యున్ముఖుఁ డయ్యెనా ప్రపంచములలరారు. నివృత్తుఁ డయ్యెనా సర్వము లయించు. ఇట్టి యవాఙ్మానసగోచరంబగు తత్త్వంబునెఱుంగ సామాన్యులతరంబె. తదిచ్ఛయే మాయ. ఆమెయే ప్రకృతి తత్కృతమే ప్రపంచము.

ఈవిషయమును జక్కఁగా నాలోచింప హరిహరాది విభేద మేలోకమున నుండునో తెలియకున్నది. అల్పబుద్ధులయి దేవతలం దుచ్చనీచత్వముల నెలకొల్పి పోటులాటకుం బూని పాపము నొడిగట్టికొనుట కంటె వెఱ్ఱితన మేమున్నది?

ఆపరమేశ్వరుఁ డీశ్వరుఁడా, విష్ణువా, రెండును అని చెప్పవలయునా? రెండును గాఁడనవలయునా. అన్నచోఁ బున్నపుంసకస్త్రీలింగశబ్దములచే వ్యవహరింపఁబడు నాపర మాత్మయందే భేదములు గల్పింప నశక్యంబు. ఏమానవుఁ డేరూపంబున ధ్యానించిన నారూపమున నాపరమాత్మ భక్తు నను గ్రహించు. ఈనియమంబు పాటించి భజించువాఁడే కృతార్థుఁడగు. లేనిచోఁ దత్ఫలము వేఱువిధముగా ననుభవించును. ఇంక నవ్వాలిపుణ్యవృత్తాంతమును జిత్తగింపుఁడు.

## { లక్ష్మీప్రభృతుల భూతలంబున జన్మింప శ్రీకృష్ణమూర్తి నియోగించుట. }

ఇట్లు దేవతలంద ఱుపవిష్టులై యానందపరవశులై యుండఁగా శ్రీకృష్ణమూర్తి చిఱునవ్వు మోమునఁ జిందు

లాడుచుండ * లక్ష్మీదేవిం జూచి ఓభార్గవీ! నాయానతి నీవు భూలోకంబునకుం బోయి విదర్భదేశాధిపతి యగుభీష్మకునకుం బుత్త్రికవై జన్మింపుము. నీవు నన్ను వదలియుండ నోపవని యెఱుంగుదు. నేను నీవుండు కుండినపురంబునకు వచ్చి నిన్నుం బెండ్లియాడెద. సంశయింపకుము. నీవు పతివ్రతాశిరోమణి వౌట నీవాంఛితంబు నెఱవేఱును. అని పలికి రత్నాసనాసీన యగు పార్వతిం గనుంగొని యోసుశీలా! నీవును భూతలం బున యశోదాదేవికి నందునకుం బుత్త్రికవై జన్మింపుము. నేనును నీతోడన దేవకీవసుదేవులకుం గుమారుండనై జనింతు. నాజననము మధురానగరమున నగు సోదరీ! నీవు పుట్టఁగనే మాతండ్రి నన్నుంగొనివచ్చి నీవుండుపురుటింట నునిచి నిన్నుఁదోడ్కొని యతివేగముగా మధురాపురము నకుం బోవును. కంసుని జూచినంతనే శ్రీచంద్రమౌళి పరిసర మునకుం బొమ్ము. నేను నవ్వేల భూభారము నడంచి యీ లోకంబున కరుగుదెంతు. † నీవు జగత్సృష్టిని సంహారమును జేయుదానవు. కావునఁ బ్రతిగ్రామమునను బూజింపఁబడు

* ఉవాచ కమలాం కృష్ణ స్మేరానన సరోరుహాః, త్వం గచ్ఛ భీష్మకగృహం నానారత్నసమన్వితమ్. వైదర్భ్యా ఉదరే జన్మ లభ దేవి సనాతని, తవపాణిం గ్రహిష్యామి గత్వాహం కుండినం సతి.

ఌ అధ్యా. ౧౨౧ శ్లో.

† లభ జన్మ మహామాయే సృష్టి సంహారకారణి, గ్రామే గ్రామేచ పూజాంతే కారయిష్యామి భూతలే, కృత్స్నే మహీతలే భక్త్యా నగరేషు వనేషు చ, తత్రాధిష్ఠాతృ దేవీంత్వాం పూజయిష్యంతి మానవాః.

ఌ అ. ౧౨౮ శ్లో.

చుండువు. నగరములందు నిన్ను భక్తిచేఁ బూజించుచు నాగరులు కృతకృత్యులు కాఁగలరు. నీవధిష్ఠాతృదేవి వనం బరఁగుదువు

అని పలికి యామె యనుతింప సంతసించుచుం గుమారస్వామిం గాంచి షడాననా! నీ వంశరూపమున భూతలమున జాంబవతీగర్భంబున నవతరింపుము నీతోడ దేవతలందఱు నిజాంశముల నాకు సాయమొనరింపఁ బుట్టఁగలరు. నేనును మీరందఱు తోడ్పడ భూభారం బుపసంహరింతురు.

అని పంకజలోచనుండగు శ్రీకృష్ణపరమాత్మ యానతిచ్చిన నప్పలుకు లాలించి పద్మయోనియగు బ్రహ్మ కరయుగము జోడించి వినయమున నిట్లు ప్రశ్నించెను. దేవదేవా! సకలలోకాధిపతివయి సర్వశక్తియుక్తుఁడవయి యలరారు నీసేవ చేయఁగలవాఁడే భక్తుఁడు. ఆతఁడే కృతార్థుఁడు. నీయాజ్ఞ జవదాఁటక యొనరించువాఁడే నిత్యభక్తుఁ డనంబరఁగు. ఒక్కమనవి గలదు. ఏయే దేవత లేయేరూపంబుల నేయేనామంబుల నెందెందుఁ బుట్టవలయునో కింకరుండనగు నాయందనుగ్రహమునిచి యానతిమ్ము నావిని జగన్నాథుండిట్లు బదులు చెప్పెను.

## బ్రహ్మకుం గృష్ణుండు భూతలంబునఁ బుట్టఁగల దేవతానామాదులను దెల్పుట.

పద్మసంభవా! చక్కని ప్రశ్నము చేసితివి. ఇది వినఁదగిన విషయము. మన్మథుఁడు రుక్మిణీగర్భమునం బుట్టఁగలఁడు. రతీ

దేవి మాయారతియనంబరంగి జనింపందగు. ఏదేవి శంకరుగృహమున ఛాయారూపమున నుండెనో యామెయే రతియని యెఱుంగుము. నీవు రౌక్మిణేయతనయుండవై యనిరుద్ధుండనం బ్రసిద్ధినొందంగలవు. భారతీదేవి బాణాసురపుత్రికయై శోణితపురంబున వెలయంగలదు. అనంతుండు దేవకీగర్భమున నెలకొని మాయచే గర్భసంకర్షణము చేయంబడి రౌహిణేయుండయి సంకర్షణుం డనంబరంగు. సూర్యతనయ గంగాంశమునం గాళిందియనంబుట్టువుంగాంచు తులసి తనయర్ధాంశమున లక్ష్మణయనం జనించు. ఆమె రాజకన్యకయే యగు. వేదమాతయగు సావిత్రి నాగ్నజిత్తియనం బుట్టు. భూదేవియే సత్యభామ యనం బ్రసిద్ధిగాంచు. సరస్వతి శైబ్యయనుపేరుగాంచి జనించు. రోహిణి మిత్రవిందయనం బుట్టుందగు. సూర్యపత్ని రత్నమాలనా విఖ్యాతింగాంచు. స్వాహాదేవ్యంశమున సుశీల జనింగాంచు. దుర్గార్ధాంశమున జాంబవతిజనించు. వీరు తొమ్మండ్రుగురు రుక్మిణియుంగలిసి పదిమందియు నాకు భార్యలుగాం గలరు. శైలపుత్రిక యర్ధాంశమున జాంబవంతుని గృహమునం బుట్టువుంగను. ఒకనాండు శంకరుండు పార్వతిం గాంచి శ్వేతద్వీపనివాసియగు విష్ణువు కైలాసమునకు రాంగా నాతని నాలింగనము చేసికొమ్ము. దాన దోషంబు లేదు. ఇది మదాజ్ఞగదా. అనుమానింపకుము. దోస మిసుమంతయు లేదు. అని కృష్ణమూర్తి పలుకునంతలోం బద్మయోని పరమేశ్వరా! రాధానాథా! శ్వేతద్వీపమునుండి విష్ణుమూర్తి కైలాసమునకు

వచ్చుటకుముందే యీశ్వరుఁడు పార్వతింగూర్చి యీమాట పలుకనేల? ఆశ్చర్యముగ నున్నది. దీనివృత్తాంత మంతయుం దెలుపుమా యని ప్రార్థించెను.

## పార్వతీపరమేశ్వరుల వృత్తాంతము బ్రహ్మకుం గృష్ణుండు దెల్పుట.

ఆప్రార్థనకు నలరి జలజాక్షుం డిట్లు చెప్పెను. సృష్టికర్త వగు నీవడిగినఁ దప్పక చెప్పవలయు. వివరించెద. వినుము ముం దొకకాలంబున గణాధీశుండగు గజాస్యునిదర్శించి దేవతలెల్లం బెల్లుగం బోయిరి. శ్వేతద్వీపమున నెలకొనియుండు విష్ణుమూర్తియు గణపతిని దర్శింపఁబోయెను. అందఱును గణపతిని దర్శించి హృష్టులైరి. యథోచితాసనంబులఁ గూరుచుండిరి. సుఖాసనమున నుపవిష్టుం డగు శ్రీమహావిష్ణువు త్రిలోకమోహనరూపంబు గాంచి యమర్త్యులెల్ల నానందించిరి. శంకరుండు నందఱ నాదరించెను అందు నవరత్నకిరీటమునుదాల్చి కుండలకాంతులు గండభాగంబుల నాట్యమాడఁ, బీతాంబర మొప్పుమెఱయ, శ్యామలతనుకాంతులు సర్వత్ర వ్యాపింప, నవయౌవనంబు చూపరుల నాశ్చర్యపరవశులను జేయ, చందనాగురుకస్తూరీకుంకుమద్రవచర్చలరుచులు గూర్ప, రత్నాలంకారములు చెలువుసూప, చిఱునవ్వు మోమునదమ్మి కొకవింత

---

* పురా గణేశం ద్రష్టుం చ ప్రజగ్ముస్సర్వదేవతాః, శ్వేతద్వీపాత్స్వయం విష్ణుర్జగామ శంకరాలయమ్. అని మూ. ౬ అ. ౧౪౯ శ్లో.

చెలువు సమకూర్ప, రత్నసింహాసనమునఁ దేజరిల్లు మహా విష్ణువును, శంకరాదులు వినుతించి పూజింప నలరువానిం గాంచి పార్వతి ప్రసన్నవదనేక్షణయై యించుక లజ్జించి వస్త్రమున ముఖముం గప్పుకొని మరలమరలఁ జాటుఁజూపుల నాసుందరమంగళదివ్యవిగ్రహమును జూచుచుండెను. నిమేషరహితయై యావిష్ణునాకారమును గన్నుల పండువుసేయు దానింజూచునపు డాపార్వతికిఁ బులకలు పొడమెను.

మరల నయనముల మరలించి క్షణకాలము పంచవక్త్రుఁడై శుభ్రదేహచ్ఛాయుఁడై, త్రిలోచనుండయి, త్రిశూలాద్యాయుధములం దాల్చి కందర్పకోటిలావణ్యదేహుండై యలరారు శంకరుం జూచెను. ఆవల నట్లే యేకవక్త్రుఁడై, శ్యామలాంగుఁడై, ద్విలోచనుఁడై, చతుర్భుజుండై, పీతాంబరధరుండై, వనమాలావిభూషితుండై, యేకత్వంబునను, మూర్తిభేదమునను దానే బ్రహ్మమై వెలయు మహావిష్ణువును జూచెను.

ఇట్లు విస్మయజనకంబగు విష్ణురూపమును జూచినంతనే విష్ణుమాయచే సకాము యాయెను. ఓపంకజాసనా! వాణీపతీ! బ్రహ్మవిష్ణుమహేశ్వరు లనుమీరు ముప్పురు మదంశములే. అందు సత్వగుణాత్మకుండగు విష్ణు వధికుఁడు. అట్టివిష్ణువుం జూచి పులకాంచితవిగ్రహయై పార్వతి మనస్సున నాదేవదేవునిఁ బూజించెను.

పార్వతి మనోభావమును శంకరుం డెఱింగి యొక్కటఁ బిలిచి యిట్లు హితముపదేశించెను. హిమాలయాత్మజా!

నే నుపదేశించువిషయము నాలకింపుము. నీశృంగారమును హరి కొసంగుము.* నేనును బ్రహ్మయు విష్ణుమూర్తియు నొక్కరూపమే కాని వేఱుకాదు. ఆత్మయొక్కటియే. నీవో మూలప్రకృతివి. సర్వజగజ్జననివి. సర్వప్రపంచము నీరూపమే. నీయంత నీవే పుట్టితివి. బ్రహ్మకు సరస్వతియు, విష్ణువునకు లక్ష్మియు, నాకు దుర్గయు భార్యలుగా నలరుచున్నవను నీరూపములే మాకు ముగ్వురకును భేదమే లేదు. ఇదియే తత్త్వము.

అని పలికిన పరాత్పరునివచనంబు లాలకించి గౌరి యిట్లు ప్రశ్నించెను. నాథా! దీనబంధుఁడవు. కృపాపాథోరాశివి. ఇట్టి నీకు నాపై నేల యిట్లు నిష్కృపకలిగెనో తెలియఁజాలకున్నాఁడను. చిరకాలతపఃఫలముగా భర్తవుగ నీవు లభించితివి. ఇట్టి నావంటి కింకరుని బరిత్యజింపఁ జను నే. ఈరీతి నన్నుఁ బలుకుట నాకుఁ దగినది కాదు. రెండవపర్యాయము పలుకకుండ ననుగ్రహింపుము. భవద్వాక్యమును శిరసావహించెద. కాని యది జన్మాంతరమున నగుఁ గాక. రూపాంతరమున హరిని భజించెద. నీవచన మమోఘమని యెఱుంగుదు.

అని గౌరిపలుక శంకరుం డూరకుండెను. మరలఁ బక్కున నవ్వి యభయం బొసంగి పార్వతిం గారవించెను. ఆప్రతిజ్ఞను బాలించుపొంటెఁ బర్వతకుమారి జాంబవంతునింటఁ బుట్టెను.

* 'అహం బ్రహ్మా చ విష్ణుశ్చ బ్రహ్మైకం చ సనాతనం.' అని మూ. ౬. అ. ౧౬౮ శ్లో.

పంకజాసనా! ఇదియ జాంబవతీవృత్తాంతము. పురాతనవార్త గావున వచించితి.

అని శ్రీకృష్ణుండు పలుక బ్రహ్మయు నచ్చెరువంది మరల నిట్లు ప్రశ్నించెను. 'దేవదేవా! పార్వతి మర్త్యలోకంబునఁ బెక్కుమంది భూపాలురుండ భల్లుకాధిపతియగు జాంబవంతు నింటఁ బుట్టనేల? జాంబవంతునివంటి పుణ్యాత్మకులు రాజులు లేరా?' ఈసందేహముం బాపి కాపాడుమా యని వేఁడెను.

పార్వతి జాంబవంతునింట జన్మింపఁ గారణము శ్రీకృష్ణుఁడు తెలుపుట.

శ్రీకృష్ణపరమాత్మయు సంతసంబున బ్రహ్మ కిట్లు బదులు చెప్పెను. 'సరసిజాసనా! పూర్వము త్రేతాయుగమందు శ్రీహరి రామరూపంబున నవతరించెఁ గదా. దేవతలందఱు స్వాంశం బుల రామసహాయార్థము పుట్టిరి. భల్లుకాధిపతియగు జాంబవంతుఁడు హిమాలయాంశమునఁబుట్టి శ్రీరామకింకరుఁ డయ్యెను. శ్రీరాముఁ డనుగ్రహంబున నాతనికిఁ జిరంజీవిత్వ మును బ్రసాదించెను. ఆవరప్రభావమున నతఁడు కోటిసింహ ములబలముగలవాఁ డయ్యెను. పార్వతియు హిమవంతుఁడు తనకుఁ దండ్రి గావునఁ దదంశమునఁ బుట్టిన జాంబవంతు నింట భూతలంబున నవతరించెను. ఆమెయే జాంబవతి యనం బ్రఖ్యాతింగాంచె. ఈవృత్తాంతము పురాతనము గావున నంతయుఁ జెప్పితి. ఇఁక శీఘ్రంబ దేవతలందఱు తమతమయంశ

ములు భూతలంబునఁ బుట్టువుం గాంతురు గాక. రాజపుత్త్రులై నాకు భూభార హరణకార్యంబున సహాయము చేయుదురు గాక * లక్ష్మీదేవ్యంశమునఁబుట్టి రాజకన్యకలు నాకుఁ బత్ను లగుదురుగాక.' అని యానతిచ్చెను.

పాఠకమహాశయులారా! ఈగాథవలన మన మెఱుంగఁ దగిన ముఖ్యాంశములు కొన్నిగలవు. బాహ్యదృష్టిఁ జూడ కుఁడు. ఇందలి తత్త్వమేమనియే పరిశీలింపుఁడు. శ్రీకృష్ణ శంకరుల వాక్యముల శ్రద్ధమై దిలకింపుఁడు. విధి హరిహరులకు భేదము నామమాత్రమేగాని వేఱుగాదని దీనినుండి తేలును గదా. లక్ష్మీవాణీపార్వతులకు నభేదమే యని తేలునుగదా భగవంతుఁడు పరాత్పరుఁడు జగత్ప్రవర్తనార్థము మూఁడు రూపములఁ దాల్చి సృష్టిస్థితిసంహారముల నొనరించుచున్నాఁ డనియు, ఆయన యిచ్ఛారూపిణి యగు మూలప్రకృతి మూఁడురూపముల నొంది వాణీలక్ష్మీపార్వతీనామంబుల వెల యుచున్నదనియు, ఇంతియకాని యిందొకరు తక్కువయని గాని, యింకొకరు ఎక్కువయనిగాని గ్రహించుట మిగులఁ బొరపాటనియు, కార్యాంతమున వీరంద ఱా పరమాత్మయం దైక్యమగుదురనియు, ఈముగ్వురు కాంత లామూలప్రకృతి యందు విలీన లగుదు రనియు దీనిసారము. ఇట్టులగుట నిం దెవ్వరిభజించినను ఫలమొక్కఁడేగాని వేఱుఫల మెట్లగును?

---

* 'కమలా కలయా సర్వా భవంతు నృపకన్యకాః, మన్మహిష్యో భవిష్యంతి సహస్రాణాం చ షోడశ' అని మూ. ౧.౨౮ శ్లో.

ఇట్లు శ్రుతులుగాక పురాణములుగూడఁ దలపై నోరుపెట్టుకొని తత్త్వ మిదియని ఘోషించుచుండ మొండిపట్టుమానక వీరియందుఁ దారతమ్యములు గలవని వాదించు మహానుభావుల కేమి సమాధానము చెప్పవలయునో తెలియరాకున్నది.

కొందఱు సర్వసాక్షి, సర్వేశ్వరుఁడు, సర్వవ్యాపియు నగు భగవంతునిఁ బరాత్పరుని "మొద్దు" అని పలుకుచు, నంతతోఁ దృప్తినొందక యామొద్దు నుపాసించిన నేమి ఫలమని వ్రాయఁ, జెప్ప, సాహసింతురు. అట్టివారి కది వెఱ్ఱితనము. పూర్వజన్మపాపఫలము అనక మఱేమనవచ్చును. ఆ మొద్దే ఈ త్రిమూర్తుల నాడించుచు, గంతులు వేయించుచు, లయ మొందఁజేయుచున్నది. ఆమహాత్ము నుపాసించు భాగ్యము లేకయే వీరి నుపాసించుచున్నారము. అందుఁగూడ నైక్యమును బాటింపకున్న నిది కడపటిజన్మము కాదని వారికి హితము చెప్పుటయే సమంజసము. అతివిస్తరముగా వారింగూర్చి వ్రాయుటయు వృథాకాలక్షేపమే యగు. ప్రకృతమనుసరించుచున్నాఁడను. లక్ష్మీదేవ్యంశమునఁ బదాఱువేల మందివనితలు జన్మించి నాకు భార్యలుగావలయు నని శ్రీకృష్ణమూర్తియే యాజ్ఞాపించెనఁట. ఆకాంతలే గోపికలు. వారు శ్రీకృష్ణునిఁ బ్రేమించుటలోఁ దప్పేమియో తోఁచకున్నది. లక్ష్మీదేవి భగవంతుని సాధ్వి. అనపాయిని. పెక్కురూపముల ననేకావతారములయం దాయనకు భార్యయయ్యెను. శ్రీకృష్ణావతారమున ననేకరూపముల నేకకాలమున భార్యయయ్యెను. ఇందేమి యాక్షేపింపఁదగు విషయముకలదో

తెలియఁజాలకున్నాఁడను. భగవత్కథామృతమును జవి చూడఁజాలని మహాత్ముల కన్నియును సంశయములే. అన్నియుఁ జేయరాని కార్యములే యని తోఁచును. ఒకభక్తుఁ డాసర్వేశ్వరుఁ గౌఁగిలింపఁగోరును. ఒకఁడు సేవఁజేయఁగోరును. వేఱొకఁడు నుతింపఁ గాంక్షించును. ఇంకొకఁడు పూజింపఁ దమకించును మఱియొకఁడు మఱొకటిఁ గోరును. అంతఱి కోర్కులఁ దీర్చుట యాభగవంతునికృత్యము. ఆయాయి యవతారముల నాయాయిభక్తుల వాంఛితములఁ దీర్చుచుండు పరమాత్మునియందు దోషముల శంకించుట, వచించుట, వానిని సిద్ధాంతము చేయఁబూనుట పురాకృతదుష్కృతఫలము గాక వేఱొండు గాదని మాటిమాటికిం బలుకవచ్చును. అంతియ గాని శాస్త్రోక్తముగ వారింగూర్చి వేఱొక్కసమాధానమును జెప్పసాధ్యము గాదు.

ముందుముందు శ్రీకృష్ణలీలలయందు బహుకార్యములతోఁ గ్రీడించినట్లు కనఁబడును. అందును సమాధానము సమయోచితముగా వ్రాయఁబడును. ఇపుడు వ్రాయునదియు దానికిం దోడ్పాటు చేయఁజాలియుండునని యూహింతునుగాక!

## దేవాంశజనితుల వివరణము.

ఇంకఁ దర్వాతికథ విన నవహితులరు గండు. భగవంతుఁడిట్లు బ్రహ్మకుం దెలిపి మఱియు నిట్లు పలికెను. వాక్పతీ! ధర్ముఁడే యంశరూపమున, బాండుపుత్త్రుఁ డనబరఁగు యుధి

ష్టుఁడగు. వాయుదేవాంశమున భీమసేనుండుపుట్టు. ఇంద్రాంశభవుఁ డర్జునుఁడు కాఁగలఁడు. నకులసహదేవులు దేవ వైద్యులగు నశ్విదేవాంశసంభూతులు. సూర్యాంశభవుండు కర్ణుండు. విదురుఁడు యముఁడేయగు. కల్యంశమున దుర్యోధనుఁడుపుట్టు. శంతనుఁడు సముద్రాంశజనితుండగు. అశ్వత్థామ శంకరాంశజనితుఁడు వహ్న్యంశజనితుఁడు ద్రోణుఁడు. హుతవహునంశమున దృష్టద్యుమ్నుఁడు మహాబలశాలియై జనింగాంచు. అభిమన్యుండు చంద్రాంశజనితుండగు. వస్వంశమున భీష్ముండు విఖ్యాతింగను. కశ్యపాంశజుఁడు వసుదేవుఁడు. అదిత్యంశమునఁ బుట్టు సాధ్వి దేవకియగు. వస్వంశమున నంద గోపకుఁ డుదయమందు. యశోద వసుభార్యయ యగు. ద్రౌపది కమలాంశజనిత. ఆమె యజ్ఞకుండమునుండి వెలువడు. శతరూపాంశజాత సుభద్ర యగు. ఆమె దేవకీగర్భసంభవయగు నని తెలియఁదగు. దేవతలందఱు భూభారహరకులై పుట్టఁగలరు. దేవతాపత్నులెల్లఁ బృథివీతలంబున స్వాంశములనుద్భవ మందగలరు.

అని పలికి శ్రీకృష్ణుఁ డూరకుండెను. అంత నామహాత్ముని వామభాగంబున వాగ్దేవియు, దక్షిణభాగంబున లక్ష్మీదేవియుఁ, బురోభాగంబునఁ బార్వత్యంబయు నామె చెంతనుండి దేవతా సముదయములును సేవించుచుండిరి. గోపికలును గోపాలకులును భక్తినమ్రులై కొల్చుచుండఁగా శ్రీకృష్ణవక్షస్థలవాసినియయి వ్రజేశ్వరియగు రాధాదేవి పరమాత్మునిం జూచి యిట్లు పలికెను. ప్రాణేశ్వరా! నినుఁజూడకున్నచో నొకనిమేష

మైన బ్రదుకంజాలను. విరహముగలుగునని తోఁచినంతన ప్రాణములు దహింపఁబడు.నాచిత్తము నాయాయత్తముగాదు. నిమేషమైన నెడఁబాయఁజాల. ఇట్టి నేను నిన్నువదలి భూతలంబున కెట్లు పోనేర్తును? ఎంతకాలమునకు మన కిర్వుర కొకచోట నివాసముగలుగును? గోకులంబున నెందు మనకు యోగము పొసంగు? నినుఁ బాసిన నిమేషము శతయుగతుల్యంబుగఁ దోఁచు. నేనందుఁబోయి యెవ్వనింజూతు? ఎటుపోవుదును? నన్నెవరందు రక్షింతురు? నిన్నెడఁబాసినపుడు తల్లిని దండ్రిని బంధువులను, సోదరులను, బుత్రులను స్మరింప నిష్టము గలుగదు. సకలమాయలు నీయాజ్ఞకు లోఁబడియుండు అట్టి మాయలచే నన్ను నాచ్ఛాదింపకుము. నీయందే ప్రీతిగల్గి యుండఁజేయుము. "నిన్ను మాయచేఁ గప్పనుజుమీ" యని శపథంబుచేయుము. ఓమధుసూదనా! ప్రతిక్షణము నామనోద్విరేఫము నీ పాదారవింద విగళదమృతపానాసక్త మగునట్లనుగ్రహింపుము. ఎందెందు నెవరెవరికులమున నేఁబుట్టునట్లు చేసినను నీస్మరణము దాస్యము నాకుం గలుగున ట్లనుగ్రహింపుమా ఇదియే నావాంఛితము.

మఱియు నేనెందుజన్మించినను నీవు కృష్ణుఁడవని, నేను రాధిక యని యీ పేరులు మార్పునొందకుండ మనకిర్వురకుఁ గల ప్రేమసౌభాగ్యమునకు భంగమురాకుండున ట్లనుగ్రహింపుమా. నిను మఱువకుండ నుండునట్టి వరము ప్రసాదింపుమా. శరీరమును ఛాయ యెడఁబాయనిపగిది, ఆత్మ నెడఁబాయని ప్రాణములవలె మనకిర్వురకు జన్మము లభించుఁగాక! ఇదియె

నాపాంఛితము. ఈవర మనుగ్రహింపుము. నిమేషమాత్ర మైన మన కెడఁబాటు గలుగఁగూడదు. నేను బ్రాణతుల్యను గావున నీతనువు నెడఁబాయకుండునట్లు చేయుదువుగాక నేను నీకర్ధశరీరంబ కదా. దాన మన కభేదంబు సిద్ధించెఁగదా. దానికి చ్యుతి లేకుండునట్టి వర మనుగ్రహింపవే యని దీనవదనయై మాటిమాటికీమాటలం బల్కుచు నుచ్చైర్నాదమున రోద నము గావించుచుఁ బాదారవిందంబులపైఁ బడియుండెను.

కరుణాశరధియగు శ్రీహరి రాధాదేవిని లేవనెత్తి బాహువుల బిగియం గౌఁగిలించుకొని సత్యపూతమై కరుణా పూర్ణమై హితమై యలరార నిట్లుపలికెను. ప్రాణేశ్వరీ! ఆధ్యా త్మికమై శోకచ్ఛేదనకారణంబయి తగుయోగము నుపదేశిం చెద. చక్కఁగా నాలకింపుము. ఈయోగము యోగీశ్వరుల కేని దుర్లభము.

## శ్రీకృష్ణుఁడు రాధకు యోగ ముపదేశించుట.

ప్రజేశ్వరీ! సర్వబ్రహ్మాండము ఆధారాధేయాత్మకమని తెలియుము. ఆధారములేక యాధేయ ముండఁజాలదని నమ్ముము. ఫలమున కాధారము పుష్పము. పుష్పమున కాధా రము పల్లవము. పల్లవాధారము స్కంధము. స్కంధాధారము తరువు. వృక్షాధార మంకురము. అంకురాధారము జీవ శక్తియుతమగు బీజము. * బీజాధార మష్టి. అష్టి కాధారము

* అష్టిరేవాంకురాధార శ్చాష్ట్యాధారో వసుంధరా' అని మూ.
౬ అ. ౧ శ్లో.

భూమి. భూమికాధారము శేషుఁడు. శేషాధారము కచ్ఛపము. కచ్ఛపాధారము వాయువు. ఆవాయువున కాధారము నేనే. [1]నాకాధారస్వరూపవు నీవు. నేను నీయాధారమున నున్నవాఁడను. [2]సర్వశక్తులు నీయందున్నవి. మూలప్రకృతివి. ఈశ్వరివి. శరీరశ్వరూపవు. త్రిగుణాధారరూపిణివి. [3]నీయాత్మను నేను నిరీహుండను. నిన్నుఁ గూడినపుడు కదలుదును. పురుషునుండి వీర్య ముద్భవించు. దానినుండి సంతతికలుగు. ఆరెండింటికాధారము ప్రకృతి, కామినియు, ఆప్రకృతి కళ. దేహము లేక ఆత్మ నిలుచుటెట్లు? ఆత్మ లేక శరీరముండుటెట్లు? అవి లేకున్న పుట్టుకయెట్లుకలుగును. సంసారబీజభూతులమగు మన కిరువురకు భేద మెట్లు కలుగును? ఆత్మయెందుండిన దేహమందుండును. నీవెందుండిన నేనందుండక యెట్లు మాననేర్తు? [4]క్షీరమునందు ధావళ్యము, అగ్నియందు దహించుశక్తియు, (అనఁగా నుష్ణము) భూమియందు గంధము, జలమందు శీతలత్వము ఎట్లో అట్లే మనయం దభేదగుణము కలిగియుండు. ధావళ్యదుగ్ధముల కైక్య మెట్లో, అగ్ని దాహికలకేకత్వమేలాగో, భూగంధముల కెట్టు లభేదమో, సలిలశీతలత్వముల కేరీతి నైకమత్యమో, మనయిరువురకు నట్లే యభేదము గలిగియుండు

1 'మమాధార స్వరూపాత్వం త్వయి తిష్ఠామి సాంప్రతమ్.' అని మూలము.
2 'త్వం చ శక్తి సమూహాచ మూలప్రకృతి రీశ్వరీ' అని మూ.
3 'తదాత్మాహం నిరీహాశ్చ చేష్టావాంశ్చ త్వయా సహా' అని మూ.
4 'యథా క్షీరచ ధావళ్యం దాహికా చ హుతాశనే' అని మూ.

నని నమ్ముము. ఇంతియగాదు. నన్నువదలినచో నీవు నిర్జీవవు. నిన్నువదలిన నేనదృశ్యుఁడనే. *నిన్నుఁగూడక వీడినచో నేను సృష్టిచేయఁజాల ననుటసత్యము. మృత్తిక లేక ఘటము కులాలుఁ డెట్లుచేయఁజాలఁడో, సువర్ణములేక కంసాలి యెట్లు అలంకారవస్తువుల నిర్మింపఁజాలఁడో అట్లే నేనును నిన్నుఁ గూడనిచో సృష్టికార్యము చేయంజాలను. నేనెట్లు ఆత్మరూపుఁడను నిత్యుఁడనో యట్లే నీవును ప్రకృతిరూపవు. సర్వశక్తిసమాయుక్తవు. సర్వాధారవు. సనాతనివి. నాకుం బ్రాణసమానవు. † లక్ష్మియన్న, వాణియన్న, సర్వమంగళయన్న నీవే. బ్రహ్మయు, శంకరుఁడు, అనంతుఁడు, ధర్ముఁడు నీవే. నాప్రాణాధికవు నీవే. నాసమీపమున నీదేవతలు, దేవాంగనలు నుండఁగా నీవు నా వక్షఃస్థలమున నెట్లున్నదానవు? కాననే వీరందఱికంటె నధికురాల వని తెలియలేదా. రాధాదేవీ! కన్నీరు విడుచు పని నుండి మరలుము. నిష్ఫలమగు భ్రాంతి నొందకుము. శంకను బోఁదోలుము. వేవేగ వృషభానుగృహంబున కరుగుము. కలావతి యనుపేరం బరఁగు వృషభానుపత్ని జఠరంబునఁ దొమ్మిది నెలలు వాయువుచే గర్భంబుఁ బూరించి దశమమాసంబున నీ

---

* త్వయా వినా భవం కర్తుం నాలం సుందరి నిశ్చితమ్, వినా మృదా ఘటంకర్తుం యథా నాలం కులాలకః. వినాస్వర్ణం స్వర్ణకారో ఽలంకారం కర్తు మక్షమః. ౨౨౦ శ్లో.

† మమ ప్రాణసమా లక్ష్మీ ర్వాణీచ సర్వమంగళా, బ్రహ్మేశానంత ధర్మాశ్చ త్వం మే ప్రాణాధికాప్రియా. ౨౨౨ శ్లో.

వటనుండి యావిర్భవింపుము. నీస్వరూపమును బరిత్యజించి శిశు రూపమును గ్రహింపుము. వాయురూపగర్భము నిస్సరణ మగుతఱి నీవాత్మమాయాబలంబున శిశురూపంబున ధరపైఁ బడి వివస్త్రవై రోదన మొనరింపుము.* అట్లొనరించిన నీ వయోనిసంభవురాల వగుదువు. గోకులంబు నుద్ధరింతువు. నేనును అయోనిసంభూతుఁడ నయ్యెద. మన కిరువురకు గర్భ సంస్థితి కలుగఁగలదా? గోకులమందు భూమిని స్పృశించుట మాత్రమే నాకుం గల్గును. నీకారణమువలనఁ గంసభయము నొక నెపముగానుంచుకొని నందవ్రజమునకుఁ బోవనెంచితి. యశోదామందిరంబున నందనందనుఁడనగుఁ గల్యాణీ! నిత్యము. చూడఁగలవు. నన్నుఁ గౌఁగిలింపఁగలవు. రాధాదేవీ! నావర ప్రభావమున నీకు విస్మృతి కలుగకుండఁ గలదు. బృందావనం బున నిన్నుంగూడి యిచ్ఛానుసారముగ విహరింతు. పావనశీల విరాజమానలగు ముప్పదిముగ్గురు సుశీలాదులగు వయస్యలం గూడి త్రిసప్తశతకోటిగోపికలం గలిసి గోకులంబునకుం బొమ్ము. లెక్కకుమించినగోపికలను గోకులంబున వెలయించి వారినెల్ల నమృతమయవాక్కుల నాదరించుచు నుండుము. నేనును గోపాలకులంగూడి గోకులంబున నివసించి వసుదేవాశ్రమంబున

---

* అయోని సంభవా త్వం చ భవితా గోకులే సతి,
అయోని సంభవోఽహంచ నావయో ర్గర్భసంస్థితిః.
భూమి సంస్పృష్టమాత్రం మాం గోకులే ప్రాపయిష్యతి,
తవ హేతో ర్గమిష్యామి కృత్వా కంసభయం ఛలమ్. అ॥ శ్లో.

విహరించి మధురాపురికిం బోయెద. *నాసంగమునుగోరి నన్ను సేవించుచే ప్రియమని భావించు గోపకులందఱు వల్లవుల యిండ్లఁబుట్టి నాశాసనమున నుందురుగాక. అని పలికి శ్రీ కృష్ణుఁ డూరకుండెను.

ఆ స్త్రీకశిఖామణులారా! ఈకథాసార మేమని యించుక యాలోచింపుఁడు భగవంతుఁడగు శ్రీకృష్ణుఁడు రాధతో నీవు ప్రకృతివి. నేఁ బరమాత్మను. నీతోడిపొత్తులేకున్న నేనే కార్యము చేయఁజాల ననియేఁ గదా. నాకాధారభూతు రాలవు. అట్టి నిన్ను నెడఁబాసిన నేను గదలఁజాలను. నీసాయమున నే బ్రహ్మాండమునిర్మింతు, సర్వశక్తులు నీయందున్న వనియు బోధించెను. లక్ష్మి, వాణి, పార్వతి యనునవి నామ ధేయములు. ఇన్ని పేరులు గలదానవు నీవే. బ్రహ్మశంకరానంత ధర్మాదులు నీవేయని యుద్బోధించెను. అనఁగా అవయవములు గలవ్యక్తులన్నియుఁ బ్రకృత్యధీనములు. తదతీతుఁడు విరాట్టు. అట్టివిరాట్పురుషుఁడను నేనే అని స్పష్టముగాఁ దెల్పెనుగదా.

ఈయర్థమే శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవారు సౌందర్యలహరియందు:—

శ్లో. “శివ శ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చే దేవం దేవో న ఖలు కుశల స్స్పందితు మపి,

* వ్రజం వ్రజంతు క్రీడార్థం మమసంగే ప్రియాః ప్రియాః, వల్లభానాం గృహేజన్మ లభంతాం గోపకోటయః. ౨౩౫ శ్లో.

అత స్త్వా మారాధ్యాం హరిహరవిరించాదిభి రపి
ప్రణంతుం స్తోతుం వా కథ మకృతపుణ్యః ప్రభవతి."

శ్లో. హరి స్త్వా మారాధ్య ప్రణతజన సౌభాగ్యజననీం
పురా నారీ భూత్వా పురరిపు మపి క్షోభ మనయత్,
స్మరోపి త్వాం నత్వా రతినయన లేహ్యేన వపుషా
మునీనా మ ప్యంతః కరణ మపి మోహాయ మహతామ్.

అని వక్కాణించిరి. ఈరెండువిషయములకు నించుక యేని భేదముకలదా. హరిహరవిరించులు ముగ్వురు ప్రకృత్యధీనులు. విరాట్టొక్కఁడే తదతీతుఁడు. అనుట సిద్ధాంతమని యీయిర్వురి యుపదేశమునుండి తేలినది.

ఇట్టులుండ హరిహర భేదవాద మెంత నిస్సారమైనదో పరికింపుఁడు. దాని నాధారముగాఁగొనిన నెంతపాపము వచ్చునో తలంపుఁడు. ఇఁక నావాదమే పరమపురుషార్థమను కొన్న వారికిని ముక్తికి నెంతదూరమో యూహింపుఁడు. ఈ త్రిమూర్తులలో నెవరి నుపాసించిన నొకటియే. దానిఫలము జ్ఞానము. దాని నూఁతగాఁగొని పరమపురుషుని ధ్యానింపఁ గలుగుదుము. అట్టిజ్ఞానము దృఢముగాక దుర్వాదపూరితమైన మనగతి యథోగతియే గాక మఱేమగును. కాఁబట్టి మనము పరమేశ్వరుఁడొక్కఁడే యని, ఆమహనీయుని యాత్మశక్తియే ప్రకృతియని, యాప్రకృతియే సకలబ్రహ్మాండకర్త్రి యని, అట్టి ప్రకృతి నానాదేవతారూపముల వెలయునని,

యేరూపమున నేనామమున ధ్యానించిన నది దృఢతరంగాంచె నేని ఫలప్రదమగునని, దేవతాధ్యానమున కందఱు పాత్రులని రీతిభేదములున్నను ఫలభేదము లేదని చక్కఁగా నిశ్చయించుకొని, పూర్వకర్మవాసనాబలంబున నొక్కొక్కదేవత నుపాసించు భాగ్యము గల్గునని సిద్ధాంతమును జేసికొని భగవత్తత్త్వము నుపాసించి కృతకృత్యులము గావలయునేగాని వేఱు మార్గమునఁ గాఁజాలము. అట్లుగాక స్వాభిమతదేవతాభిన్న దేవతలు తుచ్ఛులని తనదేవతకు సేవకులని, వారి నుపాసించినఁ బుణ్యము రాదని మొండిపట్టున వాదించుట కన్న వృథాకాలక్షేపము వేఱొకటి కానరాదు. కాఁబట్టి యట్టివాదములఁ బాటింపక శక్త్యనుసారముగా భగవంతు నారాధించుచుఁ గృతకృత్యులమగుటకుఁ బ్రయత్నింపవలయు.

ప్రకృతము శ్రీకృష్ణమూర్తియే విరాట్పురుషుఁడని, శ్రీరాధాదేవియే ప్రకృతి,సర్వబ్రహ్మాండకర్త్రి యని భావింతము. అట్టి రాధామాధవుల భక్తి యుక్తిమైఁ బూజింతము. వారియ పారమహిమము కనుఁగొనఁజాలము కాని, తత్కథామృతమున నించుకతృప్తి నొందుదము. లేనిపోని శంకలఁదెచ్చుకొని భగవద్గాథల నాక్షేపింపక వానిం బఠింతము. దాన నేదో వచింపరాని ఫలము గలుగకమానదు. సకలపాపహారమగు భగవత్కథామృతమునఁ దృప్తినొందమేని వేఱుమార్గము తృప్తి నొందింప వలంతిగాదు. కావున నిశ్చలభక్తి నభ్యసింతము.

ఈకథామృతపానమునకు ఫలము దేవతాభేదబుద్ధి నాశమే కాని వేఱొండు కాదు.

'ప్రకృత మనుసరామః పాయసంభక్షయామః.'

అన్నట్లు ప్రకృతకథాభాగమునకు వచ్చెదను. ఇట్లు శ్రీకృష్ణుఁ డూరకుండఁగనే దేవతలు, దేవతాకాంతలు, గోపాలకులు గోపికలు, బ్రహ్మశంకరశేషధర్మాదులు పరాత్పరుండగు శ్రీకృష్ణమూర్తిని గొనియాడిరి. పరమానందమునఁ బార్వతీ లక్ష్మీసరస్వతులు స్తుతించిరి. విరహజ్వరపీడితలై గోపికలు భక్తిచే గోపాలపాలకుని సేవించిరి. ప్రేమవిహ్వాలు లై నమస్కరించిరి.

రాధయుఁ బ్రాణాధికుండగు ప్రాణేశ్వరుని స్తుతియించి భక్తి నమ్ర యయ్యెను. విరహజ్వర కాతరయై, కన్నీరుమున్నీరుగాఁ బ్రవహింప భయాకులయై యుండు రాధనుజూచి శ్రీకృష్ణుండు వినఁదగి, ప్రబోధకరమగు వాక్యము నిట్లుపల్కెను. ప్రాణేశ్వరీ! స్థిరబుద్ధివి కమ్ము. భయమును వదలుము. నాయంత దానవు నీవు. నీయంతవాఁడను నేను. నేనుగలుగ నీకుఁ జింతయేల? ఒక్కమాట చెప్పెద. ఆలకింపుము. నిన్ను నేను వదలి యుండుటకుం గారణంబుగలదు. ఆశాపకారణమును జెప్పెద. పూర్వమున నీకును నాకును వియోగము నూఱు సంవత్సరములు గల్గ శ్రీదాముఁడు శపించెను. దాని ననుభవింపక తప్పదు. ఆశాపకాలము వచ్చునంతకు నినుఁగూడియుం

డుదు. అది యనుభవించుకాలము రాఁగా నిను వదలి మథురాపురిఁ జేరుదు. భూభారమడంచి నన్నుం గన్న తల్లిదండ్రులకు బంధవిమోచన మొనరించి తంతువాయమాలాకారులకుఁ, గుబ్జకు శాపమోక్షముం బ్రసాదించి యవనుం బొలియించి ముచుకుందునకు మోక్షము ననుగ్రహించి, ద్వారకాపురమును నిర్మించి, రాజసూయయాగమును దర్శించి, షోడశసహస్రరాజకన్యకలను వరించి,నూటపదునొకండుసంఖ్యలశత్రువుల వధించి, మిత్రుల కుపకృతి నొనరించి, వారాణసీదహనబాణభుజభంజనములఁ గావించి, పారిజాతమును దెచ్చి భామకుం బ్రీతిఁ బెంపు నొనరించి, యింక ననేక కార్యముల నొనరించి యవ్వలఁ దీర్థయాత్రకై వెడలి, మునిసంఘములకు దర్శనంబిడి, బంధువులతో సంభాషించి, పితృయజ్ఞసంపాదన మొనరించి, నీకుఁ బూర్వజన్మజ్ఞానం బొసంగి, గోపికలకు దర్శనంబునొసంగి, రేయింబగళ్లు నినుంగూడి విహరింతు. అంత నినుఁగూడి యీలోకంబున కరుదెంతును. ప్రాణేశ్వరీ! మనకు నెడఁబాటుగలుగు నూఱుసంవత్సరముల కాలమందుఁ బ్రతిదినము రాత్రియందు స్వప్నంబున నీకు దర్శనం బొసంగెద. నూఱువర్షములు కాక ముందే మదీయనారాయణాంశము ద్వారకాగమనంబు చేయు. అవ్వల నినుంగూడి వనవాసం బొనరించి మరలఁ దలిదండ్రుల దుఃఖంబు దొలఁగించి గోపికల యార్తినెడంబాపి భూభారము ను దీర్చి నిన్నుంగూడి సకలగోపీగోపసహితుండనై యీగోలోకంబున కరుదెంచెద. శ్రీమన్నారాయణాంశము లక్ష్మీవాణీ

సహితంబుగా వైకుంఠంబునకుం బోవు. మదీయవిష్ణ్వంశంబు శ్వేతద్వీపంబునకుం జను. దేవతలు, పార్వతీప్రభృతులు, నిజాంశంబులఁ బొందుదురు. నేను యథాపూర్వముగా నీగోలోకంబున నినుంగూడి విహరింతును. ప్రాణేశ్వరీ! నేను జేయ నిశ్చయించిన యిక్కార్యంబులు గా దన నెవరితరంబు అని రాధను ప్రీతిపూర్వకంబుగా గారవించెను.

ఆవిధమంతయు నాలకించుచున్న దేవదేవతాకాంతలు విస్మయాంబుధి మునింగిరి. దేవతలం జూచి గోలోకాధిపతి సురలారా! స్వస్థచిత్తులరై మీమీనిలయంబులకుం బొండు. పార్వతీ! నీకుమారద్వయంబుం గూడి కైలాసంబునకుం బొమ్ము. సకాలంబున నాయాజ్ఞ నందఱు నెఱవేర్తురు గాత! అందఱు అంశమాత్రంబున జన్మింతురుగాక! గణపతి భూలోకంబున నవతరింపఁ జనఁడు.

అని యిట్లు పలికిన శ్రీహరివాక్యంబు లాలకించి దేవతలెల్ల భక్తినమ్రులై యనుజ్ఞఁగొని తమతమగృహంబుల కేగిరి. లక్ష్మీసరస్వతులు శ్రీకృష్ణానుజ్ఞంగొని తమకృత్యంబులు నిర్వర్తింపఁ జనిరి. రాధికయు శంకాకులితస్వాంతయై యుండఁ గాంచి భగవంతుఁడు ప్రియా! వృషభానుగృహంబున జన్మింపఁ బొమ్ము. గోపికలు గోపకులు నిను సేవించియుండఁ గలరు. నేను మధురానగరంబున వసుదేవుని గేహంబున కరిగెద. కంస భయము నభినయించి నందవ్రజమునకు నీచెంత కరుదెంతు.

అని పలుక నాలకించి రాధాదేవి మిగుల నిట్టూర్పులు నిగుడించుచు బిట్టు రోదనముచేసెను. దాన నామె నయనాంబుజము లెఱ్ఱఁబాఱెను. భర్తృముఖారవిందదర్శనాసక్తమతియై కన్నీటి నాపుకొని పలుమాఱు దర్శించెను. విడిచిపోఁజాలననుభావము గనఁబఱచెను. ఏడుమాఱులు ప్రదక్షిణ మొనరించి మఱల నమస్కరించి శ్రీహరి మ్రోల నిలువంబడియె. కృష్ణానుజ్ఞచేఁ బూర్వోక్తగోపీగోపకు లరుదెంచి రాధను సేవించి యామెంగూడి భూలోకంబున జన్మింప సంసిద్ధులైరి. రాధయు విధిలేక భర్త నెడఁబాసిపోఁజాలక, భర్తృశాసనంబుఁ బాటింపకుండుట పాటిగాదని తలంచియు విడువనొల్లక కట్టకడపట భర్తృశాసనం బవశ్యంబు చేయఁ దగునని నిశ్చయించి వృషభానునకుఁ దనయగాఁ బుట్టఁ జనియెను. ఆమె వెంటనంటి గోపికాగోపకులు భూతలంబున కరిగిరి.

శ్రీహరియు గోపికలను స్థానాంతరంబుల జన్మింప నియోగించి తానును మధురానగరంబున వసుదేవుగర్భంబునఁ బుట్టనెంచెను. వసుదేవుఁ డేమునియంశోత్పన్నుఁడో యామునికిఁ దాఁ దనయుండై పుట్టియుండుటం దలంచెను. భూభారముఁ దీర్ప నవతరింప కెడసేయుట కడునపాయ మని నిశ్చయించెను. దేవకీగర్భమున నేడవతడవ శేషాంశమునునిచి మాయచే దాని గోకులంబున రోహిణీగర్భంబుఁ జేర్పుమా యని యోగమాయ కాజ్ఞాపించెను. భూతలంబునఁ గలసాధుజనుల సకలకష్టములం

దీర్పుకున్న వారు బ్రదుకఁజాల రని యాత్మఁ జింతించెను.
1 తడవు సేయఁగూడదని తీర్మానించుకొనియె.

## శ్రీదాముఁడు రాధయుఁ బరస్పరము శపించుకొనుట.

2 పాఠకులారా! శ్రీకృష్ణరాధాసంవాదమున శ్రీదామ శాపంబువలన మనకు వియోగంబు సంభవించునని భగవంతుఁడు రాధకుం జెప్పినట్లు పఠించితిరి. ఆవిధ మెఱుంగుట చాల ముఖ్యము. కాన వినుండు.

ఒకానొకసమయమున శ్రీకృష్ణపరమాత్మ గోలోకమున రాధాదేవింగూడి నిర్జనంబగు రాసమండలమున విహరించుచుండెను. రాధాసుఖసంభోగమునకన్న వేఱుసుఖమే తనకు లేదని తలంచెను. ఇట్టులుండియు నొకనాఁడు రాధాదేవికిం జెప్పకయే యామెను విడనాడ విరజయనం బరఁగు గోపికయింటికిం బోయెను. ఆమె బృందావనముననుండెను. సౌందర్యమున నా సుదతి రాధకు నించుకంతయైనఁ దీసిపోవునది కాదు. ఆమె వయస్యలు పెక్కుమందికలరు. వారి లెక్కింపఁ దరంబుగాదు. ఆవిరజ శ్రీకృష్ణప్రాణాధికురాలు. ధన్యయు, మాన్యయు నగు.

---

1 ఇంతవఱకు శ్రీకృష్ణజన్మఖండమున నాఱవయధ్యాయపుఁ గథ వ్రాయఁబడినదని యెఱుంగఁ దగు.

2 ఇది శ్రీకృష్ణజన్మఖండద్వితీయాధ్యాయము ననుసరించి వ్రాయఁ బడిన దని యెఱుంగఁ దగు.

రత్నసింహాసనాసీనురాలగు నాతరుణీమణి తన చెంత కరుదెంచు శ్రీకృష్ణునిం జూచెను. కృష్ణమూర్తియు శరచ్చంద్ర నిభాననయై, మనోహారిణియై, చిఱునవ్వుమోమున నటియింపఁ గుటిలదృష్టిఁ దన్నవలోకించుచుఁ, బదాఱువత్సరముల ప్రాయముగలిగి సకలమణిఘృణివిలాసమమర, శ్వేతాంబరమును దాల్చి, నిజదర్శన జనితపులకాంచితశరీర యై, నికామకామ సాయకప్రవిద్ధయైయున్న యావిరజను గన్నులారఁ గాంచెను.

ఆయన్నులమిన్నం జూచి యాగోలోకనాయకుఁడు తద భీష్టముం దీర్పంగోరి యామెతో విహరించెను. పుష్పతల్పంబున మహారణ్యమున నిర్జనస్థలంబున నందును రత్నమయమండపంబున శ్రీకృష్ణుని నిరుపమానాకారముం గనుంగొని విరజ పరవశయయ్యెను. ఇట్లు వా రిరువు రానందమహాసాగరమున నోలలాడుచుండిరి.

కోటికందర్పసుందరాకారుండగు నాప్రాణేశు నెదపై నిడుకొనియున్న విరజను, దదాసక్తుఁడై రత్నమండపమున నున్న శ్రీకృష్ణుని రాధికాదేవిచెలికత్తెలు కన్నులారఁ జూచి వేగంబ పఱచి రాధకుఁ బూసగ్రుచ్చినట్లు తెలిపిరి. వారిమాట లాలకించినంతనే రాధ వగలఁ బొరలాడెను. ఆగ్రహోదగ్రురాలయ్యెను. రక్తపంకజలోచనయై యాదేవి బిట్టు రోదనము చేసెను. వయస్యలారా! ఆకృష్ణుని నాకుం జూపఁగలరే యని వారివేఁడెను. మీమాటలు బూటకములుగాఁ బాటింపఁబడ వేని నాకీపాటిసాయ మొనరింపుఁడీ యని దీనయై ప్రార్థించెను.

నన్నుం దోడ్కొని పొండని వారిని హెచ్చరించెను. గోపిక లారా! ఆకృష్ణునకుం దగిన ప్రాయశ్చిత్తమొనరించెద నని గట్టిగా పలికెను. నేశిక్షింపఁబూన నడ్డువా రెవ్వరో చూచెదఁ గాక యని బీరములు పల్కెను. నేవేగ ప్రియురాలింగూడి కన్ను మిన్నెఱుంగక యున్న యావెన్నునిఁ గన్నులారఁ జూడఁ గోరెదఁ జూపుఁ డని సంప్రార్థించెను. అంతర్వక్రమై, సస్మితంబై, సుధాముఖవిషకుంభముంబోలి మద్యాశ్రయంబై యున్న యాకృష్ణపదార్థమును నాకుం జూపుఁడు. మీరొక కొందఱు ముందేగి యామండపమును గాచియుండుఁడు. అని బరుషముగాఁ బలికెను.

ఆమాటలు విని వయస్యలు భయకంపితచిత్తలై కరాంజలులొప్పఁ దల్లీ! శ్రీగోలోకనాయకునిం జూపెదము. చింతిల్లకుము. నావిని యానెలఁత యూఱడి నిజరథమెక్కి పెక్కుమందిగోపికలు గొలుచుచురాఁగా రత్నసారభాసురంబై, కోటి భాస్కరప్రభాయుతంబై మణిశకలశవిసర మరుదైయొప్ప నొప్పుచుఁ, భర్మనిర్మితపాంచాలికాసముదయమలరార లక్ష చక్రసమాయుక్తంబై వివిధఛత్రసుందరంబై వాయువేగంబై పరుగిడు నారథగమనంబులకు మెచ్చుచుఁ బోయిపోయి కృష్ణ విహారపావనంబగు నారత్నమండపంబును గాంచెను.

తద్ద్వారంబునఁ గావలియున్న ద్వారపాలకుం గనుంగొనియె. ఆతండు గోపాలనియుతపరివృతుండై స్మేరాననసరోరుహుండై యుండెను. శ్రీదాముఁడని యా ద్వారపాలకు

నామము. ఆతండే శ్రీకృష్ణప్రియకింకరుఁడు. ఆతని మ్రోల నిలిచి రాధాదేవి కనుదమ్ము లెఱ్ఱఁబాఱ సురతలంపటకింకరా! దూరముగాఁ బొమ్ము. దూరముగాఁ బొమ్మని యదలించెను. నానాథుని లోఁబఱచుకొన్న మాయలాడిం జూచెదఁగాక. అని గంభీరపరుషభాషణంబులఁ దన్నదలించు రాధను గనుంగొని బలశాలియై వేత్రపాణియై యున్న శ్రీదాముఁడు వారి వదలఁ డయ్యెను. రాధావయస్య లత్యంతక్రోధావిష్టలై బలవంతముగా నా శ్రీదామునిం ద్రోచుకొని పోయిరి.

శ్రీకృష్ణుఁ డాకోలాహలం బాలించి రాధాకోప మెఱింగి యంతర్ధానమును జిత్తగించెను. విరజ రాధికాకఠోరశబ్దజాలము శ్రీకృష్ణాంతర్ధానము నెఱింగి భయవివశయై చేయునది నేరక యాక్షణంబ ప్రాణముల యోగబలంబున వదలెను. ఆచెంతనే యావిరజాదేహము నదీరూపమునం బ్రవహించెను. వర్తులాకారమై కోటియోజనవిస్తీర్ణమై యానదీజల మాగోలోకమునఁ బ్రవహించెను. దానివెడల్పు వర్ణనాతీతమయ్యెను.

* అవ్వల రాధ రతిగృహంబునకుం బోయి యట శ్రీహరింగానక విరజ నదీరూపమునఁ బ్రవహించుటంగాంచి యిఁక నేమియుఁ జేయనేరక స్వగృహమునకుం బోయెను. శ్రీకృష్ణుం డంతట నదీరూపమునఁ బ్రవహించు ప్రాణనాయికను విరజను జూచి తత్తీరంబున నిలిచి బిగ్గరగా నేడ్చెను. మనోహారిణీ! విర

---

* ఇటనుండి తృతీయాధ్యాయ మని యెఱుంగఁ దగు.

జాదేవీ! నీవు నాప్రియురాండ్రలో నుత్తమురాలవు. కాన శీఘ్రుంబ నాచెంతకురమ్ము. నిన్ను వదలి నే జీవింపఁగలనే. ఈనదీ రూపమును మాని దేహధారిణివై రమ్ము. నాయాశీఃప్రభావ మున నీకు రూప మలవడుఁగాక! పూర్వరూపముననున్న నీ రూపమగు నిరుపమానమగు దేహమును దాల్చిరమ్ము. జల ములనుండి వెడలిరమ్ము. నీకష్టసిద్ధులు గలుగున ట్లనుగ్రహిం చితి. అను శ్రీకృష్ణునుడుల నాలకించి విరజ యత్యుత్తమ కాంతారూపంబును దాల్చి సాక్షాద్దాత్రిధరయో యనుచంద మున శ్రీహరిమ్రోల నిలిచెను.

ఆవిరజ యలంకారములు నిరుపమానములై యుండెను. ఆయందమున కవి మెఱుగుపెట్టిన ట్లుండెను. అట్టియాకృతి మెఱయఁ బఱతెంచు నాసుదతిం గాంచి ప్రేమోత్కంఠమున శ్రీహరి యాలింగనమొనరించి ముద్దాడెను. ఆప్రేమాలింగన మాత్రముననే యామె గర్భవతియయ్యెను. వర్షశతమున కామె పుత్రసప్తకమును గనెను. ఆకొడుకు లేడుగురు చెంత నుండ నా పురుషోత్తము చెంగటనుండెను. ఒకానొకతఱి విహారలంపటుఁడై యాపూఁబోఁడి బృందావనమున నిర్జనస్థల మున శ్రీహరింగూడి వేడుకమై విహరించెను.

అంతఁ గడపటిబుడుతఁడు సోదరపీడితుఁడై తల్లిభుజాం తరమున కేఁగ బ్రాకెను. పుత్రప్రేమమున నున్న యావిరజను వదలి శ్రీహరి రాధామందిరమున కరిగెను. భుజాంతరమున నలరారు బాలు నూఱడించి యానారీమణి మరలిచూడఁ

గృష్ణుం డట లేఁడయ్యె. రతిసుఖమునఁ దృప్తినొందని యాబిడ ప్రియదర్శనముఁ గోరి విలపించెను. ప్రియు నెడఁ బాపినవాఁ డీతఁడే యని యెంచి కొడుకును జూచి నీ వుప్పుసంద్రమవు కమ్మా యని శపించె. నీజలము నెవ్వరును ద్రాగకుందురుగాక యని మఱియుఁ దిట్టెను. అంత న్వారకుండక తక్కినకొడుకులఁ జూచి మూర్ఖులారా! మీరెల్లభూతలమున జంబూద్వీపము నకుం బొండు. మీకొకచో నిలుకడ లేకుండుఁగాక. ప్రతిద్వీప మందును నొక్కరొక్కరు జలధిరూపమున నదీనదములం గూడి యుందురుగాక. అనియు శపించెను.

కడగొట్టుకొడు కాతల్లి శాపమున లవణసముద్రమయ్యెను. ఆతఁడు తక్కినవారికందఱకుఁ దల్లియిడిన శాపమును దెల్పెను. వారందఱు దుఃఖితులై తల్లిచెంతకుం బోయి యామెవలన వార్తనెల్ల నాలకించి భూతలంబున కరిగి సప్తద్వీపముల యందును సముద్రరూపముం దాల్చి వరుసగా నిలిచిరి. కని ష్ఠుఁడు మొదలు తొలివానిపర్యంత మొక్కొక్కఁడు ద్విగు ణితపరిమాణమగు సముద్రరూపమున నుండెను. వరుసఁగా లవణేక్షు సురాసర్పిర్దధిదుగ్ధజలార్ణవములని వారిపేరులు. సప్త ద్వీపముల నావరించి నిలిచి మాతృభ్రాతృదుఃఖకర్శితులై విల పించిరి. తల్లియుఁ బుత్రవియోగకారణమునఁ జింతిల్లెను. ఆ చింతనుండి మరలఁ జాలక మూర్ఛిల్లె. ఆవిధమెఱింగి శ్రీహరి సాక్షాత్కరింప శోకమును వదలి యావిరజ సంతోషపరవశ

యయ్యెను. స్మరాతురయగు నాలలనామణి శ్రీహరి భుజాంత సంస్థునిఁ గావించుకొని విహరించెను.

అంత శ్రీకృష్ణుఁ డాసుందరి కతిప్రీతిమై వరమియ్యఁ దలంచి సుందరీ! ప్రతిదినము నీచెంత కరుదెంతు. నిశ్చయము. నాకు రాధయెట్లు ప్రేయసియో నీవు నట్లే. నావర ప్రభావమున నిత్యము నీకొడుకులఁ జూడఁజాలుదువు. అని యిట్లూఱడించుచు నామె విశోకఁజేయుచుండు. శ్రీకృష్ణువృత్తాంత మంతయు గోపికలు రాధ కెఱిఁగించిరి. రాధయు నవ్వార్తనాలించి క్రోధ మందిరమున శయనించెను. అట్టితఱి శ్రీకృష్ణుండు విరజనుండి రాధామందిరమున కరుదెంచి ద్వారభాగమున శ్రీదాముని తోడ నిలిచియుండెను.

రాధయుఁ బయిరాక నెఱింగి వచ్చి క్రోధావిష్టమతియై ప్రాణేశునిం జుఱచుఱంజూచి నాకంటె మాననీయలగు కాంతలు గోలోకమునఁ బెక్కుమందిగలరు. వారియిండ్లకుం బొమ్ము. నాతో నీకేమిపని? నీకుఁ బ్రాణాధిక ప్రియురాలగు విరజ నదీ రూపమున నున్నది కదా! ఆమె నాభయమున దేహముఁ బాసి పుణ్యనదియైనది. ఆమెచెంతకుం బొమ్ము. గోపతీ! ఆనదీతీరమున నిల్లుకట్టుకొని యుండఁబొమ్ము. ఆమె నదియాయె. నీవు నదముగమ్ము. నదమునకు నదితోటిసంగమము గుణవంతముగ నుండునుగదా. స్వజాతియందు నెల్లరకు శయనాసనభోజనము లొనరించు కోరికయుండును. ఇఁక దేవచూడా

మణివగు నీకు నబిపొందుగలుగుట అదృష్టమనవలయు. ఈ వార్త విన్నచో సజ్జను లానందపరవశు లగుదురు. ఏజనులు నిన్ను సర్వేశుఁడని నుతింతురో వారికి నీతత్త్వ మంతగాఁ దెలియదు. సర్వభూతాత్ముఁడవగు నీవు నదీసంభోగమును గోరు చున్నాఁడవు ఓహో! ఎట్టి యదృష్టము! ఎట్టి మహిమము!

అని పలికి రోషావేశమున నింకేమియుఁ బలుకఁజాలక యూరకుండెను. భూమిమీఁదఁ బరుండెను. లక్షగోపికలు గొల్చుచుండినను లేవలేకపోయెను. ఆమెకు శీతలోపచార ములు పెక్కుమంది పెక్కుతెఱంగుల నొనరించిరి. కొందఱు వీణియలు చేతులంబూని వాయించిరి. మృదంగధ్వనులఁ గొం దఱు రాధకు శ్రుతిసంతోషమును గల్పింపనెంచిరి. ఇట్లెన్ని యో రీతుల నెందఱో గోపిక లుపచారములు సేయుచుఁ గృష్ణుని ద్వారముదాఁటి లోనికిఁ బోకుండ నిలువంబడిరి.

అంత రాధ తనయెదుటనున్న ప్రాణేశు నుపలక్షించి మరల నిట్లు పలికెను. ఆమాట తగినదిగాక న్యాయముగాక మర్యాద ననుసరింపక యతికఠినమైయుండెను. ఓవిరజాకాం తుఁడా! నాయెదుట నిలువక పొమ్ము, చోరరతిలంపటుఁడవు. ఇట్టి నీవు నన్నెట్లు భ్రమింపఁజేయఁగలవు. వేగంబ పద్మావతి యింటికిం బొమ్ము. రత్నమాలగృహమునకైనం జనుము. ఆమె నీకు మనోహరురాలుకదా! రూపమున నాయంతవారుగలరే యని విఱ్ఱవీఁగు వనమాలాసౌధంబునకైనం జనుటొప్పు. ఓనదీ కాంతుఁడా! దేవదేవేశా! గురువులకు గురుఁడవు. ఇట్టి నీతత్త్వ

నెఱింగితి. ఇఁకఁ జాలునుజాలును. పోపొమ్ము. నాయీసౌధంబున నిల్వకుము.

ఓకృష్ణా! మనుష్యవ్యవహారలంపటుఁడవు. కావున మనుష్యలోకమున భారతభూమిఁ బుట్టుకంగాంచుము. గోలోకము నుండి వెడలుదువు గాక! ఓపద్మావతీ! ఓసుశీలా! ఓశశికలా! ఓమాధవీ! అని చెలికత్తియలం జేరి యీ ధూర్తుని గృష్ణుని నిల్వరింపుఁడు. ఇట నేమిపనియున్నది? ఆవలఁ బొమ్మనుఁ డని పలికెను.

ఇట్లు రాధపలుక విని గోపిక లాహరినిం గాంచి వినయమున న్యాయసమ్మతమగునట్లు శ్రీకృష్ణా! యిప్పటి కెందైనఁ బొమ్ము. రాధ కోప ముపశమిల్లఁగనే పిలుతుము. అపుడు వత్తువుగాని యిపుడేగుము. అని కొందఱు పలికిరి. మఱికొందఱు చేడియలు స్వామీ! క్షణమాత్రమున నీమె కోప మడంగు. అంతవఱ కెటకైనఁబోఁదగు. ఈరాధ మీచే వృద్ధి నొందింపఁబడినది. ఇట్టి నీతోఁదప్ప మఱెవ్వరితో నిట్టులాడును! మఱియుఁ గొందఱు పూఁబోఁడులు నాథా! క్షణకాలము బృందావనమున కరుగుము. ఈమె నోదార్తుము, కరుణింపుము. మఱియుఁ గలవయస్యలు కాముకా! మానినికి మానాపనయన మొనరింపుము. ఇంకను గొంద ఱీశా! మఱొకభార్య యింటి కేగుము. కామినీలోలుఁడ వగు నీకు యథోచిత సత్కారము లొనరింతుము.

అని యిట్లు పెక్కుమంది పెక్కురీతులఁ బల్కుచుండిరి. జగత్కారణకారణు నిట్లు చేడియలు పల్కుచుండ శ్రీహరి

గేహాంతరమునకుం బోవుచుండుట గనుఁగొని కోపమును బట్టఁ జాలక రాధాదేవిని జూచి యామె రోషమొంది కన్నులెఱ్ఱ వాఱనుండుట నెఱింగియుఁ దల్లీ! మదీశ్వరుని గోలోకనాథుని నిట్లు కటువాక్యంబుల నాడెదవే. ఇది తగిన పని యగునా! తప్పొప్పుల విచారింపక వృథా యిట్లు తూలనాడెదవు? బ్రహ్మా నంతేశ్వరుల కీశ్వరుండయి జగత్కారణకారణుం డై వాణీ పద్మాలయామాయాప్రకృతీశ్వరుండై నిర్గుణుండై స్వాత్మారాముండై పూర్ణకాముండై యలరు శ్రీకృష్ణు నిట్లు గేలిసేసెదవు! ఏపరమేశ్వరుని సేవవలన రాణులలో నుత్తమురాలవైతివో, ఏభగవంతుని పాదార్చనమువలన లోకేశ్వరి వైతివో అట్టి సకలకల్యాణగుణనిధి యగు శ్రీకృష్ణు నెఱుంగక తూలనాడె దవు ? భ్రూభంగలీలామాత్రమున నీవంటిసుందరాంగులఁ బెక్కండ్ర సృజింపఁ గల భగవంతు నెఱుంగఁజాలక వైకుంఠ లోకమున శ్రీహరియన నలరు నీభగవంతుని పాదారవిందము లను లక్ష్మీదేవి యాత్మీయశిరోజముల మార్జనమొనరించును. సరస్వతియు శ్రోత్రామృతము లనందగు స్తవముల నిరంతరము భక్తిమెయి సంస్తుతించును. అట్టిదేవదేవు నెఱుంగఁ జాలకున్న దానవు. * సర్వజగద్బీజరూపిణియై మాయ యనం బ్రఖ్యాతి నొందిన ప్రకృతి యేపరమాత్మను స్తుతించునో యట్టి విరాట్పు

---

* భీతాచ ప్రకృతిర్మాయా సర్వేషాం బీజరూపిణీ, సతతం స్తౌతి యం భక్త్యా తం న జానాతి మానిని. అని మూ. 3 అ. ౭౪ శ్లో.

దీనిచేఁ బార్వతి మూలప్రకృతిగా నిటఁ జెప్పఁబడినదని గ్రహింపఁ దగు.

రహ స్య మెఱుంగఁజాలవు కదా. *సకలవేదములు నీపరాత్పరునిమ హిమమందుఁ బదాఱవపాలైన వర్ణింపఁజాలవో ఏకాలములో నెందైన నెఱుంగఁజాలవో అట్టి సనాతను నెఱుంగకున్నదానవు. ఈశ్వరీ! చతురాననుఁడు వేదజనకుఁడు కదా. అట్టి బ్రహ్మ నిరంతర మాపరాత్పరుని నుతించుచు సేవించుచు నుండును. శంకరుఁ డైదుమోముల యోగిధ్యేయుని వినుతించుచుండు. మఱియు నానంద బాష్పపరికలితముఖుండై శ్రీకృష్ణపాదారవిందముల సేవించును. అనంతుఁడు సహస్రముఖంబులఁ బరమేశ్వరుని సతతము నుతిసల్పుచుండును. సర్వపాలకుండగు ధర్ముఁడు జగత్పతి తానయ్యు నీపరతత్త్వమును సేవించును. శ్వేతద్వీప నివాసియగు శ్రీమహావిష్ణువు స్వయంవిభుఁడయ్యు నీయన యంశరూపుఁడయ్యు సదా నామస్మరణ మొనర్పుచుండును. సురాసురమనుమనుష్యులు సేవించుచుండియు నీఘనునిపాద దర్శనము చేయనేరకున్నవారు. అట్టివేదాంతవేద్యుని దూషించెదవు. తల్లీ! వేగంబ రోషం బుజ్జగింపుము. పాదారవిందముల నపరాధముక్తికై భజింపుము. ఈభగవంతుఁ డాగ్రహించిన బ్రహ్మ క్షణమాత్రమున చ్యుతుఁడగు. చతుర్దశనిర్జరాధిపు లే పరమేష్ఠిదినార్థమునఁ బదచ్యుతు లగుదురు. అట్టిదినముల

---

* స్తువంతి సతతం వేదా మహిమ్న ష్షోడశీం కలాం, కదాపి న విజానంతి తం నజానాసి భామిని. అని మూ. 3 అ. ౯౬ శ్లో. రచనాప్రణాళిక యందు వేదములు భగవత్తత్త్వము నెఱుంగఁజాల వనుట కిది ప్రమాణమని గ్రహింపఁ దగు.

లెక్కింప నూఱుసంవత్సరము లా బ్రహ్మ కాయువగు. అట్టి బ్రహ్మయే సేవించు శ్రీకృష్ణు నేల దూషించెదవు? నీవు నీ వయస్యులు మదీశ్వరసంశోంవదలు గదా.

అను శ్రీదామోక్తుల నాలకించి కర్ణకఠోరములయి యవ్వి తోఁపఁ దటాలున మహాక్రోధ పరవశురాలయ్యెను. వెంటనే లోపలనుండి బహిర్భాగమున కరుదెంచి యారాసేశ్వరి యధరోష్ఠము కంపింప వెంద్రుకలు ముడివీడ నేత్రము లరుణాంబుజ ప్రతిభసమకూర్ప శ్రీదాముని నుద్దేశించి యిట్లు పలికెను. ఓరీ జాల్ముఁడా! నీవు మిగుల మూఢుఁడవు. విషయ లంపటకింకరుండవు. నీవు శ్రీకృష్ణు నెఱుంగుదువు కాఁబోలు. నేనెఱుంగను గాఁబోలు. ఈదేవుఁడు మాకీశ్వరుఁడు కాఁడు. నీకే యీశ్వరుఁడు. నీతండ్రి నెఱుంగుదు. నీవు తండ్రిని భూషించి తల్లినిదూషించెదవు అసురులు దూషించునట్లు నీవు నన్ను దూషించితివి. కావున నసురుండవు గమ్ము. గోపుఁడా! గోలోకభ్రష్టుఁడవు కమ్ము. అసురయోనిం బుట్టుము. ఇదె యీ శాపమిచ్చితి. నిన్నీ శాపంబునుండి రక్షించువా రెవ్వరు?

అని యిట్లు రాసనాయికయగు రాధ పలికి యూరకుండెను. భూమిపైఁ బొరలాడు నారాధను హస్తములఁ జామరము లూని వయస్యలు సేవించుచుండిరి. శ్రీదాముం డారాధా క్రోధానుప్రయుక్తభాషణంబుల నాలకించి మిగులఁ గోపించి యధరోష్ఠ మదరుచుండ నంబా! నీవును మనుష్యయోనిం బుట్టుము. మానుషివలె నాగ్రహించితివి. కాన నీకామూను

పత్యము లభించును. సందేహము లేదు. కళచేతను, ఛాయ చేతనుగళంకముగలదానవు గమ్ము. శ్రీహరి నీయిడినశాపంబున నందవ్రజంబున గోపాలకుఁడై పుట్టును. ఆగోపాలకుని గూడి యుండుము. మీయిరువురకు శతవర్షంబులు వియోగంబు గలుగును. ఆవల భర్తను బొందఁగలవు. తరువాత గోలోకంబున కరుదేరఁగలవు.

అని యిట్లు రాధను శపించి యచటు వాసి భగవంతుని చెంతకుం బోయి వలఁగొని శాపవృత్తాంతము నెఱిఁగించెను. పదంపడి చింత మైకొన విలపించెను. ఇట్టులు రోదనము చేయు శ్రీదామునిం జూచి శ్రీకృష్ణుం డిట్లు పలికెను. వత్సా! శ్రీదామా! భూలోకంబునకుం బొమ్ము. మర్త్యలోకంబున రాక్షసుఁడవై జనించిన నిన్ను ముల్లోకవాసులు నోడింపఁజాలరు. రాక్షసేంద్రుఁడ వగుదువు. కొంతకాలము కాఁగా శ్రీశంకరు శూలమున హతుఁడవై కళేబరముం బాసి మత్సన్నిధి కరుదెంతువు. ఏఁబదియుగంబులు దాఁటి మదాశీఃపాత్రుండవై యిటకు రాఁగలుగుదువు. సందేహింపకుము. పొమ్ము. అని భగవంతుఁడు పలుక నాలకించి శ్రీదాముఁడు దుఃఖాకులమానసుఁడై స్వామీ! ఏకాలమందైనను మీభక్తివిరహితుఁడను గాకుండ నుండున ట్లనుగ్రహింపుఁడు. అని వినయభక్తియుతుండై నమస్కరించి వెడలిపోయెను.

శ్రీదాముఁడు వెళ్లినపిదప విలపించుచు రాధయు భగవంతుని చెంతకేగెను. మార్గమున శ్రీదామునిం జూచి రాధిక

ప్రేమచే వత్సా! ఎందుల కేగెద వని విలపించెను. శ్రీదాముఁ డును రాధికం జూచి బిట్టు విలపించెను. విధివశమని వారిరు వురును దుఃఖవిముక్తులైరి. ఆశ్రీదాముఁడే మర్త్యలోకమున శంఖచూడుఁ డనం బుట్టి తులసీపతియయ్యెను. శ్రీదాముఁడు చనిన పిమ్మట రాధయు భర్తృసన్నిధికింబోయి జరగినవృత్తాంత మును యథారీతిగా విన్నవించెను. శోకార్తయగు రాధి కను భగవంతుఁడు ప్రేమతో నూఱడించెను శాపమనుభవింప రాధిక వృషభానునింట జన్మింపఁ బోయెను. *

పాఠకులారా! భగవంతుఁడు సర్వజ్ఞుఁడగుట ముందే యేకార్యము లెట్లెట్లుజరగఁ దగునో ఆయాయి హేతువులఁ గల్పించుచుండును. దానును వారింగూడి దుఃఖించుచుండును. విరజ నదీరూపమున నుండుట లోకోపకారమని భగవంతుఁ డెఱుంగును. ఆమెకు రాధనుండి భయమునుగల్గించెను. తాను మాత్రము నిర్లిప్తుఁడైయుండెను. ఆవల శ్రీదామునిద్వారా రాధకు హితముపదేశించెను. దాన నామె కోపమూని యత నిని శపించెను. ఆతఁ డామెను శపించెను. వీరిరువురును మను ష్యలోకమునఁ బుట్టునట్లే వారిశాపములు వెలసెను. ఇట్లు పర స్పరశాపఫలముల ననుభవించు నట్లుచేసి తాను వారినోదార్చి యేమియు నెఱుంగనట్లు నటించెను. ఎవ రెవరికర్మఫలముల వా

---

* శ్రీకృష్ణజన్మఖండమున మూఁడవయధ్యాయము సంపూర్ణమని తెలియందగు.

రనుభవింపక తప్పదను పాఠము లోకులకు నేర్పుటకే యీ ప్రయత్నమని మనము గ్రహింపవలయు.

ఇంకొక్కవిశేష మిందుఁగలదు. ఏభక్తులుకోరికతో భగవంతు నుపాసింతురో వారిదృఢతపఃఫలమును బ్రసాదించును. భగవంతుఁడు పుత్త్రుఁడుగాఁ బుట్టవలయునని కోరినచోఁ దాఁ దనయుఁడై జన్మించును. కామాతురత భర్తగా భగవదుపాసనమొనరించిన వారి కామము దీర్పుపాంకు భర్తయే యగును. విరజ కామాభిలాషిణియై తన్ను సేవింప భక్తవత్సలుఁ డవుట నట్లే యామెకుఁ దృప్తిఁగల్గించెను. కాఁబట్టి భగవంతునియందు జారత్వాదిగుణముల నారోపించుట కేవల మవివేకము. పరమాత్మవలన నెఱవేఱని కోరికలుండు ననుట కన్నఁ బరిహాసాస్పదవిషయ మేమియుండును.

అట్లు లగుట భగవంతు నుపాసించుట యందు దృఢభక్తి యుక్తుఁడు గావలయు అట్టి తపస్సు ఫలింపకపోదు. నియతిమైఁ జేయు నుపాసనము తప్పక ఫలించుననుట కెన్నియే దృష్టాంతము లున్నవి. అవి కాలాంతరమున రూపాంతరమున దేశాంతరమున ఫలింపఁజేయుచు భగవంతుఁడు తన సర్వేశ్వరత్వము నెఱపుచుండును. రామావతారమున నాభగవద్దూపమును గాంచి మోహించిన వారికెల్ల శ్రీకృష్ణావతారముననే యావాంఛలఁ దీర్పనెంచెను. అట్టివారందఱు ద్వాపరాంతమున భూతలంబున గోపికలై జన్మించిరి. ఆదివ్యమంగళవిగ్రహమును దమపూర్వజన్మతపఃఫలముగాఁ గౌఁగిలించుకొని

కృతకృత్యులైరి. ఆవిషయ మెఱుంగక పామరులు శ్రీకృష్ణుని యందు జారత్వ మారోపించుట వెఱ్ఱితనముగాక మఱే మున్నది.

ఇంతట నీవిషయమును వదలి కథానుబంధమును దెలుపుటకై లేఖినిం ద్రిప్పెదను. ఇట్లురాధయు శ్రీదాముఁడును బరస్పరశాపఫలముల ననుభవింప భూలోకమున జన్మింపఁ బోయిరిగదా. భగవదవతారమునకు ముందే తత్కార్యహేతువులు వెలయుచుండును. ప్రధానకార్యము నెఱవేఱె. ఇంక నవ్వలికథ నవధరింపుఁడు. ఒక్కొక్క కథను జదివి తత్సార మెద్దియని గ్రహింపుఁడు. అదియే ఫలమని నమ్ముఁడు. భగవంతునివిలాస మిం దేరూపమున వెలసెనో యాలోచింపుఁడు. దాని నెఱుంగుట యనఁగా భగవంతు నెఱుంగుట యని నమ్మవలయు. అట్లు నమ్మిన భగవత్కృపాపాత్రులగుదురు. సత్యము. సత్యము. సత్యము.

ఈవిధముగా గోలోకమునకు బ్రహ్మాదులు పోవ భగవంతుఁడు వారి నూఱడించి తా నవతరింతు నని విశ్వాసము పుట్టఁ బలికి తనకు సహాయులుగా నవతరింపఁదగిన వారినెల్ల నియోగించి తానును భూలోకగమనోన్ముఖుం డయ్యె నని యింతవఱకుఁ దెలిసికొంటిమి. ఇంక నెవరెవరు నేయేకారణముల భూలోకమున నవతరించిరో వారివలనఁ గలుగు నుపకారములెవ్వియో తెలిసికొనవలయును. ఇంద ఱిన్నివిధముల నవతరించినఁగాని యాకాలమున లోకమున ధర్మము నిలువ దనుట ముఖ్యముగాఁ దెలిసి కొనఁ దగినవిషయము. దానికై

కృష్ణావతారమునకుఁ గొన్ని కథలు సంబంధము లేనట్లు బాహ్య దృష్టికిఁ దోఁచినను సూక్ష్మముగ నాలోచించిన సంబంధము గలిగియుండక తప్పదే యని తోఁచును. కాన నట్టి గాథలను వ్రాయఁ బూనెద. వానిం బఠించినపిదప నెన్నియో శంకలు తొలఁగును.

## తులసీవృత్తాంతము.

శ్రీదాముఁడు రాధాశాపమున రాక్షసుఁడై పుట్టవలసిన శ్లేర్పడియెఁ గదా. భగవంతుఁ డాపనికి నుపదేశము నొసంగి యోదార్చెను. విధివశమున సంభవించిన ఫలము ననుభవింపక తప్పదని బోధించెను. ఆమాటల కాతఁడు తృప్తినొంది పోయెఁగదా. ఆమీఁద నతనివృత్తాంత మించుక తెల్పక తప్పదు. అందులకై ముందు తులస్యుపాఖ్యానము తెలిసికొనుటయు ముఖ్యము. అందులకు మునుముందు మన మెఱుంగఁ దగినది తులసి యొవ రనునదియే. తద్విధమంతయు సవిస్తరముగాఁ దెలుపఁబూని పూర్వకథ నిందు వ్రాయుచున్నాను.

## లక్ష్మీగంగాసరస్వతులు పరస్పరము శపించుకొనుట.

* లక్ష్మియు గంగయు సరస్వతియు శ్రీహరికిఁ బత్నులు. వీరుముగ్వురును నిరంతరము హరిసన్నిధానమున నైకమత్యము

---

* ఈగాథ దేవీభాగవతము దశమస్కంధము షష్ఠాధ్యాయమునుండి గ్రహింపఁబడిన దని యెఱుంగవలయు.

గలిగియుండిరి శ్రీహరియు సమస్నేహమున వర్తించుచుం డెను. కొంతకాలమునకు వీరికి శాపమున భూలోకజన్మము గావలసిన సమయము తటస్థించెను. దానిచే నొకనాఁడు గంగా దేవి ప్రాణనాథుఁడగు శ్రీహరి ముఖసరోజమును సస్మితయై సకామయై పలుమారు చూచెను. భగవంతుఁ డగు శ్రీహరి జగన్నాటకసూత్రధారుఁడు గాన గంగాదేవి తన్నుఁజూచినం తనే యించుక నవ్వెను. వారిరువురి ప్రేమాతిశయమును గన్నులారఁగాంచుచున్న లక్ష్మీసరస్వతు లించుకయైన నోర్వఁ జాలకపోయిరి. అందు లక్ష్మీదేవి యించుకశాంతమూని సపత్ని యగు సరస్వతిని శాంతస్వభావఁ జేయఁబూనెను. దుర్వార క్రోధభీషణయగు సరస్వతి శాంతచిత్తకాకపోయెను.

అంత సరస్వతి రక్తాంతలోచనయై దేహము వణఁకు చుండఁ దద్వేగమున నధరోష్ఠము నాట్యముసేయుచుండ శ్రీ హరిం జూచి యిట్లు పలికెను. ప్రాణేశ్వరా! ధర్మనిష్ఠుఁడగు సద్భ ర్తకు భార్యలయం దెల్ల సమబుద్ధియుండుట సహజము. ఖలుం డయ్యేనేని విపరీతబుద్ధియుండును. శ్రీహరీ! నీకు గంగాదేవి యందు స్మృతియుఁ బ్రేమ మధికముగ నున్నవి. లక్ష్మీదేవియం దును దత్తుల్యముగనే యవి యున్నవి. కాని యేకారణము ననో నాయందవి నీకు లేవు. కావున గంగయు లక్ష్మియు నన్యో న్యానురాగము గలవారైరి. అందుననే కాఁబోలు లక్ష్మి గంగ యం దోర్పుగల దయ్యెను. దురదృష్టవంతురాల నగు నే జీవించియు లాభమేమి? ఎవతుక భర్తచేఁ బ్రేమవిషయమున

వంచింపఁబడునో యానెలఁత జన్మము నిష్ఫలము. నిన్ను నే మానులందఱు సత్త్వరూపునిగా వచింతురో వారెల్ల మూర్ఖులు. వారు వేదవేత్తలుకారు. నీతత్త్వమెఱుంగక యట్లు వచించువారు.

ఇట్లు సరస్వతి క్రోధఘూర్ణమానమానసయై యొడలెఱుంగక మాటలాడుచుండుటఁ దలంచి భగవంతుఁడు తటాలున వెలుపలికిఁ బోయి సభామండపమునఁ గూరుచుండెను. భర్త వెలుపలికిం బోవఁగనే రోషము నాపఁజాలక వాగ్దేవి యాగంగాదేవిం గాంచి శ్రవణదుష్కరమగు వాక్యము నిట్లు పల్కెను. సిగ్గులేనిగంగాదేవీ! కాముకులారా! భర్త నీప్రక్క నున్నవాఁ డన్న గర్వమున విఱ్ఱవీఁగెదవా? నీయందు భర్తకుంగల ప్రీతిని నాకుం దెలుపనెంచితివా? నీపతియెదుట నీ గౌరవమును భస్మముచేసెదను. పతిని లోఁబఱచుకొన్న మాయలాడీ! నీభర్త యేమిచేయునో చూచెదఁగాక. అని పలికి యాగ్రహావేశమున వాణి గంగాదేవి కొప్పు పట్టుకొన నుద్యుక్తురా లయ్యెను.

అంత లక్ష్మీదేవి వారినడుమఁ జొచ్చి వారించెను. తన కార్యము సాగకుండఁజేసిన లక్ష్మిపై శారద కోపమూని లక్ష్మీ! గంగకు నీకును మైత్రి దృఢముగనున్నది. కాన నడ్డమువచ్చితివి. దీనిఫల మనుభవింపుము. నీవు మర్త్యలోకమున నదీరూపమునను వృక్షరూపమునను జన్మమొందుము సంశయము లేక యీశాపము ననుభవింపుము. నోరెత్తి మాటాడకుము.

విష్ణుసభయందు నదియు వృక్షము నెట్లుండునో చూచెదం గాక. అని శాప మొసంగెను.

లక్ష్మీదేవి యాశాపమును వినియు బదులుపలుకక యాగ్రహింపక సరస్వతి చేయిఁబట్టుకొని దుఃఖితురాలగుచు నూరకుండెను. తనకు సాయము చేయఁబూని కలహము నివారింప నడుదెంచిన లక్ష్మిని శపించిన సరస్వతిని గోపమున నధరోష్ఠము వడఁకుచుండ నున్న దానిని జూచి గంగ యోర్వరానికోపమున శపింపఁదలంచి ముందు లక్ష్మి కిట్లనియె. పంకజాలయా! క్రోధావిలచిత్తయగు శారదనువదలుము. ఇది నన్నేమిచేయఁగలదు? దుశ్శీలనై, వదరుఁబోతై, గర్వవాక్కు గలదిగదా యీవాణి. కలహము నే నిరంతరము గోరుచుండును. యథాశక్తి యథాయోగ్యతగా వాదింప నిమ్ము. నాశక్తిని దనశక్తిని గనుఁగొనంగోరుచున్నది. మీరెల్లరు మీతారతమ్యము నెఱుంగుదురు గాక. అని పలికి యాపరానికోపమున సరస్వతిం జూచి నీవు నదీరూపముం దాల్చి మర్త్యలోకంబున నుందువుగాక! ఎందు మిగులఁ బాపాత్ములు గలరో, ఎందు నధర్మము వృద్ధియగుచుండునో అట్టి భూలోకమున నివసించి పాపాత్ములపాపముల లోఁగొనుచు నుందువుగాక యని శపించెను.

ఆశాపము విన్నంత సరస్వతికి వర్ణనాతీతక్రోధము హెచ్చెను. ఒడలు కంపింపసాగెను. ప్రతిశాపం బొసంగు నూహ ప్రబలెను. అంత శారద గంగంగాంచి పాపాత్మురాలా! నీవే మహీతలమున కరుగుదువు గాక. పాపముఁ బొందుదువు

గాక. అని యింక నేమో చెప్పఁ బూనునంతలో భగవంతుఁడు సాక్షాత్కరించి చతుర్భుజధారులగు పార్షదులుకొలువం జతుర్బాహువులు చెలువుసూపఁ దటాలున నాసరస్వతిం జేరందిగిచి వక్షస్థ్సలమును జేర్చెను. లలితవచనములం బురాతనవృత్తాంతమును దెలిపెను. పరస్పరకలహకారణము, శాపహేతువును దెలియఁజెప్పెను. దానిని విని వారు ముప్పురు విధివశమున నిట్లులాయెఁగదా యని మిగుల వగచిరి. దుఃఖించువారలంగని భగవంతుఁ డిట్లు లానతిచ్చెను.

లక్ష్మీదేవీ! కళచే మర్త్యలోకంబునకుం బోయి ధర్మధ్వజునిగేహంబున నయోనిసంభవవై యతనికిం బుత్త్రివి గమ్ము. అందే దైవదోషమున వృక్షత్వ మొందఁగలవు. మదంశజనితుఁ డగు శంఖచూడునకుఁ బత్నివై కాలాంతరమున నిటఁజేరి నాకుఁ బత్నివగుదువు. సంశయము వలదు. వృక్షరూపమును బొంది భారతమునఁ దులసి యనుపేరం బరఁగఁగలవు. కలామాత్రమున నదివై యుండఁ గలవు. ఆలసింపక పొమ్ము. భారతీ శాపమున భారతమునఁ బద్మావతివనఁ బ్రఖ్యాతినొందఁగలవు. అని గంగాదేవిం గనుంగొని యిట్లు పల్కెను.

గంగాదేవీ! లక్ష్మివెనుక విశ్వపావనివగు నీవు కలామాత్రమున భూలోకమునకుం బొమ్ము. పాపాత్ములపాపరాసుల దహింపుము. భగీరథుండను భూజాని తపమొనరించి భూలోకమున నిన్ను రాఁ బ్రార్థించును. దాన నీవటకుం బోయి

భాగీరథివనం బ్రఖ్యాతినొందుము. మదంశముగల సముద్రు నకు భార్యవై యుండుము.

అని పలికి సరస్వతి దిక్కు మొగంబై భారతీ! కలామా త్రంబున గంగాశాపమున భారతభూమిని బొందుము. సపత్ను లతోఁ గలహించిన ఫలము వారలతో ననుభవింపుము. నీవు సత్యలోకమున బ్రహ్మకు భార్యవుగమ్ము. గంగాదేవి శివునిదగ్గ రకుఁ బోవుఁగాక. లక్ష్మీదేవి యిందే యుండుఁగాక. శాంతయై, క్రోధరహితయై సత్త్వరూపిణియై తగు లక్ష్మి యిందే యిపుడుం డం దగు. లోకమున ముప్వురుభార్యలు, ముప్వురు సేవకులు, ముప్వురు బాంధవులు నెవరికుండునో వారికి శుభములు గలు గవు. ఇట్లుండుటయు వేదవిరుద్ధము నగు. ఎవరియిండ్ల స్త్రీలు పురుషులవలె సర్వకార్యప్రచారము సేయుచుందురో, ఏపురు షుఁడు స్త్రీవశుండగునో వారందఱజన్మము నిష్ఫలము. ఏనారి వాక్కున దుష్టయగునో, ఏస్త్రీవ్యభిచారిణి యగునో, ఏవనిత కలహప్రియయో, అట్టి నారీపతి వెంటనే యరణ్యమునకుం బోవలయును. ఆపురుషునకు గృహమునకన్న నడవి సుఖప్రద మగును. అందు సుస్థలము నివసింపను, శుద్ధజలము త్రాగను, సత్ఫలములు భక్షింపను దొరకును. ఎల్లప్పు డందాతనికిఁ బూర్వోక్తపదార్థములు సులభముగా లభించును. గృహమం దవి లభింపవు. పరహింస్ర జంతువుల సన్నిధినుండుటకన్న నగ్నినిజొచ్చుట చాలమేలు. సుఖముగూడ నగును. అగ్ని ప్రవేశమునకన్న దుష్టస్త్రీసన్నిధి దుఃఖకరమైనది. వ్యాధిజ్వా

లయు, విషజ్వాలయు, దుష్టస్త్రీముఖ జ్వాలకన్నఁ బురుషునకు మంచివనవచ్చును. దుష్టకాంతాముఖజ్వాల మరణమునకన్నఁ బీడను గల్గించును. కాంతాజితులగు పురుషులకు భస్మమగు పఱకు శుద్ధిలేదు. ఏపగలు చేయుపుణ్యకర్మము లాతనికి సత్ఫలము నీయక యాపగటియందే నశించుచుండును. ఆతం డిహపరలోకముల నిందితుండగు. ఎవఁడు యశఃకీర్తివిహీనుఁడో యతఁడు జీవించియు మృతుఁడగు. * పెక్కుమందిపత్నులు కలిసియుండుట శ్రేయస్కరము గాదు. ఒకభార్యగలవాఁడు సుఖవంతుఁడు. బహుభార్యలుగలవాఁ డెకప్పుడైన సుఖపడఁడు. గంగాదేవి శివస్థానము బొందుఁగాక. సరస్వతి బ్రహ్మలోకము నొందుఁగాక! సుశీలయగు పంకజాలయ యిట నుండుఁగాక! ఎవనిపత్ని సుశీలయు భర్తృశాసనమును బాలించునో అతనికి నీలోకమున సుఖము, పరలోకమున ముక్తియుఁ గరతలామలకములు. దుశ్శీలయగు స్త్రీకెవఁడు భర్తయగునో ఆతఁడు జీవన్మృతుఁ డనంబడు. అని పలికి భగవంతుండగు శ్రీహరి వారి సమాధానపఱచెను.

ఆర్యమహాశయులార! ఈకథాసారమేది యని యాలోచింపుఁడు. అనేకనీతులు దీనినుండి తేలఁగలవు. బహుభార్యలు గలవాఁడు గారాదనియు, ఎంతవాఁడైనఁ బెక్కుమందిపత్నులను విరోధముగలుగకుండఁ గాపాడఁజాలఁడనియు, స్త్రీ లెంత వారైనను బరస్పరానురాగముగలవారుగా నుండఁజాల

---

* బహ్వీనాం చ సపత్నీనాం నైకత్ర శ్రేయసే స్థితిః, ఏకభార్య స్సుఖీ నైవ బహుభార్యః కదాచన. ౭౮ శ్లో.

రనియుఁ గొంతకాలముండినను బిదప మిక్కుటముగ విరో ధము లుప్పతిల్లు ననియు, శీఘ్రక్రోధము స్వాపకారహేతు వగు ననియు, అసూయ కడుమోసగించుచు సకలకష్టముల నొసంగుననియు, ఎంతవారికే నవి యుండరానివనియు, నంత కన్న శత్రువులు లేరనియు నీకథనుండి గ్రహింపఁదగిన నీతులు. ఇంకను బ్రాజ్ఞులగు వా రాలోచించినఁ దేటపడఁ గలవు. కాని యంతటి ప్రజ్ఞ చాలనికతన తోఁచినన్ని వ్రాసి తిని. ఈముప్వురు భూలోకమునఁ బుట్టుగాథ లీగ్రంథమున కుపకరింపఁజాలవని వదలి యిందు లక్ష్మీదేవిపుట్టుకనుమాత్రము తెలియఁబఱచెదను.

## కుశధ్వజునింట లక్ష్మీదేవి పుట్టుట.

* కుశధ్వజుఁడు ధర్మపరాయణుఁడై విష్ణుభక్తినిరతుఁడై యుండెను. ఆతనిభార్య మాలావతియనఁ బ్రఖ్యాతివహించి పతివ్రతాశిరోమణి యయ్యెను. కొంతకాలమున కామాలా వతి కమలాంశముగల పుత్రికను గాంచెను. ఆకొమరితయు పుట్టినప్పటినుండియు జ్ఞానయుక్తయై యలరారుచు సూతికాగృ హమునందే వేదధ్వని యొనరించుచు లేచెను. వేదనాదమును జాతమాత్రమున నొనరించినందున నాయమపేరు వేదవతి యని తండ్రిపలికెను. అంత నాకన్యక యింటనుండ నొల్లక తపోవనం బున కరిగి తపంబొనరించెద నని పోవం బోవనీక యందఱు

* ఈకథ దేవీభాగవతము నవమస్కంధము పదాఱవయధ్యాయము నుండి గ్రహింపఁబడిన దని యెఱుంగఁ దగు.

నిర్బంధించిరి. కాని నారాయణపరాయణయై వారి నిలిపి వనం బునకుం జని యతి నియమమునఁ బుష్కరంబున నుగ్రతరం బగు తపం బొనరింపసాగెను. తపం బెంత కృచ్ఛ్రతరమైనను ఆకన్నియ కృశింపక క్లేశ మొందను నవయౌవన మలర నుం డెను. ఒకనాఁ డాసుదతి ఆకస్మికముగా "జన్మాంతరమున నీకు శ్రీహరి భర్త కాఁగలఁడు. బ్రహ్మాదులకేని దురారాధ్యుఁడగు శ్రీహరిని బతిని బొంది సుఖింపఁగలవు" అను నశరీర వాక్కును వినెను. దాన నాసతికిఁ దృప్తి కలుగదయ్యెను. పూనిక వదలక మరలఁ దపంబొనరింపఁ బూని యచ్చటువాసి నిర్జనస్థానమగు గంధమాదనపర్వతమునకుం బోయి చిరకాల మం దాశ్ర మంబుఁ గల్పించు కొని నివసించి యతినియమవతియై దారుణ తరతపం బొనరించెను.

అంత నొకనాఁడా సాధ్వీమణి కఠోరహృదయుఁడగు రావణుం గాంచి యతిథిబుద్ధిచేఁ బాద్యంబొసంగి శీతలజలముల నిచ్చి సుస్వాదుఫలంబుల నిడ వానినెల్ల గ్రహించి యాపాపా త్ముఁడట నివసించి చెంతకేగి యోకల్యాణీ! నీవెవ్వతవు! ఏల యిం దొంటి నున్నదానవు? అని ప్రశ్నించెను. అంతతో నిలువ కాదుష్టుఁడు వరారోహ యై పీనశ్రోణిపయోధర యై శరత్పద్మోత్పలహాస్య యై సస్మిత యై సుదతి యై సతి యై యల రారు నాజలజలోచనం జూచి చూచి స్మరశరవిసరపీడితుం డై మూర్ఛిల్లెను.

అంతఁ గొంతసేపటికి స్మృతి గలుగ లేచి యన్యాయ మిది యని తలంపక తనఁ బ్రాణాపాయముమాత్రము కాక వంశనాశనమగునని యూహింపక తటాలున నామెం గరమున నొడిసిపట్టుకొని శృంగార చేష్టలు చూపఁబూనెను. వేదవతియు భృశకోపపీడిత యై హుంకారమాత్రంబున నాతని స్తంభింపఁ జేసెను. దాన వాఁడు జడుఁడై కరపాదములనైనఁ గదలుపం జాలక యొకమాటయైన నాడశక్తిలేకయుండెను. కాని మనం బున నాసాధ్వీమహిమమును గొనియాడెను. ఆరీతి నెఱింగి యాతని కింకేమియు నపకృతిని జేయఁబూనక యుండియు నా తని కుచేష్టల కాగ్రహంబు వీటిఁబుచ్చఁజాలక "రావణా! నా నిమిత్తమున సభాంధవుఁడ వగు నీవు వినాశ మొందుదువు. కామాతురుఁడ వగు నీచే స్పృశింపఁబడితిని. చూడఁబడితిని. నాశక్తి నించుక చూడుము" అని పలికి తత్స్పృష్టమగు తను వును విడనాడ నెంచి యోగబలంబున నాతనువును దహించెను.

ఆ బూదిరాశిని గంగలోఁ గలిపి రావణుం డింటికిం బోయెను. ఏమి యద్భుత మిది? ఎట్టి గట్టికార్య మొనరించెను? ఏమి యీమె తపశ్శక్తి? యనుకొనుచుఁ దనచేసిన యవినయ ముం దలంచుకొని వెక్కి వెక్కి యేడ్చెను. తప్పుచేసితి నింకేమి కీడుమూడునో యని భీతిల్లెను. కానున్నది కాకమానునా యని చింతఁబొసెను.

ఆ వేదవతియుఁ గాలాంతరమున జనకమహీజానికిం గూఁ తురై పరమసాధ్వియై సీత యనుపేరం బ్రఖ్యాతయై తద్దుష్టస

మానీతయై యాతని సబాంధవముగ నాశన మొనరించెను. పూర్వజన్మతపఃఫలముగ శ్రీహరియే మనుష్యరూపంబునం బుట్టుటచే నా పరమపురుషుని రామనామధారినే భర్తనుగాఁ బడసెను.

ఇట్లు కమలాంశజనితయగు వేదవతి మరలఁ గమలాదేవిం బొందెను. ఈ వేదవతీచరిత్రము స్మరించినమాత్రమున వేదపఠనఫలము గలుగఁగలదు. పాఠకవర్యులారా! ఈయుపాఖ్యానమునుండి వెలువడు నీతు లనేకములు గలవు. తన్నొల్లని కాంతలఁగోరుట తనకుమాత్రము కాక వంశమునకును హానియనియుఁ, దపశ్శక్తికన్న మించినశక్తి ప్రపంచమున లేదనియు, దానిం జెనకుట పిడుగును ముద్దిడుకొన్నట్టిదే యనియు, దేహబలాదులు దాని శతాంశమునకును సమములు కావనియు, దానిచేఁ జేయ శక్యములుకాని కార్యములు లోకమున నుండవనియు దీని నీతిసారము.

ఇఁకఁ గథకు మరలుదము. ఈ వేదవతియే తులసి. ఈమెయే లక్ష్మియని గ్రహింపఁ దగు. కారణాంతరమున లక్ష్మియే యిట్టిరూపాంతరముల నెత్తుచుండును. ఆకార్యము నెఱవేఱిన పిదప మరల వైకుంఠమున కేగుచుండును. అనఁగా లక్ష్మియే ప్రకృతి. శ్రీహరియే విరాట్పురుషుఁడు. ఈయుభయులు గలిసిన నేపనియైన నగును. విరమించినఁ బ్రపంచము నశించును. అను నీవిషయమే గ్రహింపఁదగినది. ఇఁకఁ దులసీదేవ్యుపాఖ్యానమును జిత్తగింపుఁడు.

## తులసీదేవ్యుపాఖ్యానము.

కుశధ్వజుసోదరుఁడు ధర్మధ్వజుఁడను పుణ్యాత్ముఁడు కలఁడు. ఆతని పత్ని మాధవి. ప్రఖ్యాతగుణములు గలది. ఆదంపతులు చిన్నతనమున గంధమాదనమునఁ జిరకాలము విహరించిరి. భోగోచితసకలపరికరములు గొనిపోయి యందుం డిరి. ఎన్నియో వత్సరములు గడచెను గాని యింతకాల మైనదిగదా యన్న జ్ఞానమే వారికిం గలుగలేదు. అంత రాజు క్రీడావిముఖుఁడై వెలయుట నాకాంతయు హృష్టమతి యయ్యెను గాని రతీచ్ఛావిరతిం బొందఁ జాల దయ్యెను. అంతలో నాయన్నులమిన్న చూలాలయ్యెను. ఆచూలు శత వత్సరములు నిలిచెను. ఆగర్భము శ్రీగర్భము, శ్రీయుతము నౌట దినదినాభివృద్ధిం గాంచుచు సంతోషదాయకమే యయ్యెను.

ఒక శుభదినంబున మంగళకరవారంబున నట్టిలగ్నంబున నందు శుభనవాంశమున శుభగ్రహములు బలవంతులై యుం డుతఱి స్త్రీశిశువుఁ గనియె. ఆకాలము కార్తికపూర్ణిమా శుక్రవారమయ్యెను. ఆకన్యక సాక్షాల్లక్ష్మియే. కలామాత్ర మునఁ గారణాంతరమున జన్మించె నన నొప్పెను. ఆమె ముఖము శరద్రాత్రికాచంద్రసంకాశమే. ఆయమలోచనములు శరత్పంకజములే. ఆకన్యక యధరోష్ఠము పక్వబింబఫలమే. ఆమె నునునవ్వులు చంద్రికలే. హస్తపాదములు రక్తవర్ణ ములు. నాభి గంభీరమైనది. త్రివళులుగలిగి వర్తులాకారనితంబ

బింబ మొప్ప, నా మెరూపము వర్ణనాతీతముగ నుండెను. శీత కాలమున సుఖోష్ణసర్వాంగియు, గ్రీష్మసమయమున సుఖశీతలయు, శ్యామలవర్ణయు, న్యగ్రోధపరిమండలయు, పీతచంపకవర్ణవిరాజమానయు, నగు నానారీరత్నము సుందరులలో సుందరి యనం జెన్నువహించెను. తులనసేయరాకుండుట నాకాలపుఁ బౌరాణికులు తులసి యని యామెకుఁ బేరిడిరి.

ఆకన్యక జన్మించినంత సామాన్యస్త్రీప్రకృతిని విడనాడి పూర్వజ్ఞానంబునఁ దపోవనగమనమున కుద్యమింప నెల్లరు వలదని యెంతయో నిర్బంధించిరి. వారిమాటలఁ బాటింపక యాబోటి బదరికాశ్రమమునకుం బోయి యందు నియతిమై నెన్ని యోవత్సరంబులు పరమతపం బొనరించుచు మనంబున నారాయణమూర్తి, స్వామిగావలయు నను చింతఁబూని యుండెను. గ్రీష్మర్తువునఁ బంచాగ్నిమధ్యస్థయై, శీతలకాలమునందుఁ దడివస్త్రమున నిరంతరవర్షధారలకుం దడియుచు, రేయింబగళ్లు విరామము లేక యిరువది వేల సంవత్సరములు ఫలములు జలము లాహారములుగా గ్రహించుచు, ముప్పది వేలవత్సరంబులు పత్రాహారయై, నలువది వేల హాయనంబులు వాయువే యాహారముగా, నవ్వలఁ బది వేలబ్దంబులు నిరాహారయై యేకపాదమున నిలువంబడి ఘోరతపం బొనరించుచు నుండిన యాతులసి నెఱింగి బ్రహ్మ వరంబులొసంగినఁ గాని లోకంబులు నిలువవని తలంచి బదరికాశ్రమమునకు వచ్చెను. హంసవాహనము నధి

రోహించి వేంచేసియున్న చతుర్భుజుని దర్శించి యాతులసీ కన్య సంతుష్టాంతఃకరణ యయ్యెను.

విరించియు నోతులసీ! వరమును గోరుము. ఏకోరిక నీ మనసున నున్నదో తెల్పుము. హరిభక్తియు, హరిదాస్యము, అజరామరత్వము గోరి తప మొనరించుచున్నదానవా యేమి? అని సాదరమునఁ బలుకు నలువం గనుగొని యాతులసి యో తండ్రీ! నామనసునఁ గలకోర్కె నెఱింగించెద. సర్వజ్ఞుఁడవు. నీ యెదుట దాఁపఁదగిన దేమున్నది? నేను దులసియను గోపికను. గోలోకమున నుండుదానను. కృష్ణప్రియురాలను. సదా కృష్ణ సేవాపరాయణురాలను శ్రీగోవిందునితో సుఖించుచు నొడలు తెలియకయున్న నన్ను రాసమండలమున రాసేశ్వరియగు రాధాదేవి కనుంగొనియె. శ్రీగోవిందు నధిక్షేపించుచు నన్ను శపించెను. రాక్షసయోనిం బుట్టువుంగాంచుమను నాశాపమును విని గోవిందుఁ డాదరమున నోకాంతామణీ! నాయంశమునఁబుట్టిన శ్రీహరినే భర్తను బొందఁగలవు. భారతభూమిం బుట్టి తపమొనరించి బ్రహ్మ నలరింపుము. వరము లొసంగును. అని కరుణించెను. పితామహా! రాధాభీతి నట దేహము త్యజించి జన్మించితి. దివ్యమంగళవిగ్రహుండగు శ్రీకాంతుని గాంతునిగాఁ బొందఁ గోరెద. ఇదియ నామనోవాంఛితము. అని యూరకుండెను.

శతానందుఁ డాశతపత్రపత్రనిభేక్షణుం గాంచి దేవా! శ్రీకృష్ణాంగసముద్భవుం డగుగోపకుఁడు సుదాముఁ డనఁ

గలఁడు. భారతమున శ్రీకృష్ణునంశసంభూతుఁడై తేజస్వియై జన్మించెను. ఆతఁ డిపుడు రాధాశాపమున దనువంశమున నుద్భవిల్లెను. శంఖచూడుఁ డని యాతనిపేరు. ముల్లోకములఁ దత్సముఁడు లేఁడు. గోలోకమున నన్నుంగాంచి కామోన్మథిత మానసుఁ డయ్యెను. రాధాశాపము దాఁటరాని దగుటను శ్రీహరి కృపగలవాఁ డగుట జాతిస్మరత్వముఁగాంచి సుదాముఁ డనం బ్రసిద్ధిఁగాంచిన యాతఁడే యిటఁ బుట్టెను. నీవును బూర్వస్మృతిగలదానవు. సర్వ మెఱుంగుదువు. ఇపుడు నీకా తఁడు భర్త కాఁగలఁడు. కొంతకాలమునకుఁ బిదప నారాయణ మూర్తిని భర్తనుగాఁ బొందఁగలవు. నారాయణశాపమునను దైవయోగమువలనను వృక్షరూపమును గాంచఁగలవు. పరమ పావని వగుదువు. యోగ్యపుష్పములయం దెల్ల నీవే ప్రధాన భూతవై విష్ణుప్రాణాధికురాల వగుదువు. నిన్ను వదలి యొన రించుపూజ నిష్ఫలమగును జుమీ. బృందావనమున వృక్ష రూపమున నుండి బృందావని యనం బరఁగుదువు. నీపత్రము లచే గోపికలు గోపాలురు మాధవు నర్చింతురు. వృక్షాధి దేవతవై సదా శ్రీకృష్ణునితోడి సంగతిగలిగి స్వచ్ఛందముగా నావరమున విహరింపఁగలవు.

అని పరమేష్ఠి లలితభణితిఁ బలుక హృష్టమానసయై చిఱునవ్వు మొలకలెత్త నమస్కరించుచుఁ దులసీదేవి యిట్లనియె. తండ్రీ! నిక్కము వచించెద. శ్యామసుందరుండయి ద్విభుజుం డగు శ్రీకృష్ణునియం దెట్టి ప్రీతి గలదో చతుర్భుజు

నియం బట్టి ప్రీతి నాకు లేదు. నేను గోవిందక్రీడయం దతృప్త రాలనైతిని. త్వత్ప్రసాదమున మరల గోవిందునే కోరుదును. సత్యముగా గోవిందునే పొందెద. రాధాభీతినిమాత్రము తొలఁగింపుము. అనుటయు సురజ్యేష్ఠుండు దేవీ! పదాఱక్షర ములుగల రాధామంత్ర మొసంగెద. గ్రహింపుము. దాన రాధకు నత్యంతప్రీతి పాత్రురాల వయ్యెదవు. మీయిరువుర శృంగారచేష్టల రాధిక గ్రహింపఁజాలకుండును. గోవిందునకు నీవు రాధాసమానవగుదువు.

అని పలికి హిరణ్యగర్భుండు షోడశాక్షర రాధామంత్ర మును స్తోత్రమును గవచమును బూజాపద్ధతినిఁ, బురశ్చర్యా విధానము నుపదేశించెను. మంగళాశిషముల నొసంగెను. మదుపదేశరీతి నోతులసీ! పూజ యొనరించితేని సిద్ధురాల వయ్యెదవు. నీకోరికలు ఫలించును. అని సత్యలోకమునకు లోకేశుఁ డరిగెను.

## తులసీశంఖచూడసంవాదము.

అంతఁ దులసియు బదరికావనముననే నివసించెను. కాల క్రమమున నవయౌవనవతి యాయెను. అదియ యదనని యద యుఁడగు మదనుఁడు వివిధములగు విరిశరములఁ బరఁగించి యామె చిత్తమును గలంచెను. పుష్పాయుధదగ్ధయై పుష్ప చందనచర్చలుగలిగి పులకాంచితసర్వావయవయై రక్తలోచన ముల రాజిలి కంపితాంగియై క్షణకాలము శుష్కీభూత యగుచు, క్షణమాత్రమున మూర్ఛనొందుచు, క్షణకాలము

చంచలచిత్తయై, క్షణము సుఖావహాతంద్రను గాంచి, క్షణము మదనాగ్నిజ్వాలల దహింపఁబడుచు, క్షణము ప్రసన్నతం గాంచుచు, రవంత చేతనంబొందుచు, కొంతసేపు విషణ్ణ యగుచు, శయ్యనుండి లేచుచుఁ, దిరుగుచు, ఒడలు తెలియమి నిటునటు సంచరించుచు, మరల శయనించుచు, పుష్పచందన ములను శయ్యను గంటకములుగా భావించుచు, నిట్లు పలు భంగులఁ గష్టములపా లయ్యెను. ఇట్లాలలితాంగి చింతలవంతల బడలెను. సుఖావహపదార్థములు కష్టదాయకములై కన్పడనందు వేషభూషణముల మనోహరుఁడగు నొక పురుషుం గాంచెను. రసికజనశేఖరుఁడై తరుణుఁడై సురుచిరగాత్రుఁడై మంచిగంధం పుఁబూతల నలరారి, రత్నభూషణభూషితుఁడై, సుకుమమాలాధారియై వచ్చు నాపురుషతల్లజుని గనుంగొని యచ్చెరు వందెను. ఆతరుణపురుషుఁడు రతికథలఁ జెప్పుచు, మధుర గానము చేయుచుఁ, జెంతకే తెంచుచున్న ట్లుండెను. ఆతనిం గాంచినంతనే ప్రాణేశా! యెందేగెదవు? అని పలికెను. మరల స్వభావజ్ఞానము రాఁగా నం దెవ్వరు లేకుంట విలపించెను. ఇట్లు మదనవికారములఁ బురుషునిం గాంచినట్లును, ఆతఁడు తనచెంత కరుదెంచుచున్నట్లును భావించెను గాని యం దెవ్వరును లేరు.

శంఖచూడుండును శ్రీకృష్ణమంత్రము జపించుచుఁ బుష్కరతీరమునఁ దపంబొనరించి శ్రీకృష్ణకవచమును ధరించి సర్వమంగళకరమగు తత్ప్రభావమున నుజ్జ్వలతేజము వెలయ

వరము లీయ నరుదెంచిన చతురాననువలన వరములొంది తదాజ్ఞచే బదరికావనమునకుం బోయెను.

తులసీకాంతయు నవయౌవనసంపన్నుఁడై కామదేవ సమానాకారము వెలయ, శ్వేతచంపకవర్ణాభ దేహామలర, రత్నభూషణభూషితాంగ మొప్ప, శరద్రాత్రికాశీతాంశుబింబ సమానముఖము తనర, శరత్పంకజనయనము లొప్పుగులుక, రత్నసారవినిర్మిత విమానారూఢుఁడై హరితసూవిలాసుఁడై మణిగణఖచితకుండలమండితుఁడై కల్పప్రసూనమాలికలఁ దాల్చి కస్తూరీకుంకుమాంచితచందనచర్చలు వెలయఁ, దన చెంతకరుదెంచు నా పురుషశేఖరుని గనుఁగొని తనముఖమును బటముచే నాచ్ఛాదించియుండెను. కాని చిఱునవ్వు మోమునఁ జిందులాడఁ గటాక్షవీక్షణము లాతనిపైఁ బొలయ నవసంగతిచే లజ్జించుచు నుండెను.

శంఖచూడుండును శరదిందుసుందరబింబమును దెగడు ముఖమొప్ప, అమూల్యరత్నాభరణములు వెలయ, వివిధ బహుమూల్యమణిసారవిసరవిలసత్కాంచీదామము మురువు చూప, కబరీభారమును దాల్చి, మాలతీమాలికావిసరమునం గైసేయఁబడిన యంగకమలర, మణికుండలములు మహోన్నతి వెలయింప, కుండలమరీచులగండయుగ్మము విచిత్రాకృతి ధరింప, వక్షస్థలాంతరలంబమాన రత్నేంద్రసారహారము మనోహరరీతిం గనంబడ, నవరత్నఖచితకంకణకేయూరాదులు పరికింపఁదగియుండ, అంగుళీయకములు లోకోత్తరవైభవము

వెలయింప నసమానలావణ్యవతియగు నా సుదతిం గాంచెను. కాంచి చెంగటంజేరి మృదుమధురవచనముల నిట్టు లనియె.

కల్యాణీ! నీవెవ్వతవు? భామినీ! మునివృత్తిమతీ! నను మాటల నలరింపుము. విన వేడుకపడుచున్నవాఁడ. అని పలుక నాలకించి యావామలోచన లోచనాంచలము లాతనిని మహాశాపరవశుంజేయ నిట్లు పలికెను. మహాత్మా! నేను ధర్మ ధ్వజుపుత్త్రికను. తపమొనరించు కుతూహలమున నిటవచ్చితిని. తపస్వినినై యిందున్నదానను. మీరెవరో తెలిపి యిష్టాను సారము వెళ్లవచ్చును. కులస్త్రీని నేకాంతమున నొంటరిగా నున్న సాధ్విని సత్కులప్రసూతుఁడగు వాఁడు పలుకరింప రాదని పెద్దలవలన వినియున్నదానను. మఱియు నసత్కుల జాతుఁడై లంపటుఁడై ధర్మశాస్త్రార్థముల నెఱుంగక శ్రుత్య ర్థము నాలకింపక, యెవఁడుండునో ఆపురుషుఁడు కామినితో మాటలాడం గోరును. విషకుంభాకారరూపమును, అమృత కంఠమును గలిగి, క్షురధారాతుల్యహృదయ మొప్పఁ, బలు మాఱు మధురభాషణములు పలుకుచు, స్వకార్యనిర్వాహణము పొంటెఁ దత్పరయై, కార్యము నెఱవేఱువఱకు స్వామివశమున నుండి, పిదప నాతనివీటిఁ బుచ్చి మనస్సు మలినమైయుండఁ బ్రసన్నవదనేక్షణయై యున్న కామిని చారిత్రమతి దూషిత మని శ్రుతులయందుఁ బురాణముల యందును గానంబడెడు. అట్టిస్త్రీలను బ్రజ్ఞాశాలియగు నేపురుషుఁడు విశ్వసించును? విశ్వసించునేని దురాశయుం డనంబడుంగదా. అట్టి కాంతలకు

శత్రువులు మిత్రులు ననువారుందురు. క్రొత్తవారినే యా స్త్రీలు కోరుచుందురు. సువేషముగలపురుషుని మనమున సదా కోరుచు వెలుపల స్వకార్యమునకై తనసాధ్వీత్వమును దెలుపుచుఁ బలుమాఱు కాముకురాలై నృత్యగీతాదికళావతియై కామాధారయై మనోహరాకృతియై, బాహ్యమునఁ గృత్రిమ భావమూని నటించుచు మానసమున రతిఁగోరుచు, ఒంటరి పాటునఁ గాంతునిగాంచి నవ్వుచు, బాహ్యమున మిగుల లజ్జావతి యనఁబరఁగుచు, రతియొదవనిచోఁ గోపనయై కలహ మొనర్చుచు, సురతమొదవిన సువ్రతయగుచు, నద్ది యత్యల్పమయ్యెనేని దుఃఖించుచు, మధురాహారమును, శీతలతోయమును గోరుచు, సొగసుకాని రసికునిఁ గాంతునిఁ బ్రాయమున విఱ్ఱవీఁగువానిఁ బుత్త్రునికంటె నెక్కువగఁ బ్రేమించుచు, రసికులపై నతిశయస్నేహ మునుచుచు, రతికుశలుఁడై, తనప్రీతికిం బాత్రుఁడగు వానిఁ బ్రాణాధికుంగా భావించు, సురతాశక్తుఁడై వృద్ధువగు భర్తను శత్రుతుల్యునిగా నతనితో ననవరతము ద్వేషించుచు, వాక్కుల నాతని భక్షించుచు, నెలుకపై సర్ప మునుచునంత ప్రీతి నునుచుచు, సాహసమలర సకలదోషాకరమగు చిత్తముగలిగి, బ్రహ్మవిష్ణుశంకరాదులకేని సాధింపరాని మోహనరూప మొప్పఁ, దపోమార్గమునకు నిరోధకురాలై, మోక్షద్వారకవాట మననొప్పుచు, భగవద్భక్తికి దూరమై, సర్వమాయలకు బరణియై, సంసారకారాగారమున నిగళరూపిణియై తనరారుచు, ఇంద్రజాలవిద్యారూపిణియై,

మిథ్యావాదములకు స్వప్నరూపిణులై, బాహ్యసౌందర్యము గలిగి, మనస్సు కుత్సితమై యొప్ప, దుర్గంధభూయిష్ఠమగు తనువు నలంకారములం గప్పుచు, నుండు మాయారూపము కపటాత్ములకు బ్రహ్మ నిర్మించును. అట్టి కురూపము ముము క్షువులగు ధీరులకుఁ జూడరాని దగు. మనమున నేని కోర రాని దగు. అని పలికి తులసి తూష్ణీంభావమును వహించెను.

ఆచిన్నారిపలుకుల నాలకించి చిఱునవ్వుపొలయ శంఖ చూడుఁడు బదులుచెప్పువాఁడై యిట్లనియె. దేవీ! నీవు వచిం చిన దంతయు నసత్యము కానేరదు. కొంచెము సత్యము. రవంత యలీకము నై యున్నది. ఇంచుక సమాధానము చెప్పెద. సావధానచిత్తవై యాలకింపుము. నలువచే స్త్రీరూపము ద్విప్రకారముగ నిర్మింపఁబడియె. అందొకటి సర్వ మోహనమై, వాస్తవమునఁ బ్రశంసింపందగియుండు నది యొకటి. లక్ష్మి, సరస్వతి, దుర్గ, సావిత్రి, రాధిక లోనగువారి సృష్టి ఆద్యసృష్టి యనంబడు. వీరి యంశరూపమగు స్త్రీరూ పము వాస్తవ మని చెప్పందగు. అదియే ప్రశంసింపఁ దగు. యశోరూపమనియు, సర్వమంగళకారకమనియు వర్ణింపఁదగిన దదియే. శతరూపయు, స్వధా, స్వాహా, దక్షిణా, ఛాయావతీ, రోహిణీ, వరుణానీ, శచీ, కుబేరపత్నీ, దిత్యదితులు, లోపా ముద్రయు, అనసూయయు, కోటభీదేవియుఁ, దులసీదేవియు, నహాల్యాదేవియు, నరుంధతియుఁ, దారామందోదరులు, దమ యంతీవేదవతులు, గంగాదేవియు, మనసయు, పుష్టి, తుష్టి,

స్మృతి, మేధాకాళికలు, వసుంధరయు, షష్ఠీదేవియు, మంగళ చండియు, మూర్తియు, ధర్మకామినియు, స్వస్తి శ్రద్ధాశాంతి కాంతిక్షాంతి నిద్రాతంద్రా క్షుత్పిపాసలును, సంధ్యారాత్రిదినములును, సంపత్తియు, ధృతి, కీర్తులు, క్రియా, శోభా, ప్రభా, శివలును ననంబడు నీనారీమణులరూపములు ప్రతియుగమందు నుత్తమోత్తమములు. కళాకాలాంశరూపములు, స్వర్గవేశ్యలు లోనగు వారిరూపములు జగంబుల నప్రశస్యములు. మఱి పుంశ్చలీరూపములు.

ఏరూపము సత్వగుణప్రధానమో అది ప్రభావయుతమయి, యుత్తమ మనం బరఁగుచు, జగంబులం బ్రసిద్ధిని గాంచు. ఆరూపమే వాస్తవమనం బ్రసిద్ధంబగు. రజస్తమోగుణప్రధానరూపములు కళలయందు వివిధరూపంబులుగ నుండు. రజఃప్రధానాంశములు గలరూపములు మధ్యమము లై భోగలోలుపములగు. సుఖభోగవశ్యములై స్వకార్యనిరతములై, కపటముగలిగి, మోహమును గల్గించుచు, ధర్మార్థ విముఖములై యుండు రజోరూపమునకు సాధ్వీత్వము గలుగ నేరదని యెఱుంగవలయు. కావుననే ప్రాజ్ఞులు దానిని మధ్యమ మనిరి.

ఇఁకఁ దమోరూపము దుర్నివార్యమని, అధమంబనియు విద్వాంసులు సిద్ధాంతీకరించిరి. సత్కులజుఁడగు పండితుఁడు పరస్త్రీని జూచునపుడు పలుకరింపరాదు. నిర్జనవనమునను, నిర్జలభాగమందును, రహస్యస్థలమందును, బరభామినిఁ బల్కరింప

రాదు. ఇది నే నెఱుంగుదు. అటులైన నన్నేల పలుకరించితి వందువా వినుము వచించెద. మానినీ! విధిప్రేరేపింపఁ దదాజ్ఞ నౌదలందాల్చి నీచెంత కరుదెంచితిని. కల్యాణీ! గాంధర్వ వివాహావిధి నిన్ను గ్రహింప నరుదెంచితి నని తెలియఁదగు. శంఖచూడుఁ డనంబడువాఁడను నేనే. దేవవిద్రావకారకుఁడ నేనే యని తెలుపుచున్నవాఁడ. దనువంశసంభూతుఁడను విశే షించి శ్రీహరిప్రియుఁడ నగు సుదాముఁడను నేనే సుమీ. శ్రీహరిభక్తాష్టక మనంబడుచు, పార్షదులగు గోపాలకులందు నే నొకఁడను. అట్టి నేను రాధాదేవీశాపకారణమున దానవేం ద్రుఁడనైతిని. పూర్వజాతిస్మృతిని శ్రీకృష్ణమంత్రప్రభావమునఁ గలవాఁడను. తులసీ! నీవును జాతిస్మృతిగలదానవు. శ్రీహరి ప్రియురాలవు. అట్టినీవును రాధికాశాపవశమున భారతభూమి జనించితివి. ఆలోకమున రాధాభయమువలన నిన్నుఁ బొంద మానితిని. అని పలికి శంఖచూడుఁడు మౌనముద్రను వహిం చెను.

ఆవల సస్మితాస్యపంకరుహయై తులసి యిట్లు పలుక నారంభించెను. ధీరవరా! ఇట్టిపురుషుఁడే లోకమున నెల్లప్పుడు వినుతింగాంచును. కాంతయు నిట్టికాంతు నే పడయఁగోరుచుం డును. విచారముచే నిపుడు నీచే నేఁబరాభూతనైతిని. ఎవ్వఁడు స్త్రీజితుఁడో వాఁడు నిందింపఁబడుటయ గాక యశు చియునగును. స్త్రీవిజితునిఁ బితరులు బాంధవులు దేవతలును నిందింతురు. అట్టివానిఁ దల్లియుఁ దండ్రియు సోదరుఁడు నేవ

గింతురు. విప్రుఁడు పదిదినములు, రాజు పండ్రెండుదినములు, వైశ్యుఁడు పదునేనుదినములు, శూద్రుఁడు నెల, జాతమృత విషయముల నపరిశుద్ధుం డగు. స్త్రీజితుం డగు పురుషుఁడు చితిపైఁ గాల్పఁబడుదాఁక నపరిశుద్ధుఁ డగు. ఆపురుషుఁ డొసంగు తర్పణోదకములఁ బితరులు గ్రహింపరు. అతఁ డిచ్చు పూజాదుల దేవతలు పరిగ్రహింపరు. ఎవనిచిత్తము స్త్రీచే నపహృత మగునో అతనికి జ్ఞానము తపస్సు జప హోమపూజనములు ఫలము నీఁజాలవు. ఆర్యా! విద్యా ప్రభావజ్ఞానార్థము నిను నేఁ బరీక్షించితిని. కాంతునిఁ బరీక్షిం చియే కామినివరునిగా గ్రహించును. *గుణహీనుఁడు, వృద్ధుఁడు, అజ్ఞాని, దరిద్రుఁడు, మూర్ఖుఁడు, రోగి, కుత్సితుఁడు, మిగులఁ గోపి, మిగుల దుర్ముఖుఁడు, పంగువు, అంగహీనుఁడు, గ్రుడ్డి వాఁడు, బధిరుఁడు, జడుఁడు, మూఁగ, క్లీబతుల్యుఁడు, పాపి, యనువారిలో నెవనికిఁ దనపుత్రిక నొసంగినను వానికి బ్రహ్మ హత్య ప్రాప్తించును. శాంతుఁడై, గుణవంతుఁడై, వయస్సు

* వరాయ గుణ హీనాయ వృద్ధాయాజ్ఞానినే తథా, దరిద్రాయ చ మూర్ఖాయ రోగిణే కుత్సితాయ చ. అత్యంతకోపయుక్తాయ వాత్యంత దుర్ముఖాయ చ, పంగవే చాంగహీనాయ చాంధాయ బధిరాయ చ, జడాయ చైవ మూర్ఖాయ క్లీబతుల్యాయ పాపినే, బ్రహ్మహత్యాం లభే త్సోపి స్వకన్యాం ప్రదదాతియః. శాంతాయ గుణినే చైవ యూనేచ విదుషేపి చ, సాధవే చ సుతాం దత్వా దశయజ్ఞ ఫలం లభేత్.

దేవీ భా. ౯ స్కం. ౧౯ అ. ౦౫ శ్లో.

గలిగి, విద్వాంసుఁడై, సాధువై యుండు వరునకుఁ గన్యకనొసం
గిన తండ్రి పదియజ్ఞము లొనరించిన ఫలముపొందును. ఏపురు
షుఁడు పుత్రికను బోషించి ధనలోభమున విక్రయించు
చున్నాఁడో యతఁడు కుంభీపాకనరకము నొందును. అంతియ
గాక కన్యామూత్రపురీషముల భక్షించుచుఁ, బురుగులచే
బాధింపఁబడుచు, దినప్రళయమగు దనుక నాకుంభీపాకనరక
మున నుండఁగలఁడు. ఆమీఁద వ్యాధిబాధితుఁడై జన్మిం
చును. ఇది సత్యము. ఆమీఁద నా పాపాత్ముఁడు మాంసభార
మును మోయుచు రేయింబగళ్లు శ్రమంపడును. అని పలికి
యా తులసీదేవి యూరకుండెను.

అంతకుఁ జతురాననుం డటఁ దోఁచి శంఖచూడుఁడా!
ఏల యీకామినితో సంవాదము చేయుచున్నవాఁడవు?
గాంధర్వవివాహమున నీమెను గ్రహింపుము నీవు పురుష
రత్నంబవు. ఈమె నారీరత్నము. సాధ్వీమణియు నగు. ఇట్టి
యోగ్యతగల యిరువురకు వివాహము గుణవంతమగును.
దుర్లభమయి నిర్బాధమునగు సుఖము నెవఁడు పరిత్యజించును?
విరోధమువలన నెవఁడు సుఖమును ద్యజించునో వాఁడు పశు
తుల్యుఁడు. ఓతులసీ! ఇట్టి గుణశాలియగు కాంతు నేల
యింకను బరీక్షించెదవు? దేవాసురదానవవిమర్దకుఁ డగునీతని
గ్రహింపుము. విష్ణువునందు లక్ష్మియు, శ్రీకృష్ణునియందు రాధి
కయు, నాయందు సావిత్రియు, శంకరునియందు భవానియు,
వరాహరూపధారియగు శ్రీహరియందు భూమియు, యజ్ఞ

మందు దక్షిణాయు, అత్రిమునియం దనసూయాదేవియు, నలునియందు దమయంతియు, శీతాంశునియందు రోహిణియు, మన్మథునియందు రతియుఁ, గశ్యపమునియం దదితియు, వసిష్ఠునియం దరుంధతియు, గౌతమునియం దహల్యయుఁ, గర్దమమునియందు దేవహూతియు, బృహస్పతియందుఁ దారయు, మనువునందు శతరూపయు, హుతాశనునియందు స్వాహాదేవియు, మహేంద్రునియందు శచీదేవియు, గణేశ్వరునందుఁ బుష్టియుఁ, గుమారస్వామియందు దేవసేనయు, ధర్మునియందు మూర్తిదేవియు నెట్టి ప్రీతియుంచిరో అట్టి ప్రీతిని నీవు శంఖచూడునియం దునుపుము. ఓసుందరీ! ఈ సుందరునితోడ చిరకాలము స్వేచ్ఛావిహారములఁ బరితృప్తి నొంది గోలోకమునకుఁ బొమ్ము. అట శ్రీకృష్ణునిఁ బతిగా గ్రహింపఁగలుగుదువు. శంఖచూడుఁడు మృతుఁడు కాఁగా వైకుంఠముననుండు చతుర్భుజుఁడు నీకుం బతియగు. అని బహువిధముల నాశీర్వదించి బ్రహ్మ తనలోకమునకుం బోయెను.

## తులసీ శంఖచూడుల వివాహము

తరువాత శంఖచూడుఁడు గాంధర్వవిధిని దులసిని గ్రహించెను. అంబరమున సురవాద్యములు మ్రోగెను. పుష్పవృష్టియుఁ గురిసెను. అట నాదంపతు లిరువురును విహరించిరి. సుఖసాగరమున నామె మునింగెను. రసికేశ్వరుం డగు నాశంఖచూడుఁడు తులసీకాంతం గూడి కామశా

స్త్రోక్తరీతిని విహరించెను. పరస్పర ప్రియాలాపములచే నా యిరువురు సుఖసమృద్ధి నొందిరి అతఁడంత వరుణలబ్ధమగు నమూల్యవస్త్రమును, వరుణకృపాపాత్రమగు రత్నమాల్యమును, స్వాహాదేవి యొసంగిన మంజీరయుగ్మమును, ఛాయాదేవీదత్తమగు కేయూరయుగళమును, రోహిణీ కామిని యొసంగిన కుండలద్వంద్వంబును, రతీదేవి యిచ్చిన రత్నాంగుళీయకములను, గరభూషణములును, విశ్వకర్మ యొసంగిన చిత్రతమశంఖమును, విచిత్రపద్మకశ్రేణిని దుర్లభమనందగు శయనంబును బ్రియురాలి కొసంగి దేవీ! నేను నీకృపాపాత్రుఁడఁజుమీ యని పరిహాసవచనముల నామె నలరించెను.

అంతఁ గొంతకాల మా వననివాసమును మాని వారిరువురు స్వరాజ్యమును జేరిరి. కొంతకాల ముండుండి మలయము, మేరువు, తపోవనములు లోనగు సుస్థలంబుల సంచరించిరి. పుష్పోద్యానంబుల, నిర్జనప్రదేశముల, గుహాగృహముల, నదీతీరముల, మిగుల మనోహరమనఁ బ్రసిద్ధిఁ గాంచిన పుష్పభద్రానదీతీరమున, దివ్యములగు పులినతలంబుల, గంధమాదనాద్రిని దేవోద్యానమగు నందనమున, నింకను సకల సుఖాకరములై సర్వర్తు కుసుమాభిరామంబులగు భూభాగంబుల నా యిరువురు విహరించిరి. కాని యాతఁడు దాన సుఖతృప్తి నొందఁజాలఁ డయ్యెను. వా రిరువురకు హావిస్సుచే నగ్నికివలె సురతాభిలాషము మిక్కుటముగా వృద్ధినొందెను. మరల నాకామినిం గూడి యాశంఖచూడుఁడు బదరికావనముం జేరి క్రీడా

లయం బొందు. నిర్మింపఁబంచి యందు నివసించి సుఖించెను. ఇట్లు శంఖచూడుఁడు తులసీదేవిం గూడి తిరుగుచుండియు నిష్కంటకంబగు రాజ్యమును బ్రాజ్య విభూతియలరఁ బోషించుచు, నొక మన్వంతరమును గడపెను. దేవదానవాదులకును భీతికరుఁడై సర్వజనప్రియుఁడై శత్రుభయంకరుఁడై యిల నేలెను. ఆతని రాజ్యకాలమున దేవతలు భిక్షుకులవలెఁ దిరుగుచుండిరి.

కొంతకాలమునకు దేవతలు విషణ్ణులై బ్రహ్మలోకమున కరిగి శంఖచూడవృత్తాంతమును దెలిపి విలపించిరి. పరమేష్ఠియు వారిందోడుకొని శంకరుసదనంబునకుం బోయి యా చంద్రశేఖరునికి నావృత్తాంతము విన్నవించెను. శంకరుండును వారలం దోడుకొని వైకుంఠమున కరిగి, యనన్యదుర్లభమై నిరుపమానంబై మృత్యుహరంబునగు నాలోకమున నలరారు విష్ణునివాసమును గాంచి ద్వారపాలకులు రత్నసింహాసనముల నుండఁ బొడఁగనుచుఁ, బీతవస్త్రములం దాల్చి నవరత్నభూషణముల భూషితులై ముకుందుసామ్యమున నెసఁగు వారల హరికింకరులఁ జూచి పరమానందమొందుచుఁ బోయి భగవంతునిం జూచు వేడుక. ద్వారపాలకులకుం దెలుప వారను మతినీయ లోపలం జొచ్చి పదియారుద్వారముల కవ్వల దివ్యరత్నసింహాసనమున వెలయు భగవంతుని నవ్యయు ననంతు నచ్యుతుఁ గృపానీరరాశిని దర్శించిరి.

ఆభగవంతుని వైభవము వర్ణింప నేరికేనలవిగాక తనకుఁ దానె సాటియై యలరుచుండెను. ఆపరమేశ్వరుం గాంచి

సాష్టాంగ ప్రణతులొసంగి భయభక్తుల వినుతించి గతవృత్తాంతము నెఱింగింప శ్రీహరి వారి నూఱడించి కూరుచుండ నియోగించి బ్రహ్మంజూచి విధాతా! శంఖచూడునివృత్తాంత మంతయు నెఱుంగుదు ఆతండు తొలిజన్మమున నాభక్తుండగు గోపకుఁడు. ఆవృత్తాంత మెఱింగించెద. ఆకర్ణింపుము.

గోలోకచరిత్రము పరమపవిత్రము. నాకు సుదాముఁడను గోపుఁడు పార్షదుఁడు గలఁడు. భయంకరమగు రాధా శాపమువలన నాతండు దానవకులమున జన్మించెను. గోలోకమున మున్నొకనాఁడు నేను రాసమండలమునకుం బోయితిని. విరజయను నొక గోపిక నాకుం బ్రాణాధికయగు. ఆమె నను సదాకోరుచుఁ దపమొనరించుచుండు. నేనాగోపికను దృష్టి పఱచు పొంటె నం దరిగియుంట కింకరముఖమున రాధిక విని యతిక్రోధవతియై యచటి కేతెంచెను. విరజ భీతయై నదీరూపమును గ్రహించెను. నే నదృశ్యుఁడ నైతిని. కాన రాధిక సఖులంగూడి మరలిపోయెను.

సుదాముఁడు నాచెంత నొకనాఁడుండఁగా రాధికయు నెట్లో నన్నుంజూచెను. రాధిక కోపకారణ మెఱింగిన సుదాముఁ డామెను జక్కఁగా న్యాయరీతులఁ బరిభవించెను. ఆమెయు సుదాముని దిరస్కరించెను. రాధిక యాతనిసఖులచే వెలుపలికిం ద్రోయించెను. అంత నిలువక యతఁ డాడిన నుడుల కాగ్రహించి దానవయోనిం బుట్టుమని శపించెను. ఆశాపమునకు విహ్వలచిత్తుఁడై విలపించుచు నాచెంత కరుదెంచు

చుండ రాధయుఁ గరుణాపరతంత్రయై యతని వారించి వత్సా! యెందుఁబోయెదవు. నిలునిలుము. అనుచుండ గోపి కలును దచ్ఛాపంబునకు మిగులఁ జింతిల్ల నేనవ్విధం బెఱింగి యచటికిం బోయి గోలోకమున నొకక్షణకాలమైన ఇతరలోక ముల నొకమన్వంతరంబగు. చింతిల్లకుము. మర్త్యలోకంబునం బుట్టువుఁ గాంచుము. శంకరుండు నిను సంహరింపఁగలఁడు. అని పలికితి. కమలాసనా! సర్వమంగళకారకంబగు కవచ మతని కిచ్చితి దానినాతఁడు కంఠమున ధరించియుండు. అది కంఠమం దుండ నెవ్వఁ డాతనిం జంపంగలఁడు? నేనే విప్రరూపంబునఁ బోయి యాకవచంబును యాచించెద. ఏకాలమున నాతని భార్యకు సతీత్వహానికలుగునో ఆకాలమున నతనికి మృతి గలుగునట్లు నీవు ననుగ్రహించితివి కదా? ఆతనిభార్యయుదర మున వీర్య మునిచెద. ఆమెకు మృత్యువు గలుగు. వెంటనే యామె తనువువదలి నాలోకమునకు నచ్చి నాకుఁ బత్ని కాఁగలదు.

అని పలికి భగవంతుఁడగు శ్రీహరి శూలాయుధమును శంకరున కొసంగెను. శూలమును శ్రీశంకరుఁడు గ్రహింపఁ గనే శ్రీహరి యతర్ధానమొందెను. దేవతలు బ్రహ్మశంకరుల ముందిడుకొని యుద్ధార్థులై భారతభూమికిం బోయిరి.

మహాశయులారా! ఈగాథయందు విశేషాంశము లెన్నియోఁ గలవు. సామాన్యవిషయము లటుండనిండు. ఒక్క విషయమును గ్రహింపుఁడు. శూలము శంకరునకు శ్రీహరి యొసంగిన ట్లిందుఁ జేర్కొనంబడియెఁ గదా. త్రిశూలియను పేరు

శివునకుం గలదు. శంఖచూడుని సంహరింప శ్రీహరి యొసం గకము న్నా శివుఁడు త్రిశూలి గాఁడుగదా! యన్న ప్రశ్నము రావచ్చును. ప్రాయికముగాఁ బురాణము లొక్కొక్క దేవత నొక్కపురాణమునఁ బ్రధానముగాఁ జెప్పుచుండును. ఆదేవ తకుఁ దక్కుంగలవా రెల్ల నంగదేవతలుగా నటఁ బరిగణింపఁ బడుదురు. ఏల యని శంకింపకుఁడు. ఇందు వ్యాసుల తాత్పర్య మేమని యోజింపుఁడు. ఎట్టికర్మ మొనరించిన జీవుఁడు తత్పుణ్య ఫల మనుభవింపఁదగు లోకమునకేగును తదధీశుండు సర్వో త్కృష్టుఁ డనంబడుచుండు. ఆలోకమే సర్వలోకాతిశయ మనియుఁ బేర్కొనంబడుచుండు. ఆజీవుఁడు దాన సంతృప్తి నొందును మఱియు నేదేవత నుపాసించినను భక్తి దృఢతమ మయ్యె నేని ఫలమొక్కఁడగును. ఆజీవుఁ డుపాసించు దేవతయే సర్వ దేవతాసమారాధ్యుఁడని చెప్పకున్న నాతనికి భక్తి కుదు రదు. దేవతాంతరము లాతని సేవించినట్లు తెలిపిన నాతని మన సునఁ దగిలియుండు దేవతయే ముక్తిఫలప్రదుఁడని యతఁడు నమ్మును. భగవంతుఁ డాతనిం గరుణించును. కాఁబట్టి ఒక్కొ క్కపురాణమున నొక్కొక్క దేవత సర్వోత్కృష్టుఁ డని చెప్పఁ బడుచుండుట సముచితమనియే యెంచఁ దగు. ఏపురాణము పఠించినను, ఏదేవత నుపాసించినను భగవంతుఁడయి యద్వి తీయుఁడగు విరాట్టు తద్రూపమున నాభక్తునిం గృతకృత్యుం జేయును. దీనిచే నేమతము నవలంబించినను ఫల మొక్కటియే యని తేలినది. ఏమతమైన నేమని ప్రతిదిన మొక్కమతము

నవలంబింపరాదు. స్వమతమున సారము లేదనుకొను మూఢు నకు నేమతముకూడ నుపకారము చేయంజాలదు. స్వమతమున సారము కల దని నమ్మి దానిఁ బరికించి తెలిసికొనిన ఫల మన్నింటఁ దుల్యమేగాని కందుకము భంగి గమనము చేయు చున్నచో నెందును వానికి సారము లభింపదు. ఇద్ది సిద్ధాంత మని నమ్మి ఇతరదేవతలకంటె నాదేవతయే గొప్పవాఁడని విఱ్ఱ వీఁగక యందఱు సములని భావించి తానాశ్రయించిన యొక్క దేవతనే నమ్మి ముక్తినొందుదు నన్న దృఢవిశ్వాస మున నుండుటయే సర్వోత్తమ మార్గము. ఈమార్గమున నడ చినచో నేలాటి చిక్కులు లేవు. మతద్వేష మొదవదు. రాగ ద్వేషాదులకుఁ జోటు దొరకదు? సర్వదేవతాసమానత్వమున కంటెఁ దెలిసికొనఁదగిన విషయము లేభక్తునకు నుండవు. ప్రతివిషయమున సంశయము లుండినచో నాజీవుఁడు కృతా ర్థుఁడు కాఁజాలఁడు. ఇంతట నీవిషయ ముజ్జగింతము. కథా భాగమునకు వత్తము.

## ఇంద్రాదులు శంఖచూడునితో యుద్ధముచేయుట

శ్రీహరి శంఖచూడునిం జంప శంకరు నియోగించి యంతర్హితుఁడు కాఁగా శివుఁడు దేవతలంగూడి మర్త్యలోకం బునకుం బోయి చంద్రభాగానదీతీరమున వటవిటపిమూలంబున నివసించి దేవతల నాయాయికార్యములకు నియోగించి తన మనసు నెఱిఁగి వర్తించు చిత్రరథుండను గంధర్వునిం బిలిచి

యిట్లనియె. చిత్రరథా! ఇపుడు నీవు దూతకృత్య మొనరింప వలయు. ఇది దేవతాకార్యము సుమీ! వేగంబ దూతవై శంఖచూడుని చెంతకుఁ బోయి నాయానుడులఁ దెలియఁ బలికి యుత్తర మెఱింగి రమ్మని విషయమును దెలిపి పంపించెను.

చిత్రరథుండును సర్వేశ్వరాజ్ఞ శిరసావహించి శంఖ చూడుని రాజధానికిం బోయి యాపురంబుం గనుంగొనియె. ఆనగరము మహేంద్రనగరమును గేలిసేయుచుఁ, గుబేరపుర మును మెచ్చక, యసమానవైభవమున నలరారుచుండెను. దానివిస్తీర్ణ మైదుయోజనములు. దైర్ఘ్యము పదియోజన ములు. స్ఫటికమణిఖచితములగు ప్రాకారము లెన్నియోగలవు. ఐదుపరిఖలు సముద్రములఁ బోలి యగాధములై యుండు. ఏగోడం బరికించినను జ్వలద్ధుతాశనతుల్యమాణిక్య ఖచిత ములే. ఆపత్తనము శతవీథీసమన్వితము. మణిచిత్రితవేదిక లం దెన్నియో యమర్పఁబడియుండు. సకలవస్తుప్రశస్తవణిక్సౌధ ములు క్రిక్కిరిసి లెక్కకుమించి యందలరారు. ఇఁకఁ దక్కుం గలవారిసౌధము లెన్నియనియెన్నఁ బన్నగాధిపతియుఁ జిన్నఁబోవకమానఁడు. ఇట్టు లొప్పియుండుట నప్పుట భేదనము వర్ణనాతీత మనుట యతిశయోక్తి యెట్టులగు?

చిత్రరథుం డాస్థానీయము దృగ్గోచరంబు కాఁగా నిలు వంబడి చక్కఁగాఁ బరికించి మ్రాన్పడియెను. ఇట్టినిగమ మీా మర్త్యలజగమునఁ దగియుండుట యచ్చెరువు గదా యని విస్మయం పడియెను. దీనిం జూచినదేవతలు దిగ్భ్రమ మొందక

పోరని నిశ్చయించెను. ఇట్టిపురిఁ బాలించుభాగ్యము గలరాజు దేవేంద్రునికన్న మిన్నయని సన్నుతింపక మానరాదని నిశ్చయించుకొనెను. ఇట్టు లూహించుచుం బోయిపోయి శంఖచూడుని ప్రాసాదవరము దర్శించెను. వలయాకారముగ నమరియున్న యయ్యది రాకాశీతాంశుమండలమా యనుభ్రాంతి నతనికిం బుట్టింపక మానలేదు. ఆసౌధమునకుఁ జుట్టు రత్నచిత్రిత పరిఖాసమన్విత దుర్గ చతుష్కము వెలయుచు శత్రుదుర్నిరీక్ష్యమై యితరులకు సుగమమై యుండెను. ఆగేహవర్యము గగనమునంటి మణిశృంగవిరాజితంబై, ద్వాదశద్వారశోభితంబై, భయంకర ద్వారపాలరక్షితం బై, మణిగణవిలస దంతర్మందిరవితతుల నతులితం బై, రత్నసోపానభాసురం బై, నవరత్నస్తంభ సహస్రాలంకృతం బై, నిరుపమానం బై యొప్పుచుండెను.

పుష్పదంతుఁ డనునామాంతరముగల యా చిత్రరథుండు మెలమెల్లన లోఁజొచ్చి ప్రధానద్వారమును జూచెను. ఆద్వారమున శూలహస్తుఁడై మౌనవ్రతమూనిన ట్లున్నవాని సస్మితాస్యుని ద్వారరక్షకులకు రక్షకునిగఁ గనుంగొనియె. చెంతకుఁ బోయిచూడ నాతండు పింగళాక్షుఁడై, తామ్రవర్ణతనుండై భయంకరాకారమున నలరుచు నిలువంబడి యుండెను. ఆతనితో నెట్లో తనవచ్చినపనిఁ దెలిపి సెల వంది లోపలఁజొచ్చి దూత నెవ్వరు నివారింపరనియు, బాధింపరనియుఁ దెలిసికొని రెండవద్వార సీమం జేరనరిగి యార్యా!

రణవృత్తాంతమును నివేదింప నరుదెంచితి. నే శంకరకింకరుండ. పోఁదగునే యన నతఁడు మాటాడక పో నసుమతి యీయ నభ్యంతరమును బ్రవేశించి కడపట శంఖచూడుని యాస్థానమును దర్శించెను.

ఆస్థానమున శంఖచూడుఁడు కొలువు దీరియుండెను. రాజమండల మాతనిం బరివేష్టించి యుండెను. స్వర్ణసింహాసన మాతని వైభవాతిశయమును జెప్పక చెప్పుచుండెను. రత్నశ్రేష్ఠము లందందుఁ జెక్కఁబడి మణిదండ మొప్ప రత్నమయ పుష్పము లలరార భృత్యమస్తకన్యస్తంబై నిరుపమాన మగు శ్వేతచ్ఛత్ర మెత్తఁబడియుండెను. చామరముల విసరుచుండిరి ఆతనిరూపము వర్ణనాతీతమై యుండెను. రత్నభూషణ భూషితమగు తత్తనువు మన్మథునిఁ జప్పరించుచుండెను. అనేక దానవకోటులు పరివేష్టించి యుండిరి. ఆయుధపాణులై భయంకరరూపులగు వీరభటులు క్రిక్కిరిసియుండిరి. ఇట్టు లొప్పుచున్న శంఖచూడుని బుష్పదంతుఁడు కనుంగొని విస్మయం బంది చేరంబోయి యుచితరీతి గౌరవించి శంకరకింకరుఁడ. వృత్తాంతమొండు మనవిచేసెద. అవధరింపుఁడని యిట్లు చెప్పెను.

దేవా ! నేను శివభృత్యుఁడ. నా పేరు పుష్పదంతుఁ డందురు. ప్రభూ ! శంకరాశయ మిదియే. ఏదన ? శంఖచూడ దానవేంద్రా ! దేవతలకు రాజ్యము నధికారము నిమ్ము. దేవేశుండగు శ్రీహరిని దేవతలు శరణుచొచ్చిరి. ఆశ్రీహరి శూలా

యుద్ధ మొసంగి నన్నుఁ బంచె. * పుష్పభద్రానదీతీరమున వట మూలమున నున్నవాఁడ. దేవతలకు రాజ్య మొసంగుము. దానికి సమ్మతింపనిచో యుద్ధము చేయుము." ఇదియే శంకరోక్తి. ప్రభూ! నేను శంకరునితో నేమని పల్కఁదగును? సెలవిమ్ము. అని పలికి వినయము తనర నూరకుండెను.

శంఖచూడుం డాపుష్పదంతోక్తులవిని చిఱునవ్వు ముఖమున కొక్క క్రొత్తయలంకారము నీయఁగా నేను రేపుదయము వచ్చెద నీవు పొమ్మని పలికెను. దూతయు మహాప్రసాదంబని పనివిని వటభూరుహతలవాసియైన శంకరున కా వృత్తాంతం బెల్ల నెఱింగించెను. ఆసమయముననే శివు నంతికమునకుఁ గుమారస్వామి యరుదెంచెను. ఆయనవెంట వీరభద్రుఁడు, నందీశుఁడు, మహాకాలుఁడు, సుభద్రుఁడు, విశాలాక్షుఁడు, బాణుఁడు, పింగలాక్షుఁడు, వికంపనుఁడు, విరూపాక్ష, వికృతి, మణిభద్ర, బాష్కల, కపిల, దీర్ఘదంష్ట్ర, వికట, తామ్రలోచన, కాలకంఠ, బలీభద్ర, కాలజిహ్వా, కుటీచర, బలోన్మత్త, రణశ్లాఘులును, దుర్జయ, దుర్గములును, భైరవాష్టకంబు, నేకాదశరుద్రులు, వస్వష్టకంబు, ద్వాదశాదిత్యులు, హుతాశన, చంద్ర, విశ్వక, ర్మాశ్వి, కుబేర, యమ,

* లోగా చంద్రభాగాతీరమున శంకరుఁ డున్నట్లు చెప్పఁబడియె. ఇటఁ బుష్పభద్రానదీతీరమని చెప్పఁబడినది. ఈ రెండుపేరులు గల నది యొక్కటియే యని గ్రహింపఁదగు. 'పుష్పభద్రా నదీతీరే వటమూలే త్రిలోచనః.' అని మూ.

జయంత, నలకూబర, వాయు, వరుణ, బుధ, మంగళ, ధర్మ, శ, నీశాన, కామదేవులు, ఉగ్రదం, ష్ట్రోగ్రచండ, కోటర్తు లును, భయంకరాస్యయు, భుజాష్టకవిరాజితయు, రత్నవిమా నాలంకృతయు, రక్తవస్త్రపరీధానయు, రక్తమాల్యానులేప నయు, సంతోషపరవశయు, భక్తాభయదాత్రియు, శత్రుభీతి దాత్రియు, యోజనాయతజిహ్వయు, శంఖచక్ర గదా పద్మ ఖడ్గ చర్మ ధనుశ్శర, ఖర్పర, త్రిశూల, శక్తి, ముద్గర, ముసల, వజ్ర, ఖేట, ఫలక, వైష్ణవవాయవ్యవహ్నినాగపాశ, నారా యణ, గాంధర్వ, బ్రహ్మ, గారుడ, పర్జన్య, పాశుపత, జృం భణ, పార్వత, మాహేశ్వర, దండ, సమ్మోహనముఖాస్త్ర ధారణియు, భూతప్రేతపిశాచ, కూశ్మాండ, బ్రహ్మరాక్షస, భేతాళ, రాక్షస, యక్ష, కిన్నరసేవితయు నగు భద్రకాళియు నరుదెంచిరి. వారెల్ల యథావిధి చంద్రశేఖరునకు నమస్క రించిరి.

కుమారుండు శివాజ్ఞచేఁ దదంతికమునఁ గూరుచుం డెను. తక్కుంగలవారందఱు నం దందుఁ గూరుచుండి యథో చితకథాలాపములఁ గాలముఁ గడుపుచుండిరి. ఆవైభవము వర్ణింప నేరికేఁ దరంబుగాదు. ఇట్లు త్రిలోకవాసులగు శంకర కింకరు లరుదెంచి తదాజ్ఞ నెఱవేర్ప సంసిద్ధులై యుండిరి.

అంత నచ్చట శంఖచూడుఁడు తులసియుండు సౌధం బున కేగి యుద్ధవార్త నెఱింగించెను. తులసీదేవియు రణవార్త నాలించి శుష్కకంఠోష్ఠతాలుకయై చంచలించుహృదయముతో శంఖచూడున కిట్లనియె. ప్రాణబంధూ ! నాథా ! క్షణకా

లము నాహృదయమున వసింపుము. నాప్రాణమును రక్షింపుము. నావాంఛితములఁ దీర్పుము. క్షణకాలము సాదరముగ లోచనతృప్తిగ నిన్నుఁ జూడ నిమ్ము. నాప్రాణములు వడఁకుచున్నవి. మనస్సు తపించుచున్నది. గతరాత్రి దుస్స్వప్నముఁ గంటిని. నాకనేకసంశయములు బాధించుచున్నవి. అని పలుకుచుం గన్నీరు నించెను.

శంఖచూడుఁడు తులసీవాక్కుల నాలకించి హితమై తథ్యమునగు వచనము నిట్లు చెప్పెను. భోగనిబంధనమగు కర్మము కాలానుసారముగ వచ్చుచుండును. శుభము, హర్షము, సుఖము, దుఃఖము, భయశోకములు, మంగళము కాలానుసారముగా లభించును. వృక్షములు కాలముననే కొమ్మలు వెలయఁబోలుచును. వరుసఁగాఁ బుష్పవంతములై ఫలవంతములు గూడ నగును. కాలము ననుసరించి కాయలు పక్వములై ఫలము లనంబడును. కాలము చెల్లఁగనే భూమిం బడి చెడును. ఒక్కొక్క కాలమున నశించును. కాలానుసారమే సృష్టికర్త సృజించును. రక్షకుఁడు పాలించును. సంహర్త సంహరించును. *బ్రహ్మావిష్ణుశివుల కీశ్వరి పరాప్రకృతియే. విరాట్టు కాలానుసారము సృష్టిస్థితిసంహారముల నొనరింప స్వాభిన్న ప్రకృతిని నిచ్ఛానుసారము పొందును. ఇచ్ఛానుసారము సర్వకార్యముల నొనరించును. సర్వేశుఁడు సర్వసాక్షి. సర్వాత్మ యాపరమేశ్వరుఁడే. జనుని జనునివలననే పుట్టించును. జనునిద్వారా రక్షిం

* బ్రహ్మ విష్ణు శివాదీనా మీశ్వరః ప్రకృతిః పరా. అని మూ.

చును. జనునివంక నే సంహరించును. అట్టి పరమాత్మను సేవిం పుము. ఏభగవంతు నాజ్ఞచే వాయువు వీచునో, రవి ప్రకా శించునో, ఇంద్రుఁడు వర్షించునో, మృత్యువు స్వకృత్య మొన రింప సంచరించునో, అగ్ని దహించునో, చంద్రుఁడు శీత లుఁడై చరించునో, ఏదేవుని మృత్యువునకు మృత్యువుగను, గాలమునకుఁ గాలునిగను, యమునకు యమునిగను, సృష్టకు స్రష్టగను, రక్షకునకు రక్షకునిగను, సంహర్తకు సంహర్తగను, వచింతురో యట్టిదేవుని భజింపుము. నేనెవఁడను? నీవెవతవు ? మన కెట్లు సమావేశము గలిగెను? అట్లే వియోగము కలుగ నున్నది? మూర్ఖుఁడు శోకసమయమున భయంపడును. పండితుఁ డట్లు భయంపడఁడు. సుఖదుఃఖములు చక్రనేమిక్రమమునఁ దిరుగుచుండును. కాంతామణీ! నీవును శ్రీహరిని బొందఁగలు గుదువు. బదరికాశ్రమమున నేల తపమొనరించితివి? నేనును దపమొనరించికదా బ్రహ్మావరముల నిన్నుం బరిగ్రహింపఁగల్గితి? ఏహరినుద్దేశించి తపమొనరించితివో యట్టి శ్రీహరినే పడయఁ గలవు. బృందావనమును గోలోకముననే పొందఁగలవు. నే నీ దానవతనువును ద్యజించి యాగోలోకమునే పొందఁ గలను. ఆలోకమున నన్ను నీవును నిన్ను నేనును జూడఁగలుగుదుము. రాధికాశాపమున నీలోకమునఁ బుట్టితిని. శాపాంతమున మరల నాలోకమున కేగెదను. ఇందులకై దుఃఖింప నేటికో ఇంచుక వచింపుము. నీవు నీదేహమును ద్యజించి దివ్యతనువును ధరించి యాదివ్యలోకమున శ్రీహరినే పొందఁగలవు. ఏల భీతిల్లెదు ?

అని పలికి యనునయించి యారేయి మనోజ్ఞపుష్పతల్పమున హాయిగ భార్యంగూడి నిదురించెను. ఆమెయునా రేయి నాహారముం గొనక శోకసాగరమున మునిఁగియుండఁగాఁ బెక్కుభంగుల నూరార్చెను. జ్ఞానియగునాశంఖచూడుఁడు పూర్వము శ్రీకృష్ణదత్తోపదేశము నామె కొసంగి శోకము నడంచెను. దాన నా తులసీదేవి శోకవిహ్వలగాక ప్రసన్నవదనయనయై సర్వము నశ్వరమని తలంచి యారేయి సుఖనిద్రఁ గడపెను. ఈదంపతు లంత నారాత్రిశేషమున సుఖసాగరనిమగ్నులై గడపిరి. పులకలు పొడమ బహువిధబంధవిశేషముల సుఖ మనుభవించిరి. ఆతఁ డామెను బ్రాణాధికురాలినిగా భావించెను. అన్యోన్యనర్మాలాపముల నితరేతరాశ్లేషావిశేషముల నారాత్రి క్షణకాల మట్లు వారు గడపిరి.

## శంఖచూడుఁడు శివునితో యుద్ధ మొనరించుట.

మఱునాఁడు ప్రభాతమునకుఁ బూర్వమే లేచి మనోహారపుష్పతల్పమును బరిత్యజించి శ్రీకృష్ణధ్యానముచేసి యా శంఖచూడుఁడు రాత్రి కట్టుకొన్న వస్త్రమును వదలి కాల్యకృత్యము లొనరించి మంగళోదకముల స్నానమొనరించి మరల ధౌతవస్త్రముల ధరియించి ఫాలమునఁ దిలకము నిడి యావశ్యాహ్నికమును దీరిచి, యిష్టదేవతలఁ బ్రార్థించి దధ్యాజ్యమధులాజాది మంగళవస్తువులం గనుంగొని రత్నమణి వస్త్రకాంచనశ్రేష్ఠముఁల బ్రాహ్మణశ్రేష్ఠులకు దానముచేసి గురువునకు

సద్రత్నముల నొసంగి గజరత్నాశ్వరత్న మనోహరధనరత్న ముల దరిద్రుఁడగు భూసురునకు దానమిచ్చి వేయిభాండార ములను, రెండులక్షల నగరములను, ననేక గ్రామములను బాత్ర భూతభూసురునకు నిచ్చి పుత్రునకుఁ బట్టముఁ గట్టి సర్వదానవ విభుండవు కమ్మా యని యాశీర్వదించి భార్యయగు తులసి నా పుత్రున కప్పగించి రాజ్యధనసేవకకోశ వాహనాదికములఁబుత్రుని యధీనమందుంచి తాను యుద్ధసన్నాహ మొనరించి ధనుస్సును ధరించి సైన్యముల సిద్ధపఱుప నియోగించి మూఁడులక్షలగుఱ్ఱ ములు, లక్షమదగజంబులు, పదివేలరథంబులు, మూఁడుకోట్ల పదాతులు, కవచధారులు శూలధారులు మూఁడుమూఁడు కోటులు తనవెంట జన్యమొనరింప సిద్ధపడఁగా నానందించి యుద్ధవిశారదుండగు మహారథుని మూఁడులక్షలబలముల కధి పతిం గావించి తక్కినబలములకు భాండౌఘుండను దానవు నధిపతిగా నొనర్చెను.

ఇట్లుచేయఁదగు నియమముల నేర్పఱచి శిబిరమునుండి వెలువడి శ్రీహరిని మనసున ధ్యానించుచు రత్నేంద్రసారనిర్మిత వ్యోమయానము నెక్కి గురువుల ముం దిడుకొని యీశ్వరుఁ డున్న చక్కటికిం బోయెను. పుణ్యభద్రానదీతీరమునఁ బవిత్రాక్ష యవటము నీడ సిద్ధుల కాశ్రయభూతంబగు సిద్ధాశ్రమమున గపిలమహర్షి తపస్సొనరించినచోట భారతభూమియందుఁ బడ మరసంద్రమునకుం దూర్పున మలయపర్వత పశ్చిమభాగంబున శ్రీశైలమునకు నుత్తరభాగమున గంధమాదనాద్రికి యామ్య

ప్రదేశమునఁ బంచయోజనవిస్తీర్ణమై తచ్ఛతగుణదైర్ఘ్యమై తగుచోట, విమానమును దిగెను.

అందు శుద్ధస్ఫటికమువలె జలము ప్రవహింప భారత సుకృతవిశేష మననొప్పుచు, నక్షయోదకము గలిగి, శరావతి యనునది తనలోఁ గలియ హిమాలయమునఁ బుట్టువుంగాంచి మించి పుణ్యభద్రానది యలరుచుండెను. దానినే గోమతియని యు వాడుదురు. అది పడమరసంద్రమునఁ గలియును. నద మనక యేలాకా నదియనియే పెద్దలు నామకరణము చేసిరి. అచ్చట దిగి శంఖచూడుఁడు శ్రీశంకరు దర్శించెను.

ఆసదాశివుఁడు భక్తలోకశంకరుండై, సూర్యకోటి ప్రభాసమానుండై, యోగాసనమును దాల్చి చిన్ముద్రవిలసిల్ల, స్మితవక్త్రము సౌందర్యమును దెలుప బ్రహ్మతేజస్సు ప్రజ్వరిల్లఁ, త్రిశూలపట్టిసధారియై, నిరుపమాన వ్యాఘ్రచర్మాంబరంబును ధరియించి, భక్తమృత్యుహరుండై శాంతమూర్తియై మనోహర రీతి వెలయుచుండఁగాఁ జని కాంచెను. ఆశంకరుండు తపఃఫల ప్రదాతయయి, సకల సంపత్ప్రదాయకుండై, ఆశుతుష్టింగాం చుచుఁ, బ్రసన్నముఖకమలుండై, భక్తానుగ్రహనిరతుండై విశ్వబీజవిశ్వరూపవిశ్వనాథాద్యనేక నామవిలసితుండై, నిర్వి కారవైభవంబునఁ బరఁగుచు నద్వితీయుండై విరాజిల్లుచుం డెను.

అట్టి యసమానవైభవమాహాత్మ్యముల నలరు శ్రీశంక రుం గాంచి పరిజనసమేతుఁడై శంఖచూడుఁడు నమస్క రించెను. భద్రకాళికి, స్కందునకును, నమస్కరించెను.

వారెల్ల నాతని కాశిషముల నిడుచు గౌరవపురస్సరముగాఁ జూచుచుండ నియోగించి తత్కాలోచిత కుశలప్రశ్నములచే నించుక కాలముం గడపిరి. శంఖచూడుండును శివసన్నిధి వసించెను.

అంత సదాశివుండు కరుణవెలయ నిట్లు పలికెను. లోకముల సృజించు నాతఁడు బ్రహ్మ యనంబడు. ఆతనిపుత్త్రుఁడు మరీచి. ఆముని విష్ణుభక్తుఁడు. తత్తనయుండు. కశ్యపుఁడు. ఆముని సృష్టికర్తలలో నొకఁడయ్యెను. దక్షప్రజాపతి ప్రీతిచే నా కశ్యపబ్రహ్మకుఁ బదుమూఁవురు పుత్త్రికలను భార్యలగా నొసంగెను. ఆభార్యలలో దనువను నంగన యొకతుకయని తెలియవలయు. ఆదనువు కశ్యపసౌభాగ్యవృద్ధికారిణి యనంబడుచు, నలువదిమంది కొడుకులం బడసెను. వారెల్ల బ్రతాప విశేషములఁ బ్రఖ్యాతినందిరి. వారిలో మహాబలపరాక్రమశాలి విప్రచిత్తి యనువాఁడు గలఁడు. తత్తనూజాతుఁడు దంభనామకుఁడు. ఆతఁడు విష్ణుభక్తిగలిగి జితేంద్రియుఁడై పుష్కరతీరమున లక్షసంవత్సరములు నియతిమై నొకమంత్రమును జపించెను. ఆమంత్రమే శ్రీ కృష్ణమంత్రము. ఆతని గురువు శుక్రుఁడు. కొంతకాలమున కాదంభుఁడు శ్రీకృష్ణపరాయణుఁడవగు నిన్నుఁ దనయునిం గాంచెను. నీవు తొలుత గోలోకమున శ్రీకృష్ణసేవకులలో నొకఁడవు. పార్షదుఁ డనంబడు గోపకుఁడవు. రాధికాశాపకారణమున దానవేశ్వరుండవై యిపుడు జన్మించితివి.

విష్ణుభక్తుఁడు ఆబ్రహ్మస్తంభపర్యంతము తుచ్ఛముగా భావించి దేనినిగోరక విష్ణుసమీప నివాసమునే కోరును. అది తప్ప నితర మేమిచ్చినను బరిగ్రహింపఁడు. బ్రహ్మత్వము, నమరత్వమును తుచ్ఛముగా విష్ణుభక్తుఁడు భావించును. ఇఁక నింద్రత్వము, మనుత్వమును లెక్కించునా? అట్టి శ్రీకృష్ణ భక్తుఁడ వగునీవు దేవతారాజ్యమున భ్రమింపఁ గోరనేల? దేవతలకు రాజ్యము నిమ్ము. నాయందు నీకుఁగలప్రీతిని రక్షింపుము. స్వరాజ్యమున సుఖముగా నుండుము. దేవత లీరాజ్యమున నుందురుగాక. భ్రాతవిరోధ మిఁకఁ జాలును. మీరందఱు కశ్యపవంశజులు గదా. బ్రహ్మహత్యాది మహాపాతకము లెల్లను జ్ఞాతిద్రోహపాతకమునఁ బదాఱవభాగమును బోలవు. ఈసంపదలు స్థిరములని భావింతువా? సర్వకాలసర్వావస్థ లొక రీతి జరగునని నీవు నమ్ముదువా? బ్రహ్మాయంతవానికి లయమునఁ దిరోభావము కలదు. మరల సృష్టికాలమున నావిర్భావము కలదు. ఇది యీశ్వరప్రభావమువలనఁ గదా జరగుచుండును. ధర్మము సత్యయుగ మనఁబడు కృతయుగమున నాల్గుపాదంబుల నడచుచుండు. త్రేతాయుగమున మూఁడు భాగములవెలయు. ద్వాపరయుగంబున రెండుభాగముల స్థితింగాంచు. కలియుగము నసేకభాగము నిలుచును. కలియుగము కడపటిభాగమునఁ గళామాత్రశేషముగ నుండును. కుహూ నామమనఁదగు నమవసయందుఁ జంద్రకళవలె సన్నగిలి నశించును. అదియే కలియుగాంత్యతమభాగ మని యెఱుంగఁదగు. గ్రీష్మర్తువున సూర్యకాంతి యెట్లుండునో

హేమంతమున నట్లుండదుగదా. పగటియందు మధ్యా హ్నము తఱి నుండు భాస్కరుకళ సాయం ప్రాతఃకాలముల నట్లుండదుగదా. ప్రాతఃకాలమున నుదయించి బాల్యమునొంది వరుసగా వృద్ధినొంది సాయంకాలమున రవి క్షీణించును. మేఘావృత్తిచేఁ బగటియందును గనంబడఁడు. రాహు వావరింప స్తంభత్వ మొందును. మరలఁ బ్రకాశించును. పూర్ణిమ నాఁడు పరిపూర్ణుఁ డగుచంద్రుఁడు. దినభాగమున క్షయత నొందునుగదా. కుహూ ద్వితీయదినమున మరల నుదయించును. రాహుగ్రస్తుఁడై తిరోభావ మొందును. చరాచరము లన్నియు నిట్లే వృద్ధిక్షయములఁ బడయుచుండును. పరబ్రహ్మ కొక్కనికే సదాసమత్వము వెలయుచుండును. మృత్యుంజయుఁడ నగునేను బహుప్రళయముల నందితిని. పలుమాఱు పుట్టువుం గాంచితిని. * ఆపరమాత్మయే ప్రకృతి. ఆపరమాత్మయే పురుషుఁడు. ఆతఁడే యాత్మ. ఆతఁడే జీవుఁడు. ఆతఁడే నానారూపధరుండు నగు. ఎవఁ డట్టిపరమాత్మను నామగుణస్తుతిరూప మగు ధ్యానముచేయునో ఆతఁడు మృత్యువును జయించును. † బ్రహ్మను సృష్టికర్తగను, విష్ణువును రక్షకుని

---

* స చ ప్రకృతి రూపం చ స ఏవ పురుషస్స్మృతః, సచాత్మా స చ జీవశ్చ నానారూప ధరఃపరః. అని మూ. ౮ స్కం. ౨౧ అధ్యా.

† స్రష్టాకృతో విధిస్తేన పాతావిష్ణుః కృతోభవేత్, అహం కృతశ్చ సంహర్తా వయం విషయిణః కృతాః. అని మూ. ౯ స్కం. ౨౧ అ.

గను, నన్ను లయకర్తగను నియమించిన వాఁడా పరమాత్మ యే. అట్టి నేను సదా తన్నామగుణసంకీర్తనము చేయుచుందును. ఈజ్ఞానముచేతనే నేను నిర్భయుఁడనై మృత్యుంజయుఁడ నగుచున్నాఁడ. అని పలికి సభామధ్యమున శంకరుఁ డూరకుండెను.

శంఖచూడుం డామాటల నాలకించి శివుం బ్రశంసించి మధురవాక్కుల నిట్లు పలికెను. ప్రభూ! శంకరా! నీవు వచియించినదంతయు సత్యంబ. అన్యథా వచియింపఁ జాలను. ఐనను నామనవి యొకఁడు కలదు. దానిం జిత్తగింపవలయును. జ్ఞాతిద్రోహము మహాపాతకమని మీరు వచించితిరి. బలిచక్రవర్తి సర్వస్వము పరిగ్రహించి యేల క్రిందికిఁ ద్రోయఁబడియెనో తెలియఁజాలకున్నాఁడను. గదాధరుం డాతని నధోలోకమునుండి యుద్ధరింపఁజాలకున్నాఁడు గదా. సోదరయుక్తుఁ డగు హిరణ్యాక్షుఁడేల దేవతలచే హింసింపఁబడెను? శుంభాది దానవు లేల దేవతలచే హింసింపంబడిరి? పూర్వము క్షీరసాగర మథనకాలమున దేవత లేల యమృతముఁ ద్రావిరి? అందుఁ గ్లేశము మాభాగము, ఫలము వారిభాగమా. ఇది న్యాయమా. పరమాత్మ కీలోకము క్రీడాభాండము. ఎవని కెప్పు డైశ్వర్యము నీయఁదగునో యప్పు డతని కిచ్చును. దేవదానవుల కీసంవాదము పలుమాఱు కలుగుచుండునదియే. మాకు జయపరాజయములు కాలక్రమమునఁ గలుగుచునే యుండును. ఇట్టి మాకు విరోధము గలుగఁగా దేవతలకు సాయమొనరింప

వచ్చుట నీశ్వరునకు మిగుల లజ్జాకరము. జయపరాజయములఁ గీ_ర్తిహానులు సంభవించుచుండుట సహజము. అని పలుక విని పరమేశ్వరుండు నవ్వి తగిన ట్లు_త్తరమును జెప్పఁదలఁచి యి ట్లనియె.

బ్రహ్మావంశసముద్భవులరగు మీకు యుద్ధముగలుగ మీతో యుద్ధము సేయుట కేమి లజ్జగలదు. పరాజయము గలుగ నకీ_ర్తియు లేదు. తొలుదొలుత శ్రీహరికి మధుకైట భులతోఁ గదా యుద్ధము పొసఁగెను. హిరణ్యకశిపున కతని యాత్మతోనే సంగరము సంభవించెను. త్రిపురాసురులతో మున్ను నాకు నాహవము కలిగెను. జగజ్జనని యగుప్రకృతికి శుంభాదులతోఁ గలహము పొసఁగెను. నీవు శ్రీకృష్ణపర మాత్మకుఁ బార్షదుండవు. తెగిన దానవులందఱు నీవంటివారు సుమీ! ఇట్టి నీతో నేను బ్రవిదారణ మొనరించుటచే లజ్జ యేమి? సురలకు దిక్కుగా హరివలనఁ బంపఁబడితిని. నాహిత వచనము దేవతలకు రాజ్య మిమ్మనియే. అని పలికి శంకరుం డూరకుండెను. శంఖచూడుండు నమాత్యులంగూడి వెడలెను.

## దేవదానవయుద్ధము.

శంఖచూడుఁడు విమానారూఢుఁడై వెడలినపిమ్మట శంకరుండు తనసేనలఁ ద్వరగా ననికివెడల నాయ_త్తపఱుప నాజ్ఞాపించెను. దానవేంద్రుఁడు యుద్ధారంభము నొనరింప సన్నద్ధుఁ డయ్యెను. ఇంద్రుఁడు వృషపర్వునితో సంగర మొన

రింపఁ దానే పూనుకొనెను. భాస్కరుఁడు విప్రచిత్తితో నని సేయ మార్కొనియె. చంద్రుఁడు దంభ దానవునిఁ దలపడియె. కాలుఁడు కాలస్వరూపం డనుదైతేయుని, హుతాశనుఁడు గోకర్ణుని, కుబేరుఁడు కాలకేయుని, విశ్వకర్మ మయదానవుని, మృత్యువు భయంకరుండగు సంహారనాముని, వరుణుఁడు విశంకటుని, వాయువు చంచలదితిజుని, బుధుఁడు ధృతపృష్ఠుని, శనైశ్చరుఁడు రక్తాక్షుని, జయంతుఁడు రత్నసారుని, వసువులు * వర్చోగణములను, అశ్వినీదేవతలు దీప్తిశాలి యనువానిని, నలకూబరుఁడు ధూమ్రుని, ధర్ముఁడు ధురంధరుని, మంగళుఁడు షాక్షుని, వైభానుఁడు శోభాకరదనుపుత్రుని, మన్మథుఁడు పిఠరుని, ఆదిత్యులనఁబడు భాస్కరసూర్యేతర దేవతలు పదిమందియు గోధాముఖ, చూర్ణ, ఖడ్గ, ధ్వజ, కాంచీముఖ, పిండ, ధూమ్ర, నంది, విశ్వ, పలాశు లనుదానవులను, ఏకాదశరుద్రులు భయంకరదానవులను, మహామారి యనుదేవత చండుని, నందీశ్వరాదులు దానవగణములను మారుకొనిరి. ప్రళయము భయంకరముగఁ దోఁచిన ట్లాయుద్ధము భయంకరాకృతిం దాల్చెను.

ఈశ్వరుఁడు వటమూలమునఁ గాళీదేవియుఁ గుమారుఁడును దనయొద్ద నుండఁ గూరుచుండి చూచుచుండెను ఉభయసేనలు ఘోరముగాఁ బోరిరి. శంఖచూడుఁడు రత్నసింహాసనాసీనుఁడై కోటిదానవులు పరివేష్టింప, రత్నభూషణములు

* 'వసవో వర్చసాంగణైః'. అని మూ.

ప్రకాశింప, వెలయుచుండెను. శంకరకింకరు లందఱు దానవులచేఁ దఱుమంబడిరి. దేవతలు క్షతకాయులై కాళికి బుద్ధి చెప్పిరి. కుమారుఁ డాగ్రహించి దేవతల కభయంబొసంగి సేనల కుత్సాహమును బుట్టించెను. అంతఁ దానొక్కఁడయ్యును దానవుల నందఱ మార్కొని దారుణప్రవిదారణము గావించెను. దానవకోటుల నిమేషమాత్రమున సంహరించెను. అంతఁ గమలాక్షియగు కాళి యసురుల నుక్కడంచెను. కోపము రూపముఁదాల్చినపోల్కి నాకాళి చెలరేఁగి దానవుల రక్తనదిని ముంచెను. దాను నోడలెఱుంగక యనంత క్రోధమున వారి రక్తమునుఁ ద్రావెను. ఒక్కకరంబున ననేకరాక్షసులం బట్టుకొని పిండిచేసెను. ఆకాళీయుద్ధమునఁ గబంధము లనేకములు గగనంబున నాడుచుండెను. కుమారస్వామి శరములు పరంపరలుగాఁ బరగింప దానవులు శిథిలితగాత్రులై బలపరాక్రమోపేతులయ్యు భీతులై పరుగువాఱిరి.

అట్లు స్కందుఁడు విక్రమింప దానవులు పరుగిడుచుండుట గన్నులారఁ గాంచి వృషపర్వుఁడు, వికంకణుఁడు నను వారు కుమారునిమారుకొని పోరుఘోరముగాఁ గావించిరి. మహామారియు భయంపడక రక్కసుల నురుమాడుచుండెను. వీరంద ఱొక్కపెట్టన నెట్టన విక్రమింప దానవులు భీతులై కలవిలపా టొందిరి. పలాయన మంగీకరింపక తప్పదయ్యెను. దేవత లంబరమునుండి పుష్పవృష్టిని గురియించిరి. కుమార

స్వామి సంగరమును జూచి నంత మహారుద్రుఁడు విక్రమించి ప్రళయమొందించుతఱి యిట్టిదే యనుమాట స్మృతికివచ్చెను.

అంత శంఖచూడుఁడు తనవారిపాటుగాంచి విమానా రూఢుఁడై బాణవర్షము గురియించుచు, యుద్ధము చేయఁ దొడఁగెను. ఆతనిబాణములు దృష్టిని మించెను. ఒక్కొక్క తఱి నంధకారమును బుట్టించుచు, నొక్కొక్క సమయమున దీప్తుల వెలయించుచు నాతఁడని చేయసాగెను నందీశ్వరాదు లాతని సంరంభంబు భరియింపఁజాలక పరుగెత్తసాగిరి. రణ మూర్ధమున నొక్కకుమారస్వామి నిలువఁబడియెను. పర్వతము లను, వృక్షములను, సర్పములను,శిలలను, వర్షరూపమున శంఖ చూడుఁడు గురిపింపసాగెను. ఆతని శరవృష్టిచేఁ గప్పఁబడి స్కందుఁడు తిరోహితుఁ డయ్యెను. అప్పుడు మంచుచేఁ గప్పఁ బడు భాస్కరుని విధముతోఁచెను. అంతఁ బోక దానవుఁడు కుమారుని ధనుస్సును భేదించెను. రథమును శకలములు చేసెను. మయూరవాహనము నవయవములు తద్బాణక్షతము లై రక్తమునఁ దోఁగుచుండెను. కుమారుశక్త్యాయుధము చూర్ణమయ్యెను. తుదకుక్షణమాత్రము కుమారుఁడు మూర్ఛ మునింగెను. అంతలోఁ దెలివి పొలసెను. విష్ణుదత్తమగు నొండు శరాసనముఁగొని రత్నమయవిమానము నెక్కి శస్త్రాస్త్రములఁ జక్క నమర్చుకొని భయంకరసంగర మా శంఖచూడునితోఁ జేసెను. దివ్యాస్త్రములఁ బరఁగించి దానవప్రయుక్తపర్వత వృక్షసర్పాదుల శకలములుగా నొనరించెను. పర్జన్యాస్త్రమును

బ్రయోగించి దానవాస్త్రాగ్ని నడంచెను. అంత నూరకుండక శంఖచూడుఁ డప్పు డెక్కియున్న రథమును ధనుస్సును ఛేదించెను మఱియు సారథిని, రత్నసారమగు కిరీటమును, జూర్ణము గావించి, శక్తిని బ్రయోగించెను. ఆశక్తివక్షమునఁ దాఁకుడు శంఖచూడుఁడు మూర్ఛిల్లెను క్షణమాత్రమునఁ దెప్పిరిల్లి లేచెను. వేఱొండు రథము నెక్కి ధనుర్దండము నుద్దండరీతిఁ గేలనంది మాయికులలో నగ్రగణ్యుండగు నాశంఖచూడుఁడు శరజాలములఁ గుమారుంగప్పి సింహనాద మొనరించెను. వెంటనే శ్రీవిష్ణుదత్తమగు శక్తిని గ్రహించి కుమారువక్షంబు లక్ష్యముచేసి ప్రయోగింప నాతఁడు మూర్ఛమునింగి భూమిని సోలెను. ఆస్కందుని గాళికాదేవి లేవనెత్తికొనిపోయి శంకరు పార్శ్వమున నునిచెను. శివుం డాతని నిమేషమాత్రమున లబ్ధసంజ్ఞుని జేసి బల మనంత మగునట్లు ప్రసాదించెను. బలపరాక్రమములు యథారీతి నలర నాతం డలరారెను.

అంతఁ గాళీదేవి యుద్ధముసేయ వెడల మహావీరులెల్ల నామెం బరివేష్టించి పోయిరి. దేవగంధర్వాదు లాయంబను నుతించిరి. ఆయంబ వెడలి సింహనాద మొనరించెను. దేవీసింహనాదమున భీతిల్లి దానవులు మూర్ఛాక్రాంతులైరి. ఆకాళిని బరివేష్టించి యున్న భూతములు రాక్షసులం జంపఁబూనెను. శంఖచూడుఁ డాకాళిని మార్కొన సాహసించి యుద్ధమునకు వచ్చెను. దానవుల కభయం బొసంగఁ గాళి యాతనిమీఁదఁ బ్రళయాగ్నిసమప్రభంబగు వహ్నిఁ బ్రయోగించెను ఆశం

చూడుఁడు పర్జన్యాస్త్రమును వైచి దానిం జల్లార్చెను. ఆమె వారుణాస్త్రమును వైవ నతఁడు దానిని విలాసముమీఱ గాంధర్వాస్త్రమున శాంతింపఁ జేసెను. కాళి మహాభయంకరంబగు మాహేశ్వరాస్త్రమును బ్రయోగింప వైష్ణవాస్త్రమున దాని నుపశమింపఁజేసెను దేవియు మంత్రపూర్వకముగా నారాయణాస్త్రమును నిగిడింప దానవుం డరదంబుఁ దిగి నమస్కరించి దానిపౌరుషం బుడిపెను. ఆయస్త్రము శాంతినొంది మింటికెగసి ప్రళయాగ్నిశిఖవలెఁ బైఁబడరాఁగా నతఁడు దండమువలె భూమిం బడియెను. దాన నది యూరకుండెను. ఆమెయు బ్రహ్మాస్త్రమును వైవ బ్రహ్మాస్త్రమునే వైచి శాంతినొందించెను. ఆజగజ్జననియు మంత్రపూర్వకముగా దివ్యాస్త్రమును బఱప నతఁడు దివ్యాస్త్రజాలమున దానిఁ జల్లార్చెను. యోజనాయత శక్తిని దేవివైవఁగా వివిధవిధదివ్యాస్త్రములచే దాని నతఁడు ఖండించెను. ఆవల నాజనని మంత్రపూతమగు పాశుపతముఁ బ్రయోగింప సమకట్ట నాకాశవాక్కొకటి "దేవీ! పాశుపతమున వీనికిం జావులేదు. శ్రీహరిదివ్యకవచ మీతని శరీరమున నుండు నంత దాఁక వీని నీయస్త్రము బాధింపలేదు. ఇంతియ గాదు. ఈతనిభార్యయందు సతీత్వ మెంతవఱకుండునో యంత దాఁక నీతనికి జరామరణములు గలుగవని బ్రహ్మవరము గలదు." అని పలికెంచెను.

భద్రకాళి యావాక్కు నాలకించి ఆయస్త్రమును రాక్షసులపై వైవ శతలక్షదానవులు మడిసిరి. అంత నాఁకలిఁగొని

యామె శంఖచూడుని మ్రింగఁబోఁగా దివ్యాస్త్రముల నడ్డగించెను. మరల నాతని మ్రింగ వేగముగా నామె పరుగిడ సర్వసిద్ధులుగల యాతఁడు దేహమును బెంచెను. కాళియు నభంగమగు తద్గాత్రమును ముష్టిఘాతమునఁ జూర్ణమగునట్లు చేసెను. అంత మరలక యాదేవి శూలమునువైవ వామహస్తమున వాఁడు దానిం బట్టుకొనియెను ఆవల నాకాళి ముష్టిఘాతమున నతని నొప్పింప మూర్ఛమునింగి క్షణకాలమునకే లేచెను. వారిరువురు బాహుయుద్ధ మొనరించిరి. మరల దేవి కాళ్యస్త్రమును వైవ నతఁడు స్వతేజమున దానినుపశమింపఁజేసెను. కాని మాతృభక్తిచే దేవిపై బాణప్రయోగము చేయఁడయ్యెను. దేవి యంతట నాగ్రహామాపఁజాలక యతనిం బట్టుకొని గిరగిరం ద్రిప్పి యాకసమునకు విసరివైవ నతఁడు క్రిందఁబడి లేచి కాళికి నమస్కరించెను. పిదప విమాన మెక్కెను. కాళియు దానవులం జంపి రక్తపానమునఁ దృప్తినంది శంకరు సన్నిధికిం బోయి జరిగినవృత్తాంతము దెలుప నీశ్వరుండు నవ్వి మిగిలిన రక్కసుల సంహరింప శంఖచూడుఁ బొరిఁగొనం దలంప నాకాశవాణి వీఁడవధ్యుఁడని వినఁబడ నందుండియే పాశుపతముం బ్రయోగింపక యుద్ధముచేయ రణభూమికిం బయన మయ్యెను.

శంఖచూడుఁడు విమానమునుండి దిగి పరమభక్తియుక్తుఁడై యీశ్వరునకుఁ బ్రణతు లొనర్చెను. వెంటనే విమానమెక్కి శరశరాసనముల ధరించెను. శివశంఖచూడు లిరువు

రును దలఁపడి ఘోరముగఁ బోరిరి. నూఱుసంవత్సరములు సంగరము చెల్లెనుగాని జయపరాజయములు తెలియరాకయ్యెను. శివుఁడు సకలాస్త్రములఁ బ్రయోగింపఁ దానవుఁడు నల్లి చేసెను. దానవుఁడు రథస్థుఁడై శివుఁడు వృషభస్థుఁడై యుండిరి. * వీరిరువురు సంగర మొనరించుకాలమున నేయే రాక్షసులు చనిపోయిరో అట్టి వారిని నూఱుగురను శంకరుండు బ్రదికించెను.

ఇట్టి తరుణమున నొక వృద్ధభూసురుఁడు రణభూమికి వచ్చి శంఖచూడుని జేరి యిట్లనియెను. ఓరాజేంద్రా! నీవు సర్వసంపద్దాతవు. కాన నావాంఛితమును దీర్పుము. అన విని శంఖచూడుఁ డట్లే యొసంగెద. ఏమివాంఛితమో తెల్పుఁడన నావృద్ధభూసురుం డయ్యా! నీకవచనమును గోరి వచ్చితిని. అని పలికి హరియే యాకవచమును దీసికొనియెను. పూర్ణకాముఁ డగు నాబ్రాహ్మణుఁడు శంఖచూడుని రూపముగఁ దులసియొద్దకుం బోయి యామెను మాయామోహితం జేసి యాశేయి యామెతో సుఖనిద్ర గడపెను.

ఈవిషయము నాత్మ నెఱింగి శంకరుఁడు శూలాయుధమును జేనంది ప్రయోగించెను. అది గ్రీష్మకాలమున మిట్టమధ్యాహ్నమున భాస్కరునిం బోలి వెలుంగుచు దుర్నివారంబై దుర్ధర్షంబై శత్రుసూదనపటిష్ఠమై, సకలాస్త్రసారమై శివకేశవులకుం దప్ప నితరులకు భరింపరాక భయంకరమై ధనుస్సహస్రదైర్ఘ్యముగలిగి, శతహస్తవిస్తృతింగలిగి, సజీవమై, బ్రహ్మారూ

* రణే యే యే మృతా శ్శంఖ ర్జీవయామాస తా న్విభుః. అని మూ.

పమై, శాశ్వతమై, నిర్దేశింపరాని మహిమముగలిగి, బ్రహ్మాండ ముల నశింపఁజేయ సమర్థమై యలరుచుండెను. అట్టిదానిం బూన్చి వైవ నయ్యది వచ్చుచుండుటఁ గాంచి ధనుర్దండమును బాఱవైచి శ్రీకృష్ణపాదాంబురుహముల ధ్యానించుచు యోగ మూనియుండెను. ఆశూలము మింట మిణుఁగురులు చెదర వచ్చి యాతనిపైఁ బడి భస్మము గావించెను. రథము చూర్ణ మయ్యెను.

అంత శంఖచూడుఁడు గోపకుమారవేషమును దాల్చి ద్విభుజము లలర మురళి వెలయ రత్నభూషణభూషితుండై దివ్యవిమానము నధిరోహించి సకల గోపికాగోపకపరివేష్టితం బై యద్వితీయమగు గోలోకమునకుం బోయి రాధాకృష్ణులకు నమస్కరించి వారి పాదకమలముల సేవించి బృందావనమున విహరించుచుండెను. మర్త్యలోకమునుండి వచ్చిన సుదామునిం గాంచి ప్రేమ మొప్పఁ గ్రుచ్చియెత్తి యాశీర్వదించిరి. ఆశూలా యుధము శ్రీకృష్ణలోకమునకుం బోయెను. శంఖచూడునియ స్థులు శంఖములయ్యెను. అవి నానారూపముల వెలయుచు దేవతార్చనమునఁ బవిత్రములై వెలయుచుండెను. ఆశంఖోద కము గంగోదకమువలెఁ బావనమైనది. ఎచ్చట శంఖశబ్దము వినఁబడునో శ్రీమహాలక్ష్మి సాక్షాత్కరించును. * ఎందు శంఖ ముండునో యందు శ్రీహరియుండును. ఎందు శ్రీహరి వెల

* శంఖో హరే రధిష్ఠానం యత్ర శంఖ స్తతో హరిః, తత్రైవ వసతే లక్ష్మీ ర్దూరీభూత మమంగళం. అని మూ.

యునో యందు మహాలక్ష్మియుండు. అందు నమంగళము లుండఁజాలవు. స్త్రీశూద్రులు శంఖధ్వనిచేయ భీతయై లక్ష్మీదేవి యాచోటునువిడనాడి పరుగిడును. శివుం డిట్లు శంఖచూడునిం బొలియించి శివలోకమునకుం బోయెను. దేవతలు తమతమ లోకములకుం బోయిరి.

పాఠకమహాశయు లీ గాథనుండి పెక్కువిషయములు గ్రహింపవలసి యుండును. చిత్రకారుఁడు తాఁ జేయఁబూనిన కార్యమునకు ముందే మనఃకుడ్యమునందుఁ బలురంగులతో చిత్రము నలవరించును. బాగుగనున్నదియా లేదా యని పరీక్షించును. దోషము లివి యని యిట్లుండిన తనకు మేలుకలిగి కీర్తి వ్యాపించుననియు నూహించును. ఆవల బాహ్యకుడ్యము నందో దర్పణమునందో తా మనసునఁ బరీక్షించి యూహించిన రీతిగా లిఖించి ప్రదర్శించును. చిత్రలేఖనమునకుఁ గావలసిన సాధనములగు కుంచియ, రంగులు, పాత్రములు, నిర్మలసౌధము, మనోమోదమును గల్గించి తనపని కనువగు నితరసాధనముల నన్నింటినిం జేర్చుకొనియే పనికిఁ బ్రారంభించును. అంతియగాని తటాలున ప్రారంభించి యాయాయిసాధనములు వలసినపుడు వానిని సేకరింపఁ బ్రయత్నింపఁడు. రథకారుఁడు సాలభంజికను జేయఁబూని మనసున దానిరూపమును బదిలపఱచుకొని బాగోగులు నిశ్చయించుకొని తననేర్పు నెట్లు చూపఁదగునో ఆవిధము నూహించి యంతర్దృష్టిచే దానిం జూచి లోపము లివ్వి గదా యని తానే కనిపెట్టి యన్నియు సరి

పోయినపిదపఁ దనకృత్యమును జేయఁబూనును. సత్కవియుఁ దాఁ జేయఁబూనుకొన్న గ్రంథమునకుఁ గథాభాగాదుల మొదటనే యూహించుకొని లోకుల మెప్పింపఁదగినపద్ధతి యిది గదా యని మనోరాజ్యసింహాసనముకడఁ దనకు రాఁదగు లాభములంగూర్చి చక్కఁగా నెంచియే కృతిచేయ నారంభించును. కాని లేఖినింబట్టుకొని యప్పటికప్పు డాలోచింపఁడు. అట్లు చేసినకృతి బాగుపడునదియుఁ గాదు.

అట్లే భగవంతుఁడు తానవతరించుటకు ముందే వలయువారినెల్లఁ బుట్టఁజేయును. పరికరములు సిద్ధమైనపిదపఁ దా నాయవనిక నలంకరించి నాటకము సాగించును. భగవంతునికార్యములు కొన్ని యుపయోగపడునవి కానట్లు మనకు స్ఫురించును గాని యేమో యొకకార్యమునకే వారింబుట్ట నాజ్ఞచేయును. ప్రకృత శ్రీకృష్ణావతారమునకు సుదాముఁడు శంఖచూడుఁడుగాఁ బుట్టుటవలని లాభము లేవియని మన మాలోచించినచో నంతగాఁ గానరావు. కాని ముఖ్యప్రయోజనము లేకుండఁ బోదని నిశ్చయించుకొనవలయు. తులసీదేవ్యుత్పత్తిని గూర్చి యూహింతము. కలియుగము పాపభూయిష్ఠము. తపస్సొనరించువా రొకరిద్దఱుగాని యుండరు. చాలమంది కపటాత్ములు. మఱికొందఱుదాంభికులు మాయచే నితరుల మోసమొందింపఁ బ్రయత్నించువారు. ఇఁక భగవద్భక్తి యెట్లు నిలుచును? మనుజులకాయువు తక్కువ. ఉన్నంతలోఁ బాపకృత్యముల నొనరింపఁబూనుట వాడుక. ఇట్టివారిని బుట్టింపఁ

బోవు యుగము రానున్నది. ద్వాపరాంతమునఁ దా నవత రింపఁ బూనెను. తన యవతారమును మర్త్యలోకమునఁ జాలకాలము నిలుప నూహింపలేదు. గోలోకమునఁ దన యెడఁ బాటు నంతకాల మోర్వఁగలవారు లేరు. భక్తజనశరణ్య మాలోకము అందున్నవారు పరమభాగవతులు. క్షణకాల మైన భగవద్విరహమునకుఁ దాళఁజాలరు. నిరంతరతత్పాద సేవానిరతులు. పరమపవిత్రచరిత్రులు. పునరావృత్తిరహిత పదము నంది ధన్యులై యున్నవారు. వారిని వదలి చిరకాలము మర్త్యలోకమున నుండ భగవంతున కిష్టములేదు. రాఁబోవు పాపయుగము స్థితి నాలోచించెను. నిశ్చలభక్తితోఁ జిరకాల మారాధించినను బడయరాని తనలోకము క్షణమాత్రమైనను బూజించినఁ గలుగు నన్నినియమములుచేసినఁగాని పెక్కు మందిలో నొక్కఁడైనను గలుగ నేరఁ డని నిశ్చయించెను. కావున క్షణమాత్రము తన్నారాధించుచుఁ దులసీపత్రమునఁ బూజించినఁ గలికాలమర్త్యులకును, నిరంతర దులసీకాష్ఠలఁ బూనిన సత్యయుగమనుష్యులకును గలుగఁగల తప మొక్క టియే యని నియమించెను కావున లక్ష్మీగంగాసరస్వతులకు విరోధము గలుగఁజేసి పరస్పరశాపముల నీయఁజేసెను దానఁ దులసీవృక్షము భూలోకమునఁ గలిగెను దానిపత్రములఁ దన్ను క్షణకాలము పూజించినఁ జాలు నని నియమించినందున నొక్కఁడేని భక్తిమీఱఁ బూజింపఁగలఁ డని యూహించెను. కాఁబట్టి తదవతారమునకు ముందే కలిగిన ప్రతివస్తువు మహోపయోగమును గలిగించునని మనమూహింపవలయు.

మఱియు శంఖచూడోపాఖ్యానమునుండి పెక్కునీతులు బయలుదేరును. వానిని గ్రహించుట చాలముఖ్యము. తులసీ శంఖచూడులసంవాదమును మరలఁబఠింపుఁడు. ఎన్నిధర్మములందిమిడి యున్నవో, పెక్కుస్మృతులు పఠించినఁగాని తెలియఁజాలనివిషయములు సారభూతములై యిందున్నవి. వివాహనియమము లెట్లు తెల్పఁబడినవో కనుఁగొనుఁడు. ఒక్కొక్కయుగమునఁ బూజింపఁదగిన దేవత లెందఱుగలరో చింతింపుఁడు. ఇట్టి యనేకధర్మము లీగాథనుండి మన మెఱుంగఁ దగియుండును.

శంఖచూడుని జయింప నలవిగాక నెఱింగి దేవతలు మొట్ట యిడ విష్ణు వీశ్వరునిం బంపెనని జదివితిరిగదా. కారణమే మని చింతింపుఁడు. కాలము పరిపక్వమగునంతదాఁక నెవ్వరు నేమిచేయఁజాల రని తెలిసికొనుఁడు. త్రిమూర్తులు సాధింపలే రన నిఁక నితరులమాట యిట వచింప నేటికి? శంఖచూడుఁడు శ్రీకృష్ణోపాసకుఁడు. తల్లబ్ధమగు నభేద్యకవచమాతఁడు దాల్చెను. దానిని గ్రహించినఁగాని యాతనిం జంప శక్యముగాదు. యుద్ధరంగమున యాచకుఁడు వచ్చి "దేహి" యనఁగా నీయఁదగునా తగదా యనియైన నాలోచింపక తన ప్రాణతుల్యమగు కవచము నొసంగెను. అనఁగా దేహ మెప్పటికైన నశించునది యని, దానినమ్మి తన మేలు పోఁగొట్టుకొనఁ బూనుట యవివేకమని యతఁడు భావించెను. ఆబుద్ధితో నాలోచించిన నాయూహ న్యాయమే. అల్పబుద్ధితో నెంచిన

నది తప్పుగాఁ దోఁపకమానదు దేహము స్థిరమనుకొను జీవులు కొందఱు గలరు. వారిమతిప్రతిభ తదనుగుణముగఁ బ్రసరించు చుండును. దేహము నీటిబుగ్గవంటి దనుకొను జీవులుగూడ నుండక పోఁగుకదా? వారియూహలు వేఱు. వారిబాగోగులు చర్చించుటకుఁ దత్పుణ్యము లేనిజీవులు పనికిరారు. వీరి కట్టిబుద్ధి లేదు. కావుననే కర్మములకుఁ దగినబుద్ధులు వారివారికిం గల్గు చుండును. తులసీపాతివ్రత్యమునకు భంగముఁ గల్గించినఁగాని శంఖచూడుఁడు చావఁ డని వేఱొకమాట గలదు గదా. దాని భావమేమి? పాతివ్రత్య మను నది యెంత మహోన్నతఫల ప్రదమో యోజింపుఁడు త్రిమూర్తుల నడలఁజేసినది. సకల లోకములఁ జీకాకుపఱుపఁ జాలినది. దాని నడంచుటకు విష్ణువు రూపాంతరమును ధరింపవలసివచ్చెఁగదా. ఔరా! పతివ్రతా మహిమమునకు సాటి యిఁక నేమున్నది? అట్టి పవిత్రపదార్థము వేఱొకటి కలదా. అట్టి స్త్రీలనామజపము భగవన్నామజప తుల్యము కాదా? ఇట్టి వెన్నియో తెలియఁదగిన విషయము లిందున్నవి. వీనిని గ్రహించుటయేకాక వానిం జింతించి చింతించి తదనుష్ఠానమున కెట్లు మనబుద్ధి యలవడునా యని జపించి జపించి యట్టి యత్యుత్తమపదార్థముల సంపాదింపఁ బ్రయత్నింపవలయును. ఇట్టి పవిత్రకథాభాగములే కలికాలమునకు మహోపకారకములు. వీనిం బఠించి తదుక్తనీతుల గ్రహించి వాని ననుష్ఠానమునకుం దెచ్చినవారే ధన్యులు. వారే కలికాలమునఁ గృతకృత్యులు. వారే భగవత్పదదర్శనము చేయఁ

గలుగుదురు. ఇప్పటికే చాలఁ బ్రొద్దుపోయినది. ముందటికథ విన మీామనసులు త్వరపడుచున్నవి. కాన నీకఁ బరమపవిత్ర మగు చరిత్రమును బఠింతము. అందుఁ దులసీదేవీమాహా త్మ్యము పరమమంగళప్రదము. దానిం దెలిసికొందము. నాకుఁ దెలిసినంతదనుక దేవీభాగవతమును బఠించి మీాయెదుట విన్న వించెద. సావధానులరై యాలకింపుఁడు. సంసారతాపత్రయ ములకు మనసునఁ జోటీయకుఁడు.

## నారాయణమూర్తి తులసీదేవిని వంచించుట.

శ్రీనారాయణమూర్తి విప్రవేషంబున శంఖచూడుని భయంకరరణరంగంబున వంచించి కవచము గ్రహించె నని పఠించితిమి. తులసీదేవీపాతివ్రత్యమునకు భంగముఁ గల్గించిన కథను సవిస్తరముగాఁ దెలియఁ దగియున్నది. అదెట్లనిన, కవచమును గ్రహించిన వెంటనే నారాయణమూర్తి శంఖ చూడు నాకృతింగొని శంఖచూడునిఁ జంపుట కుపాయ మిద్దియే యని యూహించి సుందరస్యందనము నారోహించి తులసీమందిరమునకుం బోయి యాద్వారసీమదుందుభిధ్వా నము వెలయఁజేసెను. ఆదుందుభిధ్వానము జయసూచకముగా నాపురమున నెలుంగఁబడుచుండెను, ఆజయశబ్దము విన్నంతనే తులసీదేవి పరమానంద మంది రాజమార్గమున రథారూఢుఁడై యున్న శంఖచూడుని గవాక్షవివరములం గాంచి పట్టరాని యానందమున బ్రాహ్మణులకు ధనంబు లొసంగి స్వస్తివచనం

బులం బడసి వందిమాగధులకు భిక్షుకులకుఁ గోరిన యట్లు ధనంబు లొసంగి పతిరాకకై వేచియుండెను.

కృత్రిమశంఖచూడుఁ డంత నరదంబు దిగి దేవీభవనంబుఁ జొచ్చెను. అమూల్యరత్నసారనిర్మితదివ్యరథమునుండి దిగి తన చెంత కరుదెంచు కాంతుం గాంచి నిరుపమప్రమోదపూర్ణమానసయై పాదములు కడిగి తడియొత్తి నమస్కరించి రత్నసింహాసనమున నాసీనుం గావించెను. అంతఁ గామంబు హెచ్చఁ గర్పూరాదిపరిమళవస్తుపరియుతంబగు తాంబూలంబు నిడి ప్రాణేశా! నేఁటికి నాజన్మము ఫలించె. బ్రదికితిని. ఏలన? ఘోరాహవమునుండి మరలి యింటికిరాఁగాఁ జూచుటకంటె నదృష్టము వేఱుగ నుండునే. అని పలికి మరల మృదులస్వరంబునఁ జిఱునవ్వు మోమునఁ మొలకలెత్తఁ గటాక్షవీక్షణముల భర్తం గాంచుచు సకామయుఁ బులకాంకురాంచితతనూవల్లి యునై యిట్లు ప్రశ్నించెను.

ప్రాణనాథా! అసంఖ్యవిశ్వసంహర్త గదా యీశ్వరుఁడు. అట్టి సదాశివుని మార్కొని రణమున నెట్లు విజయమును బడయఁ గల్గితివో యావార్తల విన వేడుచున్నదాన. ఆనతిచ్చి నాకోరికం దీర్పుమా యను తులసీదేవీవాక్యము నాలకించి కమలాపతి నవ్వి * శంఖచూడుని వాక్కులచేతనే యనృతవచన మిట్లు పలికెను. కాంతామణీ! శంకరునకు నాకును

* శంఖచూడస్య రూపేణ తా ముహా చానృతం వచః. అని మూ.

మహాహవము నూఱుసంవత్సరములు సాగెను. దానవులెల్ల నశించిరి. అంత బ్రహ్మ మాయిర్వురకుఁ బ్రీతిని గల్గించెను. బ్రహ్మయాజ్ఞచే దేవతల యధికారము వారి కిచ్చితిని. నే నింటికి వచ్చితి. శివుఁడు స్వలోకమునకుం బోయెను.

అని సూక్ష్మముగా రణవార్త నెఱింగించి శయనింపఁ గోరెను. యథాపూర్వముగా వారు సుఖనిద్ర సేసిరి. ఆసాధ్వీ తిలకము సుఖసమయమున గాఢాలింగనాదులయందించుకభేద మును గనిపెట్టి సంశయాకులస్వాంతయై నీ వెవ్వరని ప్రశ్నింపఁ బూని, మాయేశా! నీవెవ్వఁడవు? మాయఁ బూను నీచే నే ననుభవింపఁబడితిని. నాసాధ్వీత్వము నశించె. ఏల యిట్టి కట్టిడి కార్యము నొనరించితివో దానికై శపించెదను. అని తులసి పలుకఁగనే శ్రీహరి శాపభీతుఁడై క్షణమాత్రమునఁ దన దివ్యమంగళ విగ్రహమును ధరించెను. అట్లు మనోహరాకార మున నలరు దేవదేవుని రమానాథునిం గనుంగొని యాలోకోత్తరరూపమును గన్నంతనే వివశయై క్షణకాలమున లబ్ధ చేతనయై యిట్లు శ్రీహరితోఁ బలికెను. నాథా! పాషాణసదృశుఁడవగు నీకు నాపై దయలేదు. కపటముచేతను ధర్మభంగముచేతను నాసాధ్వీత్వము నీచే నపహరింపఁబడియె. దయా హీనుఁడ వేలయైతివో దాననే పాషాణహృదయుఁడవైతివి. అందువలన నిపుడే జన్మాంతరము నొంది పాషాణము గమ్ము. ఏమహాత్ములు నిన్ను సాధువని నుతింతురో వారు భ్రాంతులు.

ఇందులకు సంశయమే లేదు. అపరాధములేని భక్తునిఁ బరార్థముగా సంహరింపఁజనునే. అని బహుభంగుల నేడ్చెను.

పిదప శ్రీహరి దీనయై పలుమారులు విలపించు నా తులసీదేవింగని కరుణారససాగరుఁడు గాన నయమార్గ మలర నిట్లు హితము నుపదేశింపసాగెను. కల్యాణీ! మందరపర్వతమున జిరకాలము నన్నుఁగూర్చి తపమొనరించితివి. నీకొఱకు శంఖచూడుఁడును జిరకాలము ఘోరతప మొనరించెను. నిన్నుఁ గాంతగాఁబడసి యతఁడు విహరించెను. ఇపుడు నీకుఁ దపఃఫలమునొసంగుట యుక్తము. నీవే శరీరమును వదలి దివ్య దేహమును ధరించి నాతో విహరింపుము. లక్ష్మీతుల్యవు కమ్ము. నీ యీ దేహము నదీరూపము నొంది గండకీఖ్యాతిం గాంచెడు. భారతభూమిఁ బరమపవిత్రమై మనుజులఁ దరింపఁజేయఁజాలి యుండు. నీజడముడి యిది పుణ్యవృక్షరూపమును ధరించునది. తులసీకేశసంభవ మగుట నయ్యదియుఁ దులసీవృక్ష మనంబరఁగెడు. సుందరాంగీ! ముల్లోకములయందు దేవపూజనమందుఁ బుష్పపత్రములలో తత్పత్ర ముత్తమం బనందగు. ప్రథమ గణనకెక్కు. తులసీదేవీ! స్వర్గమర్త్యపాతాళములయందును గోలోకమునందును నీవు వృక్షశ్రేష్ఠమవై యుండఁగలవు. గోలోకమున విరజాతీరమందును, బృందావనవనమందును భాండీరవనమందును,చంపకవనమందును,మనోహరచంపక కానన మందును, మాధవీకేతకీకుందమందారాదివృక్షరమ్య మగు మాలతీవనమందును, నీకు నివాసముఁ గలుగుఁగాక. పుణ్య

స్థానములయందెల్ల నీనివాసము తగుఁగాక. తులసీతరుమూలము సకల పుణ్యస్థానోత్తమము. సకలతీర్థము లద్దాని నధిష్ఠించి యుండుఁగాక! అందే సకలదేవతలు నన్నుంగూడియుండఁ గలరు. తులసీపత్రపతనము మాపైఁ గలుగుఁగాక యని యెల్ల సురలు కోరఁగలరు. తులసీపత్రము నుంచినజలమున నెవఁ డభిషిక్తుఁడగునో వాఁడు సర్వనదీజలముల, సర్వయజ్ఞములయందును స్నాన మొనరించినట్టివాఁడే యగు. హరికి నమృతఘుట సహస్రముల నభిషేకించిన నేతృప్తిగలదో యాతృప్తి యొక తులసీదళము నొసంగినఁ గలుగఁగలదు. కార్తికమాసమునఁ బదివేలగోవుల దానముచేసినఁ గలుగుఫలము తులసీపత్రదానమునఁ గలుగును. మృతికాలమునఁ దులసీపత్రతోయము నెవఁడుగ్రోలునో వాఁడు సకలపాపనిర్ముక్తుఁడై విష్ణుసాయుజ్యము నొందును. భక్తిమీఱ ననుదినము నెవ్వఁడు తులసీతోయమును గ్రోలునో ఆపుణ్యాత్ముఁడు లక్షాశ్వమేధపుణ్యము నొందును. దేహమున ధరించిగాని, హస్తాలంకారముగఁ బడసిగాని యేమానవుఁడు శరీరమునువదలునో వాఁడు విష్ణులోకమునకే పోవును ఎవఁడు తులసీదారునిర్మితమాలనుధరించునో యతఁ డశ్వమేధఫలంబు నొందుననుటకు సంశయమే లేదు. తులసీవృక్షముపై నొట్టుపెట్టుమానవుఁడు కుంభీపాకనరకమునఁ బదునలుగు రింద్రుల యాయువంతకాల ముండఁగలఁడు. ఎవఁడు మరణకాలంబునఁ దులసీతీర్థబిందువును సేవించునో యతఁడు రత్నఖచితవిమానారూఢుఁడై వైకుంఠము

నకుం బోవును. * పున్నమయందు, నమవసయందును, ద్వాదశి యందును, సూర్యసంక్రమణమందును, నూనెతోఁ దలయంటు కొనియు, మధ్యాహ్నమందును, రాత్రియందును, నుభయ సంధ్యలయందును, ఆశౌచ సమయమందును, నేమానవులు తులసీదళములఁ గిల్లుదురో వారు శ్రీహరి శిరస్సును ద్రుంచిన ఫలమునొందుదురు. వృక్షాధిష్ఠాతృదేవివగు నీవు గోలోక మందు శ్రీకృష్ణునితోడఁ నిరంతరము విహరింపఁగలవు. నద్యధిష్ఠాతృదేవి వగు నీవే భారతవర్షమునఁ బుణ్యప్రదాత్రి వగుచు, లవణోదధి మదంశసంభవుఁడు గాన నతనికి భార్యవు కాఁగలవు. ఓతులసీ! నీవు మహాసాధ్వివై వైకుంఠమున నా సన్నిధియందు రమాతుల్యవై నివసింపఁగలవు. తులసీ! నీశాప కారణమున నేను గండకీతీరమున శైలరూపమున నివసించె దను. కోటిసంఖ్యలకీటములు తీక్ష్ణదంష్ట్రలే యాయుధములుగా వెలయ ఆపాషాణముల వివరములందు నాచక్రమును నిర్మింపఁ గలవు.

## సాలగ్రామపరీక్ష.

నాలుగుచక్రములుకలిగి యొకద్వారమున నొప్పుచు వనమాలావిభూషితమై నూత్న నీరదాకారమగు పాషాణము

---

* పూర్ణిమాయా మమాయాం చ ద్వాదశ్యాం రవిసంక్రమే తైలాభ్యంగం చ కృత్వా చ మధ్యాహ్నే నిశిసంధ్యయోః, ఆశౌచేఽ శుచికాలే యేరాత్రివాసోఽన్వితా నరాః, తులసీం యే విచిన్వంతి తే ఛిందంతి హరే శ్శిరః. అని మూ. ౫ం శ్లో.

లక్ష్మీనారాయణనామముగల దగును. ఏకద్వారముదగిలి చతు శ్చక్రముల వెలయుచు నవజలదాకారము గలిగి వనమాలా రహితమగు పాషాణము లక్ష్మీజనార్దననామము గల దనం బడును. ద్వారద్వయము నాల్గుచక్రములును గలిగి గోష్పా చిహ్నమున నలరుచు వనమాలలేనిది రఘునాథసంజ్ఞ గల దగు. మిగులఁజిన్నదై, రెండుచక్రములు గలిగి, క్రొత్తమేఘము వంటి వర్ణముగలదై వనమాలాచిహ్నము లేనిదై యుండు నది వామననామము గలది. మిక్కిలి చిన్నదై ద్విచక్రయుతమై వనమాలా భూషితమై యొప్పునది శ్రీధర నామధేయము గలదై గృహస్థులకు శ్రీప్రదమగును. స్థూలమై అత్యంతస్ఫుట మగు నది దామోదరసంజ్ఞచే నలరును. మధ్యమమై * సప్త చక్రముల నొప్పుచు, దత్తభూషణభూషితమై రాజిల్లు నది రాజరాజేశ్వరమను పేరుగలది. మనుజులకు రాజసంపత్ప్ర దము. మధ్యమమై వర్తులాకారమై ద్విచక్రయుతమై బాణ విక్షతమై శరతూణసమన్వితము నగు నది రణరామాభి ధానము గలది. మధ్యమమై, సప్తచక్రములవెలసి, ఛత్ర భూషణభూషితమై తనరారునది రాజరాజేశ్వర మనుపేర నలరి రాజసంపత్తుల మనుజుల కొసఁగును. పదునాలుగు చక్ర

---

* మధ్యమం సప్తచక్రం చ దత్తభూషణభూషితం, రాజరాజేశ్వరం జ్ఞేయం రాజసంపత్ప్రదం నృణామ్. మధ్యమం సప్తచక్రం చ ఛత్రభూషణ భూషితం, రాజరాజేశ్వరం జ్ఞేయం రాజసంపత్ప్రదం నృణామ్. అని రెండు విధములుగా మూలముననే యున్న దని గ్రహింతురు గాక.

ములుగలిగి, స్థూలమై నవమేఘవర్ణమై, యొప్పు నది యనంతాఖ్య నలరుచుఁ, జతుర్వర్గఫలప్రదమై తనరారు. ఛత్రాకారమై, ద్విచక్రమై, సశ్రీకమై, మేఘవర్ణమై, సగోష్పదమై, మధ్యమమై కనఁబడు నది మధుసూదన నామమునఁ దనరు. ఏకచక్రముగలిగి, గుప్తచక్రచిహ్నమై, గదాధరమై, ద్విచక్రమై, హయవక్త్రాభమై కనంబడు నది హయగ్రీవ మన నొప్పును. ముఖము మిగుల వెడలుపుగాఁ గనంబడ, ద్విచక్రములు వెలయ, వికటమై యొప్పుచుండు నది నృసింహాభిధేయమును ధరించి శీఘ్రకాలమున మనుజులకు వైరాగ్యము నిచ్చును. రెండుచక్రములఁ గనుపట్టుచు, మోము వెడల్పుగా నొప్ప వనమాలాచిహ్నితమై యుండు నది లక్ష్మీనృసింహ మనంబడుచు గృహస్థులకు సుఖ మొసంగును. ద్వారప్రదేశమున రెండుచక్రములు చూపట్ట సశ్రీకమై సమమై స్ఫుటమై కనఁబడునది వాసుదేవ మనంబడుచు సర్వకామఫలప్రదమగును. సూక్ష్మచక్రమై నవీననీరదాభమై సుషిరమున చిద్రబహుళమై పూజించు వారికి సుఖముల నొసఁగు నది ప్రద్యుమ్న మనంబడు. ఒకచోటనే రెండుచక్రములు సంబంధించిన ట్లుండి స్పష్టముగా శంకగలుగకుండఁ గనంబడునో యది సంకర్షణ మనుపేరుగలిగి సుఖముల నొసంగును. పీతవర్ణమై, వర్తులాకారమై, మిగుల శోభనముగాఁ గనఁబడుచు సుఖప్రదము నగు నది అనిరుద్ధ మనుపేరుగలది.

* సాలగ్రామశిల యెందుండునో అందు శ్రీహరి యుండి యేతీరును. అందే లక్ష్మియు నివసించును. సర్వతీర్థము లుండు నని వేఱుగ వచింపవలయునా. సాలగ్రామశిలార్చనమున సకల పాపములు నశించును. ఛత్రాకారముగా నలరు సాలగ్రామ మును బూజించిన రాజ్యములభించును. వర్తులాకారసాలగ్రామ శిలార్చనమున నైశ్వర్య మొనఁగూడును. శకటాకారసాల గ్రామపూజచే దుఃఖము గలుగును. శూలాగ్రముగా నలరు దానింబూజించిన మరణము సంభవించును. మొగము వికార ముగా నుండుదాని నర్చించిన దారిద్ర్యముగలుగు. పింగళ వర్ణ సాలగ్రామపూజనమున హానిసంభవించును. భగ్నచక్ర సాలగ్రామమును బూజింప వ్యాధియు, భిన్నసాలగ్రామము నర్చింప మరణము గలుగును. సాలగ్రామ సన్నిధానమున వ్రతము, దానము, దేవతాప్రతిష్ఠయు, శ్రాద్ధము, దేవతా పూజయు నొనరించిన ననంతపుణ్యమని తెలియవలయు. అట్లు చేసినవాఁడు సకలతీర్థస్నానముల నొనరించినవాఁడే యగు. సకలయజ్ఞముల నవభృథస్నానము చేసినవాఁ డగును. సకల తపోవ్రతదానము లొనరించినవాఁడగు. నాల్గువేదములు పఠించినవాఁడును, అతిఘోరతపస్సుచేసినవాఁడు నేపుణ్యమును బొందుదురో సాలగ్రామశిలార్చన మొనరించినవాఁ డట్టి పుణ్య మునే పొందును. సాలగ్రామశిలాతీర్థము నే నరుఁడు నిత్యము

---

* సాలగ్రామ మని పఠించి సాలమనుపురుగుచేఁ గల్పింపఁబడు పాషా ణమని కొందఱర్థము చెప్పుదురుగాని యది సమంజసముకాదు. సాలగ్రామ మనియే బహుగ్రంథములందుఁ గనుపట్టెడు.

సేవించునో యతఁడు దేవత్వమును, భగవత్ప్రసాదమును బొం దును. సంశయములు లేవు. అట్టిపుణ్యపురుషుఁడు మాజలముల స్నాన మొనరించునా యని సకలతీర్థములు కోరుచుండును. ఆతఁడు జీవన్ముక్తుఁడు అంతమున శ్రీహరిపదమును బొందును. ఆశ్రీహరిపదమున నసంఖ్యవత్సరములుండి భగవద్దాసోత్తముఁ డగు. అట్టి మనుష్యోత్తముని దర్శనముననే సకలమహత్తర పాపములు విలయమొందును. సాలగ్రామశిలాతోయము నంత్యకాలమున నేనరుఁడు సేవింపఁగలఁడో యతఁడు సకల పాపనిర్ముక్తుఁడై విష్ణులోకమును బొందును. ఆతనిపాదరజ స్సుచే వసుంధర పవిత్రురాలగు. తత్పితరు లనేకజన్మములవారు తరింతురు. ఎవఁడు సాలగ్రామశిలను ధరించి మిథ్యావాక్కులఁ బల్కునో యతఁడు కుంభీపాకనరకమునఁ జిరకాలముండును. ఎవఁడు సాలగ్రామశిలను ధరించి తన వచించినమాటలు జరపక వదలునో యాతఁ డసిపత్రనరకమున లక్షమన్వంతరము లుం డును. ఏబుద్ధిహీనుఁడు సాలగ్రామశిలపైని దులసీపత్రవిచ్ఛేద మొనర్చునో యతఁడు జన్మాంతరమున భార్యపోవ దుఃఖిం చును. శంఖమునందుఁ దులసీపత్రవిచ్ఛేద మొనరించు నాపాపా త్ముఁడు భార్యాహీనుఁ డగుటయకాక రోగియు నగును. ఆ పాపము సప్తజన్మము లంటియుండును. సాలగ్రామశిలను, దులసీధళమును, శంఖమును జక్కఁగాఁగాపాడునో యతఁడు శ్రీహరిపదప్రాప్తికి బాత్రుఁ డగును. ఓతులసీ! నీవు శంఖచూడు నకుఁ బ్రియురాలవై యొకమన్వంతరకాలముంటివి. కాన నిన్ను

శంఖముతోఁ గూర్పక వియోగమునకుఁ గల్గింపరాదు. అట్లు చేసినవాఁడు దుఃఖములపా లగును.

అని యిట్లు శ్రీహరి పలికి యూరకుండెను. తులసీదేవియు నాదేహమును వదలి దివ్యరూపమును ధరించి శ్రీహరి వక్షస్థలమున నివసించెను. ఆకమలాకళత్రుం డాతపఃణిరత్నముం గూడి వైకుంఠమునకుం బోయెను. లక్ష్మియు, సరస్వతియు, గంగయుఁ,దులసియు నీనలుగురు శ్రీహరిప్రియ లని యెఱుంగవలయు. ఈశ్వర ప్రియలు నగుదురు. ఆతులసీదేహసంభూతయే గండకీనది. భగవంతుం డానదీతటమున శిలారూపమున నివసించెను. ఏపుణ్యపురుషు లాతీరముల విహరింతురో, ఆశిలల నానదీజలముల పైతురో, వారు పుణ్యాతిశయఫలములఁ బొందుదురు. పెద్దపెద్దశిలలు సూర్యతాపమునఁ బింగళవర్ణమున నలరుచుండును.

## తులసీపూజావిధానము.

పాఠకులారా! తులసీదేవిని భగవంతుఁడు శంఖచూడవేషమున వంచించి పాతివ్రత్యభంగముఁ గావించి శంఖచూడుని శివునిచే జపించెను. ఆవిధ మెఱింగి తులసి శపింపఁ దానాశాపఫల మనుభవించెను. తులసిని గండకీనదీరూపమున నుండునట్లు నియమించెను. ఏల యిట్లు చేయవలయు అని సుంత విచారింపుఁడు. ఇకార్యము లన్నియు లోకోపకారమునకే యని నమ్ముఁడు. రాఁగల కలికాలమున మానవులు

సేవించునో యతఁడు దేవత్వమును, భగవత్ప్రసాదమును బొం దును. సంశయములు లేవు. అట్టిపుణ్యపురుషుఁడు మాజలముల స్నాన మొనరించునా యని సకలతీర్థములు కోరుచుండును. ఆతఁడు జీవన్ముక్తుఁడు అంతమున శ్రీహరిపదమును బొందును. ఆశ్రీహరిపదమున నసంఖ్యవత్సరములుండి భగవద్దాసోత్తముఁ డగు. అట్టి మనుష్యోత్తముని దర్శనముననే సకలమహత్తర పాపములు విలయమొందును. సాలగ్రామశిలాతోయము నంత్యకాలమున నేనరుఁడు సేవింపఁగలఁడో యతఁడు సకల పాపనిర్ముక్తుఁడై విష్ణులోకమును బొందును. ఆతనిపాదరజ స్సుచే వసుంధర పవిత్రురాలగు. తత్పితరు లనేకజన్మములవారు తరింతురు. ఎవఁడు సాలగ్రామశిలను ధరించి మిథ్యావాక్కులఁ బల్కునో యతఁడు కుంభీపాకనరకమునఁ జిరకాలముండును. ఎవఁడు సాలగ్రామశిలను ధరించి తన వచించినమాటలు జరపక వదలునో యాతఁ డసిపత్రనరకమున లక్షమన్వంతరము లుం డును. ఏబుద్ధిహీనుఁడు సాలగ్రామశిలపైని దులసీపత్రవిచ్ఛేద మొనర్చునో యతఁడు జన్మాంతరమున భార్యాహీన దుఃఖిం చును. శంఖమునందుఁ దులసీపత్రవిచ్ఛేద మొనరించు నాపాపా త్ముఁడు భార్యాహీనుఁ డగుటయకాక రోగియు నగును. ఆ పాపము సప్తజన్మము లంటియుండును. సాలగ్రామశిలను, దులసీదళమును, శంఖమును జక్కఁగాఁగాపాడునో యతఁడు శ్రీహరిపదప్రాప్తికి బాత్రుఁ డగును. ఓతులసీ! నీవు శంఖచూడు నకుఁ బ్రియురాలవై యొకమన్వంతరకాలముంటివి. కాన నిన్ను

శంఖముతోఁ గూర్పక వియోగమునకుఁ గల్గింపరాదు. అట్లు చేసినవాఁడు దుఃఖములపా లగును.

అని యిట్లు శ్రీహరి పలికి యూరకుండెను. తులసీదేవియు నాదేహమును వదలి దివ్యరూపమును ధరించి శ్రీహరి వక్షస్థలమున నివసించెను. ఆకమలాకళత్రుం డాతరుణీరత్నముం గూడి వైకుంఠమునకుం బోయెను. లక్ష్మియు, సరస్వతియు, గంగయుఁ,దులసియు నీనలుగురు శ్రీహరిప్రియ లని యెఱుంగవలయు. ఈశ్వరప్రియలు నగుదురు. ఆతులసీదేహసంభూతయే గండకీనది. భగవంతుం డానదీతటమున శిలారూపమున నివసించెను. ఏపుణ్యపురుషు లాతీరముల విహరింతురో, ఆశిలల నానదీజలముల వైతురో, వారు పుణ్యాతిశయఫలములఁ బొందుదురు. పెద్దపెద్దశిలలు సూర్యతాపమునఁ బింగళవర్ణమున నలరుచుండును.

## తులసీపూజావిధానము.

పాఠకులారా! తులసీదేవిని భగవంతుఁడు శంఖచూడవేషమున వంచించి పాతివ్రత్యభంగముఁ గావించి శంఖచూడుని శివునిచే జపించెను. ఆవిధ మెఱింగి తులసి శపింపఁ దానాశాపఫల మనుభవించెను. తులసిని గండకీనదీరూపమున నుండునట్లు నియమించెను. ఏల యిట్లు చేయవలయు అని సుంత విచారింపుఁడు. ఇకార్యము లన్నియు లోకోపకారమునకే యని నమ్ముఁడు. రాఁగల కలికాలమున మానవులు

ఘోరతపస్సుల నొనరింపఁజాలరు. నిరంతరోపవాసములు సలుపఁ జాలరు. సత్యవాక్కులఁ బల్కు వ్రతము పూనఁ జాలరు. అట్టివారు తరించు టెట్లని యాలోచించియే యిట్లు చేసెను. గండకీనదీస్నానము, సాలగ్రామశిలార్చనము, తులసీ సమారాధనము, శంఖపూజ యివి చేయఁదగుననియు, నవ్వి యనంతఫలప్రదము లనియు శాసించెను. కరుణాశరధి గావున నిట్టి సులభమార్గముల నేర్పఱచి లోకుల కుపదేశించెను. ఇంత మాత్రమైన శ్రీహరి యాజ్ఞ చేసిన ముక్తిఁ గల్గునని యెఱింగి తదాజ్ఞ శిరసావహించినవారు తరింతురు. కావున శ్రీమన్నారాయణమూర్తి యేకార్యము చేసినను బాహ్యదృష్టి కది వ్యర్థముగాఁ దోఁచినను జక్కఁగ నాలోచించిన నది లోకుల కుపకారము చేయుటకే యని తేలకమానదు. భగవత్కృపకుఁ బామరజనులు పాత్రులగుట కనేకమార్గములు గలవు. ఆ మార్గము లన్నియు నొక్కఁ డాచరింపఁజాలఁ డనుట నిశ్చయము. అందులో దేనినే నొక్కదాని నాశ్రయించి దృఢభక్తిం బూని యారాధించిన ముక్తుఁ డగును. అన్నియు సులభతరములగు మార్గములు. ద్రవ్య మక్కఱలేదు. మహోపవాసములు సలుప నవసరము లేదు. భక్తిమెయి భగవంతుని శ్రీతులసీపత్రముల నొకగడియ పూజించినఁ జాలును. అంత మాత్రము చేయకున్న వానిగతి యేమగు నను ప్రశ్న మేల? ఇఁక నవతలిదగు తులసీపూజావిధానము వినఁదగినది. భక్తిపూర్ణమానసులై దాని నాలకింపుఁడు. ఇం దేమియున్నదని చప్పరింపకుఁడు. అది యాస్తికులలక్షణము కాదు. అంద

ఆలోకరీతి కర్మముల నాచరించిన వారుగారు. ఎట్టికర్మ మొనరించిన జీవునకుఁ దదనుకూలమార్గము దొరకును. దానింబట్టి పట్టువదలక తదుక్తధర్మముల నాచరించిన మేలు గలుగును. కాలక్షేపము సేయఁగూడదు గాన గథవినుట మంచిది. ఇటుఁ దులసీపూజావిధానము స్తోత్రము చెప్పఁ బడును.

* శ్రీహరి యిట్లు తులసీదేవింగూడి నిజలోకమునకేగి యట రమాయుతుండై యుండెను. తులసికిని రమాదేవికి నే విషయమున భేదము గానరానీయక ప్రవర్తించెను. శ్రీహరి తులసీదేవింగూడుట లక్ష్మియు, గంగయు నోర్చుకొనిరి. సర స్వతిమాత్ర మోర్వఁజాలక పోయెను. ఒకానొకదినమున శ్రీహరి సన్నిధియం దేకారణము లేకయే తులసితోఁ గల హించి సరస్వతి యామెం బ్రహరించెను. తులసి సిగ్గుపడియు, నవమతినొందియు నిఁక నిట నుండరాదని యంతర్ధాన మంగీక రించెను కాని సర్వసిద్ధేశ్వరియు జ్ఞానులకు సిద్ధినొసంగునదియు నగు నాతులసి కోప మొందియు నెల్లెడల శ్రీహరిని దర్శిం చుచుఁ దా నగపడకయుండెను. శ్రీహరియుఁ దులసీదేవి తన సాన్నిధ్యమున లేకుండుట కోర్వఁజాలక సరస్వతికి నీకిది తగ దని బుద్ధిచెప్పి తదనుమతి నెట్లోకైకొని తులసీవనమునకుం బోయెను. అందుఁ బ్రవహించు దివ్యనదీజలంబుల స్నాన

---

* ఇది దేవీభాగవతము నవమస్కంధము ఇరువదియైదవ యధ్యాయ మునుండి వ్రాయఁబడినది.

మొనరించి తులసిని ధ్యానించి పూజించెను. *భక్తజనకల్ప తరువనం దగిన దశాక్షరమంత్రమును జపించుచు నామె నారాధించెను. ఎవఁడీమంత్రమునఁ దులసీదేవి నారాధించునో వాఁడు కృతకృత్యుఁ డగునని యాజ్ఞాపించెను. ఆవల శ్రీ నారాయణమూర్తి ఘృతదీపముచేతను, సిందూరచందనముచేతను, సురభికుసుమములచేతను, నైవేద్యముచేతను, దులసిని హృష్టురాలినిగా నొనరించెను

ఇట్లు శ్రీహరియొనరించు పూజాదులచేఁ దుష్టినొంది తులసీకాంతామణి యావృక్షమునుండి నిర్గమించెను. సుప్రసన్నముఖాంబురుహాయయి శ్రీహరి యామెకు సర్వపూజ్యత్వము గలుగునట్లు వరమొసంగెను. నేను నిన్ను వక్షమున శిరమున సదాధరింతు నని నుడివెను. దేవతలు నిన్ను మూర్ధమున ధరింతురని శాసించెను. అని యిట్లు వరమొసంగి యామెను సుప్రీతాత్మనుగ నొనరించి పిలుచుకొని నిజావాసమును జేరెను. నీవొనరించిన యీ స్తవము లోకముల నుద్ధరింపవలయు నని యామె యడుగ నట్లే యగుఁగాక యని వరమిచ్చెను. ఆస్తోత్ర మిద్దియే యని తెలియఁబలికెను. †తులసీ వృక్షములు బృందముగా నెందుండునో దానిచే బృంద యని

---

* లక్ష్మీమాయా కామవాణీ బీజపూర్వం దశాక్షరం, బృందావనేతి చాన్తం చ వహ్నిజాయాంత మేవ చ. అనేన కల్పతరుణా మంత్రరాజేన నారద, పూజయే ద్యో విధానేన సర్వసిద్ధిం లభే ద్ధ్రువమ్. అని మూ.

† బృందరూపాశ్చ వృక్షాశ్చ యదైకత్ర భవంతి చ, విదు ర్బుధాస్తేన బృన్దా మత్ప్రియా తాం భజామ్యహం. ౧. పురా బభూవ యాదేవీ త్వా

యీనాప్రియురాలిని బండితులు నుతింతురు గాని నట్టి యీ దేవిని సేవించుచున్న వాఁడను. పూర్వ మేదేవి బృందారూపమున నుద్భవించెనో దాన బృందావనాహ్వయమును గాంచిన సౌభాగ్యరూపిణిని దులసీదేవిని సేవించుచున్న వాఁడను. అనేక బ్రహ్మాండములయందు నిరంతర మేదేన పూజింపఁబడునో దానిచేఁ బూజితాదేవి యనఁ బ్రఖ్యాతినొందిన పరమముని పూజితను దులసిని సేవించుచున్నాఁడను. అసంఖ్యాక బ్రహ్మాండములు పవిత్రములుగ నేదేవిచేఁ జేయఁబడునో విశ్వపావని యగు నాదేవిని విరహము నొందిన నేను సేవించుచున్నాఁడను. ఏతులసీదేవి పత్రములు లేక మఱియేపుష్పములచేతను దేవతలు తృప్తి నొందరో పుష్పసారాకృతిగల యా పరిశుద్ధురాలిని సేవించుచు శోకము పోఁగొట్టుకొనఁ గోరుచున్నాఁడను.

---

దా బృందావనే వనే, తేన బృందావనాఖ్యాతాం సౌభాగ్యాం తాం భజామ్యహం. ౨. అసంఖ్యేషు చ విశ్వేషు పూజితా యా నిరంతరం, తేన విశ్వే పూజితాఖ్యాం పూజితాం తాం భజామ్యహం. ౩. అసంఖ్యాని చ విశ్వాని పవిత్రాణి త్వయా సదా, తాం విశ్వపావనీం దేవీం విరహేణ స్మరామ్యహం. ౪. దేవా న తుష్టాః పుష్పాణాం సమూహేన యయా వినా, తాం పుష్పసారాం శుద్ధాం చ ద్రష్టు మిచ్ఛామి శోకతః. ౫. విశ్వే యత్ప్రాప్తి మాత్రేణ భక్తానందో భవేద్ధ్రువం, నందనీ తేన విఖ్యాతా సా ప్రీతా భవతా దిహ. ౬. యస్యా దేవ్యా స్తులా నాస్తి విశ్వేషు నిఖిలేషు చ, తులసీ తేన విఖ్యాతా తాం యామి శరణం ప్రియాం. ౭. కృష్ణజీవనరూపా సా శశ్వత్ప్రియతమా సతీ, తేన కృష్ణ జీవనీ సా స్వా త్వాం మే రక్షతు జీవనం. ౮.

ఏతులసి లభింపఁగా భక్తులకు నానందము గలుగుచున్నదో నందని యను పేరఁబరఁగు నాతులసి నాకుఁ బ్రసన్నురాలగుఁ గాక! ఏదేవికి సర్వలోకముల సాటిలేదో దాననే తులసీ నామధేయమును గాంచెనో ఆనా ప్రియురాలిని శరణ మొందుచున్నాఁడను. కృష్ణజీవనరూపిణియై నాకత్యంతప్రియు రాలునై కృష్ణజీవని యనుపేరుఁగన్న యాసన్నుతాంగి నా జీవనమును గాపాడుఁగాక!

అని యిట్లు నుతించి యందే రమానాథుఁడు నివసించెను. అంత నాతులసీదేవి సాక్షాత్కరించెను ఆపరమపావనిం గాంచి యామె తనుంజూచి మిగులవగలఁబొగులుచుండుటకు వగచి వేవేగ తనవక్షుస్థలమం దుంచుకొనెను. భారతియు శాంత హృదయయై తులసీదేవిరాక కంగీకరించినందున శ్రీహరి యాం తులసిం దోడుకొని నిజలోకమున కేగెను. తులసికి శ్రీహరి పరమప్రీతుఁడై సర్వపూజ్యత్వమును బ్రసాదించెను. ఎల్లరీ తులసిని శిరస్సున ధరింతురు గాక యని శాసించెను. నాకు వంద్యయు మాన్యయు నగు నని పలికెను.

ఇట్లు శ్రీహరి పరమకరుణాతిరేకమునఁ బలుక నాదేవి పరితుష్టాంతరంగయై వెలసెను. సరస్వతి యాదేవిం జేయిపట్టి పిలుచుకొని గృహమునకుం బోయెను. లక్ష్మియు గంగయుఁ జిఱునగవు వెలయ నాతులసిని జేయిపట్టుకొని లోపలికిం బిలుచుకొని పోయిరి. అదిమొదల లాదేవి బృందయనియు, బృందావన యనియు, విశ్వపూజితయనియు, విశ్వపావనియనియుఁ, బుష్పసారయనియు, నందనియనియుఁ, దులసియనియు, శ్రీకృష్ణజీవని

యనియు నీ నెనిమిదినామములఁ బ్రఖ్యాతయై జగత్పూజ్య యయ్యెను. యెవ్వరీ నామాష్టకాలంకృతమగు నీస్తోత్రమును భక్తిమైఁ బఠింతురో, ఆదేవిం బూజింతురో, వారు సత్ఫలము నొందుదురు. కార్తికపున్నమ తులసి జన్మదినము. ఆదినమునం దా తులసినిబూజించుట శ్రేష్ఠతమమని శ్రీహరి విధించెను. కాన నాశుభదినమున నెవ రా దేవిని బూజింతురో యావిశ్వ పావని వినుతింతురో వారు సకలపాప వినిర్ముక్తులయి విష్ణు లోకమును మృతికాలంబునఁ బొందుదురు. ఎవఁడా కార్తికపూర్ణిమయందుఁ దులసీపత్రమును శ్రీహరి కర్పించునో యతఁడు పదివేలగోవుల దానమిచ్చినసుకృతము నొందును.

## తులసీ పూజాఫలము.

తులసీదేవిని భక్తితోఁ బూజించినచో నపుత్రకుఁడు సపుత్రకుండగు భార్యాహీనుఁడు సభార్యుండగు. బంధుహీనుఁడు బంధుసముదాయాన్వితుం డగు. స్తోత్రమునువినిన నట్టి ఫలములు గలుగు. రోగి రోగనిర్ముక్తుఁ డగు. కారాగార బద్ధుఁడు నిర్ముక్తశృంఖలుఁ డగు. భీతుఁడు భయనిర్ముక్తుఁ డగు. పాపి నిర్గత పాపుఁడగును. ఈతులసీపూజయు, స్తోత్రము వేదమునఁ గణ్వశాఖయందుఁ జెప్పఁబడి యున్నయది. తులసీ దేవిని దులసీవృక్షమున నావాహనముమాత్రము చేయక సకలోపచారములఁ బూజింపవలయు. పూజించి స్తుతుల నల రింపవలయు. తులసి సకల పుష్పసారభూత. అవతారాంతరము

నొందిన తులసీదేవి పతివ్రతలలో నుత్తమురాలు. పాపము లొనరించినవారు తత్పాపదారుదాహము చేయఁగోరి జ్వాలదగ్ని శిఖోపమయగు తులసీదేవిని బూజింపఁదగు. పుష్పముల యందుఁ దులసీ సమానము గానరాదు. పవిత్ర రూప యగు తులసి వేదవినుతిం గాంచెను. సర్వజనశిరోధార్య యగు. విశ్వ పావనియు నగు. జీవన్ముక్తిప్రదయు, ముక్తిదాయినియు నగు. అట్టి శ్రీహరిప్రియను దులసీదేవిని హరిభక్తులు సదా పూజింపందగు. ఈయుపాఖ్యానము పరమపవిత్రము. దీనిం బఠింప సర్వవాంఛలు నెఱవేఱును.

మహాశయులారా! తులసీపూజావిధానమును వింటిరి గదా. తులసి వృక్షరూపిణి. వృక్షములు జడపదార్థములు. వానిం బూజించిన నేమి ఫలమని యవివేకు లనుమాటలం జెవి యొగ్గి యాలకింపకుఁడు. పైరీతిగ నాక్షేపించువారు భక్తులు గారు. ఆస్తికులవేషమును బూనినవారు. వారి కందలిసారము తెలియదు. వృక్షములనుండి మనుజులకుం గలుగు నుపకార ములు వర్ణనాతీతములు. వృక్షపత్రమూలములు రోగముల నశింపఁజేయుటవలన అది యొక దేవతాశక్తి యనవలదా? ఆరోగ్యమును వృక్షచ్ఛాయ లొసంగుట ప్రతిక్షణము సర్వ జనులు గుఱుతించుట లేదా. ఒక్కొక్కవృక్షమూలము నొక్కొక్కపుణ్యకాలముననే విధివిహితముగ సేకరించిన నది యెంతో వింతగల్పించు నుపకారము చేయుచుండుట మనము కన్నులారఁ గాంచుటలేదా. ఇన్నియుఁ దెలిసియుండుట భక్తిచే

నది దేవతాస్వరూపమని తలంపకపోవుట యనునదియే యొక యజ్ఞానముగాని వే తేమున్నది ?

వృక్షములు దేవతారూపములు. వానిం బూజించుట గొప్పకార్యము. వానిని ఛేదించుట మహాపాపకార్యము.

ఇంధనార్థం ద్రుమచ్ఛేద స్త్రీ నహింస్రౌషధజీవనమ్,
భార్యా యా విక్రయశ్చైషా మే కైక ముపపాతకమ్.

యాజ్ఞవల్క్యస్మృతి. ప్రాయశ్చిత్తకాండము. ౨౪౦ శ్లో.

ఇంధనార్థ మశుష్కాణాం ద్రుమాణా మవపాతనమ్,
... ... నాస్తిక్యం చోపపాతకమ్.

మనుస్మృతి. ౧౧ అ. ౬౩ శ్లో.

ఫలదానాం తు వృక్షాణాం ఛేదనే జప్య మృక్శతం,
గుల్మవల్లీ లతానాం చ పుష్పితానాం చ వీరుధామ్.

మను. ౧౧ అ. ౧౪౨ శ్లో.

ఈ ప్రమాణములంబట్టి గట్టిగ నాలోచింపఁగా వృక్షచ్ఛేదను పాపహేతువని స్పష్టమగును. మనుజులు మాటల చేతను, వృక్షములు క్రియారూపమునను, దేవత లదృశ్యరూపముగ నుపకార మొనరించుచుందురు. మనుజులకంటె సకలవిధముల చేతను వృక్షము లుపకార మొనరించును. కాన వానిని దేవతారూపములుగా భావించి పూజించుట మిగుల సత్కృత్యము. ఎన్నియో వృక్షములు ప్రదక్షిణముల నొస

రించువారి కెన్నియో ఆధివ్యాధుల నివర్తింపఁజేయుచుండుట ప్రత్యక్షప్రమాణము. అట్టి యుపకారములనొందుచు మీఁదు మిక్కిలి వానిని బూజించిన లాభ మేమని నుడువుట వెఱ్ఱి తనము గాక మతే మనవచ్చును ?

మహాశయులారా ! ఈ తులసీపూజావిధానమున గ్రహింపఁదగిన విషయములు పెక్కులు గలవు. తులసిచెట్టు గృహమునందుండుట యెంతయో మంచిది. దానిని బలు మాఱు చూచుచున్న నెన్నియో రోగములు నశించును. జల ములలోనుంచి దానియాకు భక్షించిన జీర్ణశక్తి కలుగుటయే గాక పిత్తగుణము నశించి నేత్రప్రకాశము గలుగును. కాఁబట్టి యావృక్షరాజమును శ్రీకృష్ణసాన్నిధ్యము గలదానిని గా భావించి శ్రీహరిప్రియురాలినిగాఁ బూజింపవలయు. అట్లు చేసిన యోగసిద్ధిగలుగును. యోగము నభ్యసించువా రిట్లు చేయుదురు. పామరుల చప్పిడిమాటల వినక శాస్త్రోక్తమగు నీపూజాపద్ధతిని దెలిసికొని య ట్లొనరింపుఁడు. ఐహికా ముష్మికములు రెండును గలవు. ఇంతట నీవిషయము నుజ్జగించి ప్రకృత కథాభాగమునకు వచ్చెదను.

ఈగ్రంథప్రారంభభాగముననే గోలోకవాసియగు శ్రీ కృష్ణుఁడు ద్విభుజుఁ డని, వైకుంఠవాసి చతుర్భుజుఁ డని, యీ యిరువురకు భేదమే లే దనియుఁ దెలుపఁబడియె. దాని హే తువు నెఱుంగుట ముఖ్యము. తులస్యుపాఖ్యానము చదివిన పిదప మహాలక్ష్మీచరిత్రము పఠించుటయు ముఖ్యము. కృష్ణావ

తారమున నీకథతో నేమి సంబంధము గల దని ప్రశ్నింప రాదు సంబంధము లేక పోలేదు. ఇఁకఁ గథ నాలకింపుఁడు.

## మహాలక్ష్మీచరిత్రము.

* ఆదిసృష్టియందు గోలోకమున శ్రీకృష్ణపరమాత్మ సకలజగత్కారణభూతుఁడై రాసమండలమున విహరించుచుం డెను. ఆపరమాత్మ వామభుజశిఖరమునుండి దేవి యుదయిం చెను. ఆమె సుందరాంగియై నవయౌవనమున విలసిల్లుచుఁ, బండ్రెండుసంవత్సరముల యీడుగల దానివలెఁ గనంబడుచు, సుస్థిరయౌవనయై శ్వేతచంపకవర్ణము గల దేహముగలిగి, శరత్పార్వణకోటిశశాంకప్రభాప్రచ్ఛాదనాస్యాననయై, శరన్మ ధ్యాహ్నసరసిజశోభామోచనలోచనయై వెలసెను. ఆదేవి యీశ్వరేచ్ఛవలన ద్వివిధయై కనుపట్టెను. రూపమున, వయ స్సునఁ, దేజస్సున, యశస్సునఁ, గాంతిని, వస్త్రమున, భూషణ వితతిని, గుణమున, స్మితమున, వీక్షణమున, ప్రేమమున, నను నయమున నాయిరువురు సమముగఁ జూపట్టిరి. అందు వామాంసభవ మహాలక్ష్మియనియు, దక్షిణాంసభవ రాధిక యనియు నామములం గాంచిరి.

రాధిక తొలుదొలుతఁ బరాత్పరుని ద్విభుజవిరాజితుని వరించెను. వెనుక మహాలక్ష్మియు మనోహరాకారుని, జతుర్భుజ

* ఈకథ దేవీభాగవతము నవమస్కంధము ముప్పదితొమ్మిదవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

విరాజమానుని వరించెను. శ్రీకృష్ణమూర్తియుఁ దద్గౌరవము చేతనే తనరూపమును రెండుగా విభజించెను. అందు దక్షిణాంశధారి ద్విభుజుఁ డయ్యె. వామాంశధారి చతుర్భుజుఁ డయ్యె. ద్విభుజుఁ డగు పరమాత్మ చతుర్భుజునకుఁ దొలుత మహాలక్ష్మి నొసంగెను. ఆమహాలక్ష్మి చేతనే యనవరతము ప్రపంచము చూడఁబడుచుండును. ఆమె కటాక్షమే సుకృతైకపాత్రము. ద్విభుజుఁడు రాధాకాంతుఁ డయ్యెను. లక్ష్మీకాంతుఁడు చతుర్భుజుఁ డయ్యెను. రాధిక శుద్ధసత్త్వస్వరూపయు గోపగోపికా సమావృతయు నై వెలసెను. చతుర్భుజుఁ డగు శ్రీహరి మహాలక్ష్మిం గూడి వైకుంఠమున కేగెను. ఆశ్రీకృష్ణనారాయణులు పరస్పర భేదములేక యేకరీతి నలరువారు. మహాలక్ష్మియు నాభగవంతుంగూడి నానారూపముల ధరించెను. ఆమెయే రమాదేవి. శుద్ధసత్త్వస్వరూపయై, సర్వసౌభాగ్యసంయుతయై, ప్రేమమున శ్రీమన్నారాయణమూర్తికిఁ బ్రియతమురా లయ్యెను స్వర్గలోకమున స్వర్గలక్ష్మి యని, శక్రసంపత్స్వరూపిణి యనం బరఁగు నది తదంశభవురా లని తెలియఁదగు. పాతాళమున నాగలక్ష్మియనియు, రాజలోకమున రాజలక్ష్మియనియు నామెయే విలసిల్లుచుండును. గృహములయందు గృహలక్ష్మి యనఁ బరఁగునది యామెయే. ఆ మహాలక్ష్మియే సర్వమంగళ మంగళయనం బరఁగుచు, సంపత్స్వరూపిణియై తనరారుచుండును. గోజాతియందు సురభియన నొప్పును. యజ్ఞముల దక్షిణ యనంబడు. క్షీరోదధికన్యకగా

నవతరించిన జనని యామెయే. పద్మినులయందు శ్రీరూప యనంబడు. చంద్రునియందు, శోభారూపంబునను, సూర్యమండలమందుఁ, దేజోరూపిణియునై నెగడుచుండును. విభూషణములయందు, రత్నములయందు, ఫలములయందు, జలములయందు, నృపులయందు, నృపపత్నులయందు, దివ్యస్త్రీలయందును, గృహములందు, సర్వసస్యములందు, వస్త్రములందు, సంస్కృతస్థానములందుఁ, దేవతాప్రతిమలయందు, మంగళఘటములయందు, మాణిక్యముక్తామణులయందు, మనోహరమాల్యములయందు, హీరమణులందు, క్షీరములయందుఁ,జందనములయందు, వృక్షశాఖలయందు, నవమేఘములయందు, వైకుంఠవాసినియగు నామహాలక్ష్మీ కళయే వెలయుచుండును. శ్రీమన్నారాయణుంగూడిన మహాలక్ష్మి యెందెందు వెలయుచుండునో ఆయావస్తువులు ప్రకాశవంతము లగుచుండును. ఆదేవిని దొలుదొలుత బ్రహ్మదేవుఁడు పూజించెను. ఆవల శంకరుండు పూజించెను. ఆవల క్షీరసాగరమథనకాలమున విష్ణువారాధించెను. పిదప స్వాయంభువు మనువు భక్తిచే నర్చించెను. నరేంద్రు లనవరత మాదేవి నర్చింతురు. మునీంద్రులు, ఋషీంద్రులు, సద్గృహస్థులు, గంధర్వులు, పాతాళవాసు లగు నాగులు నామహాలక్ష్మిదేవిని నిరంతర మర్చింతురు. భాద్రపద శుక్లాష్టమీతిథియందామెను బ్రహ్మ పూజించెను. ఒకపక్ష మాదేవీపూజాభిరతుండై యుండెను. చైత్రభాద్రపదపౌషమాస మంగళవారములయందాదేవిని విష్ణువు పూజించెను. వర్షాంతమందును, పౌషసంక్రాంతియందును, మాఘామావాస్యయం

డును, మను వాదేవి నారాధించెను. మంగళాతిమంగళకార్య ములయం దీశ్వరుఁ డాదేవి నర్చనాదుల నలరించెను. ఇంక నెందఱో యాదేవిని భక్తియుక్తి నర్చించి కృతకృత్యులైరి. ఎట్టివిపత్తులందు నామహాలక్ష్మీపూజ యుత్తమోత్తమము. ఆ మహాలక్ష్మీ వైకుంఠవాసిని. ఆమె క్షీరసాగరపుత్రి యెటు లయ్యెనో తెలిసికొనుట చాల ముఖ్యము. ఆవిధ మిటఁ దెలుపఁబడును. ఈప్రశ్నమే నారదముని నారాయణమూర్తి నడుగ నావిష్ణు విట్లు తెలిపెను. ఈగాథ వారిసంవాదరూప ముగనే యిట వ్రాయఁబడును.

## లక్ష్మీ జన్మకారణము.

తొల్లి నారదముని వైకుంఠమున కరిగి పరమేశ్వరుం గాంచి లోకవార్తలఁ బ్రశ్నించుచు లక్ష్మీ పాలసముద్రపుత్రిక యేల యయ్యెనో తెలుపుఁ డని ప్రశ్నించెను. నారాయణ మూర్తి యిట్లు బదులు చెప్పెను. నారదా! విను మావిధం బెఱిఁగించెద. దుర్వాసుఁ డను ముని శపింప నింద్రుని సిరి నశించెను. దేవసంఘములు మర్త్యలోకమునఁ ద్రిమ్మరుచుండిరి. లక్ష్మీ స్వర్గమును వదలి వైకుంఠమున నిజరూపముననే విలీనయై యుండెను.

కొంతకాలమునకు దేవతలెల్ల నొక్కటిగఁ జేరి చతుర్ముఖునిం గానంబోయి తమ దుర్గతిం దెలిపి దుఃఖించిరి. సభాముఖమున నున్న యప్పరమేష్ఠి వారిదీనతకు వగచి వారిం దోడుకొని వైకుంఠమున నున్న నన్నుం జూడవచ్చెను. దేవతలు పెదవులెండ ముఖకాంతినశింప నాయెదుట నిలువంబడి

మొఱపెట్టిరి. నాయాజ్ఞచే లక్ష్మియుఁ బాలసంద్రమునఁ బుట్టి సర్వసంపత్స్వరూపిణియై యుండెను. అంత దేవదానవులాపాల కడలి మథియించిరి. అందున్న లక్ష్మినిం గాంచిరి. క్షీరాబ్ధి శాయినియగు నామె దేవతల కమృతమొసంగి వనమాల నా కొసంగెను. తత్ప్రసాదమున దేవతలు మరల రాజ్యము నొందిరి.

అని పలుక నారదుఁ డిట్లనియె. 'దేవా! దుర్వాసుఁడు బ్రహ్మర్షి. తత్త్వవేత్త. అట్టి మహనీయుఁడు సురశ్రీవినాశకర మగు శాపము నేల యొసంగెను? దేవత లెట్లు పాలకడలిఁ ద్రచ్చిరి. లక్ష్మి మరల దేవేంద్రు నెట్లనుగ్రహించెను? ఆవిధ మెల్లఁ దెలుపుమా' యని వేఁడ నారాయణుం డిట్లు పలికెను.

## దుర్వాసుఁ డింద్రునకు శాప మొసంగుట.

నారదా! చక్కఁగా వినుము. ఇంద్రుఁడు సురాపాన మదమోహితుఁడై త్రిలోకాధిపత్యగర్వమున విఱ్ఱవీఁగి రహ స్స్థలమున రంభతోఁ గ్రీడింపసాగెను. ఆవిహారమున నారంభ శతముఖుని లోఁబఱచుకొనియె. ఆవిహారస్థాన మొకమహా రణ్యము అందే కొంతకాలము వా రుండిరి. దుర్వాసుం డను మునిసత్తముఁడు వైకుంఠమునకు వచ్చి నన్ను దర్శించి నాచే సెలవంది కైలాసమున శంకరుం జూడ నరుగుచుండెను. ఇంద్రుఁడేచోట రంభం గూడియుండెనో యాయరణ్యముపై నుండియే ముని పోవుచుండెను గాన సురపతి యమ్మునిపతిం గాంచి బ్రహ్మతేజోవ్యాప్తుంగా నెఱిఁగెను. ఆమునియు గ్రీష్మ

కాలమధ్యాహ్నమార్తాండునివలెఁ దేజరిల్లుచుఁ, బ్రతప్త చామీకరతుల్య జటాభారభాసమానుండై, శుక్లయజ్ఞోపవీతమును ధరించి, నారచీరలుగట్టి దండము కమండలువు చేకొని చంద్రసంకాశమగు తిలకము ఫాలమున వెలయ, వేద వేదాంగపారగులగుశిష్యులు పెక్కుమంది పరివేష్టించి యుండ, భూసమీపోర్ధ్వభాగమునఁ బోవుచుండెను.

శతక్రతు వామునివితతిపతిం గాంచి నమస్కరించి తచ్ఛిష్యులకు యథావిధి వందనము లాచరించెను. మునియుఁ దచ్ఛిష్యులు నాయింద్రునకు శుభాశిషము లిడిరి. అంత దుర్వాసుఁడు విష్ణుదత్తమగు పారిజాతప్రసూనమును జరారోగమృత్యుహారంబై వెలయు దాని, సకలదుఃఖఘ్నమును మోక్షకారకమును బురుహూతున కొసంగెను. శచీపతి యాపుష్పమును గ్రహించి రాజ్యసంపదఁ గన్నుమిన్నెఱుంగనివాఁడు కానఁ జెంతనున్న యైరావత మూర్ధమున విడిచెను. ఆద్విరదము తత్స్పర్శమాత్రమున నసదృశతేజస్సుపొలయ, వయస్సు తనర, మహాప్రకాశవంత మయ్యెను.

ఐరావత మంతట నింద్రునివదలి ఘోరకాంతారమున కేగెను. దానిని రక్షింప నడ్డగింపఁ బురుహూతుఁడు శక్తుఁడు కాఁడయ్యెను. మునివరుండు తా నర్పించిన పరమపవిత్రకుసుమమును దృణముగా భావించి పరిత్యజించిన శచీకాంతుం జూచి మండిపడి యిట్లు శపించెను. ఓరిసురేశా! సిరిచేత మత్తుఁడవై నన్నవమానించితివి. నాయొసంగిన పుష్పంబును

గరిమస్తమున నునిచితివి. * విష్ణుమూర్తికి సమర్పించిన పుష్పము జలము నైవేద్యము దొరకినంతమాత్రమున ననుభవింపవలయును. పరిత్యజించిన బ్రహ్మహత్య గలుగును. నీవట్లు చేసితివి. కాన భ్రష్టస్వర్గలక్ష్మీకుఁడవై బుద్ధిమాలి యిడుమలఁ గుడుతువు కాక. అని శపించెను.

ఎవఁడు పూర్వాదృష్టపరిపాకలబ్ధమగు శ్రీవిష్ణు నైవేద్యమును బరిహరించునో వాఁడు దురదృష్టవంతుఁడగు భక్తిచే భుజించువాఁడు జీవన్ముక్తుఁడగు. విష్ణునైవేద్యమును భుజించి యెవఁడు శ్రీహరికి నమస్కరించునో, పూజించునో, యాపుణ్యపురుషుఁడు విష్ణుతుల్యుఁ డగును. ఆతని దేహమును స్పృశించిన వాయువుచేఁ దీర్థములు పవిత్రములగును. మహాత్మా! దేవేంద్రా! ఆతనిపాదరజస్సున భూమిపవిత్రయగును. పుంశ్చలియన్నమును, అవీరునన్నమును, శూద్రశ్రాద్ధాన్నమును, హరికి నివేదింపనియన్నము నెవఁడు భుజించునో యతఁడు మాంసభక్షణజనితపాపము నొందును. శివలింగసమర్పితాన్నమును, శూద్రులచే యజ్ఞముచేయించిన వానియన్నమును, వైద్యముచేయు ద్విజునియన్నమును, దేవలాన్నమును, కన్యావిక్రయ మొనరించు వానియన్నమును, యోనిజీవ్యన్నమును, ఉచ్ఛిష్టాన్నమును, బర్యుషితాన్నమును, అందఱుఁ దినఁగా మిగిలినయన్నమును, శూద్రాపతి యగు ద్విజాతియన్నమును, వృషభము

* విష్ణో ర్నివేదితం చైవ నైవేద్యం వా ఫలం జలం, ప్రాప్తి మాత్రేణ భోక్తవ్యం త్యాగేన బ్రహ్మహాభవేత్. అని మూ.

నెక్కిన ద్విజునియన్నమును, దీక్షితుఁడు కాని ద్విజునియన్నమును, శవదాహకు నన్నమును, అగమ్యాగమనము చేయు నతనియన్నమును, మిత్రద్రోహము చేయు వానియన్నమును, కృతఘ్నునియన్నమును, విశ్వాసఘాతుకునియన్నమును, మిథ్యాసాక్ష్యము నిచ్చువానియన్నమును, భక్షించు పాపాత్ములు విష్ణునైవేద్యాన్నభక్షణమునఁ బరిశుద్ధులగుదురు. విష్ణుభక్తుఁడు శ్వపచుఁడైనను వంశకోటి నుద్ధరించును. హరిభక్తుఁడు కాని మనుజుఁడు తన్నుఁ దాఁ గాపాడుకొనంజాలఁడు. అజ్ఞానము వలన నైనను విష్ణునిర్మాల్యము గ్రహించినను సప్తజన్మార్జిత పాపములనుండి నిర్ముక్తుఁ డగును. జ్ఞానముగలిగి శ్రీవిష్ణునిర్మాల్యమును గ్రహించినయెడలఁ గోటిజన్మార్జితానేకపాపకర్మనిర్ముక్తుఁడగు ననుట కేసందియము లుండవు.

పురందరా! ఏగర్వకారణమున నాయొసంగిన శ్రీహరి నిర్మాల్యపుష్పమును హస్తిమస్తమున నిడితివో ఆకారణముననే లక్ష్మి మిమ్మువదలి హరిపదమునొందుఁగాక. నారాయణభక్తుఁడనగు నేను దేవతలకేని, బ్రహ్మకేని భయంపడను. కాలునకు, మృత్యువునకు, జరకును జంకను. ఇఁకఁ దక్కుంగలవారి లెక్కసేయుదునే. నేనిడిన యీశాపమునకు మీతండ్రియగు కశ్యపుం డేమిచేయునో చూచెదఁగాక. మీగురువగు బృహస్పతి యేప్రతిక్రియను వెదకునో పరికించెదఁగాక. ఈదివ్యకుసుమమే మూర్ధమున నునుపఁబడునో తత్పూజనము పరమము.

అని రోషమునఁ బలికిన దుర్వాసుని వాక్యముల విని దేవేంద్రుఁడు చేతులొగ్గి చరణములవ్రాలి భయాకులుఁడై బిట్టురోదనము చేసెను. 'మునీంద్రా! నాయపరాధమునకుఁ దగిన శాప మొసంగితివి. నాయజ్ఞానము దొలఁగించితివి పోయిన సంపత్తిని గోరను. స్వల్పజ్ఞానమును బ్రసాదింపుము. ఐశ్వర్య మాపన్మూలము. జ్ఞానప్రచ్ఛన్న కారణము. ముక్తిమార్గకుఠారము. భక్తిధ్వంసకము.' అని దీనుఁడై వేఁడెను.

మునియు నించుక కరుణించి యిట్లు పలికెను. ఐశ్వర్య మనునది తిమిరమువంటిది. అదిగలవాఁ డంధుఁడే. అట్టివాఁడు ముక్తిమార్గమును గనఁజాలఁడు. సంపన్మత్తుఁడు, విమూఢుఁడు, సురామత్తుఁడు, భగవంతు నెఱుఁగఁడు. సంపత్తి మదమత్తుఁడు, విషయాంధుఁడు, విహ్వలుఁడు, * మహాకామియు, రాజసికుఁడు, సత్యమార్గమును గనఁ జాలరు. విషయాంధుఁడు ద్వివిధ భేదము గలవాఁడై యుండును. రాజసుఁడు తామసుఁడని, అశాస్త్రజ్ఞుఁడు తామసుఁ డనంబడును. శాస్త్రజ్ఞుఁడు రాజసుఁ డనంబడు. శాస్త్రమే ద్వివిధమార్గమును దెలుపుచున్న యది. ఒకమార్గము ప్రవృత్తిబీజము వేఱొకటి నివృత్తికారణము. జీవులు దుఃఖభూయిష్ఠమగు ప్రవృత్తిమార్గమున సంచరింతురు. అది స్వచ్ఛందముగఁ దోఁచును. నిర్విరోధము

* మహాకామీ రాజసికః సత్యమార్గం న పశ్యతి. అని మూ. ౯ స్కం. ౪౦ అధ్యా. ౪౯ శ్లో.

గను గనంబడు. జీవుఁడు సుఖాభిమానము లోభము అను వానిచేత నామార్గమును ద్రొక్కను. అది పరిణామమున నాశబీజమై జన్మమృత్యుజరాకరమైన దగు. అట్టిమార్గమున ననేకజన్మములు పరిభ్రమించి పరిభ్రమించి, స్వకర్మానుసారము నానాయోనిసంభూతినొంది తుదకు క్లేశముల సహించి సత్సంగము నొందును. శతసహస్రసంఖ్యలు గల జీవుల యం దొకఁడు సంసారసాగరపారకారణమనఁబడు ముక్తిమార్గ మును తత్త్వప్రదీపముచేఁ గనుఁగొనఁజాలు. అపుడు జీవుఁడు బంధనఖండనమందుఁ బ్రయత్నము నొనరించువాఁ డగు. అనేక జన్మ యోగముచేతను, దపస్సుచేతను, నిరశనవ్రతములచేతను, నిర్విఘ్నమై శాశ్వతానందప్రదమనఁ బ్రఖ్యాతినొందిన ముక్తిమార్గమును బొందును.

అని యిట్లు పలికి దుర్వాసుఁడు 'పురందరా! వింటివి కదా! జ్ఞానమార్గమును. ఇంకేమివినఁగోరెదవు?' అన విని శత క్రతువు వీతరాగుఁడై తదుక్తపద్ధతి నాశ్రయించి వైరాగ్యము వృద్ధినొందించు ప్రయత్నమున నుండెను. అంత దుర్వాసుని సాగనంపి తా నమరావతికింబోయెను. అమరావతి రాక్షససంఘ సమాక్రాంతమై యుండెను. చూడ భయంకరముగా నుండెను. ఎందుఁజూచినను బంధువ్రాతము గానఁబడకుండెను. ఎచ్చోటఁ బరికించినను ఘోరోపప్లవములు కానఁ బడసాగెను. పితృ మాతృకళత్రాదివిహీనమై తోఁచెను. శత్రువు లెల్లెడలఁ గిక్కి రిసి యుండిరి. ఆనగరమును గాంచి దుఃఖించి చేయునదినేరక బృహస్పతిం గానంబోయి మందాకినీతీరమున గురువరుం

జూచెను. ధిషణుండును బరబ్రహ్మ ధ్యానపరాయణుండై గంగాతోయమందుఁ గనఁబడియె. అత్తఱి నాగీష్పతి ప్రాఙ్ముఖుండై సూర్యదర్శనము చేయుచు, సాశ్రునేత్రుఁడై పులకాంచితతనుఁడై కనుపట్టెను. భ్రాతృవర్గముల కిష్టుఁడై యసురుల కనిష్టుఁడై బంధువర్గములకుం జూడందగి మహానియమసంపన్నుఁడై యుండెను. ఇట్లు జపము చేయు దేశికుంగాంచి సురపతి నియమభంగము చేయ నోడి యందే నిలిచియుండెను.

ఒకజాముసే పారీతిగ నుండి నియమమువదలి లేచిన గురువర్యుం జూచి ప్రదక్షిణపురస్సరముగా నమస్కరించి పాదములపై వ్రాలి గట్టిగా రోదన మొనరించెను. తనవృత్తాంత మెఱింగించెను. మునిశాపమును విస్తరించి వినిపించెను. మరల వరమునొందుట జ్ఞానోపదేశలాభము గల్గుట విన్నవించెను. వైరిగ్రస్తయగు సురపురి నెట్లు లభించునో తెలుపవే యని వేఁడెను.

బృహస్పతియు దివస్పతి వచనముల నాకర్ణించి వక్తలలో నుత్తమోత్తముఁడు గానఁ గోపసంరక్తలోచనుండై యిట్లు పలికెను. సురేంద్రా! గతవృత్తము నాలకించితిని. వగవకుము. నామాట నాలకింపుము. నీతిజ్ఞుఁడు విపత్తునందు భయంపడఁడు. సంపద్విపత్తులు శాశ్వతములు గావు. పూర్వజన్మకృతస్వకర్మాయత్తములు. ఇవందఱకు లభించునట్టివే కాని నీకుమాత్రమే తోఁచునవి గావు. అవి చక్రనేమిక్రమము ననుసరించును. కాన వగవఁబనిలేదు. పురుషుఁడు శుభాశుభరూపకర్మఫలము

ననుభవించును. స్వకృతకర్మమును దా ననుభవింపక తప్పించుకొన వీలుకలుగదు. కల్పకోటిశతములకైన నది యనుభవించినఁగాని నశింపదు.

'అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్' అన వినవే. ఇది శ్రీకృష్ణప్రోక్తమని వేదమునఁగలదు. సామవేద శాఖయందు బ్రహ్మను సంబోధించి శ్రీకృష్ణమూర్తి యుపదేశించెను. * కృతకర్మఫలములు జన్మభోగావశేషములు. తదనురూపానుభవములు భరతఖండమందును, ఖండాంతరముల యందును గలుగవచ్చు. బ్రహ్మావమానిశాపమున లక్ష్మి నిన్ను వదలిపోయెను. సత్కార్యానుష్ఠానమున మరల లభింపఁగలదు. కోటిజన్మార్జితకర్మము జీవుల ననుసరించును. దాని ననుభవింపక తొలఁగించుకొను నుపాయము లేదని నమ్ముము. కాలదేశపాత్రభేదములవలన న్యూనాధికభావములు తోఁచుచుండును. ప్రతిదినము వస్తుదానమున వస్త్వంతరప్రాప్తి కలుగుచుండును. దినభేదమున నొకవస్తుదానముచేఁ గోటివస్తుప్రాప్తి కలుగును. సమదేశమున సమవస్తుప్రాప్తియే కలుగును దేశభేదమునఁ గోటిగుణిత ఫలముగాని, తదధికఫలముగాని గలుగఁగలదు. సమపాత్రమున నొసఁగినదానము సమవస్తులాభమును గల్పించును. పాత్రభేదమున నొసఁగినదానము శతగుణితఫలమునేని, తదధికఫలమునే నొసంగును. సస్యములు కాలపాత్రభేదము

* జన్మభోగావశేషే చ సర్వేషాం కృతకర్మణామ్, అనురూపం హి తేషాం చ భారతే ఽన్యత్ర చైవహి. అని మూ.

లచే న్యూనాధికఫలముల నిచ్చుచుండుట మన మెఱుంగు దుముకదా. కర్షకుఁ డాఫలమును క్షేత్రపాత్రభేదములచే లభించిన ట్లెఱుంగును.

## దాన ఫల వివరణము.

సామాన్యదినమున బ్రాహ్మణుం బిలిచి దానమిచ్చిన సమ ఫలము గలుగును. అమవసయందుఁగాని, సూర్యసంక్రాంతి కాలమునఁగాని యొసఁగిన దానము శతగుణఫలప్రదమగును. చాతుర్మాస్యపూర్ణిమలయం దిడు దాన మనంతఫలప్రదమగు. చంద్రగ్రహణకాలకృతదానము కోటిగుణితఫలదము. సూర్య గ్రహణమున నిడుదానము తద్దశగుణితఫలము నీఁజాలు. దేశకాలపాత్రము లుత్కృష్టములు కాఁగా తత్ఫలము సంఖ్యా తీతమగు. దానఫలమెట్లో స్నానజపాదికర్మములయం దట్లే గ్రహింపందగు. ఇది సర్వకాలములయం దిట్లే యుండునుగాని మార్పునొందఁ దని యెఱుంగుము. కుంభకారకుఁడు మృత్తును గొని చక్రముననునిచి దండభ్రమణమున భాండముల నిర్మించు నట్లు కర్మసూత్రముచే విధాత ప్రాణికోటికి ఫలము నిచ్చు చుండును. ఎవనియాజ్ఞను శిరసావహించి ధాత యీజగముల సృజించెనో యాపురాణపురుషుని నారాయణుని శరణు చొరుము. మహావిపత్కాలమున సంసారమున నెవరు మధు సూదనుస్మరింతురో వారికి విపత్తునందు సంపత్తిగలుగు నని శంకరుం డుపదేశించెను. అని యింద్రున కుపదేశించి కౌఁగిలించు

కొన్ని శుభాశిషముల నొసఁగెను. అని నారాయణమూర్తి మరల నారదున కిట్లు చెప్పెను.

పాఠకమహాశయులారా! ఈకథను వింటిరికదా. ఇది యేనీతుల బోధించునో యని యించుక పరికింపుఁడు. త్రిలోకాధిపతికదా యింద్రుఁడు. అట్టిసురపతి స్త్రీసంగతిందగిలి స్వేచ్ఛగా విహరించెను. దాన యుక్తాయుక్తపరిజ్ఞానహీనుఁడయ్యెను. మహామునియొసంగిన పుష్పమాలను దృణీకరించెను. అందున స్వర్గలోకభ్రష్టుఁడయ్యెను. కార్యము కడుంగొంచెము. ఫల మెట్టిది లభించెను? చిరకాల దుఃఖదాయకము. అంతటివాఁ డట్లాయెనుగదా. మన మెంతవారము. కావున భగవద్భక్తులఁ దృణీకరించుట, భగవత్ప్రసాదము నిర్లక్ష్యముచేయుట, చేయరానికార్యములు ఇవి సర్వాపన్మూలములు. ధనగర్వమున విఱ్ఱవీఁగి సాధువులఁ గొందఱు నిందింతురు. సాధువుల మనసులు వికృతిం బొరయవుగాని ఫలముమాత్రము కలిగింపక మానవు. క్షణమైన నిలువని యైశ్వర్యమును నమ్మి శాశ్వతదుఃఖమును సంపాదించుకొనుట చాల నన్యాయము. అకృత్యము. చేయరానికార్యము లెన్నియో యున్నవి. అందు సాధుదూషణ తిరస్కారములు ప్రథమగణ్యములు. అవి చేయునపుడు సామాన్యములుగ నుండు. పరిపాకమున దుర్భరదుష్ఫలముల నిచ్చును. కాన వాని మానుటొప్పు. మఱియు నీకథయందు దేవరూపమునఁ దెలుపు ధర్మవిషయము లమూల్యములు. పాత్ర మెఱిఁగి దానము, క్షేత్ర మెఱిఁగి బీజము నునుపఁదగు

నన్నసామెత నీకథ దృఢపఱచుచున్నది. కాఁబట్టి సత్పాత్ర దాన మిసుమంతయైన మహాఫలము నిడును. అసత్పాత్రదాన మత్యధికమైన నసత్కల్పంబై చను. ఇదియే యిందు గ్రహింపఁ దగిన నీతి. ఒక్క చిన్నయపరాధముచే నింద్రుఁ డెంతకాలము దుష్టఫలముల ననుభవించెనో పరికింపుఁడు. కొందఱు పుణ్య కార్యముల నొనరించినచోఁ బాపములన్నియు నశించు నందురు. అది యంత సగసమగు పలుకుగాదు. దానియం దెన్నియో శంకలున్నవి. ఆగోడవలో దిగిన మరలఁ బైకి వచ్చుట చాలఁ గష్టము. కాన ముఖ్యవిషయముల గమనిం పుఁడు. కథారూపమున మనకు మహర్షు లుపదేశించిన యమూల్యవిషయరత్నము లివియే. ఇం దొక్కదానినే మన మునఁ బదిలపఱచుకొని యాచరించితిమేని కృతకృత్యుల మగు దుము. ఇఁక నవ్వలికథ వినుఁడు.

## ఇంద్రాదులు బ్రహ్మకడకుం బోవుట.

తరువాతి కథను వినఁగోరిన నారదమునికి శ్రీనారా యణమూర్తి యిట్లు చెప్పెను. మునివరా! వినుము. శచీపతి యంతట బృహస్పతిని బురస్కరించుకొని దేవతావితతిం గూడి బ్రహ్మకడకుం బోయెను. కొలువుకూటమున నున్న యాచతు ర్ముఖునిం గాంచి దేవతలెల్ల నమస్కరించిరి. గురువుతోఁటి పురు హూతుండును వలగొని దండప్రణామ మాచరించెను. బృహ స్పతి మాటలయందు నేర్పరి గాన గతవృత్తాంతమును పూస

గ్రుచ్చినట్లు విన్నవించెను. కమలాసనుండు సుస్మిత మొనరించి యింద్రునిఁ గాంచి యిట్లు వచించెను.

నాయనా! నీవు మదంశజాతుఁడవు. నా ప్రపౌత్త్రుఁడవు. విచక్షణుఁడవు. బృహస్పతికి శిష్యుఁడవు. అంత చాలక దేవతలకెల్ల నధిపతివి. నీమాతామహుండగు దక్షుండు విష్ణుభక్తుఁడగుటయె కాక ప్రతాపనిధి. ఏ నీ కులత్రయము పరిశుద్ధమో యట్టి నీవేల యిట్లు గర్వించితివి? ఏ నీ తల్లి యదితి సాధ్వీశిరోమణియో, ఏ నీ తండ్రి కశ్యపుఁడు జితేంద్రియుఁడో, ఏ నీ మాతామహుఁడు మహాత్ముఁడో యట్టి నీవేల యిట్లు గర్వించితివి? జనుఁ డెవ్వఁడైనను జననీజనకగురుదోషముల దుష్టుఁడై శ్రీహరిని ద్వేషించును గాని లేకున్న ద్వేషింపఁడు. ఇది నిక్కము. పరాత్పరుండగు శ్రీనారాయణమూర్తి సర్వభూతాంతర్యామికదా! అతఁడు లేకుండిన నాతనువు శవమనంబడుఁగాదే. ఇంకొక్క రహస్యముగలదు. వినుము. నేనే మనస్సు. ఇంద్రియేశుఁడను. శంకరుఁడు జ్ఞానరూపి. విష్ణువు ప్రాణములు. ప్రకృతి బుద్ధి. ఇంద్రాదులు శక్తులు. అవియన్నియుఁ బ్రకృతికళలు. ఆత్మప్రతిబింబ మనఁబడు జీవుఁడు భోగశరీరధారి యగు. దేహమునుండి ఆత్మ వెడలఁగా తక్కుంగలవన్నియుఁ ద్వారపడిపోవును. రాజు మార్గమునఁ బోవుచుండ సేవకు లనుసరించి పోవునట్లే ఆత్మను దక్కుంగల శక్తులన్నియు ననుసరించును. నేనును, శంకరుఁడు, అనంతుఁడు, విష్ణుధర్మాదులు, నీవు, దేవతలు ఏమహాపురుషుని యంశసంభూతులమో, యెవని భక్తులమో

యట్టి పరమపురుషుని నిర్మాల్యపుష్పము నెట్లు తిరస్కరించి తివి? ఏమహనీయమూర్తి పాదము పుష్పమున శంకరునిచేఁ బూజింపఁబడెనో, ఆపుష్పము దుర్వాసుఁడు నీకియ్యఁగా నదృష్టహీనుఁడవై యేల తిరస్కరించితివి? ఏపుష్పము శ్రీకృష్ణ పాదారవిందవిగళితమో ఆపుష్పము నేపుణ్యవంతుఁడు శిరమున ధరించునో ఆమహాత్ముఁడు దేవతలచేఁ బూజింపఁ దగువాఁడు.

ఇంద్రా! దైవము నిన్ను వంచించెను ఆదైవము బలవత్తరము. అదృష్టహీను నెవఁడు రక్షింపఁగలఁడు? శ్రీకృష్ణ నిర్మాల్యపరిత్యాగమునఁ గోపమూని శ్రీదేవి నిన్ను వదలి పోయెను. ఆలక్ష్మిని మరలఁ బొందుటకు వైకుంఠమునకుం బోవలయు. పద. నేనును వచ్చెద. అందు శ్రీనాథు సేవించి మరల లక్ష్మినిఁ బొందుదువుగాక. అట్లు నీకు వరమిచ్చెద. అని పలికి బ్రహ్మ వారినందఱం దోడుకొని వైకుంఠమునకుం బోయెను.

ఆలోకము పుణ్యనిలయము. పాపసంసర్గము లేనిది. పరమపవిత్రము. ఆలోకవరమున నిరుపమానశోభాఢ్యుఁడై వెలయు శ్రీమన్నారాయణునిఁ బరాత్పరుని, సనాతనుని, తేజస్స్వరూపుని గాంచిరి. మఱియు నాపరమపురుషుఁడు గ్రీష్మర్తుమధ్యాహ్నమార్తండకోటిప్రభాభాసమానుండై, శాంతుఁడై, ఆదిమధ్యాంతములు లేక లక్ష్మీకాంతుఁడై, మఱి యనంతుఁడై, భక్తరక్షణదక్షములగు చతుర్బాహువులు వెలయ, సరస్వతీసంయుతుఁడై, చతుర్వేదపరివేష్టితుఁడై, గంగాదేవీ సంగతుండై విరాజిల్లుచుండెను. అట్టి పరమేశ్వరుం గాంచి

బ్రహ్మాదిదేవతలు శీర్షములు వంచి సమస్కరించిరి. పలుభంగుల వినుతించిరి.

అంత విరించి గతవృత్తాంతమును దెలిపెను. దేవతలా ర్తత్రాణపరాయణా! ప్రభూ! యని తమవెతలం బలుకంజాలక బిట్టు రోధనము చేసిరి. భగవంతుఁడా ర్తిమునింగిన దేవతలంజూచి రత్నాభరణశూన్యులై వాహనాదులు లేక ముఖకాంతులు నశింప హతశ్రీకులై భయాక్రాంతులై యున్నవారలం గని కరుణాపరతంత్రుఁడై మృదుమధురోక్తుల నిట్లు పలికెను.

ఓవిరించీ! బృహస్పతీ! దేవతలారా! భయంపడకుఁడు. నేఁ గలుగ మీకు భయ మేల కలుగును? పరమైశ్వర్యవర్ధిని యగు లక్ష్మి నొసంగెద. సమయోచితమగు నామాట నించుక వినుఁడు. అది హితమై, సత్యమై, సారభూతమై, పరిణామ శుభావహంబై యలరారు. లోకములందు జను లసంఖ్యాకు లున్నవారు. వారు మదధీనులు. నేను వారి యధీనుఁడను. అస్వతంత్రుఁడను. మద్భక్తుఁడైన నెవ్వఁడేని నాభక్తునిపై రోష మూనినచో వానియింట నుండనొల్లను. లక్ష్మియు నన్నెడఁబాయనిది గాన నామెయు నుండ నిచ్ఛయింపదు. దుర్వాసుఁడు శంకరాంశసంభూతుఁడు విష్ణుభక్తుఁడు. తచ్ఛాపవశమున నేను లక్ష్మింగూడి నిన్ను వదలి వచ్చితిని. * ఏయింట శంఖధ్వనియు, తులసీవృక్షము, శివార్చనము లేవో యాయింట లక్ష్మి నివసిం

---

* యత్ర శంఖధ్వని ర్నాస్తి తులసీ న శివార్చనమ్, న భోజనం చ విప్రాణాం న పద్మా తత్ర తిష్ఠతి. అని మూ.

పడు. ఏయింట నాభక్తుల నింద వినఁబడునో, ఎందు నానింద వినఁబడునో, ఆయింట లక్ష్మియుండ నొల్లక రోషమూని వెడలును. నాభక్తిలేని యేమూఢుఁడు హరివాసరమున భుజించునో, నాజన్మదినమున భుజించునో యాయింటనుండ నొల్లక శ్రీదేవి పరుగిడును. ఎవఁడు నానామమును విక్రయించుచున్నాఁడో, ఎవఁడు కన్యావిక్రయమును జేయుచున్నాఁడో, ఏ మూఢునింట నతిథులు భుజింపరో యాయింట నాసాధ్వీతిలకము నివసింపదు. ఏవిప్రుఁడు పుంశ్చలీపుత్త్రుఁడో, ఎవతె భర్త మహాపాపియో, ఎవనియింటికిఁ బాపాత్ముఁడు వచ్చుచుండునో, ఎవఁడు శూద్రశ్రాద్ధాన్నభోక్తయో, యట్టివారియిండ్ల నుండ నొల్లక కమలాదేవి వైకుంఠమును జేరును. ఏద్విజాధముఁడు శూద్రశవదాహకుఁడో, యతనియింట శ్రీదేవి యుండఁ బూనదు. ఏద్విజుఁడు శూద్రునింట వంటచేయ నంగీకరించి యప్పనిచేయునో, ఏవిప్రుఁడు వృషభము నెక్కి పయనము చేయునో, అతనియింట భీతిల్లి సిరి పరుగిడును. ఏద్విజుఁడు అపరిశుద్ధుఁడు క్రూరుఁడు హింసకుఁడు నిందకుండగునో, శూద్రయాజియగునో వానియింటనుండక లక్ష్మి తొలఁగును. ఎవఁడవీరాన్నమును భుజించునో వానియింట లక్ష్మి యుండ నొల్లదు. ఎవఁడు నిర్హేతుకముగా నఖంబులఁ దృణములఁ ద్రుంచునో, నఖములచే భూమిని లిఖించునో అట్టివానియింట నిఁక నాశ లేదని లోకమాత స్వలోకమున కరుగును. ఏ విప్రుఁడు సూర్యోదయకాలమున భుజించునో, పగటిపూట

నిద్రపోవునో, పగటియందు గ్రామ్యధర్మ మొనరించునో వాని యిల్లు వదలి కమలాలయ యరుగును. ఏవిప్రుఁడు కులాచార హీనుఁడో, ఎవఁడు సదా శూద్రప్రతిగ్రహ మొనరించు చుండునో, ఏవఁ డదీక్షితుఁడో వానియింట పద్మవాసిని నివ సింప నిచ్ఛయింపదు. ఎవఁడు జ్ఞానదుర్బలుఁడై తడిపాదము లతో వివస్త్రుఁడై శయనించునో, ఎవఁడు తుచ్ఛవాక్కులు పలుకుచుఁ బలుమాఱు నవ్వుచుండునో వానియిల్లు వదలక లక్ష్మిమానదు. ఎవఁడు తైలమునఁ దలయంటుకొని యన్యాంగ మును స్పృశించునో, తనయంగమును వాద్యమునువలె వాయించునో నాప్రియురాలు వానియింట నుండదు. ఏ ద్విజుఁడు వ్రతోపవాసహీనుఁడో, ఎవఁడు సంధ్యోపాసనము వదలునో, ఎవఁడు విష్ణుభక్తి లేకయుండునో, వానియింట పాలకడలి కొమరిత నివసింపదు. ఇంతియగాదు. నారదా! ఎవఁడు సదా బ్రాహ్మణు నిందించుచుండునో, బ్రాహ్మణునితో ద్వేషించునో, జీవహింసచేయునో, దయాశాలికాఁడో, వాని యింట సాధుశీలమున నలరు లక్ష్మీదేవి యుండనొల్లదు.

ఎందెందు శ్రీహరిపూజసాగునో, ఎందెందు శ్రీహరినామ సంకీర్తనము జరగునో అందందు శ్రీదేవియుండును. ఏయింట శ్రీకృష్ణస్తుతి,తద్భక్తప్రశంస కలుగునో యాయింట ప్రమోద భరితయై కమలాదేవియుండును. ఏయింట శంఖనినాదము గలదో శంఖముపూజింపఁబడునో, తులసీదళము భగవత్సమర్ప ణము చేయఁబడునో, భగవత్సేవావందనధ్యానము లేయింట

గలిగి యుండునో యాయింట సిరియుండును. ఏగృహమున శివ లింగార్చనము, తన్నామసంకీర్తనము చేయఁబడునో, దుర్గా పూజ, తన్నామస్తవము సాగునో యాగృహాసీమ భార్గవీదేవి వాసముచేయును. ఏయింట బ్రాహ్మణభోజనము, పూజ, సర్వ దేవార్చనము గలదో యందు లోకజనని ప్రమోదమున నుండును.

అని యిట్లు పలికి దేవతలు వినుచుండ శ్రీహరి లక్ష్మీదేవి కిట్లనియె. భార్గవీ! నీయంశము పాలసముద్రమున నుదయిం చుఁగాక! అని యాజ్ఞాపించి జగన్నాయకుఁడు బ్రహ్మనుజూచి పంకజాసనా! పాలకడలి మథించి యం దుద్భవించు లక్ష్మిని దేవతల కొసంగుము. ఆలక్ష్మి యింద్రలోకమున స్థిరముగా నిలువఁగలదు. అనియాజ్ఞయిడి యంతఃపురమున కరిగెను. దేవతలందఱు తమతమ నివాసంబుల కరిగిరి.

అంతఁ గొంతకాలమునకుఁ బరమేష్ఠి పురికొల్ప దేవత లందఱు క్షీరసాగరము చెంతకుం బోయి గుంపుచేరిరి. మంథర పర్వతమును గవ్వముచేసి కూర్మరూపధరుం డగు శ్రీహరి దాని కాధారముగా నొనరించి శేషుని త్రాడుగాఁజేసి దేవతలు రాక్షసులు తోడ్పడఁగా మథించిరి. ధన్వంతరియు, నమృతకల శము, ఉచ్చైశ్శ్రవము, నానావిధరత్నజాతము, లక్ష్మియు, సుదర్శనము, సముద్రమునుండి యావిర్భవించెను. ఆలక్ష్మియు క్షీరోదశాయియగు శ్రీహరికి వనమాల నర్పించెను. ఆదేవి

శ్రీవిష్ణువశంవద. వైష్ణవీశక్తి యనం బ్రఖ్యాతిగాంచినది. అట్టి శ్రీదేవిని దేవతలు, మునులు, బ్రహ్మ, శంకరుఁడు బహువిధ ముల వినుతించిరి. బ్రహ్మశాపవిముక్తి కలిగినందున నాదేవి మరల దేవపురమున దృష్టిని బ్రసరింపఁజేసెను. అంత దేవతలు దైత్యగ్రస్తమగు నిజైశ్వర్యమును మరలఁబొందిరి. తమరా జ్యము మరల లభించుటచేఁ బరమానందభరితులై దేవత లా లక్ష్మీదేవిని బహువిధముల నుతించిరి.

మహాశయులారా! ఈకథ చక్కఁగాఁ బఠింపఁదగినది. దీనియం దనేకరహస్యము లున్నవి. లక్ష్మి యొక్కచో నివసించు నదికాదనియు, ఎట్టి దురాచారము లున్నను ఆలోకమాత యందు నిలువక వేగ తొలఁగుననియు, మరల నాశ్రీదేవి లభిం చుట కడుంగడుం బ్రయాససాధ్యమనియు గ్రహింపఁదగు. క్షీరసముద్రమును మథించుట యెట్లు? అది శక్యమైనకార్యమా యని ప్రశ్నము దూరదృష్టిగలవారు చేయఁదగినది కాదు. మన మసమర్థులము కాన మన కప్పని శక్యము కాదుగాని సర్వశక్తి సంపన్నులక దశక్య మనరాదు. దూరవార్తాశ్రవణయంత్రము, శబ్దగ్రహణయంత్రము, రూపగ్రహణయంత్రము లోనగు నవి మనము కనిపెట్టఁజాలకున్నను మన యీకాలముననే మనలోఁ గొందఱు బుద్ధిమంతులు కనిపెట్టలేదా. మనము వానింజూచి హర్షించుట లేదా. ఇప్పటికి మన మవ్వానిని గల్పింపఁజాలక మిణకరించుటలేదా. మనకాలములో మనలోఁ గొందఱు కల్పిం చిన యంత్రమును జూచి కూడ మనము దానిని గల్పింపఁజాల

కుండి దేవతలు చేయుకార్యములను గుఱించి తర్కించుట ఇది శక్యమా? యని ప్రశ్నించుట వెఱ్ఱితనము కాదా. మన కశక్యమగు కృత్యమేదియే నితరులకు, నందు దేవతల కశక్యమనియు సిద్ధాంతముచేయుట. వ్రాయుట యసమంజసముగాని వేఱు గాదు. ఇపు డిపుడు చంద్రలోకమునఁగల జీవులతో మాటలాడ వలనుపడుననియు, దానికి వలయుపరికరములు సమకూర్పఁబడుచుండుటయు మనచెవులఁ బడుచుండలేదా. మనుజుల కిద్ది సాధ్యమగుచో నిఁక దేవతల కేకార్యములు శక్యములుగాకుండును. ఇట్టి వెన్నియో మనకశక్యములని తోఁచుచున్న వితరులచే సాధింపఁబడుచున్నయవి. అవి సాధింపఁబడిన తర్వాతఁగూడ మనము వానిని సాధింపఁజాలకున్నారము. ఇట్టి మనము దేవత లొనరించినకార్యములఁ దప్పుపట్టఁ బూనుట వెఱ్ఱితనము కాక మఱే మగును? కనుక మన మశక్తులమయ్యు నితరుల వెక్కిరించుట చేయరానిపనులలో నొకటి. అట్టి పనులజోలికి మనము పోరాదు. వాని నాక్షేపించియుఁ జేయున దేమియు లేదు. ఓటి నోటిమాటలు పది ప్రేలుటయే గాని సాధించు పురుషార్థము కానరాదు.

ఈవిషయమున మఱికొందఱు పాలసముద్రమున నోషధులు వైచి మథించిరనఁగా నోషధులనెల్లఁ బరీక్షించి వానిగుణములఁ గనిపెట్టి తత్సంయోగమునఁ గలుగు క్రొత్తగుణ మిది గదా యని పరీక్షించి సిద్ధాంతము చేసిరనియు, ఆప్రయత్నములోఁ బ్రాణమును బోనీయక కాపాడ శక్తిగల యౌషధ

మును గనిపెట్టిరనియు, దానినే మనవారు పాలసముద్రమును మథించిరని చెప్పిరనియుఁ జెప్పుదురు. అంతియెగాదు. మంథరపర్వతమును గవ్వముగాఁ జేసిరనఁగాఁ బర్వతమున నుండునోషధులు వీర్యవంతములౌట నవ్వానిం గైకొనిరనియు, వాసుకిని గవ్వమునకుఁ ద్రాడు చేసిరనఁగా నాగముఖమునం గలగరళము నౌషధములయం దుపయోగింపఁ దగు నని కని పెట్టిరనియు, హాలాహలము పుట్టెననఁగా నవవిధపాషాణ ములఁ బరికించి యందుఁ గొన్ని మందులలో నుపయోగింపక వదలిపెట్టుచు నవి ప్రాణాపాయమును గల్పించునుగాక వానిఁ బరిగ్రహింపరాదని త్రోసివేసిరనియు నర్థము చెప్పుదురు. ఆలోచింపఁగా యుక్తియుక్తముగా నున్నదిగాని చక్కఁగాఁ బరీక్షించినపు డీవాదము చాలసేపు నిలువఁబడఁజాలక పరు గిడునదియే. ఇట్టి యుక్తులతో నేకార్యము కాఁబోదు గాని వృథాకాలక్షేప మగును. సారాంశ మేమనఁగా దేవతల కీలాటి కార్యములు సులభములు గాని దుర్లభములు గావనునదియే. మఱియు.

ఈకథయందుఁ జేయరానిపనులు చేయఁదగుపనులు చెప్పఁబడినవి. వానింబఠించి తెలిసికొని యితరులకుం దెల్పుట ముఖ్యము. కథనుమాత్రము చదివి ధర్మములఁ జదువకవద లుట వెఱ్ఱిపని. చక్కఁగాఁ బఠించి నేర్చుకొనఁదగిన వివ్వియే. వానిని మనకుఁ దెలుపుటకే యీకథలఁ బెద్దలు వ్రాసి సమయో చితముగా నొక్కొక్కకథయం దొక్కొక్కధర్మమును వివిధ రీతులఁ దేటపఱచిరి. వారిఋణమును దీర్చుకొనఁజాలము. కాన

వానింబఠించి యం దేదియే నొక్కదానిని స్మరించుచు ననుష్ఠానమున దాని సార్థకముచేసినచోఁ గృతకృత్యుల మగుదుము. ఇంతట దీనినిమాని కథాభాగము విన్నవింతును. సావధానులరై యాలకింపుఁడు.

## *శ్రీహరికి భృగుశాపము గలుగుట.

ఇంకఁ జదువఁబోవు కథలకుఁ బ్రాణమనఁదగినది శ్రీహరికి మనుష్యజన్మ మేల కలిగె ననుప్రశ్నయే. దానినెఱింగినఁగాని పైగ్రంథము సాగదు కాన దానిం బఠింపుఁడు. మున్ను జనమేజయమహారాజు వేదవ్యాసుల నిట్లు ప్రశ్నించెను. మహాత్మా! నిగ్రహానుగ్రహాసమర్థుఁడు. "కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థః పరమేశ్వరః" అను సూక్తికిం బాత్రుఁడు నగు భగవంతుఁడు మనుష్యయోని నవతరింపనేల? ఏమేని కారణంబుగలదే యని ప్రశ్నింప వేదవ్యాసమహర్షి యాప్రశ్నమునకు సమాధానము వచింపఁబూని వత్సా! జనమేజయా! శ్రీహరికి భృగుశాపముగలదు. కావున మనుష్యయోనిం బుట్టువును గాంచక తప్ప దయ్యెను. అన విని రాజు మరల నామహర్షితో మునివర్యా! నామనమునఁ బెనుసందియ మంకురించెను. భృగుమహర్షి శ్రీమన్నారాయణమూర్తి నేల శపించెను? శ్రీహరి యామహర్షి కేమి యపకారము చేసెను. భక్తపరాధీనుఁడు,

---

* ఈకథ దేవీభాగవతము నాల్గవస్కంధము పదియవయధ్యాయము ననుసరించి వ్రాయఁబడినది.

కృపానీరరాశియగు శ్రీహరి మహర్షికేల యపకారము చేసెను? ఎట్టి దాయపకారము? వినవలతు. విస్తరించి చెప్పినను ధన్యుం జేయుమా యని వేడఁగాఁ గరుణించి వ్యాసమహర్షి యిట్లు పలికెను. రాజా! చక్కఁగ నాలకింపుము. వివరించి వచించెద. ఈ ప్రశ్నము లోకోపకారకము. బాగుగాఁ బ్రశ్నించితివి. నాకుఁ బరమానంద మొదవెను. శ్రద్ధాభక్తులు పొలయ నాలకింపుము. నీవంటి జిజ్ఞాసువు ప్రశ్నించినపుడు సమాధానము చెప్పకపోరాదు. కృతకృత్యుఁడవు. భగవత్తత్త్వము నెఱుంగఁ గోరితివి. పామరులకుఁ గలుగఁబోవు సంశయములఁ దొలఁగింపఁ బూనితివి. వత్సా! భగవంతుని చర్యలవాఙ్మానసగోచరములు. భగవంతునకు ఋషిశాపము తగులునా? ఋషి భగవద్భక్తుఁడు కదా. తత్ప్రసాదసమాసాదిత శక్తిసంపన్నుఁడగు ఋషి భగవంతుని శపించుట యన నద్భుతముగా నుండును. కాని భగవంతుఁడు విడంబనార్థ మనేకకృత్యములను జేయుచుండును. అది తొలుత విచిత్రముగా నుండును గాని దృఢబుద్ధిని విమర్శింపఁగా యుక్తియుక్తముగా నుండును. ముందు కథను వినుము. ఆవలఁ గొన్ని విషయము లెఱుంగఁగలవు. త్వరపడకుము. కథార్థమును మనమునఁ బదిలపఱచుకొనుము. దానఁ బెక్కు శుభములు నీకుం గలుగఁ గలవు.

బలిచక్రవర్తి బలవంతుఁడై చెదరిపోయి కడునిడుమలం గుడుచు దనుజులం గూర్చుకొని దేవతల నోడించి స్వర్గరాజ్యము నాక్రమించుకొని పాలించుచుండెను. ఇంద్రుఁడు బృహ

స్పతి ప్రోత్సాహమున భగవంతు నారాధించి బలదర్పముల శతగుణములుగాఁ బొంది దేవతలంగూడి బలితో యుద్ధమును జాటించెను. దేవదానవులకు ఘోరాహవము సాగెను. భగవత్సహాయము గలుగుటం జేసి దానవు లోడిపోయిరి. బలిప్రభృతులు పరాజితులై పాతాళము నాశ్రయించిరి. బలి యాకాలమునఁ బ్రాయమునఁ జిన్నవాఁడు. బలపరాక్రమ సమగ్రుఁడు కాఁడు తపశ్శక్తి లేనివాఁడు. కాన నింద్రుఁ డోడింపఁజాలెను.

రాక్షసులలోఁ జాలమంది శుక్రు నాశ్రయించిరి. నీవే దిక్కని మొఱపెట్టుకొనిరి. మాకికనుండఁ దా వెద్ది? నీ యనుగ్రహము లేకున్న బ్రదుకఁజాలము. ఇందుండ ననుజ్ఞ యిడుదువా? పాతాళమునకుం బొమ్మందువా? సకల మంత్రవేత్తవు గాన నేమి యాలోచింతువో నీవే మాకుదిక్కని దీనాలాపముల వేఁడిరి. నావిని పరమకారుణికుండగు శుక్రుఁ డాయసురులం జేకొని యాశ్వాసించి దానవులార! భయంపఁకుఁడు. తపశ్శక్తిచే మిమ్మేఁచనేతెంచు సురల నిలిపెద. వారిని నిలిపి మిమ్ముం గాపాడెద. మంత్రములచే నోషధులచే మీబాధల నార్పెద. దాన మీరు విగతజ్వరులై సోత్సాహులై వెలయఁగలరు.

అన్నంతలో రాక్షసులు దిగులువాసి హాయి నొందిరి. ఈవార్త గూఢచారులవలన నెఱింగి దేవతలు మంత్రాగారమును జేరి శుక్రుఁ డొసంగిన యభయప్రదానము, దానవులు నిర్భయముగా నుండుటయు నాలోచించిరి. మన మిఁకఁ జేయవలసిన దేమనియుఁ దలపోసిరి. పలుభంగులఁ జింతించి తడవు

సేయుట మునుముందు విపత్తునకు మూలము కాఁగలదనియుఁ దీర్మానించిరి. వెంటనే శస్త్రపాణులై వెడలిరి. దొరకినవారిం జంపి అవశిష్టులఁ బాతాళమునకుం దఱుమవలయునని నిశ్చయించి శ్రీవిష్ణుసాయమున దానవుల పై కేగిరి. మారుకొన్న వారిని జంపిరి. దానవులు వారితోఁ బోరఁజాలక పరుగిడి శుక్రుని శరణు చొచ్చిరి. శుక్రుండు కోపమూని దేవతలం గాంచి వారల యుద్ధతియడఁగ దానవులారా! భయంపడకుఁడు. నేఁగలుగ వెఱపేల? నామఱుగునకు రండు. మిమ్ము మార్కొను వారును గలరే. అని యాశ్వాసించెను. ఆమాటలు విని దేవతలు చేయునది లేక పలాయనపాఠమును స్మరించిరి.

శుక్రుం డంత గీర్వాణులుపోవుట యెఱింగి దానవుల నొకచోఁ జేర నియోగించి యిట్లుపదేశించెను. రాక్షసులారా! పూర్వము చతురాననుఁడు చెప్పినవిషయమును జెప్పెద. చక్కఁగా నాలకింపుఁడు. విష్ణువు వారాహరూపమును దాల్చి హిరణ్యాక్షునిఁ జంపఁగలఁడు. నృసింహరూపమున హిరణ్యకశిపుని వధింపఁగలఁడు. ఇట్లే దనుజులఁ బెక్కుమందిని జంప దేవరాజ్యము నిష్కంటకముగాఁ జేయఁగలఁడు. ఇవియే బ్రహ్మపల్కులు. అట్లే జరగినది కదా. ఇపుడు మీలో మేటి శూరులు గానరారు. దేవతలు శ్రీహరిసాహాయ్యమున బలపరాక్రమముల నప్రతిములై యున్నవారు. వారికిం బ్రాణమనఁగా శ్రీహరియే. అట్టి హరినిజయించుటకు మంత్రబలము నాకుఁ జాలినంత కానరాదు. అట్టి మంత్రబలము నేను

సాధించిన మీరశ్రమంబున సురలఁ ద్వాపడి పరుగిడఁ జేయఁ గలరు. కావునఁ గాలమును గనిపెట్టియుండుఁడు. నే నిపుడు మహాదేవుని శరణుచొచ్చి తపంబున నలరించి దివ్యమంత్రముల సంపాదించి వచ్చెద. ఆమంత్రముల మీ కుపదేశించెద. సత్యము. నమ్ముఁడు. అని పలికెను.

దానవు లామాటలువిని గురువర్యునిం గాంచి భార్గవా! దేవతలకుఁ జిక్కకుండఁ బరాజయంబునొందిన మే మెట్లు నిలువఁగలము? ఏచోటనుండ వీలుగలదు? బలహీనులమగు మే మెట్లు మమ్ముఁ గాపాడుకొనఁ జాలుదుము. నీ వచ్చునంత దనుక నిలువ వీలగునే? బలవంతులగు దానవు లనిఁ బడిరి. బలహీనులమగు మే మల్పసంఖ్యాకులము మిగిలితిమి. మే మించుకయు యుద్ధమున నిలువఁజాలము. అని జాలిగలుగఁ బలికి యూరకుండిరి.

శుక్రుం డాదానవుల దీనాలాపముల విని యించుక మౌనమూని ధ్యానించి యిట్లనియె. నేను శ్రీమహాదేవుని దపంబున నలరించి మంత్రముల సంపాదించి వచ్చునంతదనుక మీరు శమము మిగులవెలయఁ దపోనియమముల నుండఁదగు.విద్వాంసులు సామదానాద్యుపాయముల సమయోచితముగా నుపయోగింపఁ దగునని వచించిరి. దేశకాల బలపరాక్రమాదుల నాలోచించి యాయుపాయముల వలసిన ట్లుపయోగించుచుండవలయును. భావి శుభఫలమును గోరి శత్రువుల సేవింపవలయును. తమశక్తి యతిశయించుతఱి వారి నడంపవలయును. కాన నిపుడు మీరు కపటంబున దేవతలతో మైత్రినిబాటించి కొంత

కాల ముండవలయును. మీయిండ్ల నాయాగమనమును బ్రతీ క్షించుచు నుండుఁడు. నేను మహాదేవు నారాధించి మంత్రములఁ బరిగ్రహించి వచ్చెద మంత్రబలసంయుతులమగు మనము దేవతలతోఁ బోరాడుదము.

అని పలికి కృతనిశ్చయుఁడై శుక్రుఁడు మహేశ్వరుని కడ కేగెను. మఱుదినము దానవులు ప్రహ్లాదునిబిలిచి నీవు దేవేంద్రునొద్దకుం బోయి దేవతలకు మనపై విశ్వాసముపుట్టఁ బలుకుము. అనిపనుపఁ బ్రహ్లాదుఁడు దేవతలయొద్దకుం బోయి యమర్త్యనాయకు మ్రోల సర్వామర్త్యులు వినుచుండ వినయమున నిట్లు పలికెను. ఆదిత్యులారా! మే మాయుధములఁ గ్రిందఁబెట్టితిమి. యుద్ధసన్నాహముల మానితిమి. మీతో సమానముగ సంగర మొనరింపఁజాలము. కావున నీఁక వల్కలాజినములఁ దాల్చి తప మొనరించు వారము. మీరు కోపం బుడిగి మాజోలి రాకుఁడు అని పలికెను.

దేవత లామాటలు విని సత్యవాదికదా ప్రహ్లాదుఁ డని నమ్మి విగతకోపులై దనుజు లాయుధముల వదలుటనెఱింగి తమ యుద్ధప్రయత్నముల మానిరి. నిష్కంటకం బయ్యెఁగదా రాజ్యమని ముదితులై యిచ్ఛావిహారముల నుండిరి. రాక్షసులు కపటాచారముల నవలంబించి యంద ఱొకటిగఁగూడి కశ్యపముని యాశ్రమమున నివసించిరి.

శుక్రుం డటఁ గైలాసంబునకుం బోయి మహాదేవుంగాంచి భక్తివినయంబులు మెఱయ నమస్కరింప సదాశివుండు వచ్చిన

పనియేమని ప్రశ్నించెను. శుక్రుండు దేవా! దేవతలఁ బాఱఁ దోలుటకును, బూర్వగీర్వాణులకు జయం బొనఁగూడుటకు ననువగు మంత్రములఁ గోరి వచ్చినాఁడ. కృపసేయవే మహా దేవా! యని వేఁడెను. శంకరుం డామాట లాలించి యతని వాంఛితమాలకించి యిఁకఁ జేయవలసినదేమని చింతించెను. ఈ శుక్రుఁడు దేవతలకు ద్రోహముచేయఁబూని వచ్చినాఁడు. రాక్షసులకు విజయమును గూర్పనెంచెను. దేవతల రక్షింప వలసినభారము నాది. అని తలంచి దుష్కర మత్యుగ్రము నగు వ్రత ముపదేశించెను. ఆవ్రతనియమ మెట్టిదనిన: వేయిసంవ త్సరములు కణధూమ మాహారముగాఁ గొనుచు నవాక్శిర స్కుఁడవై తప మొనరించిన ఫలమునొందుదు వనునదియే. ఆవల నీకు మంత్రములు స్వాధీనములగు. అన విని కావ్యుఁడు శంకరా! అట్లే యొనరింతును. వ్రతాలంభమున కనుజ్ఞయిమ్మా! యని ప్రార్థించి తదనుజ్ఞవడసి తపము చేయ నారంభించెను.

శివాజ్ఞ ననుసరించి ధూమపానము చేయుచు, శాంతుఁ డై మంత్రగ్రహణతత్పరుండై, నియమమున నించుకేని సడలక యుండెను. ఇట్లు శుక్రుఁడు తప మొనరించుచుండ నందు దేవ తలు శుక్రుని మహాప్రయత్నము నెఱింగి దంభాచారనిరతులై రాక్షసులుండుటయుఁ దెలిసికొని మంతనంబుండి తమలోఁదమ రిట్లు చెప్పుకొనసాగిరి. రాక్షసులు మాయాతపోనిరతులై మనము బాధింపకుండవలయు నన్నయుద్దేశమున నిట్లు మనకు విధేయులై యున్నవారు. వీరికొఱకు శుక్రుఁడు శంకరు నారా

ధించుచున్నాఁడని మనము వింటిమికదా! మన మిపుడు వీరి మాయామాగురులకుం జిక్కితిమేని బిదప సకలకష్టములకుఁ బాలగుదుము. కాన నిపుడు హతశేషులగు దానవులఁ జంపు దము. తర్వాత శుక్రుఁడువచ్చియు నేమి చేయఁగలఁడు?

అని యోజించుకొని యంద ఱేకగ్రీవముగా యుద్ధము చేయుటకే తీర్మానించుకొని యాయుధములఁ బూని దానవు లున్న వనమున కరిగిరి. తమపై కనిచేయు నుద్యమమున నాయుధములఁబూని వచ్చుచున్న దేవతలం గాంచి దానవులు భయంపడి తపంబులు చాలించి లేచి సత్యవాక్కుల నిట్లు పల్కిరి. దేవతలారా! ఆయుధముల వదలిన మా కభయ మొసంగితిరి. మాగురువగు శుక్రుఁడు నియమమును బూని యున్నవాఁడు. ఇట్టి యిక్కట్టుననున్న మమ్మును జంప నరు దెంచితిరిగదా. ఇది తగునే. మీ సత్యవాక్కు లేమాయె. శ్రుతిచోదితధర్మ మేయేటఁ గలిసెను? మేము అస్త్రసన్న్యా సము చేసితిమి. మిమ్ము శరణంటిమి. కరుణించి మన్నింపరే అని ప్రార్థించిరి.

ఆపలుకులు విని దేవతలు శిరఃకంప మొనరించి దానవు లారా! మీరు మమ్ము వంచించి శుక్రుని మంత్రముల సంగ్ర హింపఁ బనిచితిరికదా. మీరు తదాగమనమును గోరుచు నంతదనుకఁ గపటతపస్సు చేయఁబూనితిరి. ఇట్టి మిమ్ము శిక్షిం చుట న్యాయముకాదు. యుద్ధమొనరించి మిమ్ము వధింతుము. మీ రాయుధములఁగొని యుద్ధమునకు రండు శత్రువుల నంతర మెఱింగి వధించుటయే యుక్తమని సనాతనధర్మము గలదు.

అను నీ మాటలువిని రాక్షసు లొండొరులతో నాలోచించు కొనుచు సమయ మిది మంచిదిగాదని పలాయనము నంగీక రించిరి. నలు దెసలఁ బరుగులిడి శుక్రునితల్లి ని శరణుచొచ్చిరి.

శుక్రమాత మహాసాధ్వి. దీనులను గాపఁబూనుస్వభా వముగల దయావంతురాలు. కావున దానవులు తల్లీ యని మొఱ్ఱయిడ నంగీకరించి యభయదానం బొసంగెను. భయం పడకుఁడు. భయంపడకుఁడు. దానవులారా! భయమును వద లుఁడు. నాసన్నిధినుండు మీకు భయమెట్లు కలుగును ? నిర్భ యముగ నుండుఁడు. అను నాసాధ్వీమణివాక్కుల నాలించి భీతిపాయ విగతజ్వరులై యుండిరి ఆయుధముల గ్రహింపక యథాపూర్వముగ నుండిరి.

దేవత లట్లు దానవులు పలాయితులగుటఁ దెలిసికొని వారి యడుగులజాడల గుఱుతించి వచ్చి వారుండు స్థల మెట్టిదో వారికి సాయమొనరించు వారెవరో వారిశక్తి యెట్టిదో చింతింపక యాయాశ్రమంబున గతభయులై యుండు దానవులఁ జంప నుద్యమించిరి. కావ్యమాతయు వలదు. వలదు. న్యాయ మిదికాదని వారించుచున్నను వూనక ఆశ్రమ మున్న దానవులఁ గొట్టిరి. ఆదుష్కార్యమును గన్నులారఁ గాంచుచున్న యాసాధ్వీమణికిఁ బట్టరాని యాగ్రహ ముద యించెను. ఆకోపమున దేహము కంపించెను. మనసు గలఁత నొందెను. చూడరాని యాదుష్కార్యమును చేయుచున్న దేవతలం గాంచి నాతపఃప్రభావమున నిదిగో మీకు నిద్ర

వచ్చునట్లు చేయుచున్నదాననని పలికినంతనే దేవతలకు నిద్ర వచ్చి యట్లే పడిపోయిరి. ఇంద్రాదులాడలు తెలియక మృతి గన్నయట్లు పడిపోయిరి. అందఱు మూకత్వము నొందిన ట్లయ్యెను.

ఇట్లింద్రుండును దీనుండై నిద్రావశంగతుఁడై పడియుండ శ్రీవిష్ణువుగాంచి దేవేంద్రా! నన్ను నాశ్రయింపుము. నాలోఁ బ్రవేశింపుము. నిన్నుఁ దోడుకొనిపోయెద. అన్నంతనే యింద్రుఁ డించుక తెలివిగలిగి విష్ణువు నావేశించెను. శ్రీహరి రక్షణమున నిద్రఁబాసి నిర్భయుం డయ్యెను. ఇట్లింద్రుఁడు నిద్రఁబాసి గతవ్యథుఁడై హరిరక్షితుండై యుండుటఁగాంచి కావ్యమాత యతి కోపపరవశయై యిట్లు పలికెను. దేవేంద్రా! నాతపోబల మెట్టిదో చూడుము. * నిన్నును నీకు రక్షకుండగు శ్రీవిష్ణువును భక్షించెదను. దేవతలందఱు చూతురుగాక! అని పలికి యాభృగుపత్ని యోగమహాత్వంబున విష్ణ్వింద్రుల స్తంభించెను. ఆయాశ్చర్యమును గనుంగొని స్వర్లోకవాసు లందఱు దీనమానసులై యిదేమి యాశ్చర్య మని తల్లడిల్లిరి.

ఇట్లు తల్లడిల్లు దేవతలంగాంచి శచీవల్లభుండు లక్ష్మీవల్లభున కల్లనల్లన నిట్లు పలికెను. శ్రీనాథా! నినుంగూడి విశేషావమతి నొందితిని. ఇంక నీమె మనల దహింపకుండఁ జంపుము. అని యింద్రుఁడు పురికొల్పఁగా శ్రీపతి సుదర్శనమును స్మరించెను. ఆచక్రము స్మరించునంతన ప్రత్యక్షమయ్యెను. మధుసూదనుం డద్దాని హస్తంబునఁ దాల్చి కరుణలేక యింద్రునిచేఁ

* మఘవం స్త్వాం భక్షయామి స విష్ణుం వై తపోబలాత్. అని మూ.

బలుసారులు పురికొల్పఁబడుచు నిది కృత్యముగాదని తలంపక యహాసాధ్వీమణి శిరస్సును ఛేదించెను. ఆమె మరణింపఁగాంచి యింద్రుఁడు పరమానందభరితుం డయ్యెను. దేవతలు పరమ ప్రమదంబు నొంది 'జయింపుము జయింపు'మని శ్రీహరిని వినుతించిరి. ఆమె మృతినొందఁగా దేవతల నాపాదించియున్న నిద్ర వదలిపోయెను. ఆవల నింద్రపంకజాక్షులు స్త్రీవధకుఁ జంకుచు భృగుశాపము దురత్యయ మనియు, నది లభింపక తప్పదని చింతించిరి.

అంతఁ దపోవనంబున నెందో ఫలమూలములకై పోయి యున్న భృగుమహర్షి యాశ్రమమునకు వచ్చి దనుజులవలన జరగిన వృత్తాంతము నెఱింగి పడియున్న భార్యకళేబరమును జూచి దుఃఖాకులుండై మధుసూదనున కి ట్లనియెను. హరీ! ఇది పాపకృత్యమని యెఱింగియుఁ జేయరానిపనిని జేసితివి. ఈ కార్యము మనసునఁగూడఁ జేయఁ దలంపఁజనదు. బ్రాహ్మణస్త్రీని జంపుట మహాపాతకము కాదా? నిన్ను సత్త్వగుణము గల వానినిగాఁ జెప్పుచుందురు. బ్రహ్మ రజోగుణముగలవాఁ డందురు. శంకరుఁడు తమోగుణము కలవాఁ డందురు. ఇది విపరీతముగాఁ జెప్పఁదగినది. నీవు తమోగుణ ప్రధానుఁడవు. కాకున్న నిట్టియకార్య మొనరింతువే. స్త్రీని వధింపఁజనదు. అందున నపరాధురాలగు వనిత నెట్లు వధించితివి? కావున దురాచారుండవగు నిన్ను శపించువాఁడను. పాపాత్ముఁడా! నీవు నన్ను విధురునిగా నొనరించితివి. దీనికిఁగారణ మింద్రుఁడు.

అయిన నశక్తుండగు నింద్రుని శపింపను. నిన్నే శపింతును. నీ వెప్పుడు కపటస్వభావుఁడవు. కీటయోనిం బుట్టఁదగువాఁడవు. దురాశయుఁడవు. ఎవరు నిన్ను సాత్వికునిగా వచింతురో వారు మూర్ఖులు నీవు తామసుండవు. దుష్కృత్యముల నొనరించువాఁడవు. ఇది ప్రత్యక్షప్రమాణమున నెఱింగితి. ఇదె శపించుచున్నవాఁడ. * మర్త్యలోకమున నాశాపమువలన నీకు జన్మములు కలుగుఁగాక. అందును దఱచుగా గర్భవాసదుఃఖముల ననుభవింతువుగాక. అని శాపమిచ్చెను.

జనమేజయమహారాజా! ఆశాపము ననుభవింప శ్రీహరి ధర్మము నశించుతఱి మనుష్యలోకమున బుట్టుచుండును. ఆ శాపము లోకహితమునకే యీయఁబడిన దని యెఱుంగుము. అన జనమేజయుం డి ట్లనియె. మహాత్మా! అమిత తేజస్సుగల చక్రమున భృగుభార్య చనిపోయెఁ గదా. మరల భృగుమహర్షికి గార్హస్థ్య మెట్లు కలిగెను. దాని నెఱుంగవేఁడెద నని ప్రశ్నించెను.

వ్యాసమహర్షి యిట్లు బదులుచెప్పెను. రాజా! వినుము. భృగుమహర్షి యంత నిలువక భార్య పడియున్నతావునకుం బోయి దేహమునకు శిరస్సును సంధించి కార్యజ్ఞుఁడు కాన నిట్లు పలికెను. దేవీ! నిన్ను విష్ణువు చక్రధారచేఁ దునిమెను. అట్టి

* అవతారా మృత్యులోకే సంతు మచ్ఛాపసంభవాః, ప్రాయో గర్భభవం దుఃఖం భుంక్ష్వ పాపా జ్జనార్దన. ౪ స్కం. ౧౨ అధ్యా.

ని న్నిదిగో బ్రతికించుచున్న వాఁడను. నేను ధర్మముల జక్కఁగా నెఱింగినవాఁడ నేని, ఎఱింగినధర్మముల నాచరించు వాఁడ నేని, నిరంతరము సూనృతమును వచించువాఁడ నేని, ఈసత్యముచేత నే నీవు జీవింతువు గాక. దేవతలందఱు నాతేజో బలమును గాంతురుగాక! ఇపుడే జలములను జల్లి నాతపో బలమువలన నిన్ను బ్రదికించెదను. * సత్యశౌచవేదములు నాతపోబలము లైనచో నీవిపుడే జీవింతువు. అని పలికి పవిత్రోదకములు చల్లెను. ఆజలములు శరీరమును సోఁకగనే ఆ సాధ్వీమణి నిద్రనుండి మేలుకొనినట్లు లేచెను. చిఱునవ్వొలయ నాభృగుపత్ని లేచి భర్తచెంతకు వచ్చెను. ఆ విధముఁ గన్నులారఁ గాంచుచున్న సర్వభూతము లాశ్చర్యము నొంది సర్వదిశలను సాధుసాధుశబ్దంబుల నొనరించెను. రాజా! ఇట్లు భృగుమునిచే భార్య బ్రదికింపఁబడియె. ఇంద్రాదులు దేవతలు విస్మయము నొందిరి.

మహాశయులగు పాఠకులారా! ఈకథయందు విశేషాంశము లనేకములు గలవు. భగవంతునకుంగూడ భృగుశాపము తగులునా యనుశంక నొందకుఁడు. భగవంతునిగూర్చి తప మొనరించి తదనుగ్రహపాత్రు లగుమునులు భగవంతుని శపింపవచ్చునా యనియుఁ బ్రశ్నింపకుఁడు. భగవంతుఁడగు శ్రీహరియే యిట్టిఘట్టములఁ గల్పించును. వీనిద్వారా లోకులకు బుద్ధిగఱపును. ఎట్లనఁగా: శాస్త్రనిషిద్ధకార్యములు స్త్రీ

* సత్యం శౌచం తథా వేదా యది మే తపసో బలం. అని మూ.

హత్య లోనగునవి. వాని నొనరించినచో నెట్టివాఁడైనను దత్ఫల మనుభవింపక తప్పదు. శ్రీమన్నారాయణమూర్తియే యిట్టితప్పునకుఁ దగినఫల మనుభవించెఁ గదా. ఇఁక మన మనఁగా నెంతవారము? అనుభవింపక తప్పించుకొనఁ జాలుదుమా? అనుబుద్ధి యందఱకుం గలుగవలయు నని భగవంతుని యభిప్రాయము.

భృగుమహర్షి పత్నిని బ్రదికింపఁగల శక్తిసంపన్నుఁడని శ్రీహరికిఁ దెలియదా? తానుజంపుట న్యాయముకాదు. నన్నుదాహరణముగాఁ గొని యితరు లిట్టిపాపకార్యములఁ జేయఁ గడంగక మానరని యెఱుంగఁడా? ఎఱింగియుఁ దానే యిట్టి యకార్యముల నొనరించి దాన మహర్షులు కోపించి శపించునట్లు చేసి తత్ఫలమును లోకోపకారము చేయుటకై తానేపొంది లోకులకు గుణపాఠము నేర్పును. దీనిచే లోకుల కాపాఠము చక్కఁగా మనసునకుఁ బట్టును. కాఁబట్టి యేముని శాపమిచ్చినను దాను శిరసావహించును. దాన లోకులు బాగుపడుటయే ఫలమని యా లోకేశ్వరుని తాత్పర్యము. ఇది యొక విశేషాంశము.

మఱియు శరణాగతపరిత్రాణము పరమధర్మమనియు, దానఁ బ్రాణములుపోయినను మేలనియు భావింపవలయు నను నది యొకవిశేషాంశము. దానవులు భీతులై నీవే దిక్కని భృగుపత్ని మఱుఁగుచొచ్చిరి. వారి నాదరించి యాసాధ్వి యభయ మిచ్చెను. దేవతలు శ్రీహరియు దేవేంద్రుఁడు దానవులఁ జంపవచ్చుట యామె యెఱుంగును. తా నొంటరిగా నుండుటయు

నెఱుంగును. ఇట్టిపట్టున ఇంద్ర శ్రీహరులను దా నాపఁజాలుదునా యని స్వశక్తిపరశక్తుల నాలోచింపఁదగు. బుద్ధివైభవమా మెకు లేకపోలేదు. ఐనను ఆసాధ్వికిఁ దన పాతివ్రత్యశక్తి యెట్టిదుష్కరకార్యములనైనను దనకు సాయపడునన్న నమ్మకము గలదు. కాననే నాతపశ్శక్తివలన మిమ్ము భక్షింతునని పల్కఁజాలెను. అట్లు చేయఁగలదనియు నింద్రుఁడు నమ్మి శ్రీహరిని ద్వారపెట్టెను. ఆజగదీశ్వరుఁడు సర్వజ్ఞుండగుట ముందు కాఁగలకార్యముల నాలోచించి యప్పని నొనరించెను. దాన నిఁక నిట్టికార్యములు చేయఁబూనకుము నిన్ను రక్షింపఁబూని నేనును శ్రమంపడితిని. అని యింద్రునకు బుద్ధిచెప్పిన ట్లయ్యెను. మహర్షుల జోలికింబోయిన శ్రీహరి గతి యిట్లాయె. ఇఁక నాగతి యెట్లగునో యను భీతి యింద్రునకుం గల్గెను. ఇంతకన్న భగవంతుఁడు తాను జేసిచూపఁదగు మహాకార్యము లేవి యుండును ?

ఇంతియగాక మఱికొన్ని నీతులు. ఎంతటివారు కాని విపత్కాలమునఁ దగినరీతిని బ్రవర్తించి దానిని దప్పించుకొనవలయుననుట యొక విశేషాంశము. ఎట్లన, దానవులు నిర్జరులతో హాహాహాకారిగాఁ బోరాడిరి. కాలము విపరీతమగుట నోడిపోయిరి. గురువు నాశ్రయించిరి. ఆయన చెప్పినహితము నాలకించిరి. శత్రువులగు దేవతలకే తగ్గియుండిరి. వారిని వేఁడుకొనిరి. తమకార్యమును దీర్పఁబూనిన గురువురాకను వేచి సమయోచితాచారముల నవలంబించిరి. ప్రాణము లతితుచ్ఛ-

ములు. వానిని గాపాడుకొని మర్యాద పోఁగొట్టుకొనుట పాడిగా దనునీతి రాజనీతికాదని గ్రహించిరి. సమయోచితా చారముల నవలంబించిరి. కావునఁ గాలము తప్పివచ్చినపుడు మొండిపట్టులమాని సమయోచితాచారముల నాశ్రయించి మంచికాలము రాఁగా తమపట్టుదలను దీర్చుకొనవలయునను టయే యిట నీతి. ఇంక నెన్నియో ఈకథనుండి గ్రహింప వచ్చును. మచ్చునకు నించుక వ్రాసితి. తక్కినవానిని మీా రెఱుంగఁగలరు. గ్రంథము పెద్ద దగునన్న భీతి నన్ను బాధించు చున్నయది. కాన వదలితిని. మన్నింతురు గాక.

## ఇంద్రుఁడు తనపుత్రికను శుక్రునొద్దకుఁ బరిచర్యచేయఁ బంపుట.

ప్రకృతగ్రంథమునకు ముఖ్యమనఁదగిన భృగుశాపప్రాప్తి యనఁదగు నీకథ పూర్తియాయె. దీనివెంట శ్రీకృష్ణచరిత్ర మారంభింపఁ దగియుండు. ఐనను మన మీాకథలో శుక్రుని హిమాలయమున నిరంతర తపోనిష్ఠల నున్నవానిని వదలితిమి. ఆయరణ్యమున నట్లు పొగయాహారముగా నున్నవానిని వదలి పెట్టుట న్యాయమా ? యని యించుక యోజించిన న్యాయము కాదనియే తోఁపక పోదు. కాఁబట్టి ప్రకృతకథ కుపయోగింప కున్నను నీతి కుపయోగించునుగాన మరల శుక్రుని రాక్షసు లతోఁ గలిపి వదలుట మంచిది. కాన నీమాత్రము శాఖా చంక్రమణ మొనర్చినందులకు నన్ను మీారు మన్నింతురన్న

నమ్మిక వ్రాయఁబూనితిని. ఆమీఁది కథ నించుక యాల కింపుఁడు.

దేవేంద్రు నావేశించియున్న నిద్ర తొలఁగిపోఁగా దనుజులసంహరించు పని మాని యిల్లుచేరి యింద్రుఁడు కొలువునఁ గూరుచుండి దేవతల రావించి యిట్లు చెప్పెను దనుజులఁజంప మనకు వీలు గలుగ లేదు. ఇంతియగాక మనకు సాయముచేయఁ బూనిన శ్రీహరికి శాపము గల్గెను. ఇంక నసురులఁ జంపు ప్రయత్నము మానవలసిన దే. వారు బలవంతులై మనలఁ బొడిచినప్పటిమాటను జూచికొందము. ప్రకృతము శుక్రుని గూర్చి విశేషముగ భయపడవలసిన పనిగల్గినది. మంత్రబల మున దానవులను గెల్పింప నతఁడు ప్రతినపూని కైలాసమున శంకరు నారాధించుచున్న వాఁడు. ఆవ్రతము చక్కఁగా సాగెను. అమోఘమంత్రములు సిద్ధించును. వానిని దనుజుల కొసంగును. ఆవల మనము వారి నోర్వఁజాలము. కావున నిపుడు శుక్రతపోనియమభంగము చేయుటొప్పు. నా చేయఁ బూను పని యిది యని వారికి రహస్యముగఁ దెల్పి వారి సమ్మతింబడసి మనంబునఁ జక్కఁదలంచి తనపుత్రికయగు జయంతిని రావించి స్మితపూర్వకముగా నిట్లు పలికెను. అమ్మా! దేవతాకార్యము నీవు సాయముచేయ సిద్ధింపవలసిన దొకటి యున్నది. దాని నొనరింపుము. వేగముగా హిమాలయము నకుం బొమ్ము. అందు దప మొనరించు శుక్రాచార్యు నారా ధింపుము. నాకొఱకు శుక్రుని వశపఱచుకొమ్ము. మనఃప్రియ

ములై యనిందితములగు నుపచారముల నాతనిమనసు నీయం దనురాగము గలదానినిగా నొనరింపఁదగు. నాభయము పోవునట్లు చేయుము. నీవు వేగముగాఁబోయి యాయాశ్రమ మున నిల్వుము. జయంతీ! తనయామణీ! యీపనియందు జాగరూకురాలవు గమ్మా. అని పలుక నబ్బాలిక తండ్రియానతి నొఁదలందాల్చి మనోహరాకారము వెలయ వెంటనే పయనమై పోయి హిమాలయమున వెదకి ధూమధ్వజముచే నిది కావ్యు నాశ్రమంబని గుఱుతించి యాశ్రమమునుజొచ్చి యందున్న శుక్రునిఁ దలక్రిందుగా వ్రేలాడువానిం గాంచి తండ్రివాక్య మును స్మరించి యరఁటియాకు నతికోమలముగ నున్నదానిఁ జేకొని విసరెను. స్వచ్ఛమై శీతలమై పావనమై తనరారుజల మును బానముకొఱకు సిద్ధపఱచెను. అందు సువాసనఁ గలుగఁ జేసెను. పరమభక్తిచే నాఋషిచంద్రునకు మధ్యాహ్నకాల మున నాతపము తగులకుండ వస్త్రముచే ఛాయను గల్పిం చెను. తాను ధర్మమును విడనాడక యామునివర్యున కిట్టి యుపచారములు చేయుచుండెను. పరిపక్వమంజులతమ సత్ఫల ముల సేకరించి మునిముందఱ భోజనముచేయ నిడెను. చిలుక రెక్కలంబోలి ప్రాదేశమాత్ర పరిమాణంబుగల పచ్చిదర్భలను దెచ్చియునిచెను. నిత్యకర్మమున కొకయంగమగు దేవతార్చన మునకై పరిశుద్ధపుష్పంబులఁ దెచ్చి యందుఁ బెట్టెను. అభినవ పల్లవంబులఁ దెచ్చి యమ్ముని తల్లజునకు శయనమును గల్పిం చెను. ఆయన యందు శయనింప నించుక హాయిగలిగి నిద్రపట్టఁ

దగినంతగాలిఁ గల్పింపఁబూని విసరెను. మనోవికారములఁ గల్పింపఁదగు హావభావాదుల సుంతయుఁ జేయక తపోవిఘ్నము గలుగకుండ న్యాయమగురీతి నుపచరించెను. ప్రియజనకములై మనోహరములై యర్థము లగుస్తుతుల నామునివరు నలరించెను. నిద్ర లేవఁగా నాచమనము చేయ నుదకమును సిద్ధపఱచెను

ఇంద్రుండును గూఢచారులం బంపి యందలివార్తల వినుచు నానందించుచుండెను. తనపుత్రిక చమత్కృతికి మెచ్చుచుండెను. ఇట్లాజయంతి బహువత్సరములు పరిచర్యా పరాయణురాలై యుండెను. శుక్రుని తపస్సున వేయిసంవత్సరములు నిండెను. సదా శివుఁడు ప్రత్యక్ష మయ్యెను. ఇష్టానుసారము వరము లడుగుమా? ఇచ్చెద. మది మెచ్చితి. ఓ సచ్చరితా! నీతప మనన్యసాధ్యమైనది. అని మఱియు నిట్లనియె. నీ వేమికోరుదువో దానినెల్ల నిచ్చెద. అందఱను దిరస్కరింపఁజాలు తేజస్సు నీ కలరును. సర్వభూతముల కవధ్యుఁడ వగుదువుగాక! అని యంతర్హితుఁ డయ్యెను.

శుక్రుం డిట్లు సిద్ధతపస్వియై జయంతిం గాంచి 'బాలామణీ! నీ వెవ్వనికూఁతురవు? ఎందుండుదానవు? ఏల వచ్చితివి? నన్నాశ్రయించెద వేల ? నీమనోరథమును దెల్పుమా' యని ప్రశ్నించుచు నీయుపచారమున సుప్రీతుఁడ నైతిని. వరము గోరు మిచ్చెదను. అనిన జయంతి ముదితయై యమ్మునితో మహాత్మా! నామనోరథ మెద్దియో మీరు తపోబలంబున నెఱుంగఁదగుదురు. అని యవనతవదనయై యూరకుండెను.

శుక్రుం డిట్లు పలికెను. సుశ్రోణీ! తపోబలంబున నీవాంఛ నెఱిం గితి. ఐన నీవు చెప్పుము. నీసేవచే నధిక ప్రీతి జనించెను. సంశ యింపక చెప్పుమా యని మృదుతమవచనముల నడిగెను.

జయంతి వాఙ్నైపుణ్యము గలది. సమయోచితజ్ఞానము గలవారిలో మిన్నయన్న యెన్నికం గాంచునది. కావున వినయమలర నిట్లు బదులుచెప్పెను. మహాత్మా! నే నింద్రపుత్రి కను. తండ్రియాజ్ఞచే మిమ్ము సేవింపవచ్చితిని నన్ను జయంతి యని పిలుతురు. జయంతునకుఁ జెలియలను. విభూ! నీపై సకామనైతిని. నా వాంఛితమును దీర్పుమా! ధర్మపద్ధతి నిన్నుంగూడి విహరింపఁ గోరుదాన. అని పలికి తలవంచి యూర కుండెను. శుక్రుం డమ్మాటల కలరి యిట్లనియె. ఓ కాంతామణీ! సర్వభూతములకుఁ గనఁబడకుండఁ బదిసంవత్సరములు స్వే చ్ఛగా ననుంగూడి విహరింపుము. అంత సంతృప్తినొంద వలయు. అనిపలికి యందులకామె సమ్మతింప గృహంబునకుంజని జయంతిని బాణిగ్రహణము చేసికొని యామెంగూడి నియ మమురీతి సర్వభూతాదృశ్యుండై విహరించుచుండెను. తపో బలమున నమ్ముని కల్పించిన మాయ యెట్టివారేని వారిని గనుఁగొనరాకుండఁ జేసెను.

దానవులు శుక్రాగమనము నెఱింగి మంత్రములఁ గొని వచ్చెఁగదా యన్నసంతసమున గురువును దర్శింపవచ్చిరి. కాని గృహమున శుక్రుఁడు కానరాఁ డయ్యెను. జయంతింగూడి వాగ్దానమునుజెల్లింప విహరించుచున్న వాఁడని యెఱుంగక పోయిరి. కనఁబడమికిం జింతిల్లి భగ్నోత్సాహులై చింతాప

రాయణులై దీనులై వచ్చినమార్గమున నిండ్లకేగిరి. అంత వారికిఁ బెనుచింతయు భీతియుఁ దోఁచెను.

ఇంద్రుఁ డావిధ మెఱింగి జయంతీసంయుతుఁడై శుక్రుఁ డుండు టెఱుంగుం గాన నవ్వార్త నెఱింగించి యిపుడు మన మేమి చేయవలయునో చెప్పుమని వేఁడెను. అంతియగాక దానవులకడకుంబోయి వారిని మోసపుచ్చుము. బుద్ధిబల మెల్లఁ గనఁబడ మాకు సాయ మొనరింపుమా యని ప్రతిమాలెను. బృహస్పతియు నందుల కీయకొని శుక్రుఁడు పదిసంవత్సరములు కనఁబడఁడని యెఱింగి శుక్రునిరూపమును జేకొని దానవులకడకుం బోయెను. అతిప్రేమముతో దానవులఁ బిలిచి బహూకరించెను. వారెల్ల సంతసంబున నరుదెంచి ప్రత్యక్షముగ శుక్రుం గాంచిరి. శుక్రుఁడే యని తలంచిరిగాని మోసమని గ్రహింపఁజాలక పోయిరి. కావ్యరూపుండగు గురువు వారంజూచి నాయాశ్రితులగు దానవులకు మేలుగలుగుంగాక! నేను మీకు హితమొనరింప వచ్చితిని. నాతపమునకు సంతోషించి శంకరుఁడు మీకు శుభముగలుగుటకై మంత్రముల ననుగ్రహించెను. నావిని దానవులు ప్రమోదపారావార నిమగ్నమానసులై సిద్ధతపస్సుఁ గలిగి శుక్రుండు వచ్చెనని నమ్మిరి. కాని మోస మెఱుంగఁజాలరైరి. పలుసారులు నమస్కరించిరి. గతవ్యధులైరి. దేవతల వలనఁ గలుగఁబోవు భయమును వదలిరి. సుఖముగా నుండిరి.

నీతి నెఱుంగఁగోరు బుద్ధిమంతులారా! ఈకథనుండి మనము గ్రహింపఁదగినవియు, గ్రహించి యనుష్ఠానమునకుం

దెచ్చుకొనఁదగినవియు నగు విషయములఁ బరికింపుఁడు. లోక మున మనుజులకందఱకు నాచరింపఁ దగినధర్మము లొకరీతి నుండవు. కొన్ని కులముఁబట్టియుఁ, గొన్ని యధికారమును బట్టియుఁ, గొన్ని కాలమునుబట్టియు నుండు నను విధ మీకథ బోధించుచున్నయది. సామాన్య మానవధర్మములకు రాజధర్మ ములకు భేద మెక్కుడగఁ బొడకట్టుచుండును. రాజధర్మము లకు మనుష్య సాధారణధర్మములకు వాసి మిక్కిలి కలదు. ఆ రాజధర్మములు కూడ సమయోచితముగ నుండును. ఒక్కొ క్కజాతికుఁడు ధర్మములు నాపత్కాలమున మాఱుచుండును. అధికారమునుబట్టి కొన్నిధర్మములు విశేషించి భేదముగలవిగ నుండును.

ప్రకృతము నిర్జరనాథుఁ డాచరింపఁదగిన వాపద్ధర్మ ములు. శుక్రుఁడు చేయఁబూనినకార్యము దేవతానాశన హే తువు. కాఁబట్టి యింద్రుఁ డిప్పట్టున మెలఁకువగలిగి మెలంగెను. జయంతి యనుకొమరితం బిలిచి న్యాయమార్గంబున శుక్రు నా రాధింపుమా యని బోధించి పంపెను. ఆమె నియమము వదల కుండ శుక్రు నారాధించి తత్కృపాపాత్రభూతురా లయ్యెను. ఆయన ప్రశ్నించునపుడు సత్యమువచించెను మునియు మిగుల హర్షించి యామెకోరికను దీర్తు ననెను. అదియుఁ బదిసంవత్స రములే యని గడువుపెట్టెను. ఆవిధ మెఱింగి యింద్రుఁడు దాన వులకు శుక్రునకు విభేదముగల్పింప బృహస్పతి నియోగించెను. బృహస్పతియు శుక్రవేషంబున నసురుల మోసపుచ్చెను.

దీనిచేత రాజు సమయోచితముగా సామదానభేద దండము లను నుపాయముల నుపయోగింపవలయుననియు, పౌరుషమునుగాని, శాంతమునుగాని సర్వదా ఆశ్రయింప రాదనియుఁ దేలును. గురువు శిష్యోద్ధారణపటిష్ఠుఁడై శిష్యుని కార్యము స్వకార్యమునకంటె నెక్కుడ యని భావించి యొన రింపవలయుననియు గ్రహింపఁదగినవి. జయంతి బాలికయయ్యు ధర్మవిరుద్ధము కానివృత్తి నవలంబించి పితృనానతి నొనరించి స్వేష్టమును దీర్చుకొని కృతకృత్యురా లయ్యెను. అనుటచే జననీజనకుల కష్టముల కోపినంత న్యాయసమ్మత సాహాయ్యము చేయుట పుత్రికా పుత్రులకు ధర్మమని తెలియఁ దగియున్న యది. కాఁబట్టి జాతిధర్మములును గాలోచితముగా న్యాయముతప్పక మార్పునొందును. స్మృతికర్తలుకూడ నాల్గు యుగములయందును ధర్మములకు మార్పును గల్గించిరి. వానిం బాటించి యందు నాపద్ధర్మము లివి యని యెఱింగి వాని నితరకాలమునం దాచరింపక కాలానుసార మాచరించుచుండిన నిహపరసుఖములు గలుగుచుండును. కాన వాని మానక చేయుటయే మానవులకుఁజాల మేలు. ఇఁకఁ గథవిన మర లుఁడు.

కృష్ణావతారహేతువులు చాల వింటిరి. శ్రీహరి తన కంటె ముందుఁ బుట్టఁదగినవారిని గొందఱం జేర్కొనెననియు నాలకించితిరి. ఇఁకఁ గృష్ణునకుఁ బ్రతిపక్షులుగాఁ గొందఱు పుట్టినఁగాని యవతారఫలము గలుగనేరదు. ఆవిషయము

కొంచెముగా నాలకింపుడు. ముందుముం దాయావతారముల నట్టి ఘట్టములనే వినఁగలరు.

## * దేవకీపుత్త్రు లార్గు రెవ్వరు ?

అనువది ముందు వినఁదగినది. ఈగాథయే ముందు వే ఱొకపురాణమునుండి వ్రాయునపు డించుక భేద మగపడు నేమో. అది పురాణభేదములవలనఁ గలిగిన భేదమనియే గ్రహింపుఁడు. అన్నికథలయందు నిట్లే గ్రహింపఁదగియుండు. ఎందేని ఒక్కగాథయే వేఱురీతిగా వ్రాయఁబడినపుడు వాని యం దేది సత్యమని ప్రశ్నింపరాదు. గ్రంథభేదముచేఁ గథ యించుక మాఱ్పునొందుట నైజము. కాని యందలిసార మొక్కటియే గదా యని సరిపెట్టుకొనుట యాస్తికులకు ధర్మము. స్వల్పవిషయములను గమనించి తన్నీతిని మఱచుట సమంజసముగాదు.

పూర్వము స్వాయంభువను మనువు ధర్మప్రవక్తయై యుండుతఱి మరీచిమహర్షికి నార్గురు కొడుకులు గలిగిరి. ఆము నిభార్య ఊర్ణాదేవి. ఆదంపతు లీకొడుకుల బలశాలుర నార్గురిని జూచి కరము హర్షించిరి. వారిహర్షము సార్థకమగునట్లు పుత్త్రులు ధర్మవిచక్షణులు కూడ నైరి. ఎవ్వరికేని కర్మమును దాఁట శక్యముకాకుండుదానిని మీఱ బ్రహ్మాదులు వలంతులుగా రన

---

* ఈకథ దేవీభాగవతము నాల్గవస్కంధము ఇరువదిరెండవ యధ్యాయమునుండి గ్రహింపఁ బడినది.

నిఁక వీరిమాట యిట నేటికి? ఆకుమారు లార్గురు బ్రహ్మదేవుని జూచి యతఁడు పుత్త్రి కాగామియను నాశయమునఁ బరిహాసించిరి. నిష్కారణపరిహాస మవమానము చేయఁబూనుటయే యను విశ్వాసమున బ్రహ్మ వారిని రాక్షసయోనిం బుట్టుఁడని శపించెను. బ్రహ్మశాపమును దప్పించుకొన శక్యమగునా ? వారాశాపఫలముగాఁ గాలనేమి యనుదైత్యునకుం బుత్త్రులై బుట్టిరి. రెండవపుట్టుకయందు హిరణ్యకశిపునకుం పుత్త్రులైరి పూర్వశాపభయమువలన నీపుట్టుకయం దాతనయు లార్గురు జ్ఞానసంపన్నులైరి. మఱియు శాంతులు దాంతులునై తపస్సు చేసిరి. ఆతపస్సువలన సుప్రీతుండై చతురాననుండు ప్రత్యక్షుండై వారి కిట్లనియె. పుత్త్రకులారా! పూర్వజన్మమున మీయందుఁ గోపము గలుగ మిమ్ము శపించితిని. ఇపుడు మీరొనరించు తపస్సున సంతుష్టుఁడ నైతిని. కాన వరమిచ్చెద వేఁడుఁడనియెను. ఆమాటలు విని వారత్యంతసంతోషమునఁ బొదలి కార్యతత్పరులు గాన నిట్లు ప్రార్థించిరి. మహాత్మా! పితామహా! మాయందుఁ బరమానుగ్రహము మీకుం గలుగుట మా భాగ్యమే. కాన వరమడుగుచున్నారము. దేవదానవగంధర్వసిద్ధమహోరగముల చేతను మానవుల చేతను మాకవధ్యత్వము గలుగ ననుగ్రహింపుము. అన విని బ్రహ్మ ముదమంది మీరు కోరినట్లయగు. సంశయము లేదు. అని యంతర్హితుం డయ్యె.

ఆవిషయము నెట్లో హిరణ్యకశిపుం డెఱింగి క్రుద్ధుండై కొడుకులం జీరి మీరు జనకుండ నగు నన్ను వదలి బ్రహ్మ

ను దపమున నలరించితిరి. వరములఁ గైకొంటిరి. బలవంతు లరై గర్వించితిరి. నాయం దుండఁదగు స్నేహము దూరమగు నట్లు మీచేఁ జేయఁబడియె. కాన మిమ్ముఁ ద్యజించెద. మీరు వేవేగ పాతాళమునకుం బొండు. అందు నిద్రావిష్టులై బహు సంవత్సరము లుండుఁడు. ఆవల దేవకీగర్భమునఁ బ్రతివత్స రము పుట్టువును గాంచుఁడు. మీతండ్రియగు కాలనేమియే యట కంసుఁడుగాఁ బుట్టఁగలఁడు. ఆతఁడు మిమ్ముఁ బుట్టఁగనే వధింపఁగలఁడు. అని శపించెను. ఆశాపమునఁ బుట్టినవారినే కంసుఁడు చంపినట్లు ముందు మీరు చదువఁగలరు. ఇఁక భూ భారమును హరింప నవతరింపఁ బూను శ్రీకృష్ణపరమాత్మకుఁ దోడుపడ నవతరించినవారి నెఱుంగఁ దగు. మున్ను కొందఱ నెఱిఁగితిరి. ఇంకను గొందఱ వినుండు.

## దేవతలు స్వాంశములచే భూలోకమున నవతరించుట.

వసుదేవుఁడు కశ్యపాంశసంభూతుఁ డనియు, బలరా ముఁడు శేషాంశసంభవుఁ డనియు, శ్రీహరి కృష్ణరూపమున నవతరించెననియు ముందే వివరింపఁబడియెఁ గదా. ఇతరు లెవ్వ రెవ్వ రేయే దేవతాంశములవలనఁ బుట్టిరో వినఁగోరెద నని జనమేజయుఁడు ప్రశ్నింప వ్యాసమహర్షి యిట్లనియె.

జనమేజయా! భూభారహరణార్థ మెవ్వరెవ్వరు దేవ దానవాంశములనుండి పుట్టిరో వారిం దెల్పెద. సావధాన

ముగా వినుము. ఈక్రిందఁ బేర్కొనఁబడువా రందఱు దేవ దానవాంశసంభూతులని యెఱుంగుము. వసుదేవుఁడు కశ్యపుఁడు. దేవకియే అదితి. అనంతుఁడు. బలదేవుఁడు. శ్రీమన్నారాయణుఁడు. శ్రీకృష్ణమూర్తి వాసుదేవుఁడనియు వ్యవహరింపఁబడు. ఆనారాయణు ననుజుఁడు నరుఁడను మునిఁగలఁడు. ఆతఁడే యర్జునుం డయ్యె. ధర్ముఁడు యుధిష్ఠిరుఁడు. వాయుపు భీముఁడు. అశ్వినీదేవతలే మాద్రీపుత్రులగు నకులసహదేవులనువారు. సూర్యుఁడు కర్ణుఁడు ధర్మునంశభవుఁడే విదురుఁడునగు. బృహస్పతి ద్రోణుఁడు. తత్పుత్త్రుండగు నశ్వత్థామ శివాంశసంజనితుఁడు. సముద్రుఁడు శంతనుఁడు. కావుననే గంగాదేవి యాశంతనునకు భార్య యయ్యెను. గంధర్వరాజు దేవకుఁడనఁబుట్టెను. వసువు భీష్ముఁడు. మరుద్గణము విరాటుఁడు. అరిష్టుండను వాని సుతుఁడగు హంసుఁడే ధృతరాష్ట్రుఁడు. * మరుద్గణము కృపాచార్యుఁడు. కృతవర్మయు మరుద్గణసంభూతుఁడే యగు. కలి దుర్యోధనుఁడు. ద్వాపరము శకునియగు. సోము పుత్త్రుఁడగు సువర్చుఁడు సోమదత్తుఁడు. పావకాంశము దృష్టద్యుమ్నుఁడు. రాక్షసుఁడు శిఖండి. సనత్కుమారాంశభవుఁడు ప్రద్యుమ్నుఁడు. వరుణుఁడు, ద్రుపదుఁడు రమాంశసంజనిత

---

* 'విరాటస్తు మరుద్గణ' ఇతి స్మృతః. అనియు, 'మరుద్గణః కృపః ప్రోక్తః' అనియు మూలమున నున్నది. సప్తమరుద్గణములు గలవని ప్రమాణములు కలవు గాన నిట శంకనొందఁ బనిలేదు. ఇంటే 'కృతవర్మా తథాపరః' అనియున్నది. కృతవర్మయు మరుద్గణాంశసంభూతుఁ డనియే యర్థము.

ద్రౌపది. ఆ ద్రౌపదీ పుత్రపంచకము విశ్వేదేవాంశభవులు. సిద్ధి కుంతీదేవి. ధృతి మాద్రి. మతి గాంధారి. దేవవారాంగనలు కృష్ణపత్న్ను లగుటకుం బుట్టిరి. ఇంద్రప్రోత్సాహితులై యసురులు పెక్కురాజులుగాఁ బుట్టిరి. హిరణ్యకశిపుని యంశమే శిశుపాలుఁడు. విప్రచిత్తి జరాసంధుఁడు. ప్రహ్లాదుఁడు శల్యుఁడు. కాలనేమి కంసుఁడు. హయశిరుఁడు కేశి. బలిపుత్రుఁడగు నరిష్టనేమి వృషభాసురుఁడు. అనుహ్లాదుఁడు ధృష్టకేతువు. బాష్కలుఁడు భగదత్తుఁడు. లంబాసురుఁడు ప్రలంబుఁడు. ఖరుఁడు ధేనుకాసురుఁడు. వారాహ కిశోరు లను పేరుగల్గి బలవంతులయి పరమభయంకరులు నగుదానవులు చాణూరముష్టికు లనఁబడు మల్లులుగాఁ బుట్టిరి. దితిపుత్రుఁడగు నరిష్టుఁడే కువలయగజము దీనికే కువలయాపీడమను నామాంతరము గలదు బలిపుత్రి బకి యనునది. దాని తమ్ముఁడే బకాసురుఁడు. *యమ రుద్ర కామక్రోధాంశభవుఁడే ద్రోణపుత్రుఁడు. ఈతఁడు మహాబలశాలి.

శ్రీకృష్ణావతారమునకుఁ బూర్వమే దైతేయులు రాక్షసులు, నిర్జరులు భూభారావతారణార్థము భగవంతునకు శత్రుమిత్రరూపముల సాయముచేయఁ బుట్టిరి. వీరందఱును జగదు

---

* యమో రుద్ర స్తథా కామః క్రోధశ్చైవ చతుర్థకః, తేషామంశైస్తు సంజాతో ద్రోణపుత్రో మహాబలః. అని మూ. ఈయధ్యాయమందే 38 శ్లోకమందు 'ద్రోణో బృహస్పతే రంశ స్తత్సుతస్తు శివాంశజః' అని చెప్పఁబడినదని పాఠకు లూహింతురుగాక.

పకారము చేయుటయే ప్రధానకృత్యముగా నవతరించిరి. వీరంద అవతరించినపిదప శ్రీకృష్ణుఁ డవతరింపఁ బూనెను. రాక్ష. సులు మహోపకారము చేయువారు కారు. దేవత లుపకారము చేయువారు కారు. వీరు రెండుపక్షములుగాఁ జేరి యన్యోన్య కలహములఁ గల్పించుకొనఁగాఁ దక్కుంగల వారెల్ల వీరికిఁ దోడ్పడఁగా భూభారము తగ్గఁగల మహాహావము పొసంగు. దానఁ బ్రజాక్షయ మగును. అందుచే భూభారము తగ్గును. భగవదవతార ఫలమనునది భూమికిం గలుగు. పాపాత్ములు గూడ యుద్ధమరణంబునఁ బుణ్యలోకంబున కరుగుదురు. భూభారమును దగ్గించి ధర్మంబు నెలకొల్పి భగవంతుఁడు స్వస్థానమునకు వేంచేయు. ప్రతియవతారమున నిదేపద్ధతి సాగును. శ్రీ.కృష్ణావతారమునమాత్రము సర్వావతారసాధారణ పద్ధతియేగాక భగవల్లీలల నగపఱచుటయు, జనులకుఁ దత్త్వము, లోకధర్మములు లోనగువాని నుపదేశించుటయు ననునివి క్రొత్తపద్ధతులు. ఈ యవతారమందే యీ యుపదేశ పద్ధతి. కాఁబట్టియే యీ యవతారమునుగుఱించి ముఖ్యముగా దెలిసికొనవలయును.

మహాశయులారా ! కృష్ణావతారమునకు ముం దవత రించిన వారిపేరులు కొన్ని యిందు వ్రాయఁబడినవి. వీరిలోఁ గొందఱచరిత్రములు ముఖ్యముగాఁ దెలియఁ దగియుండును. అవి తెలిసికొనినఁగాని తత్కృత్యములు సమంజసములే యని

తోఁపవు. ఆమూలముగాఁ దెలిసికొనిననే భక్తియుఁ గుదురును. కాఁబట్టి భగవత్కథలఁ జక్కఁగాఁ బఠించిపఠించిన వానిని మనసునఁ బదిలపఱచుకొనవలయును. లేనిపోనిశంకలఁ గల్పించుకొనక శ్రద్ధాభక్తులు వెలయఁ దదర్థమును జింతింపవలయు. తదనుసారముగాఁ బ్రవర్తింపవలయు. ఇట్లొనరించువాఁడే భగత్కృపకుఁ బాత్రుఁ డగు. భగవత్కృపాపాత్రుఁ డగువాఁడే ముక్తిపదమున కేగును. కాఁబట్టి కుమార్గములఁ బరికింపక సాధుసమ్మతమార్గమునఁ బ్రవర్తింపవలయుననుటయే సారము. ఇఁక భగవదవతారమునకు సంబంధించిన భాగములఁ బఠింపవలసియుండును. చిత్తశుద్ధిగలిగి దేవతావిషయమున వైషమ్యములను బాటింపక, దూరదృష్టి గలిగి కుమతులు కొందఱు స్వార్థపరులై చేయు దుష్టోపదేశములకుఁ జెవిరంధ్రములఁ జోటీయకయే దేవత నుపాసించిన నిష్కలంకభక్తికుదిరెనేని ఫలముతప్పక కల్గుననియు, సర్వదేవతారూపుఁడు భగవంతుఁ డొక్కఁడే యనియు, నమ్మహానుభావుని రూపభేదములే దేవతలనియు నందేరూపమును భజించినను భగవంతుఁడు తృప్తుఁ డగుననియు నిశ్చయము గలిగి శ్రీపరాత్పరుని శ్రీహరిని వాసుదేవుని శ్రీకృష్ణపరమాత్మను భజింపుఁడు. పూజింపుఁడు. ధ్యానింపుఁడు. తలంపుఁడు. ఇదియే సకల వేదసారము ఇదియే సకలస్మృతిసారము. ఇదియే సకల పురాణసారము. ఇదియే సకలసజ్జనగ్రాహ్యధర్మసారము. సత్యము. సత్యము. సత్యము.

*ఇంకఁ గథ ప్రక్కకు మరలుదము. శ్రీకృష్ణునకు ముందే భూభారహరణార్థ మవతరించిన మఱికొందఱివిషయము తెలిపినఁగాని పైగ్రంథము చక్కఁగా బోధపడదు. కాఁబట్టి యిట వ్రాయుచున్నాను. శంతను ప్రభృతులచరిత్ర మిటఁ జేర్చుట గ్రంథమును బెంచుటకుఁగాదు. ఆచరిత్రము చాల ముఖ్యమని తెలుపుటకే. దేవదానవులు భూభారమును హరించుటకే యవతరించి రెండుపక్షములుగాఁజేరి కలహములఁ గల్పించుకొని యుద్ధ మొనరించి భూభారమును హరించి తమతమనివాసములకుం బోదురు. భగవంతుఁడు తానాకార్యమునకుఁ బ్రభువై చూచుచుండును. తమతమకర్మానుసారము జీవులు కృత్యముల నొనరింపఁ బ్రభువగు పరమాత్మ సాక్షిమాత్రుఁడై సర్వముం జూచుచు నానందించుచుఁ దాను నందుఁ బ్రవర్తించినట్లు నటించుచుఁ గొన్నియెడల సంతోషించుచుఁ గొన్నియెడల దుఃఖించుచుఁ దనమాయ యెవరేఁ గనుఁగొనఁజాలకుండఁ జేయుచుండు. కార్యాంతమున నిది భగవత్కృతమని యందఱెఱుంగుదురు. కాని యంతకుముం దెఱుంగఁజాలరు. కావునఁ బ్రకృతకృష్ణావతారమునకుఁ గారణమగు భూభారమును హరింపఁ గారణభూతులుగ జన్మించినవారి చరిత్ర మించుక యిట వ్రాయుట కృత్యమేగాని వేఱుగాదు.

---

* ఈభాగము హరివంశమున హరివంశపర్వమున నేఁబదిమూఁడవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

## శంతనువుజన్మము.

భూదేవి బ్రహ్మకడకుం బోయి దుష్టమానవులభారము దుస్సహామని తెలుపఁగా దేవతలు వా రొనరింపఁదగిన కార్యమును గానక బ్రహ్మకడకు భూదేవిని బిలుచుకొనిపోయిరి. తమవచ్చినకార్య మాపరమేష్ఠి సముఖమున నిట్లు విన్నవించిరి.

పితామహా! ఈభూదేవి విచారము తొలుదొలుతఁ బరికింపఁదగినది. ఈమె చింతమాన్పక తప్పదు. ఈదేవి దుర్భరచింతానిమగ్నయగుటఁ జూచుట మిన్నకుండ రాదు. న్యాయముకాదు. ఈదేవి కాధారము నీవేకదా. ఈమె కననేల సృష్టికర్తవు గాన నెల్లర కాధారభూతుఁడవు నీవే. లోకకర్తవు, పాలకుఁడవు నీవే యమాట నీతోఁ జెప్పుకొనక మఱెవరితో మొఱపెట్టుకొనును. అతిదీనయై మమ్ముద్ధారకులని భావించి మాచెంత కరుదెంచెను. మేమో మీప్రాపున బ్రదుకువారము. ఆమెకోరిక నెఱవేర్పఁజాలము. ఈకార్యము మావంటివారివలనఁ గాఁదగినది కాదు. కాన మీచెంత కరుదెంచితిమి. ఇదిగో భూదేవి. మ్రోల దుఃఖసాగరనిమగ్నచిత్తయై యున్నది. చూడుము. కనికరింపుము. మహాత్మా! ఊరకుండుట న్యాయమా! ఆలస్యము చేయఁదగుకార్య మిది కాదు. త్వరపడినఁగాని భూదేవి వగపుతీఱదు. ఈమహాకార్యమున నేయేకృత్యము లెవరెవ రొనర్పఁదగినవి కలవో తెల్పుము. ఇంద్రుఁడు, యమవరుణకుబేరులు, శ్రీమన్నారాయణమూర్తి, చంద్రసూర్యాగ్నులు, ఆదిత్యవసురుద్రాశ్విసాధ్యులు, బృహ

స్తుతి, శుక్రుఁడు, కాలము, కలి, మహేశ్వరుఁడు, కుమార స్వామి, యక్షరాక్షసగంధర్వచారణులు, సర్పములు, పక్షులు, పర్వతములు, సాగరములు, గంగాప్రముఖదివ్యతరంగిణులు, సరిద్వరములు చేయఁదగిన కార్యము లున్న నాజ్ఞాపింపుము. తమతమకార్యముల నెఱవేర్తురు. ఎవ్వరెవ్వ రేయేకార్యము లొనరించినఁగాని యీమహాభారము నశింపదో యాయా కార్యము లొనరింప వారివారి నాజ్ఞాపింపుము. తప్పక యొన రింతురు. మేమందఱము పృథివియందుఁ బార్థివరూపములఁ గొనవలయునేని భవదాజ్ఞశిరములంబూని యట్లే యొనరిం తుము. అంశావతరణ మిట్లుండవలె నని యాదేశింపుము. శిర సావహింతుము. అంతరిక్షమున భూమిని, సదస్సున, రాజకుల ముల, నిలిచి యొనరింపఁదగు కార్యములున్న నయోనిజరూప ములఁ దాల్చి యొనరింతుము. భగవంతా! కరుణాసింధూ! మామొఱ్ఱ లాలకింపఁ దగు నని వేఁడిరి.

బ్రహ్మయు నేకవాక్యముగా దేవతలెల్ల విన్నవింప నాల కించి చక్కఁగా యోజించి 'దేవతలారా! మీవాక్యముల వింటిని. నాకును నిట్లే తోఁచినది. ఇఁక నీకార్యము వేవేగ చేయఁదగినదియే. తొలుదొలుత మీమీయంశములనుండి యప్రధృష్యతేజస్కుల భూతలంబుల సృజింపుఁడు. మీ రందఱు వదలక మానవులఁ బుట్టఁజేయుఁడు. భూదేవి త్రిలోక ముల కాధార భూతురా లనుమాట మఱువకుఁడు. ఈమె బాగుండిననే మీయునికి స్వర్గమున నిలుచు. లేకున్న సర్వ లయమగు.

ముం దిట్టి గతి భూదేవికిఁ బుట్టుననియే యెఱింగి నే నొనరించిన కార్యమును వినుండు. ఒకానొకకాలంబున నేను నా ప్రియపుత్త్రుఁడగు కశ్యపమునింగూడి సముద్రపశ్చిమతీరంబున నిచ్ఛమెయి నుంటిని. కశ్యపమునియు నెన్నోవిధములఁ బ్రాచీనకథలఁ జెప్పుమని ప్రశ్నించెను. లోకోపకారములగునవి వేదోక్తములు నగు గాథలం జెప్పుచునుంటిని. మఱియుఁ బురాణోక్తగాథలను వివరించుచుంటిని నాతనయుఁ డత్యాదరమున నాలకించుచుండెను. ఇట్లుండఁగా సాగరుఁడు గంగాదేవిం గూడి మాయున్న చక్కటికివచ్చెను. ఆతనివెంట తరంగ శీకరాప్లుత వాయువు వచ్చెను. ఆ సముద్రము గతి కల్లోల మాలికావిషమమై, జలజంతు సంతానవిచిత్రమై యుండెను. సాగరుఁడు తోయవాసస్సంవృతుఁడగుచు, శంఖ ముక్తామలదేహుండై, ప్రవాళద్రుమభూషణుండై, శీతాంశూదయసంభ్రాంతసలిలగంభీరనిస్వనుండై వచ్చెను. ఇంచుక నేపటికి మేముండిన తీరము జలాక్రాంతమయ్యెను. లావణాంబువులు మాస్థలము నావరించుకొన మేమించుక వెనుకకు సాగవలసివచ్చెను. ఆచోటునుగూడ సాగరుఁ డావరింపఁ దలంచెను. ఆవిధ మెఱింగి నేనాతనిం గాంచి సాగరుఁడా! "శాంతుఁడ వగుదువుగాక" యంటిని. నా నోటనుండి శాంతుఁడ వగుదువుగాక యను నక్షరములు వెడలిన తోడనే సాగరుఁడు తనుత్వము నొందెను. సంహీతతరంగుఁడై రాజశ్రీవిరాజితుఁడై చెలువారెను. భావికార్య మూహించి మరల నిట్లు శపించితిని. సముద్రుఁడా! ఏకారణమున నీవిపుడు

గంగాదేవింగూడి రాజశ్రీసమన్వితుండవై కనంబడితివో ఆకారణమున నీవు భూలోకమున రాజవై పుట్టుము. అందును స్వతేజమున సహజలీలాసమన్వితుండవై మనుజేంద్రుండవై భారతకులోద్వహుండ వగుము. * తొలుత శాంతుండవగుదు వని నానోట మాటవెడలంగనే తనుత్వమునొందితివి గాన భూలోకమున శంతనునామమున వ్యవహరింపంబడుచుం బ్రజలం బాలింపంగలవు. సర్వాంగశోభనయయి పరమకల్యాణియై యసితాపాంగియగుచు నలరారు నీగంగాదేవియు మానుషరూపధారిణియయి నిన్ను సేవింపంగలదు. అని యూరకుంటిని.

ఈనామాటలు విని కలవిలపాటొంది మోము వెలవెలం బాఱ సముద్రుం డిట్లు పల్కెను. ఓప్రభూ! పంకజాసనా! నీవు దేవాదిదేవుండవయ్యు నన్నేల యిట్లహేతువుగ శపించితివి? నేను నీకు లోంబడి ప్రవర్తించువాండను గదా. నీచే నిర్మింపంబడి నీయందే బద్ధానురాగుండనై యుండువాండను. శపింపందగని నన్నుం గ్రూరవాక్కుల నేల శపించితి? దేవా! నీదయచేం బర్వముల వర్ధిల్లుదు. నీయాజ్ఞ శిరసావహించి నేండు పర్వకాలమగుట వృద్ధినొందితిని. ఇది నాదోషమా! సంతోషమునం దరంగశీకరంబుల నిన్నంటితిని. దీనికై శాపమిచ్చుట న్యాయమా? నా యుప్పొంగుటకు మూండు కారణములు. ప్రబలవాతములు, ప్రవృద్ధవలాహకములు, పార్వణచంద్రుండు

* శాంతో స్మీతి మయోక్తస్త్వం యచ్చాసి తనుతాంగతః, సుతనుర్యశసా లోకే శంతనుస్త్వం భవిష్యసి—అని మూ.

హరివంశే. ౫౩ అ. ౨౬ శ్లో.

నను నివియే యీ మూఁడు హేతువులు. నే వృద్ధినొందుట యపరాధమేని ఆకారణములు కల్పించినది మీరు గాన నా యపరాధము మిమ్మే స్పృశించును. మహానుభావా! క్షమింపఁ దగువాఁడను. శాపమును మరలింతురుగాక. దిక్కులేని నన్నుఁ గరుణించుట న్యాయము. శాపానలమున దహింపఁబడకుండ నన్నుద్ధరింపుము. నీప్రమాణము ననుసరించిన నన్నేల శపింప వలయునో తెలియఁజాలకున్నాఁడ. ఈదేవగంగ నన్నుఁ గూడి వచ్చినది. భూలోకమునకుఁ బొమ్మనుట న్యాయముకాదు. నా దోషమున నీమె కిట్టిశాపము కలిగినది. కాన నను గ్రహింపుము. అని పలుభంగుల నన్నుఁ బ్రార్థించెను.

ఇట్లు దీనుఁడై కంపితాంగుఁడై తన్నుంబోలి వణఁకుచున్న గంగతో నన్నుఁబ్రార్థించు సాగరుంగాంచి యిట్లంటిని. పుణ్యాత్మా!ఆకస్మికశాపశ్రవణసంజనితవిషాదానలంబునంబొగులకుము. శాంతి నొందుము. భయపడనేల? మహోదధీ! ప్రసన్నుఁడనైతిని. ఈశాపమునకుఁ బెద్దకారణము గలదు. నీవీ సాగర తనువును వదలి భారతభూమికిం జని స్వీయతేజమున భారత వంశమునఁ బుట్టువుం గాంచుము. అందు రాజ్యలక్ష్మీసమన్వితుఁడవై ప్రజలఁ బాలింపుము. పరమానంద మట నీకుఁ గల్గెడు. ఈ గంగాదేవియు నత్యుత్తమరూపధారిణియై నీమనసును రంజిల్లఁజేయుచు నీకుఁ బరిచర్య చేయుఁగాక. నాయానతి నీసుందరింగూడి మోదమానుండవై నాయాజ్ఞ చే నర్థిల్లుము. ఈసలిల సంక్లేదమును మఱచియుండఁగలవు. సంతోషమున నాయీ

యానతి నిర్వర్తింపుము. * ప్రాజాపత్యవిధిచే గంగను వివాహము చేసికొనుము. వసువులు శాపవశంబున స్వర్గభ్రష్టులైరి. రసాతలమును బ్రవేశించిరి. వారిజన్మమునకై నీవి ట్లాజ్ఞాపింపఁబడితివి. ఈగంగాదేవి వారి నెనమండ్రను గర్భమున ధరించుఁగాక. ఈ వసువులు విభావసు సమానగుణగణులు. దేవతాప్రీతి వర్ధనులు. కాన నట్టి వసువులఁబుట్టించి కురుకులమును వృద్ధి నొందించి యాతనువువదలి సాగరితనువు నొందుము. అని పల్కెతి.

దేవతలారా! మీారు చెప్పుటకుఁబూర్వమే పృథ్వీభారమును తగ్గింపఁగోరియే యిట్లు శపించితిని. శంతనువంశమును భూమి నారోపించితిని. ఆరీతిగా వసువు లావిర్భవించిరి. అందేడుగురు స్వర్గమునకుఁ బోయిరి. ఇప్పటికి నందెనిమిదవవసువు గాంగేయుఁ డనఁబరఁగుచు భూతలంబున నున్నవాఁడు. ఆ శంతనమహారాజు తనభార్యయందు విచిత్రవీర్యుఁ డనఁబడు కొడుకుఁ గాంచెను. ఆతని కిరువురుపుత్రులు. ధృతరాష్ట్రపాండునామకులు విఖ్యాతులు గలరు. అందుఁ బాండురాజునకు నిర్వురుభార్యలు గలరు. కుంతీమాద్రులని వారిపేరులు. ధృత

---

* ఇత్యుక్త్వా చరతాం ధర్మం సహయా దీయతేఽర్థినే, సకాయః పావయేత్తజ్జః షట్ షట్ వంశ్యాన్ సహాత్మనా.

యాజ్ఞవల్క్యస్మృతి, ఆచారకాండము. ౬౧ శ్లో.

'సహధర్మంచరతా మితి పరిభాష్య కన్యాదానం స ప్రాజాపత్యః.

అని మితాక్షరావ్యాఖ్య.

రాష్ట్రునకు నొక్కర్తుకయే భార్య. గాంధారియని తన్నామధేయము. భర్తృప్రియవ్రతపరాయణురాలు. తత్పుత్త్రులు నూఱుగురు. ఈయన్నదమ్ముల తనయులకు విరోధమును గల్పింపఁదగు. దాన మహాహవము సంఘటిల్లు. ఆవిమర్దమునందు క్షత్త్రియనాశము గల్గును. ఆయుద్ధమున ప్రళయకాలభీతి ఘటిల్లవలయు. అందిరువాఁగుల రాజులు సబలవాహనులై పోరాడి నశింతురు. అపుడు భూభారము సన్నగిల్లు. ద్వాపరాంతమున నీమహాహవము ఘటిల్లఁదగు. ఆసంగరమునఁ జావక మిగిలినవారు శంకరాంశసంభూతుని చే నిద్రామృతి నొందఁగలరు. ఆరేయి శంకరాంశసంభూతుఁడగు మహాపురుషుఁడంతకాకారుఁడై శాత్త్రవుల నిశ్శేషముగఁ జంపు. అంతఁ దృతీయ ద్వాపరయుగంబు సమాప్తం బగు. ఎపుడు విష్ణ్వంశము భూమినివదలునో అపుడే కలికాలము ధరవెలయు. అది భయంకరదర్శనము గలది. అధర్మపురుషులందుఁ బెక్కుమంది వెలయుదురు. ధర్మము నామమాత్రముగ నుండు. సత్యముత్సన్నప్రాయమై యసత్యమభివృద్ధినొందు నాయుగము దుష్టభూతమైయలరు. మహేశ్వరకుమారు లనుదేవతల నాశ్రయించి మనుజు లుందురు. ఆయువత్యల్పముగ నుండు.

దేవతలారా ! ఇపుడు చేయఁదగుకార్యము మీవలనఁ గాఁదగిన దేవియన, వేవేగ మీమీ యంశముల భూమియందు మనుజరూపముల వెలయించుటయే. ఆలస్యము చేయకుఁడని మఱియొకతూరి చెప్పుచున్నవాఁడను. ధర్మదేవతాంశమును

గుంతీదేవియందును, మాద్రియందును వ్యాపింపఁజేయుఁడు. కలహమునకుఁ గలి మూలముగాన గాంధారియం దాకలియంశము నుంచుఁడు. కాలచోదితులై వీరు రెండుపక్షములుగా నేర్పడి యుద్ధకారకు లగుదురు. అంత భూభారమడంగు. ఈభూదేవి తన నివాసము నొందునుగాక. యుద్ధోపాయమే రాజులకు విధివిహిత మనుట యంద తెలుంగుదురు. కాఁబట్టి ధర్మకల్యంశపురుషుల యాధారముగా నీభూభారమునడంచు సంగ్రామము విస్తరిల్లు. మీరును జింతల మాని పొండు. భూమియు ధైర్య మవలంబించి చనుఁగాక. అని బ్రహ్మపలికి విశ్రాంతిఁ గొనియె.

బ్రహ్మపలుకులువిని భూదేవి విగతజ్వరయై రాజు లన్యోన్యకలహముల మృందుదు రని నమ్మి పని వినియె. ఆవల బ్రహ్మ మరల దేవతలం గాంచి మీరసురమర్దన ప్రయత్నమున జాగరూకులరై వర్తింపుఁడని హెచ్చరించెను. మహర్షియగునరుని, భూభారమును వహించు శేషుని, సనత్కుమారుని, సాధ్యులను, అగ్నిపురోగము లగుదేవతలను, వరుణ, యమ, సూర్య, శశాంకులను, గంధర్వులను, అచ్చరలను, రుద్రుల, నాదిత్యుల, నశ్విదేవతలఁ, బ్రోత్సహించి వేవేగ మీరంశావతారముల భూమినివెలయుఁడని పలికెను. దేవతలు తదాదిష్టప్రకారమున నవతరించిరి. కొందఱయోనిజులైరి. కొందఱుయోనిసంభూతులైరి. దైత్యదానవవధార్హరూపంబుల దేవతలు భూమి నిండియుండిరి. సకలాయుధములధరించి వారెల్ల యుద్ధదుర్మదులై,

సింహబలులై, గదాపరిఘాద్యాయుధహతులనోర్చుశక్తివెలయ, గిరిశృంగముల నెత్తి వైవఁగలవా రగుచు, వృష్ణిప్రముఖ వంశముల వేనవేలుగ జనియించి భూమినిండియుండిరి. కురువంశమునందును, పాంచాలవంశమందును, యాజ్ఞికులగు బ్రాహ్మణపుంగవవంశములయందును, దేవత లుదయించిరి సర్వాస్త్రశస్త్రవిదులు, వేదవ్రతపరాయణులు, సకలసద్గుణసంపన్నులు, యజ్వులు, పుణ్యకర్మనిరతులునై వారెల్ల జన వినుతింగాంచిరి.

బ్రహ్మయు దేవతలం బ్రోత్సహించుతఱి సురలారా! మీరెల్లఁ గొండలఁ బిండిచేయుఁడు, భూమిని గదలింపుఁడు, ఆకసమున కెగిరి దుముకుఁడు, సముద్రములఁ గలంపుఁడు. ఇట్లు చేసిన మీరు బలవంతులని నమ్మి ప్రజలు మీపక్షములఁ జేరి ప్రాణముల వదల నుంకింతురు. అని యిట్లు లాదేశించి దేవతలఁ బొండని యాజ్ఞనిడి శ్రీమన్నారాయణమూర్తి యందు సకల భారముల నునిచి శాంతినొందెను.

జనమేజయమహారాజా! శ్రీమహావిష్ణువు భూతలంబునఁ దాను బ్రజాహితముసేయుపొంటె యయాతివంశమున నెట్లుద్భవించెనో ఆవిధ మెఱింగించెద వినుమని వైశంపాయన ముని చెప్పఁ దొడఁగె.

భక్తవరులారా! ఒక్క ధర్మరక్షణమున కయి దేవత లెంతపాటుపడిరో తలంపుఁడు. ధర్మమునుగావ భూతలంబున నవతరించిరి. అధర్మపరాయణులగు మనుజుల హింసింప దారుణ

ప్రయత్నముల నొనరించిరి. ఇట్టి లేలచేయవలయు నన్న ప్రశ్నము హాస్యమునకైనను జేయరాదు. ధర్మమునకే మనము బ్రదికియున్నవారము. దానిని గాపాడుటకే శ్రీహరి మను ష్యాకారమెత్తును. దానిని గాపాడుటకన్న మంచికార్యము వేఱొకటిలేదు. మహర్షులకుఁ గూడ నీకార్యమునకై తపస్సును వ్యయింపక తప్పినదికాదు. కావున ధర్మమును గాపాడిన జగమును గాపాడిన ట్లగు. ధర్మరూపమే భగవద్రూపము. దాని నుపాసించిన భగవంతు నుపాసించినట్లే. దానిని మించి నకార్యము లేదు. దానిని మీఱు పుణ్యకార్యములేదు. కాన మనుజులమై పూర్వపుణ్యంబున నిలఁ బుట్టినందులకై యథో చితముగ ధర్మపరాయణులము కావలయు. ఆపని మన మొన రింపమేని మన మనుజత నిష్ఫలమగును. పశుజాతికిని మనకు భేదము గానరాకయుండఁ గలదు. తొలిజన్మమున నెంతయో తపమొనరించియో, సద్వ్రతముల నొనర్చియో, సజ్జనుల సేవించియో, సత్క్షేత్రములకుం జనియో, పుణ్యతరంగిణుల స్నానమొనరించియో, దీనులఁబాలించియో, సత్పురాణములఁ బఠించియో, ఏపుణ్యలేశముచేతనో మనుజులమై పుట్టఁగలిగి తిమి. ఇట్టి పుట్టువున కర్హమగు సత్కార్యమును జేయమేని జం తుజాతికిఁ జేరఁదగినవార మగుదుము. కాఁబట్టి భగవత్సేవా కార్యమునందు శక్తి వంచనలేక పాటుపడవలయు. భగవ ద్భక్తుల దూషింపరాదు. భగవత్కథల నిస్సారము లనరాదు. పుణ్యతీర్థసేవనము నిష్ఫలమని మొండిపట్టుదలచే వాదింప

రాదు. ఇవియు నిట్టి వింక నెన్నియో చేయరాని కార్యములు. ఇంకఁ గథ వినుఁడు.

## నారదుఁడు నారాయణుని దర్శించుట.

* ఇట్లు దేవతలయంశావతారములు భూమి నిండెను. కాని యేమిలాభము? భగవదవతారమేది ? అదిలేక యీసృష్టి యేమిచేయఁగలదు? మఱింతభూభారహేతు వగును గాదా. భగవత్సహాయము కలిగినపుడే యీసృష్టి ఫలవంత మగును. లేదేని నిష్ఫలమగును. ఈవిధమును నారదముని యెఱిఁగినట్లు ఇతరు లెవ్వ రెఱుంగరు. అట్టి నారదముని యేకార్య మొనరించిన నది లోకోపకారమే యగు. కలహప్రియుఁ డనియుఁ, గలహాశనుఁ డనియు నాతనికిం బేరులు కలవు. ఆపేరులు పామరులచేఁ గల్పింపఁబడిన వనుట తప్పుగాదు. సజ్జనులుకూడ నాపేరు లుపయోగించుచున్నారే యన్న లీలార్థ ముపయోగింతురు. కాని నారదకల్పితకలహము లన్నియుఁ గార్యాంతమున నెట్టి ఫలము నీఁజాలునవియో పరికించినఁ దేటపడును.

ఆనారదమహాముని యొక్కనాఁడు ప్రపంచస్థితి యెట్లున్నదని విచారించెను. దేవత లంశావతారముల భూతలంబున నిండియుండుట గాంచెను. వీ రేమిచేయఁబూనిరనియుఁ జింతించెను. ఓహో! వీరి కనువగు నాయకుఁడై భగవంతుఁ డవతరింపలేదే యని యెఱింగెను. భగవంతుఁ డేల యింక నూరకు

* ఈకథ హరివంశపర్వము ౫౮ అధ్యాయమునుండి గైకొనఁబడినది.

న్నాఁడని మరల వితర్కించుకొనియె. ఇఁక నాపని మిగిలియు న్నది. నేఁజేసెద నని సిద్ధాంతీకరించుకొని మరల నొక్కసారి ప్రపంచమువైపునకు దృష్టిఁబఱపెను భారతకులమున ధర్మ పవన పురుహూతాశ్విదేవత లంశావతారముల నవలంబించిరి. సూర్యుఁ డవతరించెను. దేవపురోహితుఁ డగు బృహస్పతి ముందే యవతరించియుండెను. వసువులలోఁ గడపటివసువు గం గాపుత్త్రుఁడన వెలసియుండెను. మృత్యుకాలాంశభవులుండిరి. శుక్రశశాంకవరుణాంశపురుషులు భూమి నలరారిరి. శంకర, కుబేర, గంధర్వోరగయక్షాంశభవు లుండిరి. నారాయణాంశ భవుఁడు కానఁబడఁ డయ్యె.

ఆముని దేవతలెల్ల భూతలమున నిండియుండుటం గాం చెను. వెంటనే యగ్నివలెఁ బ్రజ్వరిల్లు తేజమున నొప్పుచు, బాలార్కసదృశేక్షణములఁ గానఁబడుచు, సవ్యాపవృత్తమై, విపులమై తనరు జటామండలమునుదాల్చి,శీతాంశుజ్యోత్స్నా తుల్యవస్త్రమును ధరించి మహతి యనంబడు వీణియం జేతం బూని కృష్ణాజినము నుత్తరీయముగఁ దాల్చి, కమండలువు చేతఁ బూని యపరపురుహూతుఁడో యన సకలరహస్యముల వెలిఁ బుచ్చు స్వభావము తనరార, రూపమొందిన విగ్రహమో యన, వేదగాన మొనరించుచు, శరీరకాంతి వెలయుచుండ, గంధర్వ విద్యాకోవిదుండై, కలిబాహ్యుండై, దేవగంధర్వలోకముల నాదివక్తయనఁ బ్రఖ్యాతిని వహించుచు, నిస్సమానతేజమునఁ దగు నారదముని పరమాత్మలోకంబునకుం బోయి దేవసభా

మధ్యభాగమున నవ్యయుండై యలరారు శ్రీమహావిష్ణువుం గాంచి యిట్లు విన్నవించెను.

ఓభగవంతా! నారాయణమూర్తీ! దేవతాకృతాంశావతరణము న్యాయమని నాకుఁ దోఁపకున్నది. అది సర్వపృథ్వీపాలకవినాశార్థము చేయఁబడినది. ఇది యెంతయు నకారణము. పృథ్వియందుఁగల క్షత్రియసంతానము నీయందుండును. నృనారాయణయుక్తమగు నిది క్షయార్థమయ్యె నని నాకుం దోఁచెను. సర్వమెఱిఁగిన నీచే నిట్లు చేయఁబడుట యుక్తమగు పనికాదు. ఒక్కభూదేవికొఱ కింతటి దారుణకృత్య మొనరించుట సమంజస మనఁ దగునా. నీవు చక్షుష్మంతులకు నేత్రప్రాయుఁడవు. జన్మించువారలలో శ్లాఘ్యుఁడవు. యోగులలో శ్రేష్ఠుఁడవు. గతిమంతులకు గతివి. భూతలంబున నిండి దేవతాంశభవులుండఁ గాంచియు సర్వేశ్వరుఁడ వగు నీవు భూదేవికి సాయముచేయుఁబొంటె నేల యవతరింపవు? ఈదేవాంశములు నీచే సనాథములు. త్వన్మయములు. త్వత్పరాయణములు జగమున నేవో కార్యములఁ జేయఁబూని సంచరించుచున్నవి. ఈవిధముం గాంచియే నే నీ దేవసభాదర్శనము చేయవచ్చితిని నిన్నుఁ బ్రోత్సహించుటయే నాపని. ఏల యీ పని నీకందువా? కారణమును జెప్పెద నవధరింపుము.

## మధురాపురవృత్తాంతము.

పూర్వము తారకాసురసంగ్రామము పొసఁగిన తఱి నీచేఁ జంపఁబడిన రాక్షసులు భూతలంబునం బుట్టిరి. వారిగతి

యెట్టిదో వినుము. భూలోకమున మధురాపురమనునది యొకఁడుగలదు. యమునాతీరమున నది యలరు. జనపదస్థితమై యుండు. అద్దానియందు మధునామకమహాసురుండుండెను. ఆతఁడు దుర్జయుండై సాటిలేక సర్వభూతభయంకరుండై మహాబలసమన్వితుండై యుండెను. ఆరాక్షసునకుఁ బ్రియమై మహాపాదపసమూహసంకులంబై, భయంకరదర్శనంబై మధువనంబ్రఖ్యాతిగాంచినవన మొక్కండుండెను. ఆదనుజునికుమారుఁడు లవణనామకుండు గలఁడు. తండ్రినిమించిన బలపరాక్రమవంతుఁడు.

* ఆమధువనమున నాదానవుఁడు వేడుకఁగ్రీడించుచు దేవదానవులఁ బాఱఁదోలుచుఁ దనకు నెదురులేకయుండెను. ఆకాలమున నయోధ్యాపురమున దశరథపుత్త్రుఁడగు శ్రీరాముఁడు కోసలరాజ్యమును బాలించుచుండెను. ఆమహాపురుషుఁడు రాక్షసభయావహుండై ధర్మజ్ఞుఁడై ప్రజారంజకుఁడై యుండఁగా నావార్త నాలించి యాదానవుండు రామునిసన్నిధికి దూతనంపెను. ఆదూతయుఁ బరుషవాది. ఆవార్తయిట్టిది. రామా! నేను నీవుండు దేశమునకు సమీపమున నున్నవాఁడను. కాన నీకుం బగవాఁడనే. లోకమున రాజులు బలదర్పితుని సామంతరాజునుగా నంగీకరింపరు. ప్రజాహితమును గోరి న్యాయమార్గావలంబియగు రాజు జనపదసంకులంబగు

* ఈకథ శ్రీమద్రామాయణోత్తరకాండమునఁ జెప్పఁబడిన కథకు ఇంచుక విరుద్ధముగాఁ గన్పట్టుచున్నట్లు తోఁచు. కాని ముఖ్యాంశములందు భేదము కానరాదు. కావున సంశయింపఁ బనియుండదు.

రాజ్యమును వృద్ధిచేయఁగోరునెడల శత్రువుల జయింపవలయు. అభిషేకార్ద్రకేశుం డగు రాజు తొలుదొలుత నింద్రియముల జయింపవలయు. వాని జయించిననే జయశాలి యనంబడు. ఇంతియకాక సత్ప్రవర్తకుఁ డగువానికి, నందును రాజునకు, నీతిని బ్రజలకుపదేశించువానికి సముఁడగు గురువు లోకమున లేనే లేఁడు. వ్యసనముల సేవగించుచు, ధర్మమధ్యస్థితుఁడై, ఫల జ్యేష్ఠుఁడునగు రాజచంద్రునకు సామంతరాజభయము లేదు. కూడఁబుట్టినవియు, నిరంతర మభివృద్ధినొందుచుండు నవియు నగుచు మిత్రప్రియకరములు నగు నింద్రియాదులచేఁ జిక్కనరాజే యధీరుఁ డనఁబడు. రామా! నీవు స్త్రీవిషయమున లోలుఁడవై సమిత్రపుత్రబాంధవముగ రావణుం జంపితి. ఇది న్యాయసమ్మతమని నేఁదలంపను. మహాకుత్సితకర్మమని నా భావము. ఇంతియగాదు. వ్రతముపూని వనవాస మొనరించుచు, రాక్షసానీకమును జంపితివి. ఇట్టికృత్యము సజ్జనసమ్మతమనఁ దగు పనికాదు. అక్రోధము సజ్జనధర్మము. అదియే సద్గతిని జూపును. నీచర్యచే నాశ్రమవాసుల కపకీర్తి సంభవిల్లినది. వ్రతచర్యాపరాయణుండవగు నీచే రావణుండు తెగి ధన్యుఁ డయ్యెను. స్త్రీనిమిత్తమగు యుద్ధము సద్గతిప్రదము కానేరదు. జితేంద్రియుఁడు కాక దుర్బుద్ధియగు రావణుఁడు నీచేఁ జంపఁబడియెను. నీవు యుద్ధశూరుఁడవేని నాతోఁ బోరు సల్పుము.

ఈమాటలు లవణాసురుఁడు చెప్పినట్లే పరుషవాక్కు గల దూతపలికెను. రామచంద్రుఁ డాలకించి సస్మితవక్త్రుఁడై

యిట్లు బదులుచెప్పెను. రాజాజ్ఞాపాలకా! నీవు దూతకార్యము నిర్వహించితివి గాని నీచెప్పిన యీవాగ్జాలము కుత్సితమైనది. నన్నుఁ గుత్సితకార్యతత్పరునిం జేసితివి. నిన్ను సుస్థిరమతిగా భావించుకొంటివి. ప్రభుగౌరవమున నిట్లు పల్కితివి. నేను సన్మార్గ మూఢుఁడను. రావణుఁడు నాచేఁ జంపఁబడియె. నా భార్య వానిచే న్యాయముగనే హరింపఁబడియె. కానిమ్ము. ఇపుడేల యాగోడవ. సత్పథస్థితులగు సజ్జనులు వాఙ్మాత్రమున నిందింపరు. దూత చేయఁదగినకార్య మొనరించితివి. ఇంకఁ బొమ్ము. ఇచటఁ జాలసేపు నిలువకుము. నావంటి ధీరు లాత్మ స్తుతిని జేసికొను నీచులతో యుద్ధ మొనరింపరు. ఇదిగో నా యనుజుఁడు శత్రుఘ్నుఁడు వచ్చి దురాత్ముఁడగు నీప్రభువు నకుఁ దృప్తి గల్గించును.

అనిన దూతయు మధురాపురమున కరిగెను. శత్రుఘ్నుఁడును బయనమై పోయెను. అనుజుఁ డరుగుతరుణమున శ్రీరామచంద్రుఁడు నిర్భరానందమున నాశీర్వదించెను. అతి వేగమ శత్రుఘ్నుఁడు మధురాపురముచేరి వనాంతమున యుద్ధాభిలాష మించ నివసించెను.

## లవణశత్రుఘ్నుల యుద్ధము.

దూత యరిగి రాము నాశయముఁ దెలుప వాఁడు మండిపడి యుద్ధాభిముఖుండై మధువనముచెంత కరిగెను. ఆయుద్ధము భయంకరమై దానవామర్త్యసంగ్రామమును మించెను. లవణాసురశత్రుఘ్ను లన్యోన్యబాణజాలంబుల క్షత

గాత్రులగుచు గెలుపోటములు లేక పోరాడిరి. ఆయాసము గాని విసుగుగాని వారికిం గలుగదయ్యెను ఒకనాఁటి యుద్ధమున నాదానవుఁడు శూలవిరహితుఁడై శత్రుఘ్ను బాణ క్షతుఁడై హీనసత్త్వుఁ డయ్యెను. విధివశమున నాదిన మాతఁడు శూలాయుధమును గొనిపోఁ డయ్యె. అంత లవణుఁడు డస్సియుఁ దనమహాంకుశాయుధమును వైచి శత్రువును బడనేయ నాసఁగొనియె. అది యట్టియాయుధమే. కాని విధి వశమున నది లక్ష్మణానుజుని జంపఁజాలదు. ఆయాయుధమును జేనంది లక్ష్మణుని తమ్ముని జంప దగ్గఱకేగెను. శత్రుఘ్నుఁడు బంగరుకుసుమముల నలంకృతమగు ఖడ్గమును జేనంది చెంత కరుదెంచు లవణుని శిరసు ఖండించెను.

ఇట్లు లవణాసురుంజంపి యాసుమిత్ర కడపటికొడుకా ఖడ్గముననే యాభయంకరారణ్యమును ఛేదించెను. ఆవనభాగమున నగరమును నిర్మించి సౌమిత్రియందుండెను. ఆనగరము మధువనమున నిర్మింపఁబడుట మధురానగరమనఁ బ్రఖ్యాతి నొందెను. ఆనగరము హృష్టపుష్టజనాకులమై సకలపరికరసంయుతమై రాజనివాసార్హమై యుండెను. అది యమునాతీరమందుండుట బరమపావనమై జగద్విఖ్యాతిం గాంచెను.

శ్రీహరీ! కొంతకాలమున కానగరమును శూరసేనుఁడను రాజు పాలించెను భోజకులోద్వహుఁడగు సుగ్రసేనుఁడు మహాసేనతుల్యపరాక్రముఁ డౌట జగద్విదితుఁడై యాపురము నాక్రమించెను. మహాభావా! తారకాసురసంగ్రామమున నీచేఁ జంపఁబడిన దానవేంద్రుఁడు కాలనేమియే

యాయుగ్రసేనునకుంబుత్రుఁడై కంసనామమున నుదయించెను. భోజవంశవివర్ధనుఁడై బలపరాక్రమముల సాటిలేక యా కంసుఁడు రాజచక్రభయంకరుఁడై, సర్వభూతములఁ దనవశముననుంచుకొనుచు, నున్నవాఁడు. దారుణాభినివేశము చేతను భయప్రదాంతరాత్మ చేతను, జనుల కగమ్యుఁడై రాజధర్మాభిరతుఁడు కాక ఆత్మపక్షమునకై సుఖావహుఁడు కాక, స్వరాజ్యమునైనను న్యాయరీతిఁ బాలింపక, ప్రచండుఁడై ప్రజలఁబీడించి పన్నుఁగొనుచు, నున్నవాఁడు. నీచేత యుద్ధమునఁ జంపఁ బడిన కాలనేమియంశమునుండి జన్మించి యాసురాత్మాంతరాత్మ గలిగి లోకములఁ బీడించుచున్నవాఁడు. ఆతనిసోదరుఁడు కేశియనువాఁడు. ఆతఁడే పూర్వము హయగ్రీవుఁడను రాక్షసుఁడు. వాఁడు సింహబలుఁడై బృందావనమున నొంటరిగ నున్నవాఁడు. సదా వాఁడు మనుజమాంసములనే నములుచుండును. బలిపుత్రుఁడగు నరిష్టుండు వృషభరూపధారియై పుష్టకకుద్విరాజితుండై గోకులాంతకుఁడై యున్నవాఁడు. వాఁడు కామరూపి. మహాసురుఁడు. దితిపుత్రుఁడగు నరిష్టనామకుఁడు దానవశ్రేష్ఠుఁడై కుంజరత్వము నొంది కంసవాహనమై యున్నవాఁడు. లంబాసురుఁడు పరాక్రమమున సాటిలేక విఱ్ఱవీఁగుచుఁ బ్రలంబనామమున భాండీరవటము నాశ్రయించి యున్నవాఁడు. ఖరాసురుఁడనఁ బ్రఖ్యాతినొందియున్న రాక్షసుఁడే యిపుడు ధేనుకాఖ్యనొప్పుచు భయంకరతాళవనము నాశ్రయించి ప్రజలఁ బీడించుచున్నవాఁడు. వారాహార్క్షికిశోరనామధారులగు నసురులు మహాబలవిక్రమసంపన్నులు

యుద్ధరంగాభిలాషు లిపుడు చాణూరముష్టికు లన నవతరిం చిరి. ఓదానవాంతకా! మయతారకులను మహాదానవు లిర్వురు భూపుత్త్రుఁడగు నరకాసురుఁడుండు ప్రాగ్జ్యోతిషపురమున విజ్జృ మ్భిఁగుచున్న వారు. మహానుభావా! శ్రీవిష్ణూ! ఈరాక్షసులెల్ల నీచేఁ జంపఁబడియు, నవమానింపఁబడియు మానవరూపము లెత్తి యిపుడు మానవుల సకలవిధముల బాధించుచున్న వారు. ఈపేర్కొనఁబడినవారెల్ల నీకథావిముఖులు. భగవ ద్భక్తులఁ ద్రుంచువారు. వీరు నీయనుగ్రహమున మృతినొం దింపఁబడుదురేని స్వర్గము నిలుచును. ప్రపంచము సుఖపడును. సాగరములు వర్ధిల్లును. నీవూరకున్న నింకొక్కరీకార్యము నిర్వహింపఁజాలరు. దుర్వృత్తుఁడైనను నీచేఁ దెగి పుణ్యలో కమునొందును. నీవీసమయమున నౌదాసీన్యము వహించిన జనులకుఁ బుణ్యగతులే లేవు. పాపమతులచేఁ బీడితులయి పాపకార్యతత్పరులచేఁ బ్రోత్సాహితు లగుచున్న వారు.

కాఁబట్టి యోమహాత్మా! పురాణపురుషా! నావెంట రమ్ము. భూలోకమునకుం బోవుదము. దానవనిర్మూలనార్థ మీ శరీరము నుపసంహరించి మానవత్వమొందుము. నీయవ్యక్త మూర్తులు దేవతలచే నెఱుంగఁ దగునే. దేవత లేభూమియం దవతరించియున్న వారు. నీవవతరించినఁ గంసుఁడు నశించు. ఎందులకై వాఁడు భూతలమున నవతరించెనో ఆఫలము నీవవతరించిన నొనఁగూడును. భారతమున నీవే కార్యగురుడవు. లోక చక్షుస్సు నీవే. నీవే పరమగతివి. కాన వేవేగ భూలోక

మునకు రమ్ము. రాక్షసులం జించి చెండాడుము. అని నారద మునిప్రార్థించి యూరకుండెను.

## శ్రీవిష్ణువు నారదమునికి సమాధానము చెప్పుట.

* శ్రీమహావిష్ణువు లోకహితార్థ మిట్లు నారదముని వచింప నాలకించి తాఁ బరమేశ్వరుండగుట సర్వ మెఱుంగుఁ గాన నేయుత్తర మిడిన నమ్మునిసందియములు తొలంగునో యారీతి నూహించి యిట్లు బదులుచెప్పెను. నారదమునీంద్రా! లోకహితమే ప్రధానమని భావించి నీచేసిన ప్రశ్నమునకు, నన్నుఁ బురికొల్పినందులకుఁ బరమానంద మొందితిని. రక్కసులు నాయందు ద్వేషమూని భూతలంబున వివిధరూపముల నవతరించి మద్భక్తులగు సజ్జనుల బాధించుచుండుట నేనెఱుంగుదును. ఉగ్రసేనతనయుఁడగు కంసు నెఱుంగుదు. తురగరూపధారియగు కేశిని, కువలయాపీడ నామకమహాగజమును, చాణూరముష్టికు లనఁబడు మల్లులను, వృషభరూపమును దాల్చిన యరిష్టదానవుని, ప్రలంబుఁ డనుపేర నవతరించిన ఖరుని, బలిపుత్రికయగు పూతనను, వినతాతనయుఁడగు గరుత్మంతుని సాధ్వసమున యమునానదీహ్రదమును జేరియున్న మహాక్రూరుని గాళియుని, సకలరాజశిరస్థితుఁడై సాటిలేక విలసిల్లు జరాసంధుని, ప్రాగ్జ్యోతిషనగరంబున నున్న నరకుని జక్కఁగా నెఱుంగుదును. కుమారునిం దిరస్కరించు పౌరుష

---

* ఇది హరివంశపర్వము ౧౫-వ అధ్యాయమునుండి గ్రహింపఁ బడినది.

మున నలరారుచు మనుజలోకంబున శోణితనగరంబున నవత రించి బాహుసహస్ర విరాజితుఁడై దేవతల లెక్కఁగొనని బాణాసురునిఁ, జక్కఁగా నెఱుంగుదు. భూదేవి మహాభారాతి పీడితయై నాయవతారమున కెదురుచూచుచుండుటయుఁ దెలియుదును. ఏయుపాయము వన్నిన నీరాజు లాహవ మొన రించిన బలవాహనులై మరణింతురో యాపద్ధతి నూహిం చియే యున్నాఁడను. దేవతల కష్టములు తొలఁగు నుపాయ మూహించితిని. నేఁజేయఁదగిన కార్య మింకేదియనియు నాలో చించితిని. మది కదియు సరిపడియే యున్నది. పృథ్విని మనుజ రూపమునఁ బుట్టవలయుననియే సిద్ధాంతము చేసికొనియున్నాఁ డను ఏయేయుపాయములచేఁ గంసాదుల వధింపనగునో యాయుపాయము లన్నియు నాలోచింపఁబడియే యున్నవి. యోగమాయంగొని యామాయిగతుల నాయాయసురుల వధించెదను. దేవతారిపులవధించి దేవతలకష్టములం బాపె దను. ప్రపంచమున నిజనిజాంశముల సురగంధర్వముని ప్రభృతు లవతరించుట నాయాజ్ఞచేతనే యని తెలియఁదగు. ఈకార్య మిట్లిట్లు చేయఁదగు నని ముందే నిశ్చయించుకొని యున్నవాఁడ. నారదా! నేనేదేశమున నేవేషమున నుండ వలయునో ఆవిధము బ్రహ్మదేవుఁడే నిశ్చయింపవలయును.

ఒక్కమాఱు నేను బితామహుం బిలిపించి పంకజాస నా! ఈభూభార మాప నేదేశమున నెట్టివేషమున నేనుండ వలయు. ఏరీతి నాదానవులఁ జంపవలయు. ఆవిధము తెల్పుము.

నీవెట్లుగోరిన నట్లే యొనరించెద నని బ్రహ్మనడిగితిని. నా ప్రశ్నములు విని బ్రహ్మయు నిట్లు బదులుచెప్పెను. నారాయణా! జగదీశ్వరా! నేసిద్ధాంతము చేసికొని విన్నవింపఁ దలంచిన విషయమును వినుము. నిన్నుఁ గన్నకొడుకుగా భావింపఁదగు పుణ్యాత్ము రా లెవరో, నిన్ను వంశకర్తగాఁ బడయఁగల తండ్రి యెవ్వఁడో, నానిర్ణయము నెఱింగించెద. పవిత్రయాదవవంశమున నసురు లెందఱో యవతరించిరి. వారి నున్మూలించి సద్వంశంబుగా దాని నొనరింపవలయును. స్థిరకీర్తిమంతముగా దానిఁ జేయవలయు. ఆపద్ధతి నేజెప్పినట్లు చేయఁదగునని వేఁడెదను.

మహానుభావా! కరుణాసింధూ! జగదుద్ధారకా! * పూర్వము కశ్యపమహర్షికి, వరుణునకు వివాదము గల్గెను ఎట్లనఁ గశ్యపముని వరుణదేవుని యజ్ఞధేనువులఁ గాంచి యివి సమృద్ధిగాఁ బాలు పిదుకఁగలవు. అని తలంచి వాని నపహరించెను. ఆమునికి అదితియు సురభియు నను నిర్వురుభార్యలు గలరు. ఆగోవుల నాభార్యలకు నిచ్చెను. వరుణుం డడిగిన నీ నొల్లఁడయ్యె. అంత వరుణుఁడు నాచెంతకరుదెంచి నమస్కరించి పితామహా నా యజ్ఞధేనువులఁ గస్యపముని హరించెను.

---

* ఈకథ యింతకుముందు దేవీభాగవతమునుండి యెత్తి వ్రాయఁబడినదియే. కొంచెము మార్పుగలదు. కాన సంగ్రహించి యిట వ్రాయఁబడినధని పాఠకు లూహించి మన్నింతురుగాక. ఇంతియగాక యాకథయందు విశేషాంశములు గలవు. గోరక్షణము ప్రధానకృత్యమని చెప్పఁబడినది. అద్ది ముఖ్యముగాఁ దెలిసికొనఁదగియుండుఁ గాన మరల నిట వ్రాయఁబడినది.

వా రొనరించు యజ్ఞకార్యము పూర్తినొందువరకూరకుండి యడిగితిని. ఈనొల్లఁడయ్యె. అదితియు సురభియు నను భార్యల యనుమతిచే నూరకున్న వాఁడు. ఆ ధేనువులు కామముల బిదుకునవి అక్షయ పయోవంతంబులు. దివ్యములు. నాల్గు సాగరములుఁ దిరిగి స్వతేజోరక్షితములై యిల్లు చేరుచుండినవి. ఈ కశ్యపుఁడుతప్ప వాని నెవ్వఁడు హరించును? ఇంతియ గాదు. దేవామృతోపమాన మగుపాలను అక్షయముగఁ గురి పించును. అట్టి నాగోవుల హరించువాఁడు ప్రభువుగాని, గురువుగాని యితరుఁ డెవ్వఁడుగాని నీచే శిక్షింపఁ బడఁదగు. కార్యజ్ఞులుకాని మూర్ఖులకొఱకే దండవిద్య సృజింపఁబడినది. నీకంటె ధర్మరక్షకు లెవరుగలరు? ఏది యెట్లుగావలయునో యది యట్లుగావలయుఁగదా! కర్తవ్య మొనరింపుము. నా గోవుల నాకిప్పింపుము. ఆవల సముద్రమునుం బ్రవేశింతు. అదిగదా నాగృహము. ఏ ధేనువు లాత్మదేవతలో, ఏవి అక్షయ ధనమో, అట్టివి నీచే రక్షింపఁబడు ప్రపంచమున నుత్తమజంతువు లగుటయగాక బ్రాహ్మణశబ్దమునకంటె ముందుఁ జెప్పఁ బడినవి. గోబ్రాహ్మణపదము లోకవిదితము గదా!

* తొలుదొలుత గోవుల రక్షింపఁదగు. అవి రక్షింపఁ బడి ద్విజుల రక్షించు. గోబ్రాహ్మణులరక్షింప వారు జగమును

* త్రాతవ్యాః ప్రథమంగావః స్త్రాతా స్త్రాయంతి తా ద్విజాన్, గోబ్రాహ్మణ పరిత్రాణే పరిత్రాతం జగద్భవేత్. అని మూ. హరివంశే. ౧౨౮ అ. ౩౧ శ్లో.

గాపాడుదురు. అని యిట్లు వరుణుఁడు దీనాననుఁడై వేఁడెను. అచ్యుతా! నేనును జక్కఁగా నాలోచించి దాని తత్త్వ మెఱింగి కశ్యపమునికి శాపమొసంగితి. ఏయంశమున గోవు లపహరింపఁబడినవో యాకారణమున నమ్ముని మర్త్యలోకమున గోపత్వమొందెను. ఆయన యిరువురుభార్యలు భర్తతోఁ గూడి గోపికలై జనించిరి. కశ్యపాంశజనితుఁడై కశ్యపసమానుఁడై వసుదేవుఁడనఁ బ్రఖ్యాతినొంది గోకులమున నున్నవాఁడు. మధురాపురమునకు సమీప భూభాగమందు గోవర్ధన పర్వతము గలదు. ఆపర్వతము చెంత నందవ్రజమున భార్యలం గూడి యతఁ డున్నవాఁడు. కంసునకుఁ గప్ప మిచ్చుచుండు వాఁడు. అదితియు సురభియు నను నీయిరువురు కశ్యపముని భార్యలు గోపకులమునంబుట్టి దేవకియనియు, రోహిణియనియు విఖ్యాతింగాంచి వసుదేవునకుం బ్రియపత్నులై యున్నవారు. అదితియే దేవకి. సురభియే రోహిణి. ఆవసుదేవకుటుంబమున నీవు జన్మించి గోపాలశిశులక్షణలక్షితుఁడవై వర్ధిల్లవలయు. త్రివిక్రమావతారమున నీవు వారికిం బుత్త్రుండవుకదా. యోగ మాయచేఁ గప్పఁబడినట్లు నటించుచు నవతరించి ప్రవర్తింపుము. అవతరించిన నిన్ను దేవతలు జయాశీర్వచనముల నలరింతురుగాక. * నీయాత్మచే నాత్మను గల్పించి భూతలమున

---

* ఆత్మాన మాత్మ నా హిత్వ మవతార్య మహీతలే, దేవకీం రోహిణీం చైవ గర్భాభ్యాం పరితోషయ. హరివంశే. ౫౫ అ. [illegible] శ్లో. దీనిచే బలరామకృష్ణుల కభేద మని తెలిసికొనఁదగినది.

దేవకీరోహిణీగర్భములఁ బరితోషము నొందఁజేయుము. గోపకన్యాసహస్రములు నిన్నుఁగోరి యవతరించినవి. అట్టి వేన వేలగోపికలను సంతోషింపఁజేయుచు విహరింపుము. రక్షకుఁడ వగు నీచుట్టు ఆ గోవులు తిరుగుచుండఁ గలవు. వనమాలా పరిభూషితం బగు నీ దివ్యదేహమును ధన్యులగుమానవులు చూడఁగలరు. ఓ మహాత్మా! * పంకజాక్షా! నీవు బాలుఁ డవై చరింప లోకమంతయు బాలత్వ మొందఁగలదు. పుండ రీకనయనా! † నీభక్తులందఱు నీచిత్తవశానుగులై గోపాల కులై గోవులరక్షింప సహాయభూతులై నిరంతరము నిన్ను సేవించుచుండఁగలరు. వనములకు గోవులందోలుచు, గోష్ఠము లందు గోవులఁ దిరుగఁజేయుచు, యమునాజలంబుల నాగోవు లను గడుగుచు నీయం దాగోపకు లాసక్తిగలవారై యుం దురు. వసుదేవుని జీవితము నీయవతారమున సుజీవితమగును. నీవు తండ్రీ యని పిలువ నతఁడు నిన్నుఁ గుమారా యని పిలువఁగలఁడు. కశ్యపమునికిం దప్ప నీవెవనికిఁ బుత్త్రుఁడవగు దువు? అదితితప్ప నిన్నెయింతి ధరింపఁగలదు? నీమాయఁ గాని విజయమునకొఱకు భూమి నవతరింపుము. ఓ మధు సూదనా! మేము మాగృహంబులకుం బోదుము.

---

* విష్ణో పద్మపలాశాక్ష గోపాలవసతిం గతే, బాలే త్వయి మహా బాహో లోకో బాలత్వమేష్యతి. అని మూ. ౪౪ శ్లో.

† త్వ ద్భక్తాః పుండరీకాక్ష తవచిత్తవశానుగాః, గోషు గోపా భవిష్యంతి సహాయాః సతతం తవ. వనేచారయతో గాశ్చ గోష్ఠేషు పరిధా వతః, మజ్జతో యమునాయాంచ రతిం ప్రాప్స్యంతి తే త్వయి. ౪౯ శ్లో.

జనమేజయా! బ్రహ్మ యిట్లు పలుకఁగా మధుసూదనుఁ డాలించి దేవతలఁ దమతమనివాసములకుఁ బోవంబనిచి పాల సముద్రమునకు నుత్తరభాగమం దున్న స్వాలయమునకుం బోయెను. అంత విష్ణువు వసుదేవనందనుండు తానగుట కాలో చించి చేయఁదగినకృత్యము లివిగదా యని తలపోసికొనుచు జగతీతలంబున నవతరింప సిద్ధపడియెను. అని వైశంపాయన ముని తెల్పి తరువాతి కథఁ జెప్పఁబూనెను.

పాఠకమహాశయులారా! నారదముని ప్రశ్నము. భగ వంతుఁ డందులకుఁ జెప్పిన సమాధానమును వింటిరిగదా ఈకథనుండి కొన్ని రహస్యవిషయములు తెలియఁదగియున్నవి. శ్రీవిష్ణుభక్తులందఱు గోపాలవేషములఁ దాల్చి భగవంతుని సేవింతురనుట దీనివలనఁ దెల్లమాయె. అనఁగా లోకోపకార మునకై భగవంతుఁ డవతరించుచో, తద్విరహము నోర్వఁజా లక భక్తులందఱు భగవంతుని సేవింప నవతరించి భగవదవతా రానుగుణరూపములం దాల్చి యాయనను సేవించుచుందురు. శ్రీకృష్ణావతారమున గోపాలవేషములం దాల్చి శ్రీకృష్ణునిం గూడి యాడుకొనువారును, ఆదివ్యమూర్తిఁ గన్నులార సంద ర్శించుచుఁ దృప్తినొందువారును, ఆపరమేశ్వరుని తత్త్వ మెఱింగి యుపాసించువారునై కాలముఁగడపిరి. గొల్లలతో శ్రీ కృష్ణుఁ డాడుకొనెనన్న మాటలలోని రహస్యార్థ మిదియే. లోకు లకు గుణపాఠముఁ జెప్పఁబూని భగవంతుఁ డాడుచుఁ బాడుచు వివిధవినోదములఁ గాలముఁబుచ్చుచుఁ దనతత్త్వ మెఱింగిన

వారికి ముక్తినొసంగుచు, నెఱుంగఁదగినవారలకుఁ దదుచితరీతి బోధించుచు, నందుల కర్హులుగానివారలకు నేయేమార్గములు ప్రదర్శింపఁదగునో ఆమార్గముల నీతి నుపదేశించుచు, నందు లకుంగూడ నర్హులుగాని కేవలపామరులకుఁ దన సాంగత్యబల ముచే నించుక తెల్విని బ్రసాదించుచు, దుష్టులశిక్షించుచు, దానిచే నితరులకు దుష్టమార్గము నవలంబింపరాదనుపాఠము నేర్పుచుఁ దన వచ్చినపనిని బూర్తినొందించి స్వరూపమును దాల్చు. ఇదియే యవతారములకు ఫలము. అట్టు లిప్పట్టునఁ దన్నువిడువనొల్లని గోలోకవాసుల భూలోకమున నవతరింప ననుమతి నిడియె. రాధాదులకు శాపఫలము లనుభవింపక తప్ప దని తనకంటె ముందుగ నవతరింపఁబోవ నాజ్ఞనొసంగెను. మహర్షులు దేవతలు తన్ను ధర్మరక్షణమునకుం బురికొలుపు నంత దనుక నూరకుండెను. ఆధిపత్యగర్వము, తపోగర్వము గలుగ మేమీపాటికార్యములఁ జేయఁజాలమా యని గర్వింతురేమో యని యూహించి వారు మొఱ్ఱపెట్టుచు, నీకార్యము మాచేతఁగాదు. విభూ! నీవవతరించి మమ్ముఁ గాపాడుమా యని ప్రార్థింపఁ దా నందుల కంగీకరించినట్లు నటించి గర్వము తగ్గినదని యెఱింగి వారి దీనాలాపములఁ దా నాల కించి యవతరించునట్లు నటించెను. నారదముని తనకు మార్గము చూపఁ దద్గర్వము నడంచుటకుఁగాబోలు సమస్తము నేనెఱుం గుదు నని హెచ్చరించెను. దుష్టుల హింసించుపని నాయది యని యభయమొసంగెను. దీనిచే నేయేకార్యము లెవ్వ

రెవ్వ రెంతెంతమాత్రము చేయఁదగునో యావిషయము తెలును. దాని నెఱుంగుటయే మనుష్యుని కర్తవ్యము.

ఇంతమంది దుష్టులు చెలరేఁగి బాధించునంతదనుక భగవంతుఁ డేల యుపేక్షింపవలయు? అన్న ప్రశ్నము రావచ్చును. అట్లు చేయుటయే భగవంతుని కర్తవ్యము. స్వశక్తియుండు దాఁకఁ దన్నుఁ గాపాడుకొనుటకుఁ బ్రతిమానవుఁడు ప్రయత్నింపవలయు. సకలవిధశక్తుల నుపయోగించి యెట్లును సాధ్యముకానిచో నపుడు పరులసాయము కోరవలయు నేకాని తాను బాటుపడక సదా పరులసహాయ మపేక్షింపరాదని మనుజులకు గుణపాఠము నేర్పుట భగవంతునిపని. ఇంతియకాదు. పుణ్యపాపములకుంగూడఁ బరిణామకాల మున్నయది. ఆ కాలము వచ్చినఁగాని ఫలముగలుగదు. పాపముగూడఁ బుణ్యవిరహితమై యుండదు. పుణ్యముకూడ దానితోనుండును. పాప మేకాలమునఁ బుణ్యమునడంచి తా నతిశయించునో యపుడు దాని నశింపఁజేయ భగవంతుఁడు ప్రయత్నించును. లోకమునఁ బాపాత్ములనఁబడువారెల్లఁ బాపాత్ములు గారు. పుణ్యముకూడ వారియందుండును. అది ప్రధానము కాక యుండును గాన మనము దానిని లెక్కింపము. ఎపుడు దేవతాభక్తి, భూతదయ, పరోపకారతత్పరత్వము మానవునియందుఁ జాలభాగమునశించునో అపుడు వానినిరూపుమాపభగవంతుఁ డంగీకరించును. అట్టిస్థితిలో వానినివెంటనే చంపఁబూనక యించుక యాలసించును. ఇంకను వానియందుఁ బాపమే హెచ్చు

నని తోఁచెనేని వానిని రూపుమాపును. తా నవతరింప నవస రము లేదేని భక్తులగు సాధువులవలన శాపము గలుగునట్లు చేసియో, ప్రబలు లగు రాజులవలన మృతినిగల్పించియో కార్య మునుదీర్చును. అట్టి కార్యములచేఁ గార్యము నెఱవేఱదని తోఁచెనేని తానే యవతరించును. కావుననే భగవదవతార ముల సంఖ్య కొలఁదిగ నున్నయది. ప్రతికార్యమునకుఁ దానే పూనుకొన్న లాభము లోకులకు లేదని యామహాత్ముఁ డెఱుం గఁడా? ప్రతిప్రాణియు భగవద్దత్తమగు స్వశక్తివలన స్వల్ప కార్యముల సాధింపవలయు. కాని సాధించిన కార్యము స్వశక్తివలననే యని గర్వింపరాదు. కార్యముచేయుట తన పనిగాని నెఱవేఱుట భగవదనుగ్రహముననే యని నిశ్చయిం పవలయు. అంతియకాని భగవదనుగ్రహమున నేమి లాభ మని గర్వించెనా వాని జన్మమే వ్యర్థము. అధోగతిపా లగును. ఈనీతులన్నియు నీ కథనుండి వెలువడును.

ఇంతియగాక వేఱొక పరమరహస్యవిషయ మీరెండు గాథలనుండి తెలియఁదగును. ఏమనఁగా ఖరాదిరాక్షసులు మాఱురూపముల నవతరించినట్లు నారదుఁడు భగవంతునితోఁ జెప్పినట్లు చదివితిరిగదా. శ్రీరామమూర్తిచే యుద్ధరంగమున మృతుఁడగు ఖరాసురుఁడు మరల నవతరించుట యేమి? యుద్ధ మరణమున, నందును శ్రీరామునిచేత మృతినొందిన ఖరునకు మోక్షము గలుగకపోయెనా? యన్న శంక గలుగకపోవునా. రావణకుంభకర్ణులు మృతినొందుట. త్రేతాయుగాంత్యభాగ

మునఁగదా. శిశుపాలాదుల నవతరించుట ద్వాపరయుగాంత్య తమభాగమునఁ గదా. ఈయవాంతరకాలము కొన్ని లక్షల సంవత్సరము లుండును. ఈకాలమంతయు శాపఫల మనుభ వింపఁజూచు జయవిజయులు ఎందుండి గడపిరి? ఏరూపమున నుండిరి? అని మన మాలోచించునపుడు సమాధాన మంత సులభముగఁ దోఁపదు. భగవంతునితో ద్వేషించి మూఁడుజన్మ ములలో నాశాపఫల మనుభవింతుము గాని భగవద్భక్తులమై ఆఱుజన్మములవఱకు వైకుంఠము వీడియుండఁజాల మనుకొన్న జయవిజయులు త్రేతాయుగాంత్యభాగము మొదలు ద్వాపర యుగమంతయు నూరకుండిరని చెప్పుటయుఁగూడ నంత సర సముకాదని నాభావము. అయిన సమాధాన మేమని యడిగిన నిది దీనికి సమాధానమని గ్రంథములనుండి చెప్పఁజాల కున్నాఁడను. మఱేమి గతి? ఒక్కయూహ నామదికిఁ దట్టు చున్నది.

ఒక్కపాపాత్ముఁ డుండిన భగవంతుఁ డవతరింప నవసరము లేదు. ఆతనితోఁగూడ మృతినొందఁదగినవారు, లోకమున కపకారము చేయు నూహలుగలవారు పెక్కుమంది భూతల మునఁ బుట్టవలయును. అట్టివారు భూమిఁ బ్రబలినఁగాని వారికిఁ బ్రభువై పుట్టు నవకాశ మీతనికి లేదు. పెక్కుమంది యట్టి వారు ప్రబలుటయు, సాధుజనులకు వారివలనఁ బెక్కిడుములు గలుగుటయు నను నీరెండుకార్యములు కలుగఁగా వివిధపాప ముల నొనరించినవాఁడు సమయ మిది కదా యని భావించి తానుం బుట్టును. ఈతని సాంగత్యమున నొక మహోహావము

గలుగును. దానఁ జావఁదగిన పాపులెల్లఁ బౌరుషమునఁ బురి కొల్పఁబడుచు మృతినొందుదురు.

ఈయూహా సిద్ధాంతమనియే నాభావము. దీనిప్రకారము జయవిజయులు వైకుంఠమున భగవత్సేవాతత్పరులై యుండి అట్టికాలము రాఁగాఁ దమశాపఫల మనుభవింపఁ బుట్టువుం గాంతురు. వారు నాయకులు కాఁగా వారిప్రాపున స్వల్పులందఱు చెలరేఁగుదురు. వీరందఱికి భగవంతునిచేఁ జావు తప్పక కల్గును. కావునఁ ద్రేతాయుగాంతమున వైకుంఠమునఁ జేరిన జయవిజయులు ద్వాపరయుగము చిట్టచివరవఱకు వైకుంఠమున నుండిరి. తమశాప మనుభవించుటకు సమయము భూతలమున మహాపాపులు మిక్కిలి నిండియుండుటచే రాఁగా నిపుడాశాప మనుభవింతమని శిశుపాలాదిరూపముల నవతరించిరి. ఖరాదులుకూడ నవతరించిరి. సహాయసంపద కలుగఁగా శిష్టుల బాధించుకార్యము చక్కఁగా సాగఁజొచ్చెను. ధర్మధ్వంసనము చేయఁబడుచుండెను. అపుడు శ్రీకృష్ణ పరమాత్మ యవతరించెను. వారి వధించి పరమపవిత్రులను జేసెను. అను నీసిద్ధాంతము పైనవ్రాసిన నాయూహ వాస్తవమైనచో నిల్చును. ఇతర ప్రమాణములు నా యీయూహకు విరుద్ధముగ నుండెనా యిది నిలువఁజాలదు. నిలువలేదే యను చింత నాకును లేదు. అట్టి ప్రమాణవాక్యములకొఱకే నాచిత్తము వేచియున్నది.

ఏది యెట్లున్నను బాపము వృద్ధినొందినఁగాని ధర్మము వృద్ధియగుట కవకాశము లేదు. అల్పపాపము నడంపఁ గంక ణముకట్టుకొనుట కెవరును బూనరు. కాఁబట్టి పాపము వృద్ధి కాఁగా దాని నశింపఁజేయ భగవంతుఁడో తద్భక్తులో పూను దురు. అది నశించిన నామమాత్రముగ నున్న ధర్మము చైతన్యస్థి తికి వచ్చును. భగవంతుఁడు తద్భక్తులుసదా ధర్మరక్షణ నిబద్ధు లగుదురనుట నిర్బాధక సిద్ధాంతము.

పాఠకులారా! కొలఁదిపంక్తులు వ్రాయుటచేఁ గథా సారము వదలునట్లు చేసి మీకు విసుఁగును గల్పించినవాఁడ నైతిని. కాని నాభావ మది కాదు. శ్రీకృష్ణగాథలన్నియు నీతి బాహ్యములు కానే కావనియు, నీతిపూర్ణములే యనియుఁ దెల్పుటకే యీనాప్రయత్నము తొలుదొలుత గోపికలన నెవరు? అనునది తెలిసికొన్నచో శ్రీకృష్ణునియం దారోపింపఁ బడు జారత్వరూపాపకీర్తి తొలంగు. శ్రీకృష్ణజన్మఖండము నుండి వ్రాయఁబడిన కథల ననుసరించిన గోలోకమున నుండు శ్రీకృష్ణప్రియులని తేలినది. ఇఁకఁ గథను నడిపెదను. సాధనము లన్నియు నలవడిన మీఁద నాటకము సాగునుగాని స్వల్ప పరికరములచే సాగదు. జగన్నాటకమును భగవంతుఁడే సర్వ పరికరభూయిష్ఠుఁడై నడుపుచుండుట మన మెఱింగితిమికదా! ఇఁకఁ గథాభాగమును జక్కఁగా సాగించెదను. మఱియొక్క విషయము చెప్పక తప్పదు. శ్రీకృష్ణనామము భగవంతున కనాదిగా వచ్చిన దని ముందే చెప్పఁబడినది. గోలోకవాసి

యగు పరమేశ్వరునకు శ్రీకృష్ణనామము. వైకుంఠవాసి యగు పరమేశ్వరునకు శ్రీవిష్ణునామము. శ్వేతద్వీపవాసియగు పరమేశ్వరునకు నారాయణనామము వర్తించుచుండు. ఈనామత్రయప్రతిపాద్యపరబ్రహ్మ మొక్కఁడే. పెక్కునామములు గలమహాత్ముఁడు గదా విష్ణుమూర్తి.

ఇఁక వాసుదేవనామ మెట్టిది? అన్నది యొక ప్రశ్నము. వసుదేవుని పుత్త్రుఁడగుట వచ్చినది యని కొందఱు వాదింపఁ జూతురేమో కాని యది యట్టిది కాదు. ప్రాచీనకాలము నుండి పిలువఁబడునదియే. వసుదేవుఁడనఁ గశ్యపముని యని తెల్పితిని. దేవకీదేవి యదితి యని తెల్పితిని. ఇంక వాసుదేవనామమహిమమును దెలిపెదను. అది తెలుపక కథలువ్రాయుట న్యాయము కాదని లేఖినియే నన్ను హెచ్చరించుచున్నది. ఈ గ్రంథము శ్రీకృష్ణావతారతత్త్వము గదా! కాఁబట్టి వాసుదేవనామమహిమమును మీ రవశ్యము వినఁదగినది. ప్రకృత కథకు సంబంధించినది కాదే యనకుఁడు. వాసుదేవనామము శ్రీకృష్ణకథలయందే కానఁబడును గదా. కావున నా యీ ప్రయత్నము అసంగతము కాక సుసంగతమే. ఆర్యులార! ఇఁకఁ దన్మహిమమును భక్తిమై నాలకింపుఁడు. ఆలకించి తన్నామమును వేదతుల్యమని నమ్ముఁడు. నమ్మి జపింపుఁడు. భగవంతుని నామము లొక్కొక్కటియు నొక్కొక్కఫలము నిచ్చుచుండును. ఈవాసుదేవ నామమహిమమును వినినపిదప నెన్నివిషయములు తెలియఁగలవో ముందు వివరించెదను. ఓపికమై వానిం బఠింపుఁడు.

## * పురుషోత్తమ క్షేత్రమహిమము.

పూర్వము మహామునులు మర్త్యలోకమునఁ బామర జనులు పెక్కుమంది యుండఁగలరు; గాన వారిఁ దరింపఁ జేయునుపాయ మెద్దియని యాలోచించి బ్రహ్మదేవునితో మాటలాడుచుండి పంకజాసనా! భగవత్క్షేత్రములయం దుత్త మోత్తమమగు పురుషోత్తమక్షేత్రమున శ్రీమహావిష్ణుప్రతిమ యేల లేకుండెను? ఇంద్రద్యుమ్నమహారాజు బలవాహనయు తుఁడై యచటికిం బోయి కృష్ణరాములను భద్రాదేవిని బ్రతిష్ఠ చేసెననుట కేమి హేతువు ? ఈసంశయమును దీర్పుమా యని ప్రార్థించిరి. పరమేష్ఠియు నామహామును లేల ప్రశ్నించిరో యని యెఱింగి వారిప్రశ్నమునకు మిగుల సంతోషించి వారి సంశయములఁ దీర్చువాఁడై యిట్లు పలికెను.

మునులారా! మీ ప్రశ్నము విని పరమానందభరితుండ నైతిని. ఇది లోకోపకారక్షమము కాన నవశ్యము సమా ధానము చెప్పెద. ఆలకింపుఁడు. పూర్వము శ్రీమహాలక్ష్మి యిట్లే విష్ణువును బ్రశ్నించెను. ఆపవిత్రకథను దెలిపిన మీసంశయ ములు తీఱును. ధరాతలంబున నుత్తరభాగమున నెంతోదూర మున మేరుపర్వతము గలదుగదా! అది సకల తరువరములచే నిరుపమాన మగుచు, బంగరురంగునఁ జెలంగుచుఁ దనను

* ఇది బ్రహ్మపురాణము నలుబదిమూఁడవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

సాటిలేక యలరారుట యందఱెఱింగినదియే కదా! ఆపర్వత మున నొకశృంగాగ్రమున భగవంతుఁ డగు జగన్నాథుఁడు శ్రీమహావిష్ణువు విలాసము మీఱ నివసించియుండెను. ఆమహా నుభావుం డవ్యయుండు కాన వాసుదేవాఖ్యఁ బరఁగు. ఆ పురుషోత్తమునితోఁ గమలాలయ యగు లక్ష్మీదేవి లోకాను గ్రహేచ్ఛఁ బూని వేడుకమై యిట్లు ప్రశ్నించెను. ఓప్రాణేశా! జగన్నాయకా! పురుషోత్తమా! నామది నొకసంశయము గలదు. దానిం దీర్ప నిన్నుఁదప్ప మఱెవ్వరి వేఁడుదు. మనుష్య లోక మతివిచిత్రముగ నున్నది. కర్మభూమి యనంబరఁగు. అందు జన్మించుట పరిపక్వపూర్వపుణ్యము చేతనే యని చెప్పఁ బడు. కాని లోభమోహాగ్రహాగ్రస్తమైనది. అది కామక్రోధ మహార్ణవ మనఁదగి యున్నది. అట్టి లోకమందుండు మను ష్యులు ఈసంసారసాగరమునుండి తరించు నుపాయము గలదా. ఈశంకను నాయందలి విశ్వాసముచేఁ దీర్పవలయు. అని ప్రార్థించు శ్రీదేవిం జూచి పరమహర్షంబున నిట్లు పలికెను. ఓదేవీ! కమలాలయా! సుఖముగ సేవింపఁదగి సులభసాధ్యమై, సత్ఫల మొసంగఁజాలి వెలయు క్షేత్ర మొక్కండు కలదు. అవి పురుషోత్తమక్షేత్రమనం బ్రఖ్యాతము. భూలోకమున దానిం బోలు వేఱొండు క్షేత్రము లేదు. అందు బురుషోత్తమనామం బున భగవంతుఁ డలరు. ఆయనయే వాసుదేవుఁడు. తన్నామస్మ రణము సకలపాతకతూలదవానలము. అందు నివసించిన గోపతి నగు నన్ను దేవదానవమహర్షి ప్రభృతు లెఱుంగరుసుమా. ఆక్షే

త్రము నాకుఁ బరమసమ్మతము. దాని మహిమమును వినిపింతు. అవధరింపుము.

పూర్వము మహాప్రళయము గల్గెను. సకల భూతకోటి నశించెను. దేవదానవాదులుకూడఁ గనఁబడక పోయిరి. ఏపదార్థము దృశ్యముకాక యుండెను. ఆతరుణమున జగద్గురువై, పరమాత్మ యనంబరఁగుచుఁద్రిమూర్తియై, జగత్కర్తయై, మహేశ్వరుఁడై వాసుదేవనామంబున వెలయు భగవంతుఁడు శ్రీహరి వెలుఁగుచుండెను. ఆవాసుదేవుఁడే యోగనిద్రావిముక్తుఁడై లేచి నాభిపంకజమునుండి బ్రహ్మను సృజించెను. ఆ శిశువు పద్మకేసరసంకాశ వర్ణుఁడై అవ్యయుం డననొప్పెను. ఆ బ్రహ్మ వాసుదేవుఁ డనుగ్రహింపఁ బంచభూతాత్మకసృష్టిని మెలమెల్లనఁ జేయ నారంభించెను. స్థూలసూక్ష్మభూతములను మాత్రాయోనుల, స్థావరములఁ, జరముల నీనాల్గువిధము లగు భూతముల సృజించెను. క్రమక్రమముగాఁ జరాచరభూతములు భూమి నిండెను.

ఆవల మరీచ్యాదిమహామునుల గంధర్వాదుల నవియివి యననేల నన్నిభూతముల వెలయఁజేసెను. నదీనదములు పర్వతములు, కాననములు ధరనిండెను. సకలభూతములు సృజింపఁబడియె. అంత బ్రహ్మక్షత్రియ వైశ్య శూద్రజాతులు నాలుగింటిని, అంత్యజుల,మ్లేచ్ఛుల నిర్మించి కృతకృత్యుఁడయ్యెను. ఆపిదపఁ దనంతన లోకముప్రవృద్ధియగు నుపాయ మేదియని యాలోచించి దక్షిణాంగమునఁ బురుషుని వామాంగమున స్త్రీవ్య

_క్తిని సృజించెను. ఆమిథునమునుండియె నాటంగోలెఁ బ్రపంచ సృష్టి వెలయసాగినది. ఈసృష్టింగల జీవులకుఁ దరణోపాయ మేదని యూహించి వాసుదేవరూపమును ధ్యానించుచుం డెను. ఇట్లు ధ్యానించినంతనే వేయినేత్రములు, వేయిపాద ములు, వేయిశీర్షములు తనరారఁ బురుషోత్తముఁడు పుండరీ కాక్షుఁడు శ్రీవత్సచిహ్నితోరస్కుఁడు సాక్షాత్కరించెను.

బ్రహ్మయు ఆపురుషోత్తమునిం గాంచినంతనే లేచి సకల విధోపచారములఁ బూజించి స్తుతించెను. అనుతులు నాకుం బ్రీతిజనకములు కాఁగా నే నిట్లంటిని. పంకజాసనా! నన్నేల ధ్యానించితివి. ఏమి నీకోరిక? అన విరించి యి ట్లనియె. వాసు దేవా! నిన్ను నేధ్యానించినది లోకహితార్థము. మర్త్యలోక వాసులు పరిశుద్ధమతులు కారుగాన మోక్షద్వారము వారికి దుర్లభము. స్వర్గద్వారమార్గములు యజ్ఞదానవ్రతములు, యోగసత్యతపశ్శ్రద్ధాతీర్థములు లోనగునవి. ఇవి మనుష్యు లకు సుసాధ్యములు కావు. వారు లోభాద్యుపహత చేత సులు. కాన వీనినన్నింటిని వదలి యింకొకసాధనంబున్నం దెల్పుఁడు. భూలోకమున నుత్కృష్టస్థానము గలిగినఁ దేట పఱపుఁడు. అది సర్వభక్తజనగమ్యము గావలయు.

ఆమాటలు బ్రహ్మనోటినుండి వెడలఁగనే నామూర్తి యగు వాసుదేవుం డాదరంబున బ్రహ్మకిట్లనియె.పరమేష్ఠీ! నీవు కోరినట్టి మహోత్తమక్షేత్రమును వచింతు. వినుము. అది వినిర్మలము. దుర్లభము. సర్వక్షేత్రోత్తమము. సంసారసాగరోత్తారణ

దక్షము. ధన్యము. గోబ్రాహ్మణహితము. పవిత్రము. చాతు ర్వర్ణ్యసుఖోదయము. మనుజులకు భుక్తిముక్తిప్రదము. సకల వాంఛ లొసంగుటచేతనే యది తీర్థరాజ మనంబడు. యుగ చతుష్టయోచితఫలదాన దక్షము. సర్వదేవదానవగంధర్వ విద్యాధర నాగ గరుడాదులయం దెట్లుత్తముఁడు పురుషోత్త ముఁడో అట్లా క్షేత్రము తీర్థోత్తమము. దక్షిణసాగరతీరమున నొక మఱ్ఱిచెట్టు గలదు. ఆ క్షేత్రము దశయోజనవిస్తీర్ణ ముగా నలరారుచుండు. ఆ క్షేత్రము శాశ్వతము. దానికి క్షయకాలములేదు. ఆ క్షేత్రమునవెలయు వటవృక్షము ఛా యనుసేవించిన బ్రహ్మహత్యలు నశించు నన దక్కుపాపముల మాటను జెప్పనేటికి? ఏజంతువు గాని యాక్షేత్రమును బ్రద క్షిణాకృతి సేవించినను, నమస్కారముచేసికొల్చినను, బాప ములు నశింప శ్రీవిష్ణ్వాలయము నొందఁగలదు.

ఆ వటవృక్షమునకు నుత్తరభాగమునందు దక్షిణమున శ్రీకేశవాలయము గలదు. అది ధర్మపదము. అందు వాసుదేవు నిచే నిర్మింపఁబడు ప్రతిమగలదు. దానినిసేవించిన నాలోకమున కనాయాసమునం బోవచ్చును. అని బ్రహ్మతోఁబలికెను. శ్రీ దేవీ! ఆ క్షేత్రమునుసేవించినవారు వైకుంఠమున కరుగుచుండఁ గాఁ జూచి యముఁడందుండు నాచెంతకరుదెంచి యిట్లనియె. మహాత్మా! దేవదేవా! పురుషోత్తమా! క్షీరోదశయనుఁడై సకల దేవతాపూజితచరణారవిందుఁ డైన భగవంతుఁడు వటమూల వాసికి నమస్కరించుచున్నాఁడ ననఁగా నేను ధర్మరాజా! నీవిపు

డేల స్తోత్రమున నన్నలరించితివో దానికారణము చెప్పుమా యని ప్రశ్నించితిని. యముఁడు భక్తిభరితుఁడై భగవంతా! సుప్రసిద్ధమైన యీపురుషోత్తమక్షేత్రమున ఇంద్రనీలసంకాశ ప్రతిమ సర్వకాలము వెలయుచుండును. ఆప్రతిమను సేవించిన మానవులు నిష్కాములై వైకుంఠమున కేగుచున్నారు. కాన నావ్యాపారము సాగకున్నది. నాయందనుగ్రహించి ఆ ప్రతిమ నుపసంహరింపుము. అట్లు చేయనిచో యమలోకమే యుండవలదు. దాన నేఫలము గలుగఁబోదు.

అని పలుకు యమునిం గాంచి యాపలుకులు సమంచితములుగనుండుటం జేసి ధర్మరాజా! నీచెప్పినట్ల యీప్రతిమను ఇసుకచేఁ గప్పి కనఁబడకుండఁ జేసెద. నీవ్యాపారము సాగకుండఁ జేయుట నాయాశయము కాదు. అని యాతని నూఱడిల్లంజేసి యాప్రతిమను వల్లీవితతినాచ్ఛాదించితి. ఆవల నిసుకచేఁ గప్పితి. స్వర్గకాంక్షగల మనుజు లేరీతినైనను దానిఁ గనఁజాలకుండ నొనరించితిని. బంగారురంగుగల తీఁగెలచే దానిం గప్పి ధర్మరాజును స్వపురమునకుం బంపితి. అని లక్ష్మీదేవితో విష్ణువు చెప్పినట్లు మునులతో విరించి వచియించి మునులారా! ఇంద్రనీలమణిప్రతిమ యిట్లంతర్ధానము నొందఁజేయఁబడఁగా నవ్వల నాక్షేత్రమున జరగిన వృత్తాంతమును లక్ష్మితో భగవంతుఁ డిట్లు చెప్పెను. ఆవృత్తాంతమును వచియించెద. సావధానులరై వినుండని బ్రహ్మయు మరల మునులతో నిట్లనియె.

తరువాత లక్ష్మీదేవిం జూచి నారాయణమూర్తి పద్మాదేవీ! నేనిట్టు లా ప్రతిమ నాచ్ఛాదించినపిదప నింద్రద్యుమ్న మహారాజచ్చటికి వచ్చి యాక్షేత్రమును దర్శించి దానిమహిమము నెఱింగి ప్రాసాదమును నిర్మించి యం దశ్వమేధము నొనరించి యొకనాఁ డొక్కయద్భుతావహాస్వప్నముం గాంచి తత్ఫలముగా లవణోదధితీరమున నొకదారువును దర్శించి వాసుదేవుని, శిల్పిని గాంచి యథావర్ణముగా నా ప్రతిమను నిర్మింపఁ జేసి దాని నాప్రాసాదమున స్థాపించుటయు, యాత్రాకాలమునఁ గల్పసంకీర్తన మొనరించుటయు, మార్కండేయమునిచరిత్రమును, శంకరస్థాపనమును, పంచతీర్థ మాహాత్మ్యంబును, శూలపాణి దర్శనంబును, వటవృక్ష దర్శనంబును, బలదేవకృష్ణ సుభద్రల దర్శనంబును, నరసింహ సందర్శనంబును, వృష్టి సంకీర్తనంబును, అనంత వాసుదేవసందర్శనంబును, శ్వేతమాధవమాహాత్మ్యంబును, స్వర్గద్వారదర్శనమును, సముద్రదర్శనస్నానతర్పణములను, సముద్రస్నాన మాహాత్మ్యమును, ఇంద్రద్యుమ్న చరిత్రమును, పంచతీర్థఫలంబును, శ్రీకృష్ణబలరామస్థానములను, సర్వయాత్రాఫలమును, విష్ణులోక వర్ణనమును, భగవంతుఁడు చక్కఁగా ననువదించెను. అని పరమేష్ఠి మునులతోఁ జెప్పెను.

## ఇంద్రద్యుమ్నుఁడు పురుషోత్తమక్షేత్రమును సందర్శించుట.

* ఇట్లు పంకజాసనుండు పలుక మహర్షు లిట్లు ప్రశ్నించిరి. 'పరమేష్ఠీ! కథాశేషమును వినఁగోరెదము. ఇంద్రద్యుమ్న మహారాజు ఆ దివ్యక్షేత్రమును దర్శించి యేకార్య మొనరించెను ? ఆవృత్తాంతమును దెలుపుమా'యని వేఁడిరి. బ్రహ్మయు వారిప్రశ్నము నాలకించి సాదరముగా నిట్లు బదులుచెప్పెను. 'మహాత్ములారా! వినుండు. ఆరాజు క్షేత్రమును దర్శించిన కృత్యమును జక్కఁగాఁ దెలిపెద.

ఒక్కనాఁడు పూర్వపుణ్యవశమున నింద్రద్యుమ్నమహారాజు పురుషోత్తమక్షేత్రమునకుం బోయి యందున్న రమణీయ స్థానముల దర్శించెను. సరస్సులఁ దిలకించెను. వింధ్యపాదవినిర్గతమై మహావేగముగాఁ బ్రవహించుచు వింధ్యాపలాఖ్య నలరుచు సకలపాపములఁ బోనడంచుచున్న మహానదిని గాంచెను. దక్షిణసముద్రగామినియై గంగానదిం దిలకించు నామహానది మహానదియనం బ్రఖ్యాతి వహించెను. ఆమహానది దక్షిణ సాగరకాంత. దుహితృ శతశోభిని. ఆనదీపరమున కిరుప్రక్కలను సకలసస్యశోభితములయి మనోహరములగు గ్రామములు పిక్కటిల్లుచుండును. అందు హృష్టపుష్టజనులు క్రిక్కిరిసియుం

* ఇది బ్రహ్మపురాణము ౪౪-వ అధ్యాయమునుండి సంగ్రహింపఁబడియె.

దురు. వారు సకలాభరణభూషితులయి సాటిలేక బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రజాతులకుం జేరి స్వకులోచితధర్మముల వర్ధిల్లుచు, శాంతులయి, శుభలక్షణముల దేజరిల్లుచుందురు. ఆ తీర గ్రామవాసులకుఁ దాంబూలచర్వణము మిక్కిలి ప్రియ కృత్యము. పుష్పమాలలందాల్చుట వారి సహజకార్యము. ఆ గ్రామములందలి వనితలు దేవకాంతలం గేలిసేయువారు. గాన స్త్రీలియలరఁ బాతివ్రత్యవిభూషితులై యలరారుచుందురు.

ఇట్టి నరనారీసమాజుష్టమగు నాపురుషోత్తమక్షేత్రము నింద్రద్యుమ్నుఁడు పొడఁగాంచి దాని రామణీయ మద్భుత ప్రమోదమగ్నుం గావింపఁ బరిశుద్ధమనస్కుఁడై యిందే నివ సించి భక్తిమై భగవంతు నారాధించెదను. ఆతఁడే నాకు దిక్కు. సనాతనుండై పరమపదప్రదాతయై సర్వేశ్వరుఁడయి యపరాజితుండై వెలయు శ్రీమహావిష్ణుని సేవించెదను. మహో న్నతాకృతిం గల వటభూరుహ మిం దలరారెడు. ఇది మానస తీర్థము ఇందు వెలయు శ్రీవాసుదేవప్రతిమ భగవంతునిచే గుప్తము గావింపఁబడియెనని వింటిని. ఇందు వేఱొకప్రతిమ గానరాదు. సత్యపరాక్రముం డగుభగవంతుఁడు ప్రత్యక్ష మెట్లగునో అట్టిప్రయత్నమును గావించెదను. యజ్ఞదానతపో హోమధ్యానార్చనోపవాసముల విధివిధానమున నొనరించి భగవంతు నారాధించెదను. అనన్యమతినై తదాసక్తహృద యుఁడనై శ్రీవిష్ణుదేవాలయమును గట్టింపఁ బ్రారంభించెదను.

అని విచారించి దృఢమనస్కుఁడై తత్కార్యకరణబద్ధదీక్షుఁ
డయ్యెను.

—{ఇంద్రద్యుమ్నుఁడు ప్రాసాదమునుగట్టించి పురు
షోత్తమక్షేత్రమున నశ్వమేధ మొనరించుట.}—

* మహామునులారా! ఇట్లు కృతనిశ్చయుఁడై యింద్ర
ద్యుమ్నుఁడు ప్రాసాదనిర్మాణమున కారంభించి ఆ దేశమున
నున్న జ్యోతిశ్శాస్త్రపారంగతుల దైవజ్ఞుల రావించి తదను
మతింగొని భూమినిశోధించి పరమప్రమోదాధీనమానసుండై
ప్రారంభించెను. అంత సకల వేదశాస్త్రసంపన్నులగుచు బ్రహ్మ
జ్ఞాననియతులగు బ్రాహ్మణులు, అమాత్యులు, వాస్తువిద్యా
విశారదులగు భూసురులు, మహాకార్య మిది వదలక చేయ
వలయునని ప్రోత్సహించిరి. శుభముహూర్తమును నిర్ణయిం
చిరి. తారాచంద్రబలములు లగ్నబలము లోనగు శాస్త్రోక్త
పద్ధతులఁ బరిశీలించి సుముహూర్తమును నిర్ణయింప రాజు
లందులకెంతయు నానందించి జయమంగళఘోషములు, మనో
హరనానావాద్యధ్వనులు చెలంగుచుండ, వేదపఠననాదములు
భావిశుభోదయముల సూచించుచుండఁ ప్రాసాదనిర్మాణమున
కారంభించి పుష్పఫలలాజాక్షతలు గంధము లోనగు పరిమళ
ద్రవ్యములతో భగవంతున కర్ఘ్యమిచ్చెను.

* ఇదియుఁ బ్రహ్మపురాణము ४९-వ యధ్యాయమునుండి పరి
గృహీతమని యెఱుంగునది.

అంత నింద్రద్యుమ్నమహారాజు కళింగదేశాధిపతి యగు శూరుని, ఉత్కలదేశాధీశుని, గోసలాధీశ్వరుని రావించి ప్రియమాటల నిట్లు పలికెను. రాజోత్తములారా! మీరు సహామాత్యులయి, శిలాశాస్త్రవేత్త లగుశిల్పిజనులం గూడి నానాకందరసుందరంబై కన్నులపండువుగా నున్న వింధ్యాచలం బునకుం బొండు. అందు నానాసానువులఁ బరిశీలింపుఁడు వివిధభాగముల వెదకుఁడు. శిల్పిజనులు చెప్పినచోట్లను బరి శుద్ధస్థలంబున శిలలను గ్రహింపుఁడు. శ్రద్ధాభక్తులు గలయ వానిని బడిలముగా శకటములపైఁ గాని, వాహనములపైఁ గాని యునిచికొని తెండు. ఈదివ్యప్రాసాదమున నా శిలావర్య ములఁ బ్రతిష్ఠింపవలయును. అని పలికి మఱియు వారు విను చుండ దూతలంజీరి యిట్లు శాసించెను. దూతలారా! వేవేగ నలుదెసలకుం బొండు. అందందుఁగలరాజుల నాయాజ్ఞానుసార మాహ్వానింపుఁడు. ఇంద్రద్యుమ్నాజ్ఞను శిరసావహించి సబల వాహనులై పురుషోత్తమక్షేత్రమునకు రావలయు. రాజు తత్క్షే త్రమున దివ్యప్రాసాదము భగవంతుని స్థాపించుటకు నిర్మించు చున్నాఁడు. మీతో మాటలాడఁ దలఁచియున్నాఁడు. అని తెలిపి వేవేగ రండు. పొండు. అనియాజ్ఞాపింప వా రతివేగంబ యరిగి రాజాజ్ఞఁ దెలిపిరి.

ఇంద్రద్యుమ్నాజ్ఞ వినఁగానే తూర్పు, దక్షిణము, పడ మర, ఉత్తరము నను దిక్కులనుండు రాజులు * ద్వీపవాసులు,

---

* ప్రత్యంతవాసినో యేవా యేచ సన్నిధివాసినః, పార్వతీయాశ్చ

సమీపదేశవాసు లగుభూపతులు, ఆక్షేత్రమున కిరుప్రక్కల నుండు మహీపతులు, పర్వతదేశపాలకులు సబలవాహనముగా నరుదెంచిరి. వారివెంటఁ దత్పురోహితులు, తత్పండితులు వేడుక నేతెంచిరి. ఇట్లు రాజులందఱు నేల యీనినట్లు వచ్చి నిండియుండ శిలాసంగ్రహణమునకై పోవనున్న మహీజానులు చూచుచుండ ఇంద్రద్యుమ్నుఁడు యథోచితసత్కారముల వారిని సమ్మోదమనస్కులనుగాఁ జేసి గంభీరకంఠనాదం బొప్పుచుండ నిట్లు పలికెను.

మహీపతులారా! సత్కార్యనిరతమతులారా! నేనొక్క చిన్నమాట చెప్పెద. సావధానముగ వినుండు. ఈక్షేత్రము పరమపావనము. భుక్తిముక్తిప్రదము. కావున నీమహాక్షేత్రంబున నశ్వమేధ మహాక్రతువు చేయంబూనినాఁడ. ముందు దివ్యప్రాసాదము నిర్మించి ప్రతిమాప్రతిష్ఠనొనరించి యవ్వల నశ్వమేధమొనరింప నిచ్ఛ పొడమెడు. మీరందఱు మిగుల దయాంతరంగముల సాయమొనరింప నడుముగట్టెద రేని నా కాంక్ష యీడేరు. మీమీయాశయముల నెఱిఁగింపుఁడు. అనుటయు నాభూజాను లామహీజానితో నిట్లనిరి. రాజచంద్రమా! నీకాంక్ష సకలవిధములఁ బొగడ్త కెక్కఁ జాలినది. దీని కే మోపినంత సాయ మొనరింతుము. శక్తివంచనలేక

---

యేకేచి త్తథా ద్వీపనివాసినః. అని మూ. ౪౫ అ. ౧౬ శ్లో. సముద్రప్రాంతములనుండు ద్వీపవాసులని యర్థమేగాని ద్వీపాంతరరాజులని యర్థము గాదని యెఱుంగనగు.

తోడ్పడుదుము. వేవేగ యీ మహాకార్యముల నన్నింటి నొన రింపుఁడు. ఈపావనక్షేత్రప్రతిష్ఠవలన ననేకజనులు యాత్రార్థ మరుదెంచి పరమేశ్వరు దర్శించి సంక్షాళితపాపపంకులై నిర్మల స్వాంతులై గృహంబుల కేగఁగలరు. వారు సుసంగతికిం బోఁ జాలుదురు. మీయశంబు నలుదిక్కుల నల్లుకొను. ఈప్రాంత ముల నున్నమే మెల్ల ననవరత మీక్షేత్రవాసియగు పరమా త్మ్ముం జూచుచు ధన్యుల మగుదుము. అని తమతమ సంతోషము లను దెలిపి సువర్ణరాసుల వర్షించిరి. కంబలాజినాదిపదార్థముల నొసంగిరి. రాంకవాస్తరణాదుల నిచ్చిరి. వజ్రవైడూర్య మాణిక్య పద్మరాగేంద్ర నీలాదిరత్నముల రాసులుగఁ బోసిరి. గజతురగరథపదాతులఁ దదధీనులఁ జేసిరి. శాలివ్రీహియవ మాషముద్గతిలచణక గోధూమమసురాదిపదార్థములఁ గొండ లంత పోడవుగాఁ బోసి పరిగ్రహింపుమా యని వేడిరి. సకల సంభారముల నమర్చి తమ కార్యముల నిర్వహించి రాజులు కృతకృత్యులైరి.

అంతట నింద్రద్యుమ్నమహారాజు సర్వభారములం గాంచి యింతింతనరాని సంతసమంది రాజుల బహూకరించి ఋత్విక్కుల నియమింపంబంచి వేదవేదాంగపారగులగు భూ సురులు ఋత్విజులౌటకు సంసిద్ధులు కాఁగా కులక్రమాగతుఁ డగు పురోధనుం బొడఁగాంచి మహాత్మా! ఋత్విజులు తోడఁ రాఁగా యజ్ఞార్హప్రదేశమును నిర్ణయింపుము. సర్వసంభార ములు సమకూడె. వేవేగ నిర్ణయింపు మని సవినయముగాఁ బలికెను. పురోహితుండు రాజాజ్ఞ నిర్వహింప ససహాయుఁడై

కదలి యాచెంతనున్న పల్లియల వెదకి పరిశుద్ధభూతలంబై సర స్తటాకసంభృతం బగు ధీవరగ్రామంబు యజ్ఞార్హమగుట నెఱింగి చక్కఁగాఁ బరిశీలించి యజ్ఞమండపంబుల నిర్మింపఁ దగువారి నియోగించి యావార్త రాజున కెఱింగించెను.

అంత సర్వవిధముల నా యజ్ఞశాల కై సేయఁబడియె. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రజాతుల కనువగు రీతి వసతులు నిర్మింపఁబడియెను. సభామండపములు సిద్ధముచేయఁబడియె. మహారాజులకుఁ బ్రత్యేకముగ గృహము లమర్పఁబడియె. భోజనశాలలు, గానశాలలు, నృత్యశాలలు పలువిధములఁ గట్టఁబడియెను. కన్నులపండువుగ శిల్పు లాయజ్ఞమండపాదుల నిర్మించి రాజప్రసాద పాత్రులైరి.

అంత రాజులరుదెంచి యింద్రద్యుమ్నున కుత్సాహంబు పుట్టించుచుఁ దమతమ విడుదులం దిగిరి. శిల్పికృతగృహ నిర్మితి కెంతయుఁ గొనియాడిరి. రాజేంద్రుండును శిల్పి వర్యులఁ బెక్కురీతుల సన్మానించెను. అవ్వేల యజ్ఞకర్మమారం భింపఁబడియె. * యజ్ఞము సాగుచుండఁగా నానాదేశముల నుండి హేతువాదులై వాచోయుక్తి పటువులై యలరు పండితు లరుదెంచి పరస్పర జిగీషల సభాముఖమునఁ బెక్కు

* హేతువాదములు సభలో వాదింపఁబడుట, అందుఁ బండితులు పరస్పరజయేచ్ఛల వాదించుచుండుట, అదియే పరమపురుషార్థమని తలంచుట యనునీయనాచారము పూర్వకాలమునుండి వచ్చుచున్నదే యని స్పష్టమగును. వేదాంతశాస్త్రవాదమునందుఁగూడఁ గ్రోధావేశపరవశులై వాదింతురు. ఆహా! ఏమి తచ్ఛాస్త్రపఠనఫలము? వర్ణనాతీతముగదా!

రీతుల వాదించుచుండిరి. శ్రోతలు తలలాడించుచు వినుచుండిరి.

అంతట యజ్ఞక్రియ సాగించుచు ఋత్విజులు సర్వకార్యమందప్రమత్తులై యుండిరి. తత్కృత్యములంగాంచుచు ద్రష్టలు పరమానందమునఁ దేలుచుండిరి. రాజులు హయమేధము నిర్విఘ్నముగా సాగించు కుతూహలమున నోపికవై సాయపడుచుంచిరి. హయవర్యము రాజకుమార వీరరక్షితమై యథోచిత దేశములఁ దిరిగి తిరిగి వచ్చెను. అదట విధివంతముగ ఇంద్రద్యుమ్న మహారాజు హయమేధమును సాంగముగ నొనరించెను. యథావిధి సభాస్తారులఁ బూజించెను. ఋత్విక్ప్రిధానముగ సభాపూజ సాగెను. రాజుల సన్మానించెను. అందఱును దత్సమ్మానములఁ బరమానంద భరితులై తమ తమ వసతుల కరిగిరి.' అని యిట్లుపలికి మరల బ్రహ్మ మునుల కిట్లనియె.

## ఇంద్రద్యుమ్నుఁ డహర్నిశములు భగవంతుని ధ్యానించుచు వినుతించుట.

* మునివర్యులారా! ఇట్లు వేదోక్తవిధానమున అశ్వమేధము పూర్తినొందించి మహారాజు సంసారసాగర భీతినుండి తన్ను మరలించుకొను వాఁడై స్వాంతఃకరణపరిశుద్ధ్యర్థ మేకాంతస్థలమునఁ గూరుచుండి శ్రీమహావిష్ణులోకవర్యమును బొందఁగోరి జగదానందదాయకుం డగు శ్రీభగవంతుని వాసు

* ఇది బ్రహ్మపురాణము ౪౯ అధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

దేవు నిట్లు స్తుతించెను. * ఓ జగదాధారా! విశ్వేశ్వరా! నీవు సర్వకామ ప్రపూరకుఁడవు. లక్ష్మీకాంతుఁడవు. కరుణాసింధు

---

* ఇంద్రద్యుమ్నకృత వాసుదేవస్తుతిః.

జగదాధార విశ్వేశ సర్వకామప్రపూరక, లక్ష్మీకాంత కృపాసింధో భక్తవత్సల సత్ప్రియ. ౧. త్రాహివిష్ణో మహారాజ మగ్నం మాం భవసాగరే, ప్రళయానలసంకాశ నమస్తే దితిజాంతక. ౨. నరసింహ మహావీర్య త్రాహి మాం దీప్తలోచన, యథా రసాతలా దుర్వీ త్వయా దంష్ట్రోద్ధృతా పురా. ౩. తథా మహా వరాహత్వం త్రాహిమాం దుఃఖసాగరాత్, తవైతా మూర్తయః కృష్ణ వరదాః సంస్తుతామయా. ౪. త్వం చే మే బలదేవాద్యాః పృథగ్రూపేణ సంస్థితాః, అంగాని తవ దేవేశ గరుత్మాద్యా స్తథా ప్రభో. ౫. దిక్పాలా స్సాయుధాశ్చైవ కేశవాద్యా స్తథాచ్యుత, యేచాన్యే తవ దేవేశ భేదాః ప్రోక్తా మనీషిభిః. ౬. తేపిసర్వే జగన్నాథ ప్రసన్నాయతలోచన, మయార్చితా స్తుతా స్సర్వే తథా యూయం నమస్కృతాః. ౭. ప్రయచ్ఛధ్వం వరం మహ్యం ధర్మకామార్థ మోక్షదాః, భేదా స్తే కీర్తితా యేతు హరసంకర్షణాదయః. ౮. తవపూజార్థ సంభూతా స్తేచ త్వయి సమాశ్రితాః, నభేద స్తవ దేవేశ విద్యతే పరమార్థతః. ౯. వివిధం తవ యజ్ఞార్థం రూపం తదుపచారతః, అద్వైతం త్వాం కథం ద్వైతం వక్తుంశక్నోతిమానవః. ౧౦. ఏక స్త్వం హి హరే వ్యాపీ చిత్స్వభావో నిరంజనః, పరమం తవ యద్రూపం భావాభావవివర్జితమ్. ౧౧. నిర్లేపం విమలం సూక్ష్మం కూటస్థ మచలం ధ్రువమ్, సర్వపాప వినిర్ముక్తం సత్తామాత్ర మవస్థితమ్. ౧౨. తద్దేవాశ్చ నజానంతి కథంజానా మ్యహం ప్రభో, అపరం తవ యద్రూపం పీతవస్త్రం చతుర్భుజమ్. ౧౩. శంఖచక్రగదాపాణి ముకుటాంగద ధారిణమ్, శ్రీవత్సోరస్క సంయుక్తం వనమాలావిభూషితమ్. ౧౪. తదర్చయంతి విబుధా యే చాన్యే తవసంశ్రయాః, దేవ దేవ సురశ్రేష్ఠ భక్తా నామ భయప్రద. ౧౫.

పవు. భక్తవత్సలుఁడవు. సజ్జనప్రియుఁడవు. స్వామీ! శ్రీమహా విష్ణూ! నన్ను సంసార సముద్రమునుండి ఉద్ధరింపుము. ప్రళయ

---

త్రాహిమాం పద్మపత్రాక్ష మగ్నం విషయసాగరే, నాన్యం పశ్యామి లోకేశ యస్యాహం శరణంవ్రజే. ౧౬. తామృతే కమలాకాంత ప్రసీద మధుసూదన, జరావ్యాధి శతైర్యుక్తో నానాదుఃఖైర్నిపీడితః. ౧౭. హర్షశోకాన్వితో మూఢః కర్మపాశైస్సుయంత్రితః, పతితో ఽహం మహారౌద్రే ఘోరే సంసారసాగరే. ౧౮. విషమోదక దుష్పారే రాగద్వేషఝషాకులే, ఇంద్రియావర్తగంభీరే తృష్ణాశోకోర్మి సంకులే. ౧౯. నిరాశ్రయే నిరాలంబే నిస్సారేఽత్యంతచంచలే, మాయయా మోహిత స్తత్ర భ్రమామి సుచిరం ప్రభో. ౨౦. నానాజాతి సహస్రేషు జాయమానః పునఃపునః, మయా జన్మాన్యనేకాని సహస్రాణ్యయుతానిచ. ౨౧. వివిధాన్యను భూతాని సంసారేఽస్మిన్ జనార్దన, వేదాస్సాంగా మయా ధీతాః శాస్త్రాణి వివిధానిచ. ౨౨. ఇతిహాస పురాణాని తథా శిల్పాన్యనేకశః, అసంతోషా శ్చ సంతోషా సంచయాపచయావ్యయాః. ౨౩. మయా ప్రాప్తా జగన్నాథ జయవృద్ధ్యుదయేతరాః, భార్యారి మిత్ర బంధూనాం వియోగా స్సంగమా స్తథా. ౨౪. పితరో వివిధా దృష్టా మాతరశ్చ తథామయా, దుఃఖానిచాను భూతాని యానిసౌఖ్యాన్యనేకశః. ౨౫. ప్రాప్తాశ్చ బాంధవాః పుత్రా భ్రాతరో జ్ఞాతయ స్తథా, మయోషితం తథా స్త్రీణాం కోష్ఠే విణ్మూత్రవిప్లవే. ౨౬. గర్భవాసే మహాదుఃఖ మనుభూతం తథాప్రభో, దుఃఖాని యాన్యనేకాని బాల్య యౌవన గోచరే. ౨౭. వార్ధకేచ హృషీకేశ తాని ప్రాప్తాని వై మయా, మరణే యాని దుఃఖాని యమమార్గే యమాలయే. ౨౮. మయాతా న్యను భూతాని నరకే యాతనాకులే, క్రిమికీటద్రుమాణాంచ హస్త్యశ్వ మృగపక్షిణాం. ౨౯. మహిషోష్ట్ర గవాంచైవ తథాఽన్యేషాం వనౌకసాం, ద్విజాతీనాం చ సర్వేషాం శూద్రాణాం చైవయోనిషు. ౩౦. ధనినాం క్షత్రియాణాంచ దరిద్రా:

కాలాగ్ని తుల్యుఁడవు. రాక్షసాంతకుఁడవు కావున నీకు నమస్కరింతును. దీప్తలోచనా! నరసింహా! మహావీర్యా! నన్నుఁ

---

ణాం తపస్వినాం, నృపాణాం నృపభృత్యానాం తథాఽన్యేషాం చ దేహినామ్. ౩౧.గృహేషు తేషా ముత్పన్నో దేవ చాహంపునఃపునః,గతోఽస్మి దాసతాం నాథ శ్రీమతాం బహుశో నృణాం. ౩౨. దరిద్రత్వంచేశ్వరత్వ స్వామిత్వంచ తథాగతః,హ తామయా హతశ్చాన్యైర్ఘాతితో ఘాతితా స్తథా. దత్తంమయాన్యైరన్యేభ్యోమయాదత్తమనేకశః, పితృమాతృ సుహృద్భ్రాతృకళత్రాణాంకృతేనచ. ౩౪. ధనినాంశ్రోత్రియాణాంచ దరిద్రాణాంతపస్వినాం, ఉక్తందైన్యంబహువిధంత్యక్త్వాలజ్జాంజనార్దన. ౩౫. దేవతిర్యఙ్మనుష్యేషుస్థావరేషుచ రేషుచ, నపశ్యామితుతత్స్థానం యత్రాహం నగతః ప్రభో. కదా మేనరకేవాసః కదాస్వర్గేజగత్పతే, కదామనుష్యలోకేషుకదాతీర్థజలేషు చ. జలయంత్రే తథాచక్రే ఘటీరజ్జునిబంధినీ, యానిచోర్ధ్వమధశ్చైవ కదామధ్యేచతిష్ఠతి. ౩౮. తథాచాహంసురశ్రేష్ఠకర్మరజ్జుసమాశ్రితః, అధశ్చోర్ధ్వం తథామధ్యేభ్రమామికర్మయోగతః. ౩౯. ఏవంసంసారచక్రేఽస్మిన్ భైరవేరోమహర్షణే, భ్రమామిసుచిరంకాలంనాంతంపశ్యామికర్హిచిత్. ౪౦. నజానే కింకరోమ్యద్యహారేవ్యాకులితేంద్రియః, శోకతృష్ణాభిభూతశ్చకాందిశీకోవిచేతనః. ౪౧. ఇదానీంత్వా మహం దేవవిహ్వలశ్శరణంగతః, త్రాహిమాందుఃఖితం కృష్ణమగ్నం సంసారసాగరే. ౪౨. కృపాంకురుజగన్నాథ భక్తంమాంయదిమన్యసే, త్వదృతేనాస్తిమేబంధుర్యోఽసౌచింతాంకరిష్యతి. ౪౩. దేవత్వాం నాథమాసాద్యనభయం మేఽస్తికుత్రచిత్, జీవితేమరణేచైవయోగక్షేమేఽథవా ప్రభో.౪౪. యేతు త్వాంవిధివద్దేవనార్చయంతినరాధమాః, సుగతిస్తుకథం తేషాంభవేత్సంసారబంధనాత్. ౪౫. కింతేషాం కులశీలేన విద్యయాజీవితేనవా, యేషాంనజాయతే భక్తిర్జగద్ధాతరికేశవే. ౪౬. ప్రకృతించాసురీం ప్రాప్యయేత్వాం నిందంతి మోహితాః, పతంతినరకేతేతు జాయమానాః

గాపాడుము. మహాత్మా! రసాతలమునుండి భూమి వరాహ రూపధారి వగు నీచేత దంష్ట్రాగ్రధారితమై యెట్లుద్ధరింపఁ బడెనో యట్లే నన్ను దుఃఖసాగరమునుండి యుద్ధరింపుము. వర ములొసంగు నీ దేవతామూర్తులన్నియు నో కృష్ణా! నీమూర్తులే. నీవే యీ బలదేవాది నామముల వేఱుమూర్తులుగా వెలసితివి. నీయవయవములే సాయుధులగు దిక్పాలకులు. కేశ వాదిరూపములుగాఁ బరిగణింపఁబడు. ఓజగన్నాయకా! పెద్దలచే నేయే భేదములు నీకుఁ గల్పింపఁబడినవో అవి యన్నియుఁ బ్రసన్నాయత లోచనుఁడ వగు నిన్నుఁ బూజించుటచే, స్తుతించుటచే బూజితములే. సంస్తుతములే. ధర్మార్థ కామమోక్షముల నొసంగు నోస్వామీ! నాకు వరమొసం

---

పునఃపునః. ౪౭. నతేషాం నిష్కృతి స్తస్మాద్విద్యతే నరకార్ణవాత్, యేదూ షయంతి దుర్వృత్తాస్త్వాం దేవపురుషాధమాః. ౪౮. యత్ర యత్ర భవేజ్జన్మ మకర్మనిబంధనాత్, తత్ర తత్ర వారే భక్తిస్త్వయిచాస్తు దృఢాసదా. ౪౯. ఆరాధ్యత్వాం సురాదైత్యా నరాశ్చాన్యేపి సంయతాః, అవాపుః పరమాం సిద్ధిం కస్త్వాందేవం నపూజయేత్. ౫౦. నశక్నువంతి బ్రహ్మాద్యా స్తోతుం త్వాం త్రిదశాహరే, కథం మానుష బుధ్యాహంస్తౌమి త్వాం ప్రకృతేఃపరం. తథాచాజ్ఞాన భావేన సంస్తుతోఽసిమయా ప్రభో, తత్క్షమస్వాపరాధం మేయది చాస్తికృపామయి. కృతాపరాధేఽపిహరే క్షమాం కుర్వంతి సాధవః, తస్మా త్ప్రసీదదేవేశ భక్తస్నేహం సమాశ్రితః. ౫౩. స్తుతోఽసియన్మయా దేవ భక్తిభావేన చేతసా, సత్యం భవతు తత్సర్వం వాసుదేవ నమోస్తుతే. ౫౪. బ్రహ్మపురాణే. ౪౬ అ. ఈశ్లోకసంఖ్య పురాణముననున్నట్లుండదు. స్తుతి గతశ్లోక సంఖ్యయేయని యెఱుంగునది.

గును. ఓవాసుదేవా! హరసంకర్షణాదిమూర్తులు నీభేద ముగా నేవేవి కీర్తింపఁబడుచుండునో అవియన్నియు నీపూజార్థమేర్పఱుపఁబడునవియు నీయందుండునవియు నని తలంచెదను. దేవేశా! పరమార్థదృష్టి నాలోచించిన నీయొక్క భేదమే కానరాదు. బహువిధముగా సర్వారూపములు కల్పింపఁబడినవి. రెండవపదార్థమే లేని నిన్ను ద్వైతముగాఁ జెప్పుటకు మానవుఁ డెట్లు సమర్థుఁడగును. ఓహరీ! నీవొక్కఁడవే. సర్వవ్యాపివి. చిత్స్వభావుఁడవు. నిరంజనుఁడవు. ఏనీయుత్కృష్టరూపము భావాభావ వివర్జితమో అది నిర్లేపము. నిర్మలము సూక్ష్మము. కూటస్థము. అచలము నగును. ఇది ధ్రువము. సర్వపాపవినిర్ముక్తమగు నేనీరూపముగలదో అది సత్తామాత్రవ్యవస్థితము. దానిని దేవాదులే యెఱుంగఁజాలరన నింక నేనెట్లు తెలిసికొనఁగలను? నీయొక్క వేఱు రూపము పీతవస్త్రాలంకృతమై, చతుర్భుజమై, శంఖచక్రగదాభూషితమై, మకుటాంగదశోభితమై, శ్రీవత్సోరస్కమై, వనమాలావిభూషితమై యలరారునో దానిని దేవతలు నీభక్తులు పూజింతురు. ఓ దేవదేవా! భక్తాభయప్రదాయకా! పద్మపత్రవిశాలాక్షా! నన్ను విషయసాగరమునుండి యుద్ధరింపుము. నే నితరదేవతలనమ్మలేదు. నీశరణు సొచ్చితిని. నిన్ను నమ్మితిని. కాన నోమధుసూదనా! నాకుం బ్రసన్నుండవగుము. స్వామీ! జరావ్యాధిశతములతోఁ గూడి, నానా దుఃఖసంపీడితుఁడ నగుచు, హర్షశోకాన్వితుఁడనై, మూఢుఁడనై, కర్మపాశసంబద్ధుఁడనై ఈసంసారసాగరంబునఁ బడుచు

న్నాఁడను. ఇది మహాఘోరరూప మైనది. విషయజలపూర్ణ మైనది. రాగద్వేష మత్స్యసంఘాత సమన్వితము. ఇంద్రియావర్తగంభీరము. తృష్ణాశోకోర్మిసంకులము. నిరాశ్రయము. నిరాలంబము. నిస్సారము. అత్యంతచంచలము. అట్టి యీ సంసారసముద్రమునందు మాయామోహితుఁడనై చాల కాలమునుండి తిరుగుచున్నాఁడ. అటు ఇటు పొరలాడు చున్నాఁడను. నానావిధజాతిసహస్రములందు మరలమరల జన్మించుచున్నాను. నాచేత ననేకజన్మసహస్రాయుతములు అనుభవింపఁబడినవి. జనార్దనా! ఈ సంసారమందే పడి యింత దనుక నున్నాఁడను. స్వామీ! వేదములు సాంగములుగాఁ బఠించితిని. వివిధశాస్త్రములు చదివితిని. ఇతిహాసపురాణములు, అనేకశిల్పములు పఠించితిని. అసంతోషములు, సంతోషములు, సంచయాపచయములు, వ్యయములు, జన్మ వృద్ధిక్షయములు నగుజన్మము లనేకము లెత్తితిని. భార్యారిమిత్రబంధువు, సంయోగవియోగములు, తండ్రులు, తల్లులు, ఎన్నియోవిధములఁ జూచితిని. సకలదుఃఖముల, వివిధవిధసంతోషము లనుభవించితిని. బాంధవులు, పుత్రులు, సోదరులు, జ్ఞాతులు నాకెందఱో యుండిరి. విణ్మూత్రవిప్లవస్త్రీకోష్ఠమునందుఁ జిరకాలము గడపితిని. గర్భవాసదుఃఖముల నెన్నింటినో యనుభవించితిని. బాల్యయౌవన వార్ధకరూపదుఃఖముల ననేకముల ననుభవించితిని. నాచే మరణదుఃఖములు, యమమార్గదుఃఖములు, యమాలయదుఃఖములు, నరకదుఃఖములు బహువిధముల ననుభవింపఁబడి

నవి. క్రిమికీటద్రుమములయు,హస్త్యశ్వమృగపక్షులయు, మహిషోష్ట్రగోవులయు, మఱి యింకనుగల యనేక వన్యమృగములయు, ద్విజశూద్రులయు యోనులయందుఁ బుట్టువుం గాంచితిని. ధనసంపన్నులగు క్షత్రియజాతులయందును, దరిద్రులగు తాపసజాతియందును, నృపులయు నృపసేవకులయు వంశములందును, మఱియు ననేక జాతులయందుఁ బుట్టితిని. లోకేశ్వరా! శ్రీమంతులకడ దాసుఁడనై పెక్కుమాఱు లుంటిని. రాజభృత్యులకడ, నింక నెందఱ యిండ్ల చెంతనో సేవకుఁడనుగా నుంటిని. వారియిండ్లలో నెన్ని సారులో పుట్టితిని. మహానుభావా! పరమేశ్వరా! దరిద్రుఁడ నైతిని. స్వామినైతిని. ప్రభువునైతిని. ఎందఱినో వధించితిని. ఎందఱ చేతనో వధింపఁబడితిని. ఎందఱినో దండించితి. ఎందఱి చేతనో దండింపఁబడితి. అనేక యాచకుల కర్థమిచ్చితి. ఎందఱి చేతనో ద్రవ్యముం గొంటిని. ఈ పరిగ్రహించుట పితృమాతృసుహృద్భ్రాతృకళత్రముల కొఱకేకాని నాకొఱకుఁ గాదు. ధనవంతులగు శ్రోత్రియుల చెంతను, దరిద్రులగు తపస్వులసన్నిధిని సిగ్గు వదలి నా దైన్యము ననేక పర్యాయములు నివ్వవించితిని. దేవాదిదేవా! దేవతిర్యఙ్మనుష్య చరస్థావరభూతకోటియందు నాపుట్టని తావు లేదు. పరమపురుషా! కర్మరజ్జుసంబద్ధుఁడనై మనుష్య లోకములందు, తీర్థ జలములయందు, నరకమందు, స్వర్గమందు, జలయంత్రములందు, ఘటీరజ్జువులందు నూర్ధ్వాధోభాగములయందుఁ,ద్రిప్పఁబడుచున్నాఁడను. మహాభయంకరమై, గగుర్పాటును బుట్టించు నీ సంసార చక్రమందు చాల

కాలమునుండి తిరుగుచున్నాఁడను. కాని దీని కంతము కానఁ జాలకున్నాఁడను. శ్రీహరీ! ఇంకేమి చేయవలయునో తోఁప కున్నయది. వ్యాకులితేంద్రియుఁడ నైతిని. శోకతృష్ణాభి భూతుఁడనై కాందిశీకుఁడనై విమతిని గూడ నైతిని. ఇప్పుడు దీనుఁడనై నిన్ను వేఁడుచున్నాఁడను. నీ శరణు చొచ్చితిని. దుఃఖితుఁడనై శరణు చొచ్చిన నన్నుఁ గాపాడుము. సంసార సాగరనిమగ్ను నన్నుద్ధరింపుము. ఓ జగన్నాథా! కరుణ యుంచుము. నన్ను భక్తునిగా గ్రహింప నీకిచ్ఛ గలదేని రక్షిం పుము. నీకంటె బంధు వొకఁడు లేఁడు. దేవా! నీవే నాథుఁడ వని శరణు వేఁడితి. నాకెందు నిఁక భయము లేదని నమ్మితిని. జీవితమున, మరణమున, యోగక్షేమములందు నన్నింటను నీవే గతివి. ఏమనుష్యాధములు విధివిహితముగా నిన్నుఁ బూజింపరో వారికి సద్గతి యెట్లు కల్గును? సంసార బంధము లెట్లు తొలఁగును? ఏమనుష్యులకు జగన్నిర్మాతవగు నీయందు భక్తి కుదురదో వారు సత్కులశీలవిద్యావంతులైన నేమి లాభము? ఏజను లాసురియగు ప్రకృతినాశ్రయించి మోహి తులై నిన్ను నిందింతురో వారు నరకకూపమునం బడి మరలఁ బుట్టుచుఁ జచ్చుచు నుందురు. ఏపురుషాధములు దుర్వృత్తులై దేవాది దేవుఁడవగు నిన్ను దూషింతురో వారికి నరకార్ణవము నుండి విముక్తి లేదు. భగవంతా! నాపూర్వకర్మానుసారముగ నెందెందు జన్మములు గలుగునో అందందు నీభక్తి దృఢముగ నలవడునట్లు ప్రసాదింపుము. పరమాత్మవగు నిన్నారాధించి

సురదైత్యమనుష్యాదులు సకలసిద్ధులనొందుదురో అట్టి నిన్నే వాఁడు పూజింపకుండును? శ్రీహరీ! బ్రహ్మాదులు నిన్ను స్తుతింపఁజాలరనఁగా ప్రకృత్యతీతుఁడ వగునట్టి నిన్ను మనుష్య బుద్ధిచే నేనెట్లు స్నుతింపనేర్తును? అజ్ఞానభావమున నిన్ను నే నుతించుచున్నవాఁడను. నాయీయపరాధమును క్షమింపుము. నాయందుఁ గృపయున్న నీవర మనుగ్రహింపుము. లక్ష్మీ నాయకా! అపరాధ మొనరించినవారియందును సాధువులు కృపయునుతురు కావున దయాసముద్రుఁడవగు నీవు భక్త స్నేహము నవలంబించి ప్రసన్నుఁడవగుము. భక్తి భావ పూరితమగు బుద్ధిచే నా చేసిన యీస్తోత్రము సత్యస్తుతియై సత్ఫలముల నొసంగుఁగాక. ఓవాసుదేవా! నీకు నమస్కార ములు.

ఓమహర్షులారా! ఈరీతిగా నింద్రద్యుమ్న మహారాజు సన్నుతింప గరుడధ్వజుఁడు ప్రసన్నుఁడై తద్వాంఛితముల నొసంగెను. ఏమనుజుఁడు జగన్నాథునిఁ బూజించి యీస్తోత్ర మును బఠించునో ఆతఁ డీస్తోత్రమహిమమున ముక్తినొందును. ఇది ధ్రువము. త్రికాలములందును బరిశుద్ధుఁడై యీస్తోత్రము నెవఁడు పఠించునో ధర్మార్థకామమోక్షముల నాతఁడు పొం దును. ఎవఁడీస్తుతిని బఠించునో వినునో వినిపించునో పాపవినిర్ము క్తుఁడై విష్ణులోకము నొందును. ఇది ధన్యము. పాపహరము. భుక్తిముక్తిఫలప్రదము. పరమరహస్యము. కావున దీనినెవరికిం జెప్పరాదు. ఈదివ్యస్తోత్రమును నాస్తికునకు, మూర్ఖునకుఁ, గృత ఘ్నునకు, గర్వికి, దుష్టమతికి, ధూర్తునకు నుపదేశింపరాదు.

భక్తియుక్తుఁడై గుణశీలాన్వితునకు, విష్ణుభక్తునకు, శాంతాత్మునకు, శ్రద్ధానుష్ఠానశాలికి దీనిని దప్పక యుపదేశింపవలయును. ఈపురుషోత్తమనుతి సకలపాపముల నశింపఁజేసి సులభప్రయత్నమున మోక్షసిద్ధినిగల్పించి,ఇహసుఖములఁ గోరినట్లు కల్పించి భక్తునిం గాపాడును. కాన మునులారా! మీకుఁ దెల్పితిని. ఏమానవు లీస్తోత్రమునఁ బురాణపురుషుని, మురారిని నిర్మలాంతరంగులై నిత్యము నుతింతురో వారు ముక్తిభాక్కులు. విష్ణుప్రసాదార్హులు. సంసారదుఃఖచ్ఛేదకుఁడు పరమపురుషుఁడొక్కఁడే. తదన్యము లేదు. * ఆపురుషోత్తముఁడే సృష్టికర్త. ఆతఁడేపాలకుఁడు. ఆతఁడే లయకర్త. అఖిలదేవతాసారభూతుఁడామహావిష్ణువే. ఏమనుజులకుఁ బరమ పురుషుఁడగు శ్రీమన్నారాయణునందు భక్తికుదురునో వారికి విద్య, సద్గుణములు, యజ్ఞదానతపస్సులు లోనగువానిచే నేమి లాభము? పురుషోత్తముఁడగు వాసుదేవునియం దెవనికి భక్తికుదురునో, ధన్యుఁడు, శుచి, విద్వాంసుఁడు, యజ్ఞకర్త, తపస్వి, గుణవంతుఁడు, జ్ఞాని, దాత, సత్యనిరతుఁడు లోనగు వాక్యముల నుతింపఁ దగువాఁ డాతఁడే. అని మునులకుం దెల్పి పరమేష్ఠి పరమపురుషధ్యాననిమీలితలోచనుండై యుండెను.

పుణ్యపురుషులారా! ఈ గాథలు వ్రాయుట యేల యనిన వివిధక్షేత్రముల నందు నొకానొక పవిత్రతమస్థల

* స్రష్టా సపాతా సతు నాశకర్తా విష్ణుస్సమస్తాఖిలసారభూతః. ౪౬ అ. ౬౫-శ్లో. త్రిమూర్తులలో భేదములుగలవనువారికు వాదపృత్తమున కీవాక్యము తీవ్రకుఠార మనవచ్చుఁగదా.

మున భగవంతుఁడు తన తేజస్సు నునిచి కేవల పామరులగు మానవులను, ఇంచుక పాపము మిగిలియుండు జంతువులను దర్శనస్పర్శనములచేఁ బుణ్యాత్ములనుగా నొనరించుట కూహించును. లేనిచో జంతువులకు శాశ్వతజంతుజన్మమే లభించునని చెప్పవలసియుండును. సర్వవ్యాపి యగు భగవంతునకు నొకక్షేత్రమునఁ బక్షపాత మేల యని ప్రశ్నింపరాదు. పదార్థములం బరిశీలింపుఁడు. మనుష్యులను బరికింపుఁడు. జంతుజాలములం గాంచుఁడు. తుదకుఁ బాషాణములం గనుంగొనుఁడు. ఒక్కరీతిగా భగవత్కళ యున్నదియా ? తేజోవంతములగు పాషాణములే రత్నము లనంబడును. ఆకళయందు విశేషించి లేనిచో దాని నేమందుము ? అదియొక స్వల్పవస్తువే కదా. సర్వసముఁడు కదా భగవంతుఁడు. పక్షపాత మేలయనుట పాడిగాదు. కర్మసిద్ధాంత మిదియే. సూర్యునియందున్న తేజస్సు తక్కుంగల గ్రహములయందుఁ గలదా ? ఆలోచింపుఁడు. ఎంత పుణ్యము చేసినఁ దదనుగుణముగా భగవత్కళయందు విలసిల్లు. భగవత్కళ యధికముగాఁగల పదార్థ మమూల్యమగు. దానినే యంద అభిలషింతురు. పూజింతురు. ప్రేమింతురు. శిరస్సున ధరింతురు. ఇందులకుం బ్రధానకారణ మా పరమాత్మ తేజస్సందు వ్యాపించియుండుటయే. కాని యితర కారణములు గావు. కాఁబట్టి శ్రీపరమేశ్వరుఁడు సర్వవ్యాపియై యుండియు నొక్కొక్క తావునఁ దన తేజము నధికముగ వ్యాపింపఁ జేయును. దాన నది పరమపవిత్రమై విఖ్యాత

మగును. కాఁబట్టి పురుషోత్తమక్షేత్రము పుణ్యక్షేత్రముల కలంకారప్రాయమైనది. అందు వాసుదేవుని ప్రతిమ వెలయును. శిలలఁ బూజించుటచే నేమి లాభమని పలుకరాదు.

శ్లో. నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః,
తే పునం త్యురుకాలేన దర్శనాదేవ సాధవః
మహాభారతము.

అని పెద్దలు నిర్వచనముచేసిరి.

లోకమున మనుజు లందఱు ఒక్కరీతిఁ బుణ్యకర్మములు గాని పాపకర్మములు గాని చేసియుండరు. వారి చిత్తములు కర్మాధీనములుగా నుండును. విగ్రహారాధనము ముక్తిప్రద మని కేవల పరిపక్వముకాని యంతరంగము గలవారు భావింతురు. సర్వత్ర భగవత్కళనుజూచు జ్ఞానులకా విగ్రహారాధనము వ్యర్థముగనే తోఁచును. ప్రతిపదార్థమునందును భగవంతుని మనమందఱము చూడఁగలమా? ఎవ రట్లు సర్వత్ర పరమేశ్వరుం జూడఁగలరో వారి కొఱకుఁ జెప్పిన ప్రమాణము లందఱకుం బనికిరావు. కావునఁ దీర్థయాత్రలు నిష్ఫలము లనరాదు. తజ్జన్యజ్ఞానమున నా జీవుఁడు జన్మాంతరమున నుత్కృష్టజ్ఞానము నొందును. అప్పుడు మానసవీథియందు సదా పరమాత్మను జూచుచు ముదమందుచుండును. ఆతనిస్థితి యందఱకు రాదు. కాన నపరిపక్వ జీవుల కది ముఖ్యములు కావు.

క. తానై తే పరిశుద్ధుఁడు
మేనై తే ముట్టుబోకి • మేనో తానో
పూనుచుఁ జేసెడు తీర్థ
స్నానం బది యెవరికన్న • సంపగిమన్నా.

యని పరమానందయోగి వచించెను. ఈవాక్యమందఱకుఁ బనికి వచ్చునా? పరమానందయోగివంటి జీవులకుఁ బనికివచ్చును. మృత్కాంచనములు సమముగా భావించుకొఱకుఁ జెప్పఁబడిన ప్రమాణములు వానిని వేఱువిధముగా భావించు పామరులకుం బనికివచ్చునా? కొంద ఱట్టిమాటలు కొన్ని చెప్పి పామరులను భక్తివిహీనులనుగా నొనరించుచున్నారు. వారే ద్రోహులు. నరకకూపమునఁ బడుదురనుట సిద్ధాంతము. ఏ జీవుని కర్మఫలము ననుసరించి వివిధమార్గములు పెద్దలచే నిర్ణయింపఁబడినవి. అవి యన్నియుఁ గలిపి మాటలాడరాదు.

శ్లో. యోగరతోవాభోగరతోవా సంగరతోవా సంగవిహీనః,
యస్య బ్రహ్మణి రమతే చిత్తం నందతి నందతి నందత్యేవ.

అను శ్రీమచ్ఛంకరభగవత్పాదశిష్యోక్తి యెట్టివారికిఁ జెప్పఁబడినదో యోజింపుఁడు. ఇంద్రియలోలుఁడై విచ్చలవిడిగాఁ జరించుచుఁ బైకి భక్తునివలె జ్ఞానివలె యోగివలె మాటలాడు మూర్ఖు లీశ్లోకమును జెప్పుచు మామనస్సు భగవంతుని యందు లీనమైనది. మేమే యకార్యమొనరించిన నేమి పాపమని చెప్పుచుందురు. అట్టివారికొఱకే ప్రమాణము పనికిరాదు. సకలతాపవివర్జితులై విరాగులైన మహాత్ముల కీప్రమాణము పనికివచ్చును. కాఁబట్టి విగ్రహారాధనము ముఖ్యముగా నీకలికాలమున నుండఁదగినదియే. కాని యెన్నిజన్మములకైన నీస్థితియే కావలయునని కోరరాదు. ధ్యానమునకై నిర్మించిన మూర్తికదా ప్రతిమ. అది మనోగమ్యమై స్థిరముగుదాఁకఁ బ్రతిమారాధనము ముఖ్యము.

"ప్రతిమా స్వల్ప బుద్ధీనామ్" అనియు,
"అంతరర్చనసుప్రీతా బహిరర్చనలోలుపా"

అనియు మహాత్ము లనువదించిన దెందులకు? ఇట్టి ప్రమాణము లెన్ని యో చూపవచ్చును. కావునఁ దీర్థయాత్రలు ముఖ్యముగాఁ జేయఁదగినవియే. ఆ క్షేత్రములయందు శ్రీపరమేశ్వరుఁ డావహించి యుండును. నిశ్చలభక్తి నారాధించువారిని ముక్తులను జేయును. అట్టులౌట నీపురుషోత్తమ క్షేత్రము క్షేత్రరాజ మనఁదగినది. అందా సనాతనుండగు వాసుదేవుఁడు వెలసియుండు.

పాఠకులారా! వాసుదేవనామమహిమమును జెప్పుటకై యీకథను జేర్పఁ నవలసి వచ్చెను. ఈవాసుదేవనామము శ్రీమహావిష్ణువునకుఁ గృష్ణావతారమున వచ్చినది కాదు. అది ప్రాచీననామము. ద్వాదశాక్షరమంత్రరాజమున వెలసిన నామవర్యమిదియే. శ్రీకృష్ణవాసుదేవనామములు సనాతనములు భక్తవాంఛాపూరణక్షమములు. సకలకార్యములనఁగా సృష్టిస్థితి సంహారకృత్యములు చేయువాఁడుగానఁ గృష్ణుఁడనఁబడు. సకల లోకము ఉదరమునఁగల దేవుఁడగుట వాసుదేవుఁ డనంబడు. ఈనామద్వయ మాపరమాత్మమహిమమునే తెల్పుచుండును. ఇవి విష్ణునామరాజములనంబడు. వేదప్రతిపాదితములు. భక్తకల్పద్రుమములు. ఈనామద్వయగాథలే యీ గ్రంథమున వివరింపఁబడును. కావున భక్తులందఱును శ్రద్ధాభక్తుల భగవత్కథలఁ బఠించి, తన్మహిమము నెఱింగి కృతకృత్యులగుట కృత్యము. కలికాలమున నింతకు మించిన సులభసాధనము వేఱొకటి కానరాదు. ఈకార్యమునకు ద్రవ్య మక్కఱ లేదు.

మనుష్యసహాయ మక్కఱలేదు. ఉపవాసాదులచే దేహము శోషింపఁజేయ నక్కఱలేదు. పరిశుద్ధమనస్సున నేకాంతమునఁ గూరుచుండి భగవన్నామసంకీర్తనము చేయుచుఁ దన్మహిమ్మను దెలుపు గాథలఁ బఠించుచుండినఁ జాలును. అట్లు చేయు పూతాత్ముల శ్రీహరి కరుణాసింధువు శ్రీకృష్ణపరమాత్మ కాపాడును. సత్యము. సత్యము సత్యము.

ఓం శాంతిః శాంతిః శాంతిః.

శ్రీ కృష్ణావతారతత్త్వమునఁ బ్రథమప్రకరణము
సంపూర్ణము.

---

స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః.

సార్ధమ్ సమృద్ధై రమృతాయమానై
రాధ్మాయమానై ర్మురలీనినాదైః,
మూర్ధాభిషిక్తం మధురాకృతీనాం
బాలం కథానామ విలోకయిష్యే.

శ్రీకృష్ణకర్ణామృతము.

ఓం తత్సత్. శ్రీకృష్ణార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.

---

చెన్నపురి: శ్రీ 'రామ' ప్రెస్సున ముద్రితము.—1938.—1000.